# ఆంధ్రపత్రిక

(నలువది మూడవ
ఉగాది సంచిక)

నందన సంవత్సరాది సంచిక

(1952-53)

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

[వెల రూ. 2]

43 సంచిక

# ఆంధ్రపత్రిక

సంవత్సరము 1952-53

## నందన ఉగాది సంచిక

### విషయానుక్రమణిక



### ముఖ చిత్రము - ఉమామహేశ్వరులు

ఈ చిత్రము, కార్వేటినగర సంస్థానమునుండి సంపాదితమైన నూరేండ్లనాటి ఒకచిత్రపట గ్రంథములోనిది. ఈ గ్రంథములో అశ్వశాస్త్ర లక్షణరీత్యా చిత్రించబడ్డ వివిధ అశ్వముల త్రివర్ణచిత్రములు గలవు. వీనిలో వర్ణములు చిత్రకారులు స్వయముగా తయారుచేసికొన్నవిగాను తెలుగునాట

పూర్వము వాడుకలో నున్నవిగను కనుపించును. శాస్త్రలక్షణములతోపాటు, వాస్తవికత నుగూడ చక్కగా పాటింపబడి, చిత్రములు బహురమ్యముగా నున్నవి. ఆ గ్రంథములో దేవతాస్తవ భాగముగ చిత్రింపబడ్డ చిత్రమిా గౌరీశంకరుల చిత్రము.

## త్రివర్ణ చిత్రములు

౧. 'అత్తవారింటికి'; ౨. 'ప్రత్యక్షానము'.

## సాధారణ చిత్రములు

సాలార్ జంగ్ పురావస్తు ప్రదర్శనశాలలోని కొన్ని చిత్రములు (వ్యాసాంశముల నున్న సిల్హెట్ ఖండములు, శ్రీ ఎ. వి. యస్. ఆర్. జోస్యులుగారు రచించినవి.

పంచాంగం

శ్రీ

# ప్రస్తావన

నందన సంవత్సరమునకు స్వాగతము. ఖర సంవత్సరమునకు వీడ్కోలు.

గత సంవత్సరమున ప్రపంచ ప్రతిస్తంభన కొంతకొంత సడలుచూవచ్చి, నూత్న వత్సరారంభ కాలమునకు, శాంతిముఖముగా ప్రపంచము పురోగమించగల సూచనలను ఇతోధికముగా వెలువరుచు చున్నది. కొరియా రాయబారములలో అంతకంతకూ సామరస్యము చిక్కు నాస్కారము కనుపించు చున్నది. పర్షియన్, ఈజిప్షియన్ సమస్యా పరిష్కారములకు ఆ దేశములు, సామవిధానములనే అవలంబించుచున్నవి. కాశ్మీర్ సమస్యకూడా ఇండియా - పాకిస్తాన్‌లకు క్షేమకరముగ పరిష్కారముకాగల అవకాశము కన్పించుచున్నది. ఐక్యరాజ్యసమితిలో రెండు రాజ్యకూటముల దృష్ట్యా కాక ఏ సమస్యకాసమస్యను న్యాయ దృష్టితో పరిష్కరించవలెనను భారతీయ దృక్పథము ఇతర చిన్న రాజ్యములతోపాటు అగ్ర రాజ్యములపైకూడ ప్రభావము పరపించుకొన్న చిహ్నములు కన్పించుట ప్రపంచశాంతికి శుభసూచకముగ నున్నది. ప్రతిదేశమును కొంత కాలాది నిలిచి స్వప్రజాక్షేమమునకై, దేశాభివృద్ధికై, పాటుపడగల ఆస్కారములు సమిష్టిగను, విడివిడిగను కూడ కొంత హెచ్చినవి.

ఈసమయములో భారతదేశము శ్రేయో రాజ్య నిర్మాణాదర్శముతో, ఉత్తమ ప్రజాస్వామ్య విధానములో తన భవిష్యత్తుకై గట్టి పునాదులు నిర్మించుకొనుట గమనార్హము. ఈ సంవత్సరము భారతప్రభుత్వము దేశవ్యాప్తముగా వయోజన వోటింగ్ హక్కు ప్రాతిపదికపై అతివిస్తృత పరిధిలో ఎన్నికలను జరిపినది.

ఈ ఎన్నికలు నూతన రాజ్యాంగ ప్రాతిపదికపై జరిగినవి. స్త్రీ, పురుష, కుల, మత, వర్గ విచక్షణ లేమియుపాటించక రాజ్యాంగము వయోజనులైన సర్వప్రజలెల్లరకు వోటింగ్ హక్కు ప్రతిపాదించినది. ఈ ప్రాతిపదికపై 17 కోట్ల భారతీయులకు తమ ప్రభుత్వమును తామే నిర్ణయించుకొను హక్కు కలిగినది. ఈ హక్కును భారతప్రజ సంపూర్ణ రాజకీయ చైతన్యముతో వినియోగపరచుకొనుట, ఇంతటి బ్రహ్మాండమైన ఎన్నిక, ఏ అకమరికలు అల్లరులు లేకుండ ప్రశాంతముగ జరుగుట, సర్వప్రపంచప్రజలను విస్మితమొనర్చినది. ప్రజాస్వామ్యపద్ధతిని ఇంత విస్తృత భూభాగమున రాష్ట్ర కేంద్ర శాసనసభల కెన్నికలు జరుగుటకు ప్రపంచమున ఇదే ప్రథమమని చెప్పవచ్చును.

ఈ ఎన్నికలలో రెండుమూడు రాష్ట్రములలో తప్ప, తక్కిన రాష్ట్రములలోను, కేంద్రములోనూ కూడ కాంగ్రెస్ పక్షమున కఖండ విజయము చేకూరినది. కాంగ్రెస్ పక్షమునకు విడిగా సంఖ్యాధిక్యత లభించినను ప్రభుత్వ మేర్పరచ గలిగినంత సంఖ్యాబలము రాని రాష్ట్రములలో కూడా కాంగ్రెస్‌పక్షములోని అంతఃకలహముల వల్లను కాంగ్రెస్ పక్షము ప్రజాసాన్నిహిత్యమును కొంత పోగొట్టుకొనుట వలనను, ప్రజలు కాంగ్రెసుపై తాత్కాలిక నిరసనమును మాత్రమే వ్యక్తపరచిరి గాని, పట్టుమని ఏ ఒక్క ఇతరపక్షము పైనను సంపూర్ణాభిమానము చూపలేదు.

ఈ ఎన్నికలను సింహావలోకనము చేస్తూ సంవత్సరాంతమున జరిగిన కలకత్తా ఏ. ఐ. సి. సి. సమావేశములో పండిట్ నెహ్రూ కాంగ్రెస్ ప్రతినిధులు ప్రజలతో కలిసిమెలసి పనిచేసినచోట్లనెల్ల సంపూర్ణ

విజయమును సాధించిరనియు, ఎచ్చటెచ్చట సభలతో సమావేశాలతో తృప్తిపడిరో అచ్చటచ్చట ఓడిపోయిరనియు, దేశక్షేమార్థమై జాతీయసంస్థ యయిన కాంగ్రెసు ప్రజలతో సన్నిహితముగ కృషి చేయవలెననియు ఉద్బోధించిరి. ఈపునరుత్తేజముతో, గాంధీజీ ఆదర్శములుగల కాంగ్రెస్‌సంస్థ, సుస్థిర ప్రజాస్వామ్యమును-శ్రేయోరాజ్యమును, భారతదేశమున నెలకొల్పగలదని భారత ప్రజలలో విశ్వాసమును గడించగలదు.

ఇంతటి దేశవిస్తృతమగు ఎన్నికలను, ప్రభుత్వములోనుండి, నిష్పాక్షికముగ ప్రశాంతముగ కాంగ్రెసు నడపగలుగుటలోనే ప్రజావిశ్వాసార్హతను, ప్రపంచ ప్రజల ఆమోదమును కాంగ్రెసు సంపాదించుకొనగలిగినది.

రానున్న ఐదేండ్లలో కేవలము తాత్కాలికావసరదృష్టితో కాక, పంచవర్ష ప్రణాళిక ప్రాతిపదికతో, దేశ స్వయంసమృద్ధిని, ఆర్థిక క్షేమతను, సాంఘిక స్వాతంత్ర్యమును, శ్రేయోరాజ్య స్థాపన లక్ష్యము కలిగి, ప్రభుత్వ స్థానములో కాంగ్రెసు ఈ సంవత్సరమున కార్యకలాపమున కుపక్రమించుటకూడ భారతచరిత్రలో ముఖ్యగమనీయాంశము. భారత దేశము సర్వప్రజలకు రాజకీయ, సామాజిక, ఆర్థికాధికారాలను స్వీయాభివృద్ధికి సమానావకాశాలనుకల నూతన ప్రజాస్వామ్యమును పండించుకొనుట కున్ముఖమైయున్నది. ఈ ఆదర్శములకు కట్టుబడియున్న కాంగ్రెస్ వయోజన వోటింగ్ ప్రాతిపదికపై, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములలోనికి వచ్చుటన భారతదేశ సౌభాగ్యముగనే సూచితమగుచున్నది.

ఏ కారణముగ మద్రాసు రాష్ట్రములో కాంగ్రెసు సంపూర్ణ ప్రాబల్యము సంపాదించుకొనలేక పోయినదో, దాదాపు ఆకారణముననే ఆంధ్ర దేశము స్వరాష్ట్రమును సిద్ధించుకొనలేక పోయినది. కేంద్ర ప్రభుత్వ మీ విషయమున కొంత ఔదాసీన్యము చూపియుండవచ్చును. కాని ముఖ్యముగా నేటి మద్రాసురాష్ట్రములో కాంగ్రెస్ ప్రభుత్వమేర్పడజాలని క్లిష్టమైన పరిస్థితికిని, ఆంధ్రరాష్ట్ర మేర్పడజాలని స్థితికినికూడ ఆంధ్రనాయకులలో ఐకమత్యము లేకపోవుటయే కారణమని ఋజువయినది. ఆంధ్రకాంగ్రెస్ సంఘములో కొన్ని సంవత్సరములుగా రాజుతూ రాజుతూ వచ్చి, గత సంవత్సరములో సుస్పష్టముగా విడిపోయిన నాయకుల చీలికలే, రాష్ట్రసిద్ధి కభ్యంతరములుగా పరిణమించినవి. కేంద్రప్రభుత్వము తన కిష్టమున్నను లేకున్నను ఆంధ్రరాష్ట్రము విడదీయు నవసరము తాను గుర్తించినట్లే ఎప్పటికప్పుడు చెప్పుచున్నది. అట్టితరి 'ఆంధ్రనాయకులలో అభిప్రాయభేదములు' అను "సాకును"ను కేంద్రప్రభుత్వము చూపించ లేనంత మాత్రముగానైన ఆంధ్రనాయకులు తమలో తాము సామరస్యమునకు వచ్చుట రాష్ట్రసిద్ధికి అత్యవసరము. ఆ కృషిలో సఫలులు కాగలిగిన, అనైకమత్యతా దోషమును ఉటంకించి, కేంద్రప్రభుత్వము రాష్ట్రనిర్మాణమును వాయిదావేయు అవకాశము సన్నగిలగలదు.

ఆంధ్రసాహిత్యము స్తబ్ధస్థితిలో నున్నదనుకొని నిస్పృహ చెందువారి కందరికీ, ఈ సంవత్సరము తెలుగు కథానిక ప్రపంచబహుమాన మందుకొన్నదన్న విషయము, మన సాహిత్యము ప్రగతిముఖముగనే ప్రపంచముతోపాటు పురోగమించుచున్నదన్న ఉత్సాహము కల్పించకతప్పదు. తెలుగు కథానికలు ప్రపంచ కథానికలకు తీసిపోవన్న విశ్వాసముతో "ఆంధ్రపత్రిక" ప్రపంచ కథానికలపోటీలో పాల్గొనుటకు తెలుగు కథకుల నాహ్వానించినది. మా ఆశయమున కనుగుణ్యముగ శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి "గాలివాన" కథ, ప్రపంచ గౌరవమునందుకొనుట మాకును తెలుగు సాహితీపరులకుకూడా గర్వకారణమైనది. శ్రీ పద్మరాజుగారికి మా అభినందనములు.

ఈ ఉగాది సంచికకు తమ అమూల్య వ్యాసములను, కథలను, చిత్రములను ఒసగి, సంచికకు విశిష్టత తెచ్చి, మా కృషికి తోడ్పడిన రచయితల కెల్లరకును మా నమోవాకములు.

# మధు మాధురి

★

శ్రీ దాశరథి

ఇంటికొక్క వేప ఇవురువెట్టినదేల!
శిశిరవాతఘాత జీర్ణమైన
నగ్న తనువులందు అగ్ని చేలమ్ములు
కట్టుకొనె పలాశగణ మదేల!

మంచుతో నరాలు కుంచించుకొనుచుండ
వేడి నెత్తు పరుగువెట్ట నేల!
తరతరాల పాత బరువులు పడద్రోసి
మెడలు పైకి సాచి నడచుటేల!

బండవోని మంచు పర్వత శిఖరాల
నుండి డిగ్గిరాక మొండికెత్త
చైత్ర చిత్రభాను సాధుహస్తమ్ములు
కొండక్రింది దాక గుంజనేల!

మంచు కరగినట్లు మనసులు ద్రవియించి
ప్రేమ జలలుగా స్రవింపనేల!
పడతి చూపులోన బాణాలు పదునొత్తి
మరుడు మనల గాయపరచుటేల!

అరుణసుమజటాలపై పలాశద్రువు
తరుగణమ్ము భీతు పరచుటేల!
హిమ భరమ్మువలని చెమరింపజాలని
గుండెలందుగాది మండనేల!

నుండిన ఈ ఉగాది పువ్వుమంటలు వేపలనుండి మలికా
మండపిదాక ప్రాకినవి; మంచులు పేరినగుండెలందు కూ
ర్చుండిన స్తబ్ధతాభరముచొక్కుచుసోలుచు పారిపోవకై
దండలనెత్తి వచ్చిన దుదార మధూదయలక్ష్మి ఆమనిన్

ఎన్ని శిశిరఋతువు లెన్ని హేమంతాలు
నా మనోవనాన నాట్యమాడి
పుష్ప శిల్పమెల్ల పోద్రోలి శాఖాళి
విరిచి బ్రదుకు నగ్నపరుపలేదు!

ఎన్ని మారు లిట్టులేను కంపింపలే
దెన్ని మార్లు మోడు లెత్తలేదు!
శిశిర శీతవాత శీర్యదాశాలత
ఎన్ని సార్లు వేరు తన్నలేదు!

పూవులు రాలిపోవ, పసిమొగ్గలు వాకులు తూలిపోవ ల
జ్జావలమాన శాఖలను సాచుచు మాధవమూర్తికోసమై
త్రోవలుసూచు కానన వధూమణి ద్రౌపదికన్న వేయిరె
ట్లావడి నంది కుందె శిశిరాహతి దిగ్వసనాధివాసయై

నేడు వలవంత యే తెంచి కీడుసేయ
రేపు రాకుండునే హీనరేఖ యొకడు!
ఆకు రాల్చెడి కారు నే డరుగుదేర
వెనుకపడియుండ నోపునే విరుల కాగు?

ఒంటరివాడనై బ్రదుకు నూరక కుంటిపదాల గెంటితిన్
కంటకితాధ్వమందు; పువుకారుల దారుల కానరాని నా
కంటికి ఇంద్రజాలమటు కన్పడి నందనమై ఉగాది గో
రంటల చాటునుండి ఒక యవ్వని నవ్వినయట్లువచ్చెడిన్

గుమగుమలాడి నామనసుగొన్న నవాబ్దనఖీముఖానురా
గమున సుమించె చంపకము; కౌగిలిలో ప్రసవించె
[గోరటల్;
సుమరమణీయమైతగె నశోకము తచ్చరణాహతిన్ ప్రహా
సమునసుమించె పొన్నలుపనందగునంద నదివ్యవాటిలో

కానగ అందరాని జిగికై తల తెయదనాల లోతుల
తైలనలూని యవ్వనపు టగ్గిని పుక్కిటబట్టి కాంచనో
ద్యాన విరాజమాన కటిన్రై అరుదెంచిన మా నవాబ్దల
క్ష్మీనవహాసముల్ బ్రతుకు మేడల పువ్వులదివ్వెలెత్తెడిన్

కుంద మధూకసూన పరిగుంఫిత గుచ్ఛకజాలతోరణ
స్యంది మధుద్రవంబు రసనాగ్రమునన్ బడినంత నే రసా
నందనినై కవుంగిట పెనంగి నవాబ్దరమా నవాశిషం
బంది ఉగాది పాటలను పాడను నా జవరాలు వేకువన్

మాడిపోయిన మావి మ్రోడుపై ఇవురించె
అరుణప్రవాళ సుందరరసమ్ము
చేదుగారెడి వేపచెట్టు మట్టలపైన
ముత్యాల మ్రుగ్గులు మురిసిపోయె
బెత్తాలవలె సాగి బెత్తికలెత్తిన
మల్లెలు వజ్రాల ముల్లెలయ్యె
పాదులో రాలిన పండుటాకులనేడ్చు
గేదంగి బంగారుగాదె యయ్యె

పొగడగారాని పొగడలు పొగడబడియె
వెన్నెలలుకాసె మొల్ల తీవియలమీద
వింతమందారములు ప్రసవించి మించె
నందనంబై నవాబ్దసౌందర్యమదరె.

యాతాయాత సుశీతవాతలహరీ హల్లీసకప్రక్రియా
నీతాభోగపరాగభోగమున వెన్నెల్ దేరి ఆకాశమెం
తో తారుణ్యమునందగా భువిన శాంతుల్ రేపిమాపెల
పలా
శ్రీ లిప్తప్రసవోగ్రకాననము త్కుత్సితాకారదావాగ్నియై

పూవుల శరాలతో తెగిపోయినట్టి
శిశిరరాక్షసి భీకర శిరములట్లు
అచ్చటచ్చట నల్లగా అద్రిశిఖలు
కానుపించెను కుసుమిత కాననముల

చలియనగలేదు మంచుల జాడలేదు
తలుపులను మూసికొని మెడీ తలపులేదు
వెచ్చదనము నరాలలో పిచ్చలింప
కోష్ణరుధిరమ్ము గుండెలో కుస్తరింప

పూల వెచ్చదనము పాలిండ్ల వెచ్చంద
నమ్ముకలసి*దూప ఇమ్ముడింప
మదనదాహతప్తమై ఊర్పులునుకూడ
పూవుబోండ్లు క్రాగిపోయినారు.

ఇం దుగాది పందిలిక్రింద నందనావ
తరణమయ్యెను కుంద, మందార, వకుళ
కేతకీ, మల్లికా, పారిజాతములను
త్రెంచుకొనిపోవ రండహో తెలుగువారు!

* దూప అనగా దప్పి



# పురాణాలలో పురుషోత్తముడు

★

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

ఈ జగత్తుకు ఏదో కారణం ఉంది అని తోచటం సహజం. లోకంలో కార్యకారణ సంబంధం అనేక విధాలుగా కనిపిస్తూంది. తలిదండ్రులకూ సంతానానికీ ఉండే సంబంధం, కుండకూ మట్టికీ ఉండే సంబంధం, కుండకూ కుమ్మరవానికీ ఉండే సంబంధం, పాలకూ పెరుగుకూ ఉండే సంబంధం, తాడు పాముగా కనబడేటప్పుడు ఆ రెంటికీ కల సంబంధం.: ఈ రీతిగా ఎన్నో సంబంధాలు. ఈలాటి సంబంధాలలో ఈ జగత్తుకూ దాని కారణానికీ ఉండే సంబంధం ఏమిటి?

లోకంలో ఉండే కార్యాలూ వాని కారణాలూ మన ఇంద్రియాలకు గోచరాలు. చెట్టు అనే కార్యానికి విత్తూ మృత్తూ నీరూ గాలీ మొదలయినవి కారణాలు. మనకు విత్తూ కనబడుతుంది, చెట్టూ కనబడుతుంది. ఇంకోటి, ఎక్కడయినా ఒక ధ్వని పుడితే, అది దేని ధ్వనో, అది ఏ మూలనుంచి వచ్చిందో, అది మనిషి మాటో చిలక మాటో చెప్పగలం. అనేక లోకాల ఎన్నడూ వినని వింత వాద్యపు మోత అయితే 'ఇది ఫలానా మోత' అని చెప్పలేం. కాబట్టి కార్యకారణాలను రెంటినీ ఎరిగి ఉంటేనే వాని సంబంధం కొంత కాకపోయినా కొంత నిర్ణయించగలం.

ఇట్టి స్థితిలో మనం జగత్తునే ఎరుగుదుం. కాని జగత్కారణాన్ని ఎరగం. జగత్తూ దాని కారణమూ ఈ రెంటినీ చూచిన వాళ్ళే ఆ రెంటికీ గల సంబంధం చెప్పగలరు.

అయితే ఎవరయినా ఆ రెంటినీ చూచినవా రున్నారా?

ఆ॥. చూచినావా రున్నట్లు మనకు వేదవేదాంతాదులలో కనబడుతుంది. 'నే నీ మహాపురుషుణ్ణి ఎరుగుదును' అని ఒక రంటారు. 'అది నీవూను' అని ఇంకొక రంటారు. 'నేనూ బ్రహ్మమును' అని వేరొక రంటారు. 'ఇదంతా బ్రహ్మమే' నని మరొక రంటారు. ఈలాగా ఎరిగినవా రున్నట్లు అక్కడా అక్కడా సాక్ష్యం ఉంది.

సరే ఈ యెరిగినవారు ఆ కారణాన్ని, ఆ మహాపురుషుణ్ణి, ఆ ఆత్మను ఆ బ్రహ్మమును ఆ భూమను సంపూర్ణంగా చెప్పారా అంటే చెప్పలేదు, సరిగదా చెప్పడానికి వీలులేదన్నారు. యోగవాసిష్ఠంలో ఒక కథ ఉన్నది: ఉప్పుబొమ్మ ఒకటి సముద్రం లోతు చూచి వద్దామని ఎగిరి దుమికి సముద్రంలోకి దూకిందట, దూకీ దూకడంతోనే కరిగి సముద్రంలో కలిసి పోయింది. సముద్రం ఎంత లోతుందో ఇక చూడడ మెక్కడ? పైకి రావడ మెక్కడ? మనకు చెప్పడ మెక్కడ? ఆలాగే నిర్వికల్ప సమాధిలోకి వెళ్లినవారిలో ఒక రిద్దరు తప్ప తతిమ్మవారందరూ ఆ పరమకారణంలో కలిసిపోయేవారే. ఈ వచ్చిన ఒక రిద్దరూ కూడా ఎంగిలి కానిదా ఒక్క దేవుడే అని చెపుతారు. అనగా ఆయన్ను చెప్పడానికి నాలుక మెదలదు, ఆయన ఇట్టివాడు అని చెప్పలేము అని. అయితే ఏ కొంచెమో చెప్పడానికీ వీలులేదా? వీలు లేకపోలేదు. ఎలా అంటే—పది మంది గుడ్డివాళ్లు ఏనుగును తడిమి చూచారట. వారిలో ఒక గుడ్డి వాడికి తోక దొరికింది. 'ఏను గెల్లా ఉంది?' అని అడిగితే 'గరి టెలా ఉంది' అని అతడు సమాధానం చెప్పాట్ట. చెవి తడిమి చూచినవాడు 'ఏనుగు చేటలాఉంది' అని అన్నాట్ట. కాలట్టుకుని చూచినవాడు 'స్తంభంలా' అని అన్నాట్ట. తొండం తాకినవాడు 'రోకలి' అన్నాట్ట. ఏనుగుయొక్క స్వరూపం నిరూపించ డానికి ఈవర్ణనలలో ఏ ఒకటీ సత్యమూ కాదు, కాకా పోదు. వీరు చేసిన వర్ణన లన్నీ విని ఏనుగు నెన్నడూ ఎరగని కన్ను గలవాడెవడైనా ఏనుగును చూస్తే అప్పుడు అతడు—'ఆహా ఎంత బాగా చెప్పార్రా! తోక సరిగ్గా గరిటెలా ఉంది, ఆ చెవి చేటను చంపి పుట్టింది, ఆ తొండం, మూడురోకలా రోకలే' అని సంతోషపడతాడు. మరి ఏనుగును సాక్షాత్తూ, చూడకపోలేనో? ఉప్పు కుప్పా ప్రసాదానికి ప్రసాదమూ.

ఆలాగా ఆ చూచినవారు ఆ పరమకారణాన్ని 'ఉత్తముడైన పురుషుడు' అనీ అక్షరుడనీ [1]కూటస్థుడనీ సత్యమనీ జ్ఞానమనీ ఆనందమనీ ఎన్నో విధాలుగా వర్ణించారు.

పురాణాలు కూడా, శివుణ్ణి చెప్పేవే కానీండి, విష్ణువును చెప్పేవే కానీండి, ముఖ్యమైనవి ఈ జగత్తుకు మూలకారణం ఏదో అది సన్మాత్రం అని నిరూపిస్తున్నవి. అనగా 'అది ఆలాటిది, లేక ఈ లాటిది' అని చెప్పము కాని 'ఉన్నది' అని మాత్రమే చెప్ప దగినది' అని అర్థం! ఆ సన్మాత్రాన్నే బ్రహ్మమనీన్నీ ప్రధాన

---

1. ఈపదాలకు సరి అయిన అర్థాలు ప్రకరణాగులనుబట్టి నిర్ణయించాలి. అక్షర—అవ్యక్త—కూటస్థాది పదాలు శాస్త్రజ్ఞులనుకూడా చిక్కు పెటతైరేమో. బహుశా శాస్త్రజ్ఞులనే చిక్కు పెటతైరేమో.

2. నాహో న రాత్రిర్న నభో న భూమి
ర్నాసీ త్తమోజ్యోతి రభూచ్చ నాన్యత్
శ్రోత్రాది బుద్ధ్యానుపలభ్య మేకం
ప్రాధానికం బ్రహ్మపుమాం స్తదాసీత్. విష్ణు-౧-౨-౨౩.

3. స ఏవ క్షోభకో బ్రహ్మన్ క్షోభ్యశ్చ పురుషోత్తమః
స సంకోచవికాసాభ్యాం ప్రధానత్వేఽపి చ స్థితః ౧-౨-౩౧.

పురుషుడనీన్నీ 2 పురుషోత్తముడనీన్నీ 3 ఇంకా ఎన్నో పేర్లతో వ్యవహరించినై.

ఈ బ్రహ్మానికి మొట్టమొదటిరూపం పురుషుడు. వ్యక్తము అవ్యక్తమూ కాలమూ 4 పదపటిరూపాలు. ఐనుకటి పురుషుడు రూపంలేని పురుషుడు. ఈ పురుషుడో రూపంలేని ఆ పురుషుని మొదటిరూపం. ఐనుకటి పురుషుడు పురుషోత్తముడనీ ఈ పురుషుడు హిరణ్యగర్భుడూ లేక ప్రథమశరీరీ అనీ విస్పష్టం. ఈ హిరణ్యగర్భుణ్ణే అపరబ్రహ్మమనీ మొదటి పవాన్ని తాన్నే పరబ్రహ్మమనీ అంటారు.

'హిరణ్యగర్భుడు మొదట పుట్టాడు. పుట్టుతూ భూతాల కేకాధిపతి అయాడు. అతడు ఈ ద్యావాభూములను ధరించాడు. అతణ్ణి హోమద్రవ్యంతో సేవిద్దాం5.

ఆ హిరణ్యగర్భుడే మొదటి మనిషి. అతణ్ణి పురుషుడనీన్నీ అంటారు6.

'భూతాలను తోలీగా సృజించే బ్రహ్మ మొదట పుట్టాడు7.'

అని శ్రుతిస్మృతులు చెపుతున్నై.

ఈ రీతిగా ఇద్దరు పురుషులు శ్రుతులలోనూ పురాణాలలోనూ మనకు కనబడతారు. భారతం మోక్షధర్మపర్వంలో యోగ సాంఖ్య వివరణంలో క్షరాక్షర విభాగమూ అక్షరుడికి పురుషోత్తమత్వమూ 8 చెప్పింది. ఆ భారతమే గీతలలో మూగురు పురుషులున్నారని ఒక క్రొత్తతోవ తొక్కింది—

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః
యస్మాత్ క్షర మతీతో౽హ మక్షరా దపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః 9

లోకంలో క్షరుడనీ అక్షరుడనీన్నీ ఈ ఇద్దరు పురుషులున్నారు. భూతాలన్నీ క్షరపురుషుడు. కూటస్థుడు అక్షర పురుషుడు.10 ఉత్తముడైన పురుషుడు వేరే. అతడు పరమాత్మ. ముల్లోకాల్లోనూ చొచ్చి వానిని ధరిస్తున్నాడు. అతడు అవ్యయుడు, ఈశ్వరుడు. నేను క్షరుడికంటె దొడ్డవాణ్ణి కావడావా అక్షరుడికంటె గూడా ఉత్తముణ్ణి కావడావా లోకంలోనూ వేదంలోనూ నాకు పురుషోత్తము 11 డనే ప్రశస్తి ఉంది.'

ఉత్తముడైన ఈ పురుషుడు లేక పురుషోత్తముడు అందరికంటెనూ అధికుడు కాబట్టి అతడు పవాన్మతం. పురాణభావలోనే చెప్పకుందాం—పరబ్రహ్మం అజం అక్షయం అవ్యయం ఏక రూపం—

'తదేవ సర్వ మేవైతద్
వ్యక్తావ్యక్త స్వరూపవత్.'

4. పరస్య బ్రహ్మణోరూపం పురుషః ప్రథమం ద్విజ
వ్యక్తావ్యక్తే తథైవాన్యే రూపే కాలస్తథా పరమ్. ౧౫.

5. హిరణ్యగర్భ స్సమవర్త తాగ్రే
భూతస్య జాతః పతిరేక ఆసీత్
స దాధార పృథివీం ద్యా ముతేమాం
కస్మై దేవాయ హవిషా విధేమ.

6. సవై శరీరీ ప్రథమ స్స వై పురుష ఉచ్యతే.

7. ఆదికర్తా స భూతానాం బ్రహ్మాగ్రే సమవర్తత.

8. 'ఉత్తమ శ్చాసౌ పురుషశ్చ పురుషోత్తమః' అని ఉత్తమ శబ్దానికి పరనిపాత—మూ, 'పురుషోత్తమ ఇత్యత్ర త్రితయాపన్నిధానాభావా న్న నిర్ధారణవిభక్తిః కింతు సంబంధసామాన్యే షష్ఠీతి తయా సమాసః అత ఏవ హలాదిః శేష ఇతి సూత్రే కైయటం హాలా మాది రితి షష్ఠీసమాస ఇతి భాష్యే ఉక్తం. గుణవచనేన నిషేధ స్త్వనిత్య ఇతి తరప్సూత్రే కైయటః. ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృత ఇత్యాది గీతావాక్యా ద్విత్రి కర్మధారయ ఇతి లభ్యతే. రాజదంతాదిత్వా త్పరనిపాతః' (శబ్దేందు శేఖరే).

9. కూటస్థ పదానికి వాడుకలో లేని కొత్త అర్థం చెప్పి అక్షరుణ్ణి కిందిమెట్టుకు దిరపి 'వేదంలో ఉంద'ని చెబుతూ వేదంలో లేని పురుషోత్తమతత్త్వం ఏ విష్ణువాదో గీతలలో ఇరికించాడు. ఛాందోగ్యంలోని 'ఉత్తమః పురుషః' పరమాత్మ కాడు. శరీరంకల ఆత్మ దేహంలోంచి లేచి పరంజ్యోతిగా ఐపోతే అతడు ఉత్తముడైన పురుషు డవుతాడని దాని కర్థం. ఏ వేదంలోగాని ఏ శాఖలోగాని 'పురుషోత్తమ' పదం లేదు. వైష్ణవుల పురుషోత్తముడు ఔపనిషదం అయిన బ్రహ్మముకంటె దొడ్డ అని చెప్పడానికే ప్రయత్నం. ఎనిమిదీ పన్నెండూ అధ్యాయాలలో పరమాత్మగా చెప్పబడ్డ అక్షరుణ్ణి ఇక్కడ ఎందుకు కిందికి తోసెయ్యడం ? ఇలా కిందికి తోసియడానికి సంబంధించిన శ్లోకా లింకా కొన్ని ప్రక్షిప్తాలు. క్షరాక్షర సంక్రాంత శ్లోకసమూహం ఈ రకంలోదే. ఈ అంశం తీసేస్తే గీతల మూలమతానికి వ్యత్యయం కలుగదు, అంగ హీనమూ కాదు. గీతలలో ఏ యితరమతానికీ ఇది ఆధారం కాదు. గీతలలో మరి ఎచ్చటా దీని కనురూపమతం లేదు. పైగా విరుద్ధ మతాలే ఉన్నవి. ఈ పురుషోత్తమపదం బౌద్ధవాఙ్మయంలోని 'పురిసు ఉత్తము'కు 'సంస్కృతం' అని బ్రాహ్మ ధర్మావలంబులు మహేశచంద్రులు వ్రాశారు. కాని 'అక్షరాత్ పరతః పరః' అను శ్రుతే అక్షరుణ్ణి కిందిమెట్టుకు దింపింది. భారతంలోనే పరమాత్మకు పురుషోత్తమత్వం మోక్షధర్మపర్వంలో ఉంది. ఛాందోగ్యంలో 'ఉత్తమః పురుషః' అనేది పురుషోత్తముడే అని అద్వైతు లంటారు - చూ - ఉత్తరాధికరణం, మొ.

10. పరబ్రహ్మ.

11. ఈ ప్రకరణం యావత్తూ 'ఊర్ధ్వమూలం' ఈ మొదలుగా పకారణమైన ప్రపంచాన్ని వర్ణించి క్షరాక్షరుల కతీతమైన తత్త్వం పురుషోత్తమరూపంగా నిర్గుణ బ్రహ్మాన్నే నిరూపిస్తూ అద్వైతాన్నే దోహదం చేస్తూంది. అలా కాకపోతే క్షరాక్షరులకు పైవాడు పురుషోత్తముడని చెప్పి భగవానుడూ మన్నా క్షరాక్షరాతీతుడు కాబట్టే పురుషోత్తముడని అనడం వ్యర్థమేను. ఇచట పురుషోత్తముడు వేరని మొదట చెప్పి, అతడీశ్వరుడు కాబట్టే అతనికంటె వేరైనవాడే బద్ధముక్త జీవులకంటె భిన్నుడని తెలపించి, ఆధికారిక పురుషుడైన తాను క్షరాక్షరాతీతవల్లనే పురుషోత్తముడు కాని స్వతహాగా కాదని నిరూపితమయ్యే నిర్గుణరూపమే పురుషోత్తమ స్వరూపాన్ని తోపకేస్తుంది. కాబట్టే... 'ససర్వవిద్భజతి మాం సర్వభావేన' అని 'సంవిన్మాత్రరూపమైన బ్రహ్మజ్ఞానంచే సర్వాత్మనా బ్రహ్మభావం చెప్పబడుతూందని ఉత్తర శ్లోకంలో అనడం చక్కగా ఉందని అద్వైతు లంటారు.

అరవిందుల అభిప్రాయం *Essays on the Githas* లో చూచేది.

# నవ్య మానవ వాదము

**(Radical Humanisam)**

శ్రీ యమ్. యన్. రాయ్

పదిఏనవ శతాబ్దంలో శాస్త్ర జిజ్ఞాస పునరుజ్జీవన మందుకొంది. తదనుయాయంగా సంభవించిన సత్ఫలితాలలో కెల్లా సుదీర్ఘ ప్రాభవం గలిగిన విషయం, మానుషాధిక్యతను గుర్తించటానికై బయలుదేరిన "మానవ వాదం."

పదిఏనవ శతాబ్దం నాటినుంచీ కూడా, ప్రసిద్ధ కళాకారులు, వేదాంతులు, న్యాయవేత్తలు, (ఈ న్యాయవేత్తలలో ఎక్కువమంది చర్చి ప్రాభవంలోని, మునసబ్దీలు, సన్యాసులూను!) మొదలైన మహా మేధావులందరూ కూడా, ఒక సత్యాన్ని, నిరంతర చారిత్రక సత్యాన్ని గుర్తిస్తూవచ్చారు. "మానవుడే, స్వజీవితసంగ్రామాన్ని విజయవంతంగా కొనసాగించుకోగలందుకై, తన జ్ఞానదాహంలో, సంఘాన్ని సృష్టించుకొన్నాడు. అందుచేత, ఐహికంగాగాని ఆముష్మికంగాగాని మానవుడు సృష్టించుకొన్న దేదైనా, మానవజీవిత సమస్యలకు పరిష్కార ప్రయోజనం గలదైయే ఉండాలి" అన్న మహత్తర సత్యాన్ని గుర్తించారు.

మానవ సమస్యలనుంచి దూరగులమై పారిపోవటంవల్ల దేన్నీ పరిష్కరించలేము. ఈ ప్రపంచం దుఃఖభూయిష్టం, మానవుడు మారలోని మూర్ఖుడు. అందుచేత సత్పురుషులైన వారు సర్వసంగ పరిత్యాగంచేసి, దివ్య ఏకాంతంలో ముని వృత్తిగొని జీవితాలు సఫలంచేసికోవలసిందే—అని చెప్పలేకారు.

ఈ నూతన వేదాంతం మానవునికూడా ప్రకృతిలో భాగస్థమైన ప్రకృతిధర్మంక్రింద పరిగణించింది. నాగరికత పుట్టిన నాటినుంచి ఈనాటిదాకా వికాసమందుకొంటూన్న ప్రకృతి విజ్ఞానం అంతా మానవుని సమస్యలను అవగాహన చేసుకొనేందుకే ఉపయోగించుకోవాలని ఉద్ఘాటించింది. వేదాంతానికీ శాస్త్ర విజ్ఞానానికీ ఒక సన్నిహిత సంబంధాన్ని ఏర్పాటు చేసింది. వివిధ విజ్ఞానశాఖలలో ప్రకృతి పరిశోధనలలో, సంలబ్ధమైన విజ్ఞానాన్నంతా జీర్ణం చేసుకొని సక్రమబద్ధం చేసుకొన్ననాడే 'వేదాంతం' వేదాంతమన్న పేరుకు తగిఉంటుంది.

సంకల్పగతం, సృష్టిగతం—ఆముష్మికం, ఐహికం—ఆదర్శం, సాంఘికం—గా ఉంటూన్న మానవ చైతన్యశాఖాద్వయాన్ని రెంటినీ సమన్వయ పరుచుకోవటమే, నేటి సంస్కృతికి, నేటి నాగరికతకు ప్రాతిపదికమైంది. ఆదిలో ఈ నాగరికతా, సంస్కృతీ కూడా, మానవ మాత్రునికి అపారమైన ప్రాముఖ్యాన్నిచ్చి, సర్వ మానవ సమస్యలను, మానవ విమోచన దృష్ట్యా ఆలోచించటంవల్ల, మానవ వాద ప్రోక్తాలుగానే ఉంటూవచ్చాయి.

జీవితంలోని వివిధ కామనలను విమోహాలను ఎంతెంతవరకు మానవుడు జయించ గలుగుతాడో అంతంత మేరకు అతను ఆత్మ విముక్తుడుగానే ఉంటాడు. మానవ వాద సారాంశమంతా యిదే. కేవలం విముక్తుడను కావాలని కోరుకోవటమే కాదు. మానవుడు, కేవలం ఊహా ప్రపంచంలో కాక యథార్థ జీవితంలోకూడా విముక్తుడు కాగల శక్తి సామర్థ్యాలు మానవుని వున్నాయి. ఈ వేదాంతాన్ని "మానవ వాదం" అన్నారు. కారణం, ఈరీత్యా మానవునికే అపార ప్రాముఖ్యం—అతనే ఈ ప్రపంచానికి, అతని సృష్టి సర్వస్వానికి, కేంద్రం! ఈ ప్రపంచం అతని సృష్టే కాబట్టి, అతనికి కావలసినవిధాన దాన్ని అతనే పునర్నిర్మించుకోగలడు. నవీన విజ్ఞానానికీ సంస్కృతికీ, ఈ మానవవాదం ఇచ్చిన దోహదం మరే వేదాంతమూ ఇయ్యలేదు.

అయినా, నేటి ప్రపంచమాత్రం, మళ్లీ రోమక సామ్రాజ్యం చితికిపోయిననాటి పరిస్థితిపైపే కదులుతూ, పతనమయి పోయేందుకు సిద్ధంగా ఉన్నట్లు కనబడుతూంది. అసలు నాగరికత సమూలంగా నాశనమై పోగలదని నష్టజాతకం గుణిస్తున్నారు కొందరు వేదాంతులు. పరిస్థితి మహానైరాశ్యజనకంగా ఉంది.

మానవతా సాంప్రదాయాలు మరుగు పడిపోవటమే ఈ శైథిల్యానికంతటికీ కారణం. ఏనాడు మానవతా సాంప్రదాయాల నుంచి వేరుపడి పోయిందో—'సంస్థ'కన్నా మానవుని హీనునిగా చేసేసిందో; వాస్తవికమైన మానవవిజ్ఞానాన్ని, మానవుని బుద్ధినీ, 'సంఘ ఆత్మ' అన్న ఊహాదేవతను సృష్టించి దానికి బలిచేయ ప్రారంభించిందో; ఏనాడు జాతిలోని విశిష్టవ్యక్తుల సంకలిత సమూహంకన్నా "జాతి" ఎక్కువ అని తీర్మానించిందో, యథార్థమైన మానవ వ్యక్తులను వదలి, అగమ్యగోచరమైన 'సంఘ' భావాన్ని సృష్టించి, వ్యక్తులకన్నా పైస్థాయిలో నిలిపిందో—ఆనాటినుంచే నేటి నాగరికత అధోముఖంగా వాలుబట్టి జారిపోతూవచ్చింది. ఈ తప్పుడు భావాల ఫలితంగా అనేక విధాల రాజకీయ మతాలు బయలుదేరాయి. అవి మానవతా సాంప్రదాయాలకు ఎదురువడటమే కాకుండా, వ్యక్తికి ఏమాత్రపు విలువనూ ఇయ్యటానికి నిరాకరించాయి. తన ప్రాభవానికంతటికీ మూలకందమైన మానుషానికే విద్రోహం తలపెట్టటంవల్లనే నవీన నాగరికతకు వినాశకాలం దాపురించింది.

ప్రపంచం మారుమూలల వేదాంతులు తత్వవిదులూ, విజ్ఞులూ అయినవారంతా ఈ పాఠాన్ని గ్రహించి, మానవవాద పునరుద్ధారణ అవసరమని భావిస్తున్నారు. జాతులు, దేశాలు, రాజ్యాలు, సామ్రాజ్యాలు, సంఘం, వర్గం —ఇవి నవీన రాజకీయాలకు ఆరాధ్య దేవతలై కూర్చున్నాయి. మానవుడు విస్మరింపబడ్డాడు. సంఘ భావుకతలోనూ, సంఘయంత్రాంగంలోనూ,

మానవుడు కనబడకుండా రూపుమాసిపోయాడు. కాని, వ్యక్తుల కన్న ఉత్కృష్టస్థానంలో స్థాపింపబడిన ఈ సంస్థలన్నీ కూడా, మానవ స్వాతంత్ర్యంకోసం నెరపుకొన్న సంగ్రామంలో, తనకు సేవకమాత్రాలుగా ఉండగలందులకు మానవుడు సృష్టించుకొన్న సంస్థలే. మానవుడు జాతికోసం తన్ను త్యాగం చేసుకోవాలి; ఉత్పత్తిశక్తులకు నిస్సహాయుడై బలిఅయిపోవాలి.—సంఘం స్వతంత్రంగా ఉండగలందుకు మానవుడు తన స్వాతంత్ర్యాన్ని వదులుకోవాలి. ఇంతటి దుఃస్థితికి మానవుడు హీనపరచ బడ్డప్పుడు, మానవుడు సహజంగానే తన ఆత్మవిశ్వాసం కోల్పోతాడు.

ఈ ప్రకృతి భౌతికవాతావరణమధ్యంలో సృష్టికి తలమానికంగా, "సృష్టి రాద్యైవ ధాతుః" అన్నట్లుగా మానవుడు నిలుస్తాడు. ప్రకృతిలో సృజనాశక్తి అంటూ ఏదన్నా ఉంటే అది మానవునిలోనే ఉంది. మానవుని ద్వారానే ప్రకృతిలో ఆ శక్తి వినియమానికి రాగలుగుతుంది. మానవుడు దుష్టుడు, నీతిరహితుడు, అజ్ఞాని, అందుచేత బాసపడతాడన్న ఎక్కడా ఏ ఆస్కారమూ లేదు. అంటూ చాలామంది వాదిస్తారు. కాని మానవునిగూర్చి, మనకు తెలిసినంతమటుకూ చూసుకొన్నా మానవునికి ముఖ్యంగా "బుద్ధి" అనేది ఉందని స్వీకరించుకోటం సులభమేకదా. మానవుని ప్రతి ఒక్క కర్మ ఎంత అసంగతంగా అప్పటికి కనపడ్డా సుదీర్ఘంగా అన్వయించుకొని చూస్తే తర్కసహమే అవుతుంది. తన పరిసరాలు మానవునిలో కల్పించే జ్ఞానసంచలనమే— నీతిగా రూపొందుతుంది. 'బుద్ధి' అనేది మానవునిలో ఉండుటవల్ల కల్గిన ఫలితమే అది. వస్తుతః మానవుడు బుద్ధియుతుడు. తత్కారణంగా నీతివంతుడు. ఇదే మానవుని జీవాంశమైతే, ఇది మళ్ళీ మానవునికి జ్ఞప్తికి తెస్తే చాలు. మళ్లీ ఆత్మవిశ్వాసం కోలుకొని, తనకు జరిగిన హానినుంచి తేరుకొని వృద్ధి పొందగలుగుతాడు. భూతకాలంలో జరిగిన దోషాలను గ్రహించి, నేటిప్రపంచ అస్తవ్యస్తాన్నంతా పరిచేసుకొని, పూర్వం తాను సాధించిన మహత్తర విషయాలకన్నా కూడా ప్రశస్తతరమైన మహత్కార్యాలను సాధించేందుకు మానవుడు పురోగమించగలుగుతాడు.

ఒకప్పుడు నైతికసమస్యలను వ్యక్తిగత సమస్యలనుగా పాటించేవారు, దానిస్థానే నేడు సంఘనీతి మనను ఎదుర్కొంటూంది. "నైతిక శక్తి, అంతరాత్మప్రేరితమే" అనేటట్టయితే ఒకే పరిస్థితిలోనున్న, ఇద్దరు వ్యక్తులు ఎల్లా ప్రవర్తిస్తారో మనం చెప్పలేము. కారణం అంతరాత్మప్రేరణంగాని, ఇంద్రియజ్ఞానంగాని ఎల్లా పనిచేస్తుందో, మనకు తెలియదు. అంటే ఒక సర్వసాధారణప్రమాణం అనేది మనకు అందదు. అందుచేత, సేంద్రియవ్యాపారమూలకమైన నైతికత్వానికి, ప్రామాణికత ఏర్పడదు. ఇతర బాహ్య ప్రమాణాలు లేనివాడు నైతిక విలువల నన్నిటినీ వ్యాప్తిక ప్రపంచానికి దొర్లించ వలసిందే.

తర్కసహంగా నిలబడగల ఆనవాయితీ అంటూ ఒకటుండాలి. మానవుడు, జనుశాస్త్రము, శారీరక మనశ్శాస్త్రాలూ ఇన్నిటి విజ్ఞానమూ కూడా, మానవుడు 'ఉపపన్న జీవి" (*Rational Being*) అని ముక్తకంఠంతో ఉద్ఘోషిస్తున్నాయి. అందుచేత, నీతిని మానవునిలో వస్తుతః ఉన్న ఉపపత్తికి సంబంధీకం చేయగలిగినట్లయితే కర్మలకు గుణ విశేషాలను సాధించుకో గలుగుతాము. ఈ విధంగా సార్వత్రికమైన నీతి విలువలను ప్రమాణాలను మనం ఏర్పరుచుకోవచ్చును. "మంచి" నిసోపపత్తికంగా సంభావించుకో గలిగినప్పుడే, మంచితనానికి, సార్వత్రికమైన కొలమానం అంటూ ఏర్పడుతుంది. ఈనాడు మన నెక్కువగా అలయిస్తున్న ఉజ్జ్వలసమస్య నైతిక సమస్య—ముఖ్యంగా "సాంఘిక నీతి" విషయిక సమస్య! మానవత్వ 'సారాంశ' మేమిటో, తెలుసుకో గలిగితే, మానవుడు వస్తుతః ఉపపన్నజీవి అని కనుక్కో గలిగితే, ఈ సమస్యకు పరిష్కారం కుదురుతుంది. ఏకప్రాణి కోటికి చెందినవారవటంవల్ల, మానవులంతా ఒకేవిధంగా నిర్మింపబడి ఉన్నారు. కాబట్టి ఒక కనిష్ట ప్రమాణ మాత్రంగానైనా మానవప్రవృత్తికి విజ్ఞానం భూమికగా అమర్చగల్గినవాడు, ఒకే పరిస్థితిలో ఉన్న మానవులందరూ దాదాపు ఒకేమాదిరిగా ప్రవర్తించే అవకాశం చాలా ఉంది. ఇదే, ప్రజాజీవనంలోనూ, రాజకీయాలలోనూ, "నీతి" ని ప్రవేశపెట్టాలన్న అతి వాంఛనీయ ప్రకామనలకున్న ఆశారేఖ.

తార్కిక, సోపపత్తిక 'నైతిక చరితం,' సాధ్యమని రూపించుతున్న కారణంచేత, నేటి ముఖ్యావసరాన్ని ఎదుర్కో గలవని నవ్యమానవ వాదం అభియమిస్తోంది. ఈ సాధ్యస్థితిని సాధించుకోవటంలో మానవ జీవితానికి ఒక నూతన దృక్పథం ఉత్పన్నమవుతుంది. మానవ ఉత్కృష్టత, వ్యక్తిత్వము, సర్వాధికృతి, సృజనాశక్తి, ఆదికాలంనుంచి గౌరవమందు కొంటూ వస్తున్న ఈ భావాలన్నీ అర్థవంతమై భాసిస్తాయి.

ఈ గుణవిశేషాలన్నీ కలిగిఉండేందుకు, తన్నుమించిన ఒక మహాధిపత్యానికి మానవుడు దాసానుదాసుడై పోవలసిన అగత్యమేమీలేదు. స్వతహాగా మానవుడు "మంచి" గా ఉండలేడన్న భావము కల్గినవాడు మానవుడు అసహాయుడినని భావించుకొంటూ నిస్పృహుడైపోతాడు. ఆత్మస్వాతంత్ర్యం కలిగితేనే గాని సాంఘిక, ఆర్థిక స్వాతంత్ర్యాలు చేకూరటానికి ప్రాతిపదిక ఉండదు. ఈ "విముక్తి" సందేశాన్ని చాటించేది నవ్యమానవ వాదము. మానవ జీవితం స్వయం భరితమూ, స్వయంసమృద్ధమూ, అని ఈ వాదం చెపుతుంది. ఈ ఆత్మవిజ్ఞానంతో, తన్ను తాను తెలిసికోవటంతో, మానవునిలో ఆత్మవిశ్వాసం ప్రబలి నేటి నాగరికత యొక్క నైతికపతనాన్ని తప్పించుకొని నైతిక సమస్యను పరిష్కరించుకొనేందుకు ఆస్కారం కలుగుతుంది.

వ్యక్తిలో కార్యకారణ సంబంధమైన నైతికజ్ఞానాన్ని బుద్ధిమంతతనము అంటాం. వ్యక్తులు బుద్ధి గలిగి ప్రవర్తించటం సంఘం నీతిమంతంగా ఉండటానికి పునాది. ఈ ప్రవర్తన బలవంతంవల్ల రావలసినదిగాదు. స్వతహాగా కలిగేది. 'బుద్ధి' వర్తనులైన వ్యక్తుల మధ్య సాంఘిక సంబంధాలు నీతియుతంగా ఉండి, తత్ఫలితంగా సామరస్యం చేకూర్పునిగా ఉంటవి. అప్పుడు రాజకీయాలు కేవలం అధికారదాహపూరితాలు కాక, స్వతంత్ర వ్యక్తుల సభ్యజీవన కర్మకాండ యావత్తుకూ సహకారక్షేత్రాలవుతాయి.

నవ్యమానవవాదం రాజకీయాలనుంచి విరమించుకోమని బోధించదు! ఒక నూతన ఆచరణ విధానం అవలంబించమనిమాత్రం

బోధిస్తుంది. మానవుని చెప్పుకొంటూన్న ఆదర్శాలకూ, నమ్మకాలకూ, చేసే చేతలకూ ఏమాత్రం పొందిక లేకపోవటమే నేటి ప్రపంచ దుస్థితికి మూలకారణం. మహా అయితే క్రియాకలాపం అంతా ఉద్రేకాలు రేచ్చిన స్థాయిలో మాత్రం జరుగుతూ ఉండవచ్చును. కాని సద్యః ఫలితాల నాశించి మాత్రమే ఈ పని జరుగుతోంది. ప్రపంచం పాడయిపోయింది. ఒక విప్లవం వచ్చితీరాలి. సంఘాన్ని పునర్నిర్మించుకోవాలి. కాని ఎల్లా? ఒక కొత్త పార్టీ స్థాపించు, జనాన్ని దాని అనుసరించి దానిలో కలవమను. ఆ పార్టీ అధికారంలోకి వచ్చేటప్పటికి ఒక విప్లవం వస్తుంది. యథార్థ రాజకీయాల ఈ సకామ ప్రణాళికలో ఒక్క లోటు ఉంది. ఏ విధానమైనా ఆచరించవలసినది మనుష్యులే అని ఈ ప్రణాళిక విస్మరిస్తోంది. ప్రపంచం చెడిపోయింది కాబట్టి మనుష్యులూ చెడిపోయారు అంటారు. సాంఘికవిప్లవం వస్తే మంచికి అవకాశమున్న వాతావరణం వస్తుందంటారు. ఇల్లాగే అయేటట్లయితే ఎంత విప్లవవాద పక్షమైనా అందులో ఉండే మనుష్యులు చెడ్డవాళ్లే కదా! అథవా మంచివాళ్ళు కారు అల్లాగటప్పుడు మంచివాళ్ళు కాని వాళ్ళతో—(మరి విప్లవం సంభవం అయేదాకా 'మంచి'కి అవకాశం లేదుకదా) "మంచి"కి దోహదమిచ్చే వాతావరణాన్ని సృష్టించుకోటం సాధ్యమా? ఇది ఏమాత్రం యుక్తియుతంగా కనబడదే! చెడ్డవాళ్ళ కృషివల్ల మంచి సంఘం సృష్టికాబోదు అని విదితమే. ఇంక మంచివాళ్ళు లేనిలోటు గొప్పవాళ్ళున్నంత మాత్రాన తీరదు. ఇది చరిత్ర నేర్పిన పాఠము.

సంఘం సంస్కరించదలచుకొన్నవానికి ముందు అధికారం (*Power*) ఉండాలంటారు. ఏ రాజ్యాంగపద్ధతినైనా ఒకపక్షం అధికారంలో కొన్ని సంవత్సరాలు మాత్రమే ఉండగలదు. ఆ పార్టీ తన ప్రణాళిక నెరవేర్చుకొనేందుకు ఆ కొద్ది కాలం ఎల్లాగూ చాలదు. అప్పు డాపక్షం తన కింకో అవకాశం ఇయ్యాలంటూ తను చెయ్యగల పనులు తన ఆదర్శాలు అన్నీ మళ్ళీ ఏకరువు పెట్టి ప్రజలను ఆకర్షింప చూస్తుంది. అల్లా ఒక ఎలక్షనుకు తర్వాత ఒక ఎలక్షనుకు నిరంతరం మునుపటికన్నా పెద్ద అబద్ధాలు ఎప్పటికప్పుడు చెప్పుకొంటూ పోవాలి.

ఇక, తీవ్రవిప్లవంద్వారా పైనుంచే అధికారాన్ని స్వహస్తగతం చేసుకొని మూల విషయకమైన మార్పులను పైనుంచే సంఘం మీద రుద్దుకొంటూ వచ్చే మార్గాంతర మొకటుంది. కాని అదైనా ఇంతకన్నా సత్ఫలితాల నియ్యలేదు. కాబట్టి కొత్తమార్గం ఒకటి కావాలి. నవ్యమానవవాదం ఈ కొత్త పంథా సూచిస్తుంది. అది సుదీర్ఘమార్గంగా కనబడవచ్చును గాని నిజానికి అది అంత దీర్ఘం కాదు. లేక ఒక వేళ దీర్ఘమే అయినా అంతకన్నా గత్యంతరమూ లేదు. అటు అధికార దాహంతోటి జరుగుతూన్న ఉన్మత్త కలాపంలో అన్నా కలిసిపోవాలి. లేదా కొత్తదారులు వేయటం ప్రారంభించి ఫలితాలను ముందు తరాలవారైనా అనుభవించేందుకు పాటుపడాలి. కాని ఇన్ని ఏళ్ళబట్టి నిరంతరంగా సాగివస్తూన్న దాంట్లో పాల్గొని ఇక లాభం లేదని భావించినవారు ఇక సహజంగానే ఈ కొత్త మార్గం అవలంబిస్తారు.

రాజకీయ వేత్తలు సాంఘిక ప్రవక్తలూ కూడా, మానవుణ్ణి మూకగా జమకట్టి, కేవలం లోభమద మాత్సర్యాది ఉద్రేకపూరితమైన నినాదాలను మాత్రమే అందుకొని విజృంభించగల రాక్షస స్వరూపాన్ని తయారుచేశారు. రాజకీయాధికార వాంఛాకుతంత్రాలను కొనసాగించుకొనేందుకు మానవుని అడవిమృగంకన్నా ఎద్దు మొద్దు స్వరూపంగా చేసి నీచపరిచారు. అధికారంలోకి రావాలంటే ఏ పార్టీకైనా వోట్లు కావాలి. ఆ వోట్లు తెచ్చుకొనేందుకు మానవునిలో "బుద్ధి"ని ప్రేరేపించటానికి బదులు "ఉద్రేకాలను" "ద్వేషాలను" పురిగొల్పి వోట్లు తెచ్చుకోటం తేలికయింది. జనం ఎంత వెనకబడిఉంటే, అంత ఎక్కువగా ఈ ఉద్రేకాలను ద్వేషాలను రెచ్చగొట్టి వోట్లు తెచ్చుకోవచ్చు. అందుచేత నేటి ప్రజాస్వామ్య రాజకీయాలకు, రాజకీయంగా ఎంతటి అజ్ఞానంలో ప్రజనట్టి పెట్టి ఉంచితే అంత లాభమని తెలి, ఆ ఫలితమే సంభవించింది. దీనికి విరుగుడల్లా, ప్రజాబాహుళ్యాన్ని విద్యావంతులుగా చేయటమే. అప్పుడు మూకలుగా జనం లెక్కకు వచ్చే పద్ధతి మొదలంట నశిస్తుంది. వివాద డంబాచారాల పార్టీ పద్ధతులు నశిస్తాయి. ప్రజాజీవితంలో "నైతిక వర్తనం" ప్రవేశిస్తుంది.

ఒక్కసారి ఆరంభం అంటూ జరిగితే ఈ ఉద్యమం వృద్ధి పొంది తీరుతుంది. ఇది తప్ప వేరు మార్గం ఉండదు. అధికార వాంఛా రాజకీయాల కళ్ళెంలో మునిగిపోకుండా నే ప్రజలతో సంచరిస్తూ, నిత్యం వారితో ఉంటూ, విషయబోధచేస్తూ, స్వయం నిర్ణయ శక్తి వారిలో కలిగేందుకు దోహదంచేస్తూ, వాళ్ళ విజ్ఞాన సాంస్కృతిక ప్రమాణాలను వృద్ధిచేసేందుకు, ప్రతి ఒక్కరూ కృషి చేయవచ్చును. అంటే ప్రజలందరినీ బడులలోకి తోలమని కాదు. సామాన్య పాఠశాలలు ప్రభుత్వమో, లేక ప్రభుత్వ సహాయాన్న ఇతరులో స్థాపిస్తారు. అక్కడ కట్టుబాట్లకు లోనయిన ప్రవర్తన అవి నేర్పుతారు. కాని ప్రజాస్వామ్యానికి పునాది కాగల విద్య—మానవునికి తన హేతువృత్తిని, సృజనాశక్తిని జ్ఞప్తికి తెచ్చి అతన్ని పునరుజ్జీవితుని చెయ్యగల విద్య, స్కూళ్ళల్లో మాస్టరులు కాక ఇతర గురువులు గరపవలసిన విద్య. అది ఏదో ఒక పద్ధతి మాత్రానికి పరిమితమైన శిక్షణ విద్య కాదు. ప్రజల నిత్యజీవిత చర్యలలో, వాళ్ళతో కలిసి జీవిస్తూ వాళ్ళ జీవితకృషిలో పాల్గొంటూ నేర్పవలసిన విద్య. తమతో కలిసి పాల్గొంటూ బోధ ఆచరణలను సమన్వయపరుచుకొంటూ తమకు నేర్పుతూ మంత్రిత్వ నాయకత్వాది అధికారాలు వాంఛించని గురువులంటేనే ప్రజకు భక్తిప్రపత్తులుంటాయి. ఇది ఒకటే మార్గము. సరిగ్గా ఫలితాలియ్యగల విధానం. ఈమార్గం ప్రతివారూ అనుసరించవచ్చును. అన్ని జీవితరంగాలలోనూ నిత్యం బహుళ సంఖ్యానీకంతో పరిచయంలోకి వస్తాం. నిరాడంబరంగా ఈ "మానవ" బోధను ఎవరి గమనికలోకీ రానక్కర లేనంత సూక్ష్మంగానే ప్రారంభించవచ్చును. దాని ప్రభావము మాత్రం ఎప్పటికప్పుడు పొందుతూ, అంతకంతకూ ప్రజలపై విరివిగా ప్రసారితమౌతూ వస్తుంది. వాళ్ళు కూడా "నవ్యమానవ వాదులు"గా మారి ఈ కృషి కొనసాగిస్తే, ప్రజలలో సరియైన ప్రజాస్వామ్యభావాలు విస్తరించవచ్చును. ఇంతవరకూ అవలంబింపబడి ప్రపంచానికి ఈషణ్మాత్రం మేలుచేయలేకుండా ఉన్న తదితర ఉద్యమాలవేటికన్నా కూడా నవ్యమానవవాదం శీఘ్రఫలితాలను సాధించ గల్గుతుంది. రాజకీయ చాణక్యులు, రాజకీయ మహాపురుషులూ జితోష్ఠి అన్నచోట 'మానవవాద మార్గము' సత్వరమ ప్రగతిమై విజయం సాధించి తీరుతుంది. అప్పుడు కలిగే ఫలితాలు ఎల్లాటి వయినా సత్ఫలితాలు మాత్రమే అవుతాయి.

# లీలావతి

★

తిమ్మావజ్ఝల కోదండరామయ్య

శాస్త్రము లోకుల కక్షి. అది యగోచరార్థ విజ్ఞానమును వెలయించి సందియములఁ దొలచును. అది యలవడనివాఁడు కన్నులుండియు లేనివాఁడు, చిన్నయసూరి.

పలుసందియములఁ దొలఁచును
వెలయించు నగోచరార్థ విజ్ఞానము లో
కుల కక్షి శాస్త్ర, మయ్యది
యలవడ దెవ్వనికి వాఁడె యంధుఁడు జగతిన్.

అని శాస్త్రప్రాశస్త్యము నుగ్గడించినాఁడు. తర్కవ్యాకరణాది శాస్త్రనిచయమున బహుప్రయోజక మగుట గణితశాస్త్రము శాస్త్రములలోఁ బ్రథమగణ్యమై వెలయుచున్నది. ఉదయము నిదుర మేలుకాంచినది మొదలు గణితముతో నవసరము లేనివాఁ డుండుట యరిది. మానవుఁడు తొడఁగు ప్రతికార్యమునకును గణితము ప్రయోజనకారి. గణిత శాస్త్రముయొక్క బహుప్రయోజకతను మహావీరాచార్యుఁడు తన గణిత సారసంగ్రహమున నిట్లు పేర్కొనినాఁడు.

'లౌకికే వైదికే వాపి తథా సామాయికేఽపి యః
వ్యాపార స్తత్ర సర్వత్ర సంఖ్యాన ముపయుజ్యతే
కామతంత్రేఽర్థ శాస్త్రే చ గాంధర్వే నాటకేఽపి వా
సూపశాస్త్రే తథా వైద్యే వాస్తు విద్యాదివస్తుషు
ఛందోలంకార కావ్యేషు తర్క వ్యాకరణాదిషు
కలాగుణేషు సర్వేషు ప్రస్తుతం గణితం పరం
సూర్యాది గ్రహచారేషు గ్రహణే గ్రహసంయుతౌ
త్రిప్రశ్నే చంద్రవృత్తౌ చ సర్వత్రాంగీకృతం హి తత్
ద్వీపసాగర శైలానాం సంఖ్యావ్యాస పరిక్షిపః
భవనవ్యంతరజ్యోతి ర్లోకకల్పాధివాసినాం
నారకాణాం చ సర్వేషాం శ్రేణీ బంధేంద్ర కోత్కరాః
ప్రకీర్ణక ప్రమాణాద్యా బుధ్యంతే గణితేన తే
ప్రాణినాం తత్ర సంస్థాన మాయు రష్ట గుణాదయః
యాత్రాద్యా స్సంహితాద్యాశ్చ సర్వే తే గణితాశ్రయాః
బహుభి ర్విప్రలాపైః కిం త్రైలోక్యే సచరాచరే
యత్కించి ద్వస్తు తత్సర్వం గణితేన వినా నహి

—గణితసంగ్రహము.

గణితశాస్త్ర ప్రశస్తికి సంబంధించిన యీ శ్లోకార్థమునే పావులూరి మల్లన యొక్క పద్యములో నతిసంగ్రహముగా దెలిపినాడు.—చూడుడు.

అర్కాదిగ్రహసంచర గ్రహణకాలాన్వేషణోపాయముల్
దర్కవ్యాకరణాగమాది బహుశాస్త్రప్రోక్త నానార్థసం
పర్కాదివ్యవహారముల్ భువనరూపద్వీపవిస్తారముల్
దర్కింపన్ గణితప్రవృత్తి వెలిగాఁ దక్కొం డెఱుంగించునే

—పావులూరి గణితము.

జ్యోతిషము వేదమునకు లోచనము. అట్టి జ్యోతిషమునకు గణితశాస్త్రము మూలము. జ్యోతిషముకొఱకయియే భారతీయులు పూర్వము గణితశాస్త్రమును నేర్చుచుండి రనుట సత్యదూరము కాదు. చూడుడు—

"వేద మఖిలక్రియా ప్రతిపాదకంబు
జ్యోతిషము వేదమునకు లోచనము సందు
గణితభాగము తారకల్ గాఁగ వెలయు
నిది యవశ్యంబు చదువ మహీసురులకు"

—లీలావతి

"వేదమునకుఁ జక్షు వన్న జ్యోతిష మండ్రు
దాని కాద్యముగుచుఁ దనరు నిదియె
గాన గణిత మఖిలకారణం బనుటకు
సంశయంబు లేదు జగతియందు"

—ఆంధ్ర లీలావతి

గణితశాస్త్రాధ్యయనము జైనపండితులకు నొక పవిత్ర కార్యము! మోక్షప్రాప్తికి సాధనభూతములయిన నాలుగు 'అనుయోగము'లలో గణితశాస్త్రాధ్యయనము ప్రధానమయినదని వారి విశ్వాసము!

మహావీరాచార్యుఁడు గణితశాస్త్రము నొక మహోదధిగా సందర్శించినాడు. బహువిధగణితములును నామహోదధి కంగములుగనే యతని కనులకు ప్రతిభాసించినవి. అందలి సంఖ్యానమణిగణముల నుద్ధరించుట కజునకును సాధ్యముగానిపని యని యాతఁ డనుభవపూర్వకముగా దెలిపినాడు చూడుఁడు.

"భాసురసంజ్ఞ ప్రపంచాది వేదిత
సకలార్థ పరికర్మ జలసమృద్ధి
భిన్నాధికార గంభీరాంతరాళంబు
గాఢప్రకీర్ణక గ్రాహవితతి
త్రైరాశికోర్మి సంతానంబు మిశ్రిత
సూత్రమణి ప్రభాశోభితంబు

ఖర్జిత క్షేత్ర విస్తీర్ణ ప్రభావంబు
లాలిత ఖాతపాతాళతలము
కరణ సంశ్రిత ఛాయాధికార వేల
గణక కవి గణ కలకల ఘనరవంబు
గణితవారిధి సంఖ్యాన మణిగణంబు
లుద్ధరింపంగ వజానకు నోపనగునె."

—పావులూరి గణితము.

గణితశాస్త్రమున భారతీయవిజ్ఞాన మతిప్రాచీనము, అపారము. గణితవ్యవహారమున కంతకును బీజభూతమయిన యంక సంజ్ఞ భారతీయోపజ్ఞము! దశాంకపద్ధతి భారతీయసృష్టి. సంఖ్యా నిర్దేశమున నంకెకు నిజమూల్యముతోబాటు స్థానికమూల్యముగూడ నుండునని తొలుత కనుగొనిన కీర్తి భారతీయులది. అంకహీన స్థానమును శూన్యముచే నిర్దేశించు విధానము భారతీయ ప్రతిభా జన్యము. ఋణసంఖ్యల కల్పనమును, రెండు ఋణరాశుల గుణిత లబ్ధము ధనరాశి యనుసిద్ధాంతమును స్థాపించినవారు భారతీయులు. ధనఋణసంజ్ఞల గల్పించి, యా రెంటికి బారతమ్యము గలదని నిరూపించిన గౌరవము భారతీయులకే దక్కవలసి యున్నది. ఇక బీజగణితము కేవలము భారతీయసృష్టి. బీజగణితమున భారతీయులు గ్రీకుశాస్త్రవేత్తలకంటె ముందంజవేసి యీశాస్త్రమున నొక యున్నతస్థానము నందియుండిరని పలువురు పరిశోధకుల యభిప్రాయము.

ప్రాచీనకాలమున నింత మహోన్నతముగా నభివృద్ధి గాంచి ప్రపంచ గణితశాస్త్ర చరిత్రమున నొక ప్రధానస్థానము నే యాక్రమించుచున్న భారతీయ గణితశాస్త్రము తరువాతి కాలమున నంతగా నభివృద్ధి గాంచలేదు. గ్రీకుదేశమునందు వలె భారతదేశమున గణితశాస్త్ర మభివృద్ధినొందకపోవుటకు ప్రత్యేకములయిన కొన్ని కారణములుకలవు. పూర్వకాలమున శాస్త్రాధ్యయనాధికార మొక్క బ్రాహ్మణవర్గమునకే యుండుటచేత దక్కిన వర్ణములవారీ శాస్త్రముల విషయమున నంత శ్రద్ధ జూపరయిరి. గ్రీకుదేశమున వలె గాక గణితము నేర్చు నధికారము ప్రతి సామాన్య మానవునకు నుండెను. భారతీయులు సాధారణముగా దమ శాస్త్రగ్రంథములను ఛందోబద్ధము గావించుటయు నొక ప్రధాన కారణము. పండితులగు గణకులు గణితసూత్రముల జ్ఞాపక ముంచుకొనుటకు నీ ఛందోబద్ధములగు శాస్త్రగ్రంథములు తోడ్పడుచుండినను నివి సామాన్య మానవున కర్థము కాకపోవుచుండుటవలన వారి కందుబాటులో లేకుండెను. అందుచే సహజముగనే యీ శాస్త్ర మంత రితిప్రాయము కావలసివచ్చెను. గ్రీకు దేశములో వలె గాక గణిత శాస్త్ర సంబంధము లగు సూత్రము లన్నియు సామాన్య మానవునకును నందుబాటులో నుండుటచే గణితశాస్త్రాధ్యయనమున నేమాత్రము మాసక్తి కలవాడును నందు ప్రవేశము మాత్రమే గాక ప్రావీణ్యమును గూడ సంపాదించుట కక్కడ అవకాశముండెను. గ్రీకు దేశీయ గణకులు గణితమును గణితముకొఱకయియే నేర్వగా భారతీయులు గణితమును జ్యోతిషము నేర్చుట కొక యుపకరణముగా మాత్రమే తలచి నేర్చుటయు నిందుల కొక ప్రబల కారణము. ఇది గాక గ్రీకు శాస్త్రజ్ఞులు తమ నిరంతర పరిశోధన ఫలితముగా జేకూడిన కొన్ని సిద్ధాంతములను, వాని యుపపత్తులను గ్రంథస్థములు గావింపగా భారతీయులు వానిని సూత్రమాత్రబద్ధములు గావించి తమ పరిశోధన విధానములను దరువాతి తరములవారికి దెలుపకుండుటయు నొక కారణమే! ఇట్టి కారణములచే భారతదేశమున గణితశాస్త్రము గ్రీకుదేశమునందువలె నంత యభివృద్ధి గాంచకుండె నని తలపదగియున్నది. కాని యార్యభటుడు, వరాహమిహిరుడు, బ్రహ్మగుప్తుడు, శ్రీధరుడు, మహావీరాచార్యుడు, భాస్కరాచార్యుడు మొదలగు భారతీయ గణితశాస్త్రవేత్తల మహత్తరకృషి ఫలితముగా జేకూడిన గణితశాస్త్ర వాఙ్మయము చాలును భారతీయ గణితవిజ్ఞానప్రభావమును చాటుటకు! కజోరి మహాశయుడు తన గణితశాస్త్రచరిత్రమున భారతీయ గణితశాస్త్రమునుగూర్చి గావించిన ప్రశంస యిది చూడుడు—

"Both the form and the spirit of the Arithmetic and Algebra of modern times are essentially Indian and not Grecian. Think of that most perfect of mathematical symbolisms—the Hindu notation, think of the Indian Arithmetical operations nearly as perfect as our own, think of their elegant algebraical methods, and then judge whether the brahmins on the banks of the Ganges are not entitled to some credit. Unfortunately some of the most brilliant of Hindu discoveries in indeterminate analysis reached Europe too late to exert the influence they would have exerted, had they come two or three Centuries earlier.

—Cajori—History of mathematics.

సంస్కృత వాఙ్మయమున వెలసిన శాస్త్ర గ్రంథజాల మాజానుబాహునివలె [illegible] చుండగా తెలుగున వెలసిన శాస్త్రసాహిత్య మా యాజానుబాహుని ప్రక్క నిలుచుండిన మరుగుజ్జువలె దోపకమానదు. నిజమునకు తెలుగున శాస్త్రగ్రంథములు వెలయవలసినంతగా వెలయలేదనియే చెప్పదగును. ఆ శాస్త్రగ్రంథము లయినను స్వతంత్ర రచనములు కావు. అయా శాస్త్రములలో సంస్కృతమున వెలసిన శాస్త్ర గ్రంథముల కవి యనువాదములు, కొన్ని యనువాద ప్రాయములు. తెలుగున శాస్త్రగ్రంథములు విరివిగా రచింపబడకుండుటకు బలు కారణములు కలవు.

తెలుగున వెలసిన తొలిగ్రంథమగు మహాభారతముయొక్క యవతరణమే కొన్ని ప్రత్యేక రాజకీయ కారణములవలన జరిగినది. నాటివఱకు తెలుగునాట వ్యాపించియుండిన జైనమతప్రాబల్యమును దగ్గించుటకును, తిరిగి వైదికమత ప్రాశస్త్యమును బునరుద్ధరించి దాని కాంధ్రావనిలోఁ బ్రచార ప్రాబల్యములు కలిగించుటకును నని యుద్దేశించియే రాజరాజనరేంద్రుడు నన్నయభట్టారకునిచే భారతాంధ్రీకరణము గావింపజేసినాడు. ఇట్టి రాజకీయ కారణముతో నవతరించిన మహాభారతగ్రంథమునకు దరువాత

వెలసిన వాఙ్మయ మంతయు నించుమించుగా నట్టి యుద్దేశములతోనే యవతరించుచు వచ్చినది. అందుచే నాటి కవిలోకము మన ప్రాతిపదికను గొనియే భారత, భాగవత, రామాయణాది కావ్యములను తెలుగులో వెలయించుచువచ్చిరి. తెలుగున కవిత్వము వెలసిన పిదప నా కవిత్వము నీ ప్రయోజనమును సాధించుటకును కాక కావ్యముల యాంధ్రీకరణమునకే వినియోగింప తెలుగు కవిలోకము ముచ్చటపడసాగినది. శాస్త్రవిద్యకై యెల్లరును తిరిగి సంస్కృతము దిక్కునకే చూడసాగిరి. ఆయా శాస్త్రగ్రంథములను సంస్కృతముననే నేర్వవలయును గాని వాని తెలుగు చేయరాదను నభిప్రాయము కూడ నానాటివారిలో నుండుట యాశ్చర్యము కాదు. శాస్త్రపఠనమునకు సంస్కృతము తగినంతగా తెలుగు తగదేమో యను నభిప్రాయము కూడ వారిలో నుండియుండును. అందుచేతనే సంస్కృతమునందలి తర్కమీమాంసాది శాస్త్రములకు సంబంధించిన గ్రంథములలో ననేకములు నేటికిని తెలుగున ననువదింపబడలేదు. ఇదిగాక కవిత్రయమునకు తరువాత వెలసిన కావ్యవాఙ్మయమును, ప్రబంధవాఙ్మయమునుగూడ జాలవఱకు తెలుగున శాస్త్రవాఙ్మయము విరివిగా నవతరింపకుండుటకు హేతుభూతములయియుండు నని తలచుట దోషము కాదు. శృంగారప్రధానములగు ప్రబంధాది రచనమునకు తెలుగుకవులు ముచ్చట పడుచుండుటయు, నాటి కవితాపోషణ కంకణబద్ధు లగు మహారాజులు, మంత్రులు మొదలగువా రట్టి రచనములయెడలనే యాదరము చూపుచుండుటయు నిందులకు ముఖ్య కారణములు. ఈ కారణములవలననే కాబోలు తెలుగున వెలసిన శాస్త్రగ్రంథములు చాల తక్కువ. అందును గణితశాస్త్రగ్రంథములు మిక్కిలి తక్కువ. ఆంధ్రసాహిత్యమున వెలసిన యితర శాఖాసాహిత్యములతో పోల్చినపుడు తెలుగున వెలసిన శాస్త్ర సాహిత్యము చాల తక్కువ యని చెప్పకొనక తప్పదు.

తెలుగున వెలసిన గణితశాస్త్రగ్రంథములు తక్కువే యయినను తెలుగుదేశమున గణితశాస్త్రమున కాదరము లేకపోలేదు. భూమికొలతలు మొదలగు గణితసంబంధి కార్యములు నిర్వర్తింప వలసియుండుటచే నందులకై యాశాస్త్రమున నిష్ణాతుడయిన యొకకరణము ప్రతిగ్రామమునందును నుండెడివాడు. అతడు సాధారణముగా నియోగి యయి యుండును. తెలుగునాటనుండిన యీ నియోగికరణముల వేష మిట్లుండెడిదని 'హంసవింశతి' యను కావ్యమునఁ జెప్పబడియున్నది.

పరకతిలగుడ్డ యొకపాటి పచ్చడంబు
ముడుక నీర్కావి దోవతి మొలను పంచి
తత్తి నెండుంగరము వ్రేలహత్తి యొప్ప
నుండు కరణను పేద నియోగి యొకడు—

ఇట్టి వేషముతో నియోగికరణము గ్రామస్థుల యవసరముల దీర్చువాడు. ఈ కరణములు సాధారణముగా గణిత సంబంధములగు పెల్ల విషయముల నెఱిగియుండెడివారు. 'హంసవింశతి' లో వర్ణింపబడిన నియోగికరణమునకు గణితశాస్త్రమున నెట్టి ప్రవేశము, పాండిత్యము నుండెనో యీ క్రింది పద్యములవలన దెలియ గలదు.

"క్షేత్ర ఘాతంబుల స్థితులు లక్కాణించి
సౌవర్ణగణితోక్త సంఖ్య దెలిసి
మిశ్రిత గణితార్థ మిళితమునక్కడై
గాఢప్రకీర్ణక గణిత మెఱిగి
త్రైరాశికాద్యంత సారాంశము గ్రహించి
సూత్రగణితములు సొచ్చి కలచి
మఱి భిన్న గణితంబు మార్గమెల్లను గాంచి
పరగణితంబులు పాఱఁజూచి
నిఖిలసిద్ధాంత సూత్రముల్ నేర్చి జగతి
గణకకుల సార్వభౌమత్వ గణనకుఁ దగి
గణిత మర్మజ్ఞు డితఁ డని ఘనులు మెచ్చ
దెలిసి యతఁ డెంత లెక్కైన జేటపఱుచు."

"త్రైరాశిక ప్రకీర్ణ సువర్ణ పంచరా
శిక వేరుపార్ణ రాశిక సమాధి
కార వీరాచార ఘాతకుంటాహ్వయ
చ్ఛాయార్య ధిటబ్రహ్మజ్ఞాతికోత్క
లిత సప్త రాశిక లీలావతీ వర్గ
వర్గ మూల క్షేత్ర వాస్తుభాగ
గణితసార చతురంగ ప్రకాంపౌఢి
వాదీయబీజ భిన్న నవరాశి
ఘనఘనామూల శిల్పి సంకలిత సూర్య
సోమసిద్ధాంత యుగలబోధ రత్న
ఘుట్టి త్రైకోణ శాఖ్యాది గణితతతులు
దెలిసి యతఁ డెట్టి లెక్కైన జేటపఱుచు."

"పరవి గుణికట్టుగా చెంగ నరసి వ్రాసి
యంతకము వేసి కులవర్గు లాయకట్లు
దీర్చి దినవహి నపరగతి ప్రతీక
నారవణి నిర్ణయింప శేషాహి యతఁడు."

ఇట్టి గణితశాస్త్రపాండిత్యము గల కరణములు తెలుగునాట ప్రతిగ్రామమునందును నుండెడివారు! గ్రామవ్యవహారములన్నియు వారి తీర్పునకు లోనుచుండెడివి! ఇట్టిచో తెలుగునాట గణితశాస్త్రమున కాదరము లేకపోవుట యేమి? అయినను నాయా కరణములకు దెలియవలసిన గణితశాస్త్రవిషయములు చాల పరిమితములే యయి యుండుటచే వారు తమ కావశ్యక మయినంత పరిజ్ఞానమును మాత్రమే సంపాదించుకొనుటకు ప్రయత్నించెడివారు. గణితమును గణితముకొఱకు గాక గ్రామవ్యవహార నిర్వహణమునకై వారు నేర్చుచుండుటచే వారు పూర్వగణితాధ్యయనముతోనే తృప్తి జెందుచుండిరి. గాని క్రొత్తగా గణితశాస్త్ర పరిశ్రమము గావించుటకును, తత్సంబంధు లగు గ్రంథములు రచించుటకును వారు ప్రయత్నింపరయిరి. తత్ఫలితముగా తెలుగున గణితశాస్త్ర గ్రంథములు చెప్పకొనదగినంతగా వెలయలేదు.

తెలుగున వెలసిన గణితశాస్త్రగ్రంథములలో మొలతటిది పావులూరి గణితము. ఇది క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్దమున వెలసిన మహావీరాచార్యుని గణితసారసంగ్రహమునకు తెలుగుసేత.

రాజరాజనరేంద్రునిచే 'నవఖండవాడ' యను గ్రామము నగ్రహార ముగా బడసిన మల్లనకు మనుమ డగు పావులూరి మల్లన దీనికి కర్త. వితద్విషయము పావులూరి గణితములోని యీ క్రింది పద్యముల వలన దెలియనగుచున్నది.

"శ్రీలల నేపఁ దంగ్రనృపశేఖరుఁడై చను రాజరాజ భూ
పాలకు చేతఁ బీఠపురి పార్శ్వమునన్ నవఖండవాడ యన్
బ్రోలు విభూతితోఁ బడసి భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుఁడు రాజపూజితుఁడు సివ్వన పుత్రుఁడు మల్లఁడున్నతిన్."

"శ్రీ నిలయుండు సివ్వనయుఁ
జిమ్మనయున్ గుణనూర్య దేవుఁడున్
ధీనిధి ప్రోలనార్యుఁడును
దేజమునన్ రవితుల్యులైన యా
సూనుల నల్వురం బడసె
సూరిజనస్తుతి సత్యభారతీ
జ్ఞానులఁ బద్మగర్భ వదనంబులు
నాలుగుఁ బోల వారిలోన్".

"గోత్ర పవిత్రుఁడు సద్గుణ
పాత్రుం డగు సివ్వనకును బతిహిత శుభ చా
రిత్రౌరుంధతి గౌరమ
ధాత్రీసతి కిర్వురకును దనయుఁడ జగతిన్."

నన్నయభట్టారకునకు దరువాత యించుమించుగా నేబది యేండ్లకు దెలుగున వెలసిన ప్రథమశాస్త్రగ్రంథ మిది! మహావీరా చార్యుని గణితసారసంగ్రహమున (1) పరికర్మగణితము (2) భిన్న గణితము (3) ప్రకీర్ణగణితము (4) త్రైరాశికగణితము (5) మిశ్ర గణితము (6) క్షేత్రగణితము (7) ఖాతగణితము (8) ఛాయాగణి తము నని యష్టవిధగణితములు వివరింపబడియున్నవి. కాని తెలు గున పావులూరిగణితములో నందముగ నున్న మిశ్రగణితమే సూత్ర సువర్ణగణితము లని రెండుగా విభక్తమయినది. ఇంతకు బూర్వ ముదాహరింపఁడిన 'భాసురసంజ్ఞ ప్రపంచాదివేదిత' యను పద్య రూపప్రతిజ్ఞలో మల్లన 'మిశ్రితసూత్ర మణిప్రభాశోభితంబు' అని పేర్కొనియె గాని సువర్ణగణితమును బ్రత్యేకముగా పేర్కొన లేదు. కాగా సంస్కృతమున నెనిమిదివ్యవహారములలో నున్న గణితసారసంగ్రహము తెలుగున మిశ్రవ్యవహారము సువర్ణసూత్ర గణితములుగా విభక్తమగుటచే నొమ్మిది గణితములు గల దయినది.

పావులూరి గణితము విషయమున నింకను దెలియదగు నంశము లనేకములు గలవు. అవి యెల్ల వివరించుట కిది తావు కాదు. తెలు గున వెలసిన తొలి గణితశాస్త్రగ్రంథ మిది ఇంకను బ్రకటనభాగ్య మందకుండుట నిజముగా శోచనీయము! శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయమువారికై యీ ప్రథమ గణితశాస్త్ర గ్రంథమును శ్రీ సురవరపులు వేటూరి ప్రభాకరశాస్త్రి గారు మద రాసు ప్రాచ్యలిఖితపుస్తకశాలలో లభ్యము లగుచున్న వ్రాతప్రతు లను, కాకినాడ యాంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారము నందలి వ్రాతప్రతులను, మహామహోపాధ్యాయ శ్రీ పరవస్తు రంగా చార్యులు గారి యార్షపుస్తకాలయములోని ప్రతులను సంపాదించి, సంశోధించి, పరిష్కరించి యుండిరి. అందు బరికర్మ భిన్నగణిత ములను తొలి రెండు వ్యవహారములను వారి జీవితకాలమునందే ముద్రణభాగ్య మందినది. అది త్వరలో బ్రకటింపబడగలదు. తక్కిన గ్రంథభాగము గూడ నవశ్యము ముద్రింపదగినది. అపుడు గాని పావులూరి గణితముయొక్క స్వరూపము సుబోధము కాదు. మల్లన రచనములోని తప్పు నిప్పుల దెల్పుటకును, తెలుగున గణితశాస్త్ర పరిశ్రమ నిజస్వరూపము తెలియుటకును నది సహాయకము కాగలదు. వావిళ్ల ముద్రణాలయమువారు కూడ పావులూరి గణిత మును దానికి మూలమగు మహావీరాచార్యుని గణితసారసంగ్రహ ముతో గూడ ముద్రించుచున్నారని వింటిమి. వారి ప్రకటన మునకై పాఠకలోక మెదురుచూచుచున్నది.

పావులూరి గణితమునకు దరువాత కవికాలాదికము తెలియ వచ్చుచున్న గణితశాస్త్రగ్రంథము లీలావతీగణితము. ఇయ్యది సంస్కృతమున భాస్కరాచార్యుడు రచించిన సిద్ధాంతశిరోమణి యను గ్రంథములోని ప్రథమఖండమగు లీలావతికి ననువాదము.

భాస్కరాచార్యుని సిద్ధాంతశిరోమణి జ్యోతిషగ్రంథము. అందు మూడుఖండములు కలవు. తొలిది లీలావతి. రెండవది బీజ గణితము. మూడవది సిద్ధాంతశిరోమణి యను జ్యోతిర్గణితభాగము.

సిద్ధాంతశిరోమణిలోని గోళాధ్యాయమందలి ప్రశ్నాధ్యాయ మున—

'రసగుణ పూర్ణ మహీసమ శకనృపసమయేఽభవన్మమోత్పత్తిః
రసగుణవర్షేణ మయా సిద్ధాంతశిరోమణీ రచితః'

అని యున్నది. దీనింబట్టి సిద్ధాంతశిరోమణి రచనాకాలము శాలివాహనశకము 1072 వ సంవత్సరమనియు, భాస్కరాచార్యుని జన్మకాలము శాలివాహనశకము 1036 అనియు దెలియుచున్నది. గోళాధ్యాయాంతమున—

'ఆ సీత్సహ్యకులాచలాశ్రితపురే త్రైవిద్యవిద్వజ్జనే
నానాసజ్జనధామ్ని విజ్జడవిడే శాండిల్యగోత్రో ద్విజః
శ్రౌతస్మార్త విచారసారచతురో నిశ్శేషవిద్యానిధిః
సాధూనా మవధి ర్మహేశ్వరకృతీ దైవజ్ఞచూడామణిః'

అని యుండుటచే నితడు శాండిల్యగోత్రోద్భవు డనియు, మహేశ్వరోపాధ్యాయుని పుత్రు డనియు విశద మగును. ఈయన యుజ్జయినీనగరమున జ్యోతిషశాస్త్రజ్ఞుడై ప్రసిద్ధినంది యుండెను.

భాస్కరాచార్యుని లీలావతికి సంస్కృతమున రచింప బడినవి క్రీస్తుశకము 1420 వ సంవత్సరమునుండి సుమారు పది వ్యాఖ్యానములు తెలియవచ్చుచున్నవి. క్రీస్తుశకము 1587 లో నిది యక్బరు పాదుషా గారి యాజ్ఞచేఁ బారసీకభాషలోనికి గూడ బరి వర్తిత మయ్యెను.

కన్నడ ద్రావిడభాషలలోనికి నైతమిది పరివర్తితము. ద్రావిడ మున నొక్క యనువాదము మాత్రము, అదియు నసంపూర్ణముగ నే కానవచ్చుచున్నది. తెలుగున నీ లీలావతికి రెం డనువాదములు వెలసినవి. అందు దొలుతటిది ప్రస్తుత ప్రకటనలో నున్న లీలావతి. రెండవది శ్రీ తిరుకమల్లి కృష్ణరావు గారు గావించిన యను వాదము. *

భాస్కరాచార్యుని లీలావతికి దెలుగున వెలసిన తొలి యను వాదమును† గావించినకవి వల్లభాచార్యుడు. ఇతడు ఆపస్తంబ

* శ్రీ శ్రీ వావిళ్లవారిచే బ్రకటితము. పరిష్కర్త శ్రీ వేదము లక్ష్మీనారాయణశాస్త్రి గారు.

† ఇది ప్రాచ్య లిఖితపుస్తకభాండాగారమునందు గలదు. చూడుడు గ్రంథసంఖ్యలు $D$ 2280, $R$ 135.

నూర్యుడు. కోదూరి వెల్లయామాత్యు డితనికి పితామహుడు. కోదూరి రాఘవసూరి యితని తండ్రి. కృత్యాదిని వల్లభార్యుడు స్వవిషయము నిట్లు చెప్పుకొనినాడు.

"(సుమతి కోదూరి రాఘవసూరిసు)తుఁడ
సుజనహితుఁడ నాపస్తంబ సూత్ర కలిత
హారితగోత్ర పయోధినీహారకరుఁడ
ఘలఘుచరితుఁడ వల్లభాహ్వయుఁడ నేను."

ఇతనికి కవిదేవేంద్రు డను నపరనామధేయము కలదు. పరమహంస పరివ్రాజకాచార్య ప్రబోధానంద యతీంద్రు లితనికి నాచార్యవర్యులు. సంజ్ఞాధికారము కడపట నున్న యీతని గద్య యిది చూడుడు—

"ఇది శ్రీపరమహంస పరివ్రాజకాచార్య ప్రబోధానంద శ్రీచరణ సద్గురు ఛాత్ర హారితగోత్ర కోదూరు యెల్లయామాత్య పౌత్ర రాఘవసూరిపుత్ర కవి దేవేంద్రా పరనామధేయ సుజన విధేయ సహజధైర్య వల్లభార్య ప్రణీతం బైన లీలావతియను పాటీగణితంబునందు సంజ్ఞాధికారము"—

శ్రీకృష్ణదేవరాయల వారియు, నచ్యుతదేవరాయల వారియు నాస్థానముల నుద్యోగి యయి యుండి వారి కధికాప్తుడై కొలుచుచుండిన బొమ్మలాట కాళయార్యుడే తత్కృతి ప్రేరకుడు. అతని ప్రేరణమున దా నీ లీలావతిని రచించినట్లు తానే చెప్పుకొనినాడు. చూడుడు—

"శ్రీనరసింహ నందను నరిందము
విక్రముఁ గృష్ణరాయధా
త్రీనిని వెండియుం దదనుజన్ముని
నచ్యుత దేవరాయనిన్
దా నధికాప్తుఁడై కొలిచి
తద్దయు మన్ననగాంచి మించు వి
ద్యావిధి బొమ్మలాట విరుపాక్షపు
కాళని ప్రార్థనంబునన్"

బొమ్మలాట విరుపాక్షుని కుమారుడును, నేతత్కృతి ప్రేరకుడును నగు బొమ్మలాట కాళయ శ్రీకృష్ణదేవరాయలవారి యొక్కయు, నాతని యనుజన్ముడగు నచ్యుతదేవరాయలవారి యొక్కయు నాంతరంగిక సేవకు డని యిందు చేర్కొనబడియుండు టచే నేతత్కృతికర్త యగు వల్లభార్యుడును నా కాలమునందే వర్తిల్లియుండునని తెలియదగియున్నది. కనుక వల్లభార్యుడు క్రీస్తుశకము పదునారవ శతాబ్దివా డనియు, లీలావతీగణితమునకు దెలుగున వెలసిన యీ తొలి యనువాదము పదునారవ శతాబ్దినాటి దనియు దెల్లమగుచున్నది. బొమ్మలాట కాళయ యేతత్కృతి ప్రేరకు డని పయి పద్యమునుబట్టియే కాక గ్రంథస్థోదాహరణములచే గూడ దెలియవచ్చుచున్నది. భాస్కరాచార్యుడు తన లీలావతీగణితమునందు వత్సే, బాలే, కాంతే, సఖే యిత్యాది సంబోధనముల గూర్చి గణితపరికర్మములను మనోహరములనుగా జేసినట్లే యీతడును సూత్రోదాహరణములయందు కృతిప్రేరకు డగు బొమ్మలాటకాళని జేర్కొని తన గణితగ్రంథమునకు మనోహరత్వమును జేకూర్చినాడు—కాళయ యనునది కాళహస్తి యను పదమునకు సంగ్రహరూపము. సూత్రోదాహరణములం దెల్లను బొమ్మలాటకాళని నీతని పేర్కొనినాడు—చూడుడు.

"ఘనమూలంబులు మూపటి
ఘనరాసుల వలన గొని జగద్విదితముగా
నొనరింపుము సకలకళా
ఘను డగు మన బొమ్మలాట కాళడు మెచ్చన్."

"కణగి రెండు భాదికయు బాదవిరహిత
త్రయము నిట సవర్ణితమ్ము సేయ
నేమి యయ్యె గవిమహేంద్ర! చెప్పుము బొమ్మ
లాట కాళహస్తి యాత్మ మెచ్చ."

"తన సగవాని యేనుగుల దాను హరింపగబోని రెండు యో
జనములు నోయి నాటి దివసంబున నెవ్వ డిది సంఖ్య యో
జనములు శైలసంఖ్య దివసంబుల నిట్టిది మార్గవృద్ధిగా
జని కవిసెట్టి విరోధిపురి సయ్యెన గాళడు మెచ్చ జెప్పుమా."

ఈ కాళయ యింటి పేరునుబట్టి యా కాలమున తోలుబొమ్మలాట బహుళప్రచారమున నుండెడి దనియు, నీతని పూర్వులీ వృత్తికి జెందినవారై యుందు రనియు జరిత్ర పరిశోధకులు తలచుచున్నారు. చూడుడు—

*"The Bommalata or Shadow play appears to have been popular. One of Krishnaraya's confidential servants was Kala, the son of certain Bommalata Virupaksha. Now the Sir name or family name of Kala, probably derived from the profession which his father followed is of considerable interest as to indicates that the people of the sixteenth century were familiar with Bommalata or the Shadow play"*

*—Studies in the History of Vijianagara.*

ఇతని తండ్రి విరూపాక్షుడు పెనుగొండ విరుపణ్ణకంటె భిన్నుడు. ఇతడు బొమ్మలాట విరూపాక్షుడు. అతడు పెనుగొండ విరుపణ్ణ. బొమ్మలాట కాళయ భార్య పేరు కోనాంబ. ఆ యీ విషయ మీ క్రింది పద్యమువలన దెలియుచున్నది.

అంబురుహాయతాక్షి విరుపాక్షపు కాళని యాత్మపత్ని కో
నాంబ పతివ్రతాతిలక మంబుజనాభుని గామవల్లి బ
ద్ధ్యంబుల నాడి... దయమానము రెండుగ బూజసేసె వ
ర్షంబులు నాటికైన దివసంబుల యెన్నిక లెన్ని చెప్పుమా.

గణితశాస్త్ర విషయమునుగూడ నింత చక్కని కవితలో జెప్పిన వల్లభార్యుడు ప్రశంసాపాత్రుడు! ఇందు బొమ్మలాట కాళని యాత్మపత్ని కోనాంబ యనియు, నామె కామవల్లి భక్తురాలనియు దెలియుచున్నది. దీనిబట్టి బొమ్మలాట కాళనికి 'కామేశ్వరి' (అక్కలు) యిలువేల్పని తెలియుచున్నది. ఈ కామేశ్వరికే కామవల్లి యనియు పేరు. ఈమె యేడుగు రక్కలలో నడగొట్టుది. క్రీడాభిరామములో నీ కామవల్లి ప్రస్తావము కలదు.

'కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు పాడుచు వచ్చె జక్కులపురంధ్రి'

యని జక్కులవాండ్రు కామేశ్వరి పాటను బాడుచు వచ్చినట్లందు చేర్కొనబడినది. ఆంధ్రదేశమున బ్రాహ్మణాది వర్గముల వారి కిలువేలుపగు నీ కామేశ్వరియే బొమ్మలాట కాళని యాత్మపత్ని కోనాంబకును నిష్టదైవము!

కాళడింకు విద్యానిధి యనియు, సకల కళాఘనుడనియు, కౌశలనిధి యనియు; గవికులభూషణనియు పేర్కొనబడి యున్నాడు. కాళయార్యుడు వల్లభార్యునకు లీలావతీగణితాను వాద రచనమునకు ప్రతిఫలముగా వేయు నూట పదారులు లిచ్చి నాడు కాబోలు! ఆ విషయ మిందు రెండు మూడు చోటుల నతనిచేతనే పేర్కొనబడినది. అంక యోగమున కుదాహరణము నొసగుచు నత డీ క్రింది పద్యమును రచించినాడు.

"కరులును రాజులు రథములు
కరివర్గము రాజమహలు ఖగశ్రేఢులుఁ గా
నరహాలు విరుపయ కాళడు
సరసుడగుచు నిచ్చెనివి వెసం గూడ వనా!"

ఒక్కు.—

| | |
|---|---|
| కరులు | ౮ |
| రాజులు | ౧౬ |
| రథములు | ౩౨ |
| కరి వర్గము | ౬౪ |
| రాజమహలు | ౧౧౬ |
| ఖగ శ్రేఢులు | ౮౮౦ |

౧౧౧౬ మొత్తము.

ఆశ్చర్యము! బొమ్మలాటకాళయ తనకు బారితోషిక మొసగిన వేయు నూటపదారుల నెంత చమత్కారముగా పేర్కొనినాడు! మఱొక్కచోట సంకలితయోగమున కుదాహరణము నొసగుచు బొమ్మలాట కాళయ తనకు వేయునూట పదారుల నొసగినట్లు పేర్కొనినాడు చూడుడు.

"పంచసహస్రంబులలో
గాంచనములు బొమ్మలాట కాళడు నీక
ప్పించె నృపశేంకరుల శే
షించిన యవి కవిమహేంద్ర! చెప్పుము మాకున్."

ఒక్కు—౫౦౦౦
౧౧౧౬ తీయగా
౩౮౮౪

ఇతనికి మాత్రమేకాక కాళడు కవుల కెందఱకో బహూకృతులు గావించి సత్కారములు చేసినాడు—

"కవులు సన్నిద్దటికి మాత్రికంబు లిచ్చె
వేయు నారూన్నటయిరుకద విరుపవిభుని
కాళ డొక్కొక్క సుకవిభాగమున కెన్ని
వచ్చునని కవిదేవేంద్ర! వలయుఁ దెలియ."

అచ్యుత దేవరాయలవా రితని కాందోళికాదిక మొసగి సత్కరించినాడు. ఆయా విషయ మీ క్రింది పద్యమువలన దెలియుచున్నది.

"సరస నరేంద్రవందనుఁడైన యచ్యుత
దేవరాయని కృపాదృష్టిఁ జేసి
యాందోళికారూఢుఁ డగుచును నా బొమ్మ
లాటకాళఁడు వేడ్క వర్ధరా
లో వాత్మ గురునాథుఁడైన కుమారతా
తాచార్యవర్యున కర్థ మిచ్చె
ద్విజులకు శేషతృతీయముల్ రండిడి
శేషపాదము కవిశ్రేణి కొసఁగె
స్నేహమునఁ దన చెలులకు శేషనవమ
భాగపంచక మంతయుఁ బంచిపెట్టె
కవిమహేంద్రున కర్పించె మిగిలినట్టి
వేయునూట పదారెంత విత్తరాశి."

అచ్యుత దేవరాయలవారు ప్రతి సంవత్సరమును వసంతోత్సవమును జరిపించెడివారు. ఆ యుత్సవదర్శనార్థమై యరుదెంచిన యర్థిజనుల నాతడు సత్కరించుట సంప్రదాయము. అచ్యుత దేవ రాయలవారి వసంతోత్సవమునకై వచ్చుచుండిన యర్థిజనులకై జరుపబడుచుండిన విందునకు బొమ్మలాటకాళయ తండులములను దెప్పించి యొసఁగువాడు. ఆయా విషయ మీ క్రిందిపద్యమున పేర్కొనబడినది—

"అచ్యుత దేవరాయల వసంతోత్సవ
మునకు వచ్చిన యర్థిజనుల కిడిన
యావిందుకై బొమ్మలాట కాళవిభుండు
తాను దెప్పించిన తండులములు
వలువదియేను పుట్టులమీఁదఁ బదునెన
మందుముఁ బదియేనుమానికలకు
నేత్రము కుంచెడు నేడు సోలలును గి
ద్దంటికి వద్దు పుట్టెంటి లెక్క
"నతని కరణంబు గోలిపించె నగరి వియ్య
మిచ్చిన చేహారులకు వని యెన్ని యయ్యెఁ
దెలిపి వత్తకు సరి చూపవలయు మాకు
పెండియును రెండు దెలుఁగుల తండులములు."

బొమ్మలాట కాళయకు గుమారతాతాచార్యులు గురునాథు డని పూర్వతర పద్యమున పేర్కొనబడియున్నది. కుమార తాతా చార్యులు సుప్రసిద్ధ శ్రీ వైష్ణవాచార్యుడు. ఎట్టూర్ తిరుమల కుమార తాతాచార్యులని యీతని సంపూర్ణ నామధేయము. ఇత డాపస్తంబ సూత్రుడు. శఠమర్షణ గోత్రుడు. యజుశ్శాఖకు జెందిన వాడు. ఇతని తండ్రి అయ్యావయ్యంగారు. లోకప్పాచార్య లితని పితామహుడు. వీరు శ్రీశైలనాథుఁడని పిలువబడు తిరుమల వంశీయులు. కుమారతాతాచార్యులు వేంకటపతి దేవరాయలకు నాచార్యుడైయుండి యాతని పట్టాభిషేకమును నిర్వర్తించినట్లు తెలియుచున్నది. అతడు తన గురుదేవునిమీఁది భక్తి విశేషముచే దన సామ్రాజ్యము నంతను దన గురునాథున కొసగినాడట! రాజ సత్కారముల విశేషముగా నందియుండిన యీ యాచార్యవర్యుడు దేవాలయాదికములకు విశేషముగా దానాదికమును గావించినట్లు తెలియుచున్నది.

క్రీస్తుశకము 1588 వ సంవత్సరములో నితడు శ్రీవేంకటేశ్వరస్వామివారికి నాలుగు గ్రామముల నొసగెను. తిరుమలయందు క్రీ. శ. 1680 లో నొకవిమానమును గట్టించెను. పుణ్యకోటి విమానమునకు బంగారు ములామా చేయించెను. కాంచీనగరమున నమ్మవారికి కల్యాణకోటి విమానము గట్టించెను. తనయెత్తు తులాభారము

తూగి యా ద్రవ్యమువంతను వరదరాజస్వామిసేవకై వినియోగించెను. బ్రాహ్మణుల కగ్రహారముల నెలకొల్పెను. వరదరాజస్వామివారికి వాహనాదికములఁ జేయించెను. 'తాతాసముద్ర' మను నొక చెరువునుగూడ త్రవ్వించెను. కాంచీనగరమున వరదరాజస్వామిదేవాలయమునకు గార్యకర్తగాను, శ్రీకార్యధురంధరుడుగాను నుండుటమాత్రమే కాక యీతడు చెంగల్పట్టు మండలములోని వైష్ణవ దేవాలయములకు ధర్మకర్తకుడుగా గూడ నుండెను. జీవిత చరమభాగమున నీతడు కాంచీనగరమున రాజభోగము లనుభవించినట్లు తెలియవచ్చుచున్నది.* 'ప్రపన్నామృత' మను గ్రంథమున నీతని వంశాదికము కానవగును.

కుమార తాతాచార్యులకు శిష్యుడగు నీబొమ్మలాట కాళయ పరమవైష్ణవుడు. వల్లభాచార్యు డీవిషయమును జక్కగ నుతించియే పద్యరచనమును మిక్కిలి జాగ్రత్తతో నిర్వర్తించినట్లు తెలియుచున్నది. సంస్కృతమూలమును దానికి వల్లభాచార్యుడు గావించిన యనువాదమును గాంచినచో నీవిషయమునం దీత డెంత జాగరూకత వహించెనో తెలియగలదు. చూడుడు—

'అమల కమలరాశే స్త్ర్యగ్నిం పక్షాంకవస్త్రై
స్త్రినయనహరి సూర్యా యేన తుర్యేణ చార్యా
సురుపద మథవడ్భిః పూజితం దేవపఙ్క్త్యా
సకల కమల సంఖ్యాం క్షిప్ర మాఖ్యాహి తస్య.'

"అంబుజరాశిలోపల మడంతపురారియు పంచమాంశ తు
ర్యంబుల బొమ్మలాట విరుపాధిపు కాళడు హార్యజార్క హే
రంబుల బూజ చేసె గురురాజపదాబ్జము షట్పద్మ ప
ట్కాంబున జేసె నర్చితముగా సకలాంబుజసంఖ్య జెప్పుమా"

మూలమున త్రినయనుడు, హరి, సూర్యుడు, ఆర్యాదేవి యనువారిని బూజించినట్లు తెలుపబడగా నాంధ్రీకరణమున త్రినయనుడు, ఆర్యాదేవి, యనువారిని బరిహరించి యజహేరంబులను గైకొనుటలో వల్లభాచార్యుడు తన కృతికర్తకు డగు బొమ్మలాట కాళయ వైష్ణవమతాభినివేశమును సంరక్షించుట కెంతగా జాగరూకుడయ్యెనో తెలియవచ్చుచున్నది.

ఏ తత్కృతికర్త యగు నీ వల్లభాచార్యుని గూర్చి మఱి కొంత విషయము తెలుపదగియున్నది. మహావీరాచార్యుడు సంస్కృతమున రచించిన గణితసారసంగ్రహమునకు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున దైవజ్ఞవల్లభ విరచిత మగు నొక కర్ణాటక వ్యాఖ్యాన ముపలబ్ధ మగుచున్నది. గణితసారసంగ్రహమునకు టీక వ్రాయుచు నీ విషయమును రావుబహదూరు శ్రీ యమ్. రంగాచార్యులుగా రిట్లు పేర్కొనిరి.

"The manuscript is a transcription on paper in Kanerese characters of an original palm leaf manu-script belonging to a Jaina Pandit and contains the whole of the work with a short commentary in the Kanerese language by one Vallabha, who claims to be the author of also a Telugu commentary on the same work. A ethough incorrect in many places it proved to be of great value on account of its being complete and containing the Kanerese commentery"

దీనిబట్టి వల్లభు డను నొక్క దైవజ్ఞుడు మహావీరాచార్య విరచిత మగు గణితసారసంగ్రహమునకు గర్ణాటకభాషయం దొక లఘుటీకను, తెలుగున నొక లఘుటీకను రచించినట్లు తెలియవచ్చుచున్నది. కాని యాతడు రచించిన తెలుగుటీక లభించుట లేదు. గణితసారసంగ్రహమునకు గర్ణాటాంధ్ర భాషలలో టీకలను రచించిన వల్లభుడును, నీ లీలావతీకర్త యగు వల్లభాచార్యుడును నొక్కరే యయి యుండురని తలచుటలో దోష ముండ దనుకొందును. గణితసార సంగ్రహ టీకాకారుడు దైవజ్ఞవల్లభుడు. లీలావతీకర్త వల్లభాచార్యుడు. గణిత సారసంగ్రహమును, లీలావతియు రెండును గణితగ్రంథములు. కాగా, అచ్యుతదేవరాయలవారి కాలమున నవగా బడువా డవలదీ శతాబ్దియం దుండిన యీ వల్లభకవి పూర్వగ్రంథ మగు గణితసార సంగ్రహమునకు బద్యానువాదము వెలయింపక టీకలు మాత్రమే రచియించి, లీలావతికి మాత్ర మనువాదము వెలయించుటకు గారణ మేమని సందేహము కలుగక మానదు. దానికి సమాధానము లేకపోలేదు. వల్లభుని నాటికి క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దియందే పావులూరి మల్లనచే గణితసారసంగ్రహ మనువదింపబడి ప్రచారమున నుండుటచే దాని దిరిగి తా ననువదించుట వ్యర్థ మని తలచి వల్లభుడు తనకు గణితశాస్త్రమునందు గల మక్కువచే నా గ్రంథమునకు గర్ణాటకాంధ్ర భాషలలో టీకలను మాత్రమే వెలయించె ననియు, తన నాటికి బహుళప్రచారమున నుండియు దెలుగున ననువాదము లేనందున నచేకుల కందుబాటులో లేకుండుటచే నా మనోహర గణితశాస్త్రగ్రంథమునకు మాత్రము తాను దొలిసారిగా ననువాదము వెలయించె ననియు మనము తలపదగియున్నది. ఇంతకును గణితసారసంగ్రహ టీకాకారు డగు దైవజ్ఞవల్లభుని కాలాదికము మనకు దెలియవచ్చుట లేదు. ఇది కేవల మొక యూహామాత్రమే! దైవజ్ఞవల్లభుని గద్య యిది కొంత యతని విషయమును దెలుపుచున్నది. చూడుడు—

"ఇతి కరణానుయోగ శాస్త్రాంభోధి పార పారావార పారంగత మహావీరాచార్యకృతౌ సారసంగ్రహాఖ్య గణితశాస్త్రే క్షేత్రాఖ్యస్య షష్ఠస్య వ్యవహారగణితస్య బాలబోధార్థం ఆంధ్రభాషామయవ్యాఖ్యానకర్త్రా శ్రీమత్సర్వజ్ఞ సిద్ధమాత్ర ప్రసాదాసాదిత గణితశాస్త్ర తత్త్వజ్ఞేన దైవజ్ఞవల్లభాఖ్యేన విరచితా క్షేత్రగణితే జన్యవ్యవహారస్య కర్ణాటక దేశీయ భాషామయటీకా బాలబోధాఖ్యా సమాప్తా."

ఇందు దైవజ్ఞవల్లభుఁడు శ్రీమత్సర్వజ్ఞ సిద్ధమంత్ర ప్రసాదాసాదిత గణితశాస్త్రతత్త్వజ్ఞు డని పేర్కొనబడియున్నది. ఈ సర్వజ్ఞ దెవ్వరో తెలియరాదు. లీలావతిగద్యలో 'శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య ప్రబోధానంద శ్రీచరణ సద్గురుచాత్ర' యని వల్లభాచార్యుడు పేర్కొనబడియున్నాడు. సర్వజ్ఞుడును, ప్రబోధానందుడును నొక్కరో లేక భిన్నులో తెలియరాదు. ఈ విషయమున నింకను బరిశోధనము జరగవలసియున్నది. ఇది తాత్కాలికమగు నొక నిర్ణయము మాత్రమే! దైవజ్ఞవల్లభుడు భిన్నుడని ప్రమాణాంతరములచే నిరూపింపబడుదాక నీ నిర్ణయమును సముచితమనియే భావించుట న్యాయము కాకపోదు.

వల్లభాచార్యుని లీలావతి యాంధ్రీకరణమునుగూర్చి యించుకంత దెలిసికొందము. సంస్కృతమున నీ గ్రంథము మూడుఖండములు గలది యని యింతకుముందు తెలిపియుంటిని. ఆ విషయము నే వల్లభాచార్యు డిట్లు పేర్కొనినాడు.

"గణితం బిది త్రివిధము గ్రహ
గణితంబును మఱియు బీజగణితముఁ బాటీ

* వివరములకు చూడుడు—*Tirupati Devasthanam Epigraphical Report-By Sri Sadhu Subrahmanya Sastry Pages 310-314*

గణితంబును; తత్పాటీ
గణితము పరికర్మ పూర్వకంబై యొప్పున్."

పయి పేర్కొనబడిన త్రివిధగణితములలో వల్లభాచార్యుడు పాటీగణితమును మాత్రమే తెలిగించెనని తెలియుచున్నది. చూడుడు—

"అని పొగడ గణకు లౌనౌ
నని సంస్కృతభాష భాస్కరాచార్యులు చె
ప్పిన పాటిగ లీలావతి
యొనర్తుఁ దెనుఁగున......"

భాస్కరాచార్యుడు తన లీలావతిలోని యంకగణిత భాగమునకు పాటీగణిత మని పేరిడి యున్నాడు. అది మహారాష్ట్రి శబ్దము. దాని కెల్లని యిసుక చల్లినపలక యని యర్థము. పూర్వము మనవా రట్టి పలకలమీదనే గణితపరికర్మలను గావించుచుండిరి. కనుక యీ గణితమునకు పాటీగణితమని పేరు వచ్చినది.

ప్రస్తుతప్రకరణములో నున్న యీ లీలావతి యసమగ్రముగా లభించుట మిక్కిలి శోచనీయము. ఇందు సంజ్ఞాధికారము, పరికర్మాష్టకము, భిన్నజాతి, శూన్యపరికర్మాష్టకము నను విభాగములతోడి పరికర్మగణితము, ప్రకీర్ణగణితము, త్రైరాశికగణితము, మిశ్రవ్యవహారము, శ్రేఢీవ్యవహారము ననునధ్యాయములు కలవు. శ్రేఢీవ్యవహార మసమగ్రముగా గలదు. గ్రంథ మంతటితో ముగియుచున్నది. కాని సంస్కృతమున వీనికి దరువాత నున్న క్షేత్రవ్యవహారమును కుట్టకవ్యవహారమును, అంకపాశవ్యవహారమును నిందు గానరావు. వల్లభాచార్యు డీవ్యవహారముల ననువదించెనో లేదో తెలియరాదు. అంకగణితభాగ మగు పాటిగణితమును మాత్రమే యితడు తెలిగించి యుండుననియు, క్షేత్రాదివ్యవహారముల నితడనువదింపనే లేదనియు దలపదగును.

వల్లభాచార్యుడు గణితగ్రంథము ననువదించినను నా యనువాదముకూడ ప్రబంధరచనమునకు వలెనే చక్కని శయ్యాసౌభాగ్యము కలిగి మెఱయునట్లు రచించెనని చెప్పుట కొంతయు సందియములేదు. ఈతని పద్యము లనువాదములే యయ్యును చక్కని ధారాశుద్ధి గలిగి స్వకపోలకల్పితములవలెనే తోచుచున్నవి. అనువాదమునందును నితడు మూలమునకు కేవలము దాసుడుగా నుండి మక్కికి మక్కి యనువాదము సేయక యొకకొంత స్వాతంత్ర్యము వహించి సరసముగా ననువాదము గావించినాడు. సంజ్ఞాధికారమునందు సంస్కృతి లీలావతిలో దెలుపబడిన సంజ్ఞలను మాత్రమే గాక తననాట దెలుగునాట వ్యవహారమున నుండిన కొలధాన్యాదిమానములను గూడ చేర్చి తన స్వతంత్రతను వెల్లడించెను. ఇదిగాక యీతడు సంస్కృతమున నున్న సూత్రోదాహరణములను, సరసము లయిన వానిని ననువదించుటమాత్రమే గాక స్వీయోదాహృతులను గూడ నొసగి తన గణితశాస్త్ర పరిజ్ఞానమును, స్వాతంత్ర్యమును చాటెను. మూలభిన్నములయిన యీయీ యుదాహృతులవలన నచ్యుతదేవరాయలకాలమునాటి వ్యాపారాదికముల బేరసారములు, సాంఘికాచారములు కొన్ని మనకు దెలియవచ్చుచున్నవి. ఇతని యాంధ్రీకరణమునకు నిదర్శనములుగా భాస్కరాచార్యుని లీలావతిలోని శ్లోకములను, వానికి వల్లభాచార్యుడు గావించిన యనువాదములను మచ్చునకు జూపుచున్నాను.

లీలాగళసములుల్లోల కాలవ్యాల విలాసినే
గణేశాయ నమో నీలకమలామలకాంతయే.

"లీలా లలిత గళోల్లల
దాలోలకరాళ బలవదవిరళ కాల
వ్యాలవిలాసి వినాయకు
నీలకమల విమలకాంతి నెమ్మదిఁ దలఁతున్."

"పంచాంశోఽలికులాత్కదంబ మగమ
త్త్ర్యంశః శిలీంధ్రం తయో
ర్విశ్లేషస్త్రిగుణో మృగాక్షి కుటజం
దోలాయమానోఽపరః
కాంతే కేతకమాలతీపరిమళ
ప్రాప్తైకకాలప్రియా
దూతాహూత ఇతస్తతో భ్రమతి ఖే
భృంగోఽలిసంఖ్యాం వద॥"

"అలియూథంబున బంచమాంశము విహా
రార్థంబు నీపద్రుమం
బులకై యేగె శిలీంధ్ర గంధములకై
పోయెం ద్రిభాగంబు వా
దులకై తద్విపర త్రిఘాత మరిగెం
దోడ్తోన వేఱొక్క పు
ష్పలిహం బాడుచు నుండె వేడ్క దెపుమా
సర్వాళి సంఖ్యానమున్."

"యాతం హంసకులస్య మూలదశకం
మేఘాగమే మానసం
ప్రోడ్డీయ స్థలపద్మినీవన మగా
దష్టాంశకోఽథ స్తటాత్
బాలే బాల మృణాలశాలిని జలే
కేళీక్రియాలాలసం
దృష్టం హంసయుగత్రయం చ సకలాం
యూథస్య సంఖ్యాం వద."

"మొదమున హంసయూథపద
ముల్ పది వర్షదికష్టమాంశ మిం
పొదవగ మెట్టతామరల
పొంతకు దిగ్గన లేచిపోయె న
య్యుదకమునందు నిల్వడక
యుండె రమింపుచు హంస లాఱు నె
మ్మది నెఱిగింపు హంసకుల
మానము గాకము సంతసింపగన్."

"పార్థః కర్ణవధాయ మార్గణగణం క్రుద్ధో రణే సందధే
తస్యార్ధేన నివార్య తచ్ఛరగణం మూలైశ్చతుర్భిర్హయాన్
శల్యం షడ్భిరథేషుభిస్త్రిభిరపి ఛత్రం ధ్వజం కార్ముకం
చిచ్ఛేదాస్య శిరః శరేణ కతి తే యానర్జునః సందధే"

"అనిలో బార్థు డిషుప్రజాతమున బ్ర
త్యర్థ ప్రవజం బాగ జ
య్యన దన్మూల చతుష్టయంబున రథా
శ్వానీకముం జంపె శ
ల్యుని నాఱమ్ముల నొంచి మూట బలు వి
ల్లున్ ఛత్రముం గేతువున్

దునిమెం గర్షని గూల్చి బర్గోకటి దో
ర్ద్రో సెన్ని యశ్వాణముల్."

"అళికుల దశమూలం మాలతీం యాత మష్టౌ
నిఖిల నవమభాగా శ్శాలినీ భృంగ మేకమ్
నిశి పరిమళలుబ్ధం పద్మమధ్యే నిరుద్ధం
ప్రతిరణతి రణంతం బ్రూహి కాంతేఽళిసంఖ్యాం."

"అళికులార్ధఫలము నఖిల నవాష్టాంశ
కమును గూడి మాల్లికములు సేరె
భ్రమర యుగము తగులుపడియుండె దమ్మిలో
రాత్రి యెల్ల మధుకరంబు లెన్ని?"

ఇతని సూత్రరచన మెంత బిగువుగా, సమగ్రముగా సరస ముగా నుండునో చూడుడు—

అనులోమఖండనంబును, విలోమఖండనంబును, ఖండం బును వర్గరాశిజంబును ననం జతుర్విధంబైన ఘనంబునకుం గరణ సూత్రము మూడుపద్యములు—

"అరుదుగ నిల్పి యంత్యఘన
మంత్యకృతి త్రిపదాహతాది మూ
త్కర మటమీఁదఁ గూడి కడ
కట త్రిజగత్ప్రమనిఘ్నమా పదాం
తరగ మిలాదివర్గ పుచి
తంబుగఁ జేరిచి యాది వెండియుఁన్
దర మిడి యంత్యభావనఁ బ
దంపడి యిట్ల యొనర్పఁ గాఁదగున్."

"ఒంటేని రాశి వృథమతి
ఖండద్వితయమునఁ జెంచి గ్రక్కున గూటన్
వెండియు గుణించి మఱియును
ఖండఘనైక్యంబుఁ గూడ ఘన మద్ది యగున్."

"కణఁగి వర్గమూలఘనము వర్ణించిన
వర్గరాశి ఘనము వచ్చు నిక్క
మరయఁ గృతిఘనంబు లాద్యంకముల నుంచి
యెన్ని టికిని నైన నేఁగు రెంచు."

* * * *

తెలుగున వెలసిన శాస్త్రగ్రంథములు తక్కువ. అందును గణితశాస్త్రగ్రంథములు మిక్కిలి. తక్కువ అందు గవికోలాదిక వివరములు తెలియవచ్చుచున్న గణితశాస్త్రగ్రంథములు పావులూరి గణితమును, నీ లీలావతియు. ఉపలబ్ధము లగుచున్న యీ రెంటు గణితశాస్త్ర గ్రంథములయినను నింకను వెలుగుమొగము చూడకపోవుట మిక్కిలి శోచనీయము. లీలావతిని మాత్రి ముపలబ్ధ మగుచున్నంతవఱకు సంపాదించి, మూలముతో సరిచూచి, యందలి లెక్కల గుణించి, పరిష్కరించి ముద్రణమునకు సిద్ధ పఱచి యున్నాఁడను. త్వరలో దాని బ్రకటింపజేయవలయునని సంకల్పము. ఇదియు బావులూరి గణితమును బ్రకటింపబడుచో తెలుగున శాస్త్రగ్రంథములు లేవన్న కొఱత కొంతవఱకు దీర గలదు. ఈ గ్రంథముల పరిశోధనము సరిగా జరిగినచో బూర్వ కాలమున దెలుగునాట గణితశాస్త్రపరిశ్రమ మెంతగా జరిగెనో తెలియగలదు.



# ది మెట్రోపాలిటన్ ఇన్‌స్యూరెన్సు కంపెనీ. లిమిటెడ్.

(హెడ్డాఫీసు: కలకత్తా)

1951 లో పూర్తిచేసిన నూతన వ్యాపారము } రు. 7 కోట్ల 51 లక్షల 91 వేలువిలువచేసినది.

అన్ని జిల్లాలలోను ప్రతినిధులు కావలెను.

విజయవాడ బ్రాంచి:
నం. 17/167 డాక్టర్ స్వామివీధి
గాంధినగర్, విజయవా

★

మద్రాసు బ్రాంచి:
నం. 52/53 తంబుచెట్టి వీధి,
జి. టి., మద్రాసు 1.

# ట్రేడ్ మార్కు నోటీసు




మేము గత అనేక సంవత్సరములుగా, ఒక నిర్దిష్టమగు శిలుగా ట్రేడ్ మార్కుతో "కొలంబియా" పేరుక్రింద, గొడుగులను తయారుచేసి విక్రయించుచున్నాము. సదరు ట్రేడ్‌మార్కు ఇచట మార్జినులో చూపిన ప్రకారం 1940 ట్రేడ్‌మార్కుల ఆక్టుక్రింద 1942 లో రిజిష్టరు చేయబడినది.

కొందరు వర్తకులు అదే పేరు, మార్కుక్రింద గొడుగులను తయారుచేసి విక్రయించిన సందర్భములు యిటీవల మా దృష్టికి తేబడినవి. సదరు మార్కుకు పేరుకు మాకుమాత్రమే ప్రత్యేకంగా హక్కు కలదను విషయము తమకు తెలియదని చెప్పి వారు పశ్చాత్తాపమును వెలిబుచ్చినారు. ఇందుమూలముగ తెలియ పరచునదేమనగా, సదరు పేరు, ట్రేడ్‌మార్కుగాని వాటిని పోలిన అనుకరణమును గాని ఏ వ్యక్తియైనను ఉల్లంఘించినయెడల వారిపైన అవసరమగు చర్య తీసుకొనబడును.

ఇబ్రహిం కరీం అండ్ సన్సు
గొడుగులు తయారు చేయువారు, మర్చంట్లు
బొంబాయి - మద్రాసు - కాలికట్.


CASTOR HAIR OIL
COCONUT OIL SHAMPOO
HAMAM
EAU DE COLOGNE

# మధురాంకితము

★

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి

కలమును దాల్చినే మధుర కావ్యమునొండు రచింపఁ బూనఁగా
గలుగలు గల్లు గల్లురని కాళులయందలి యందె మ్రోత లిం
పులుగులుకన్ శ్రవోయుగళిఁ బొల్చి, హృదంతరసీమ, మోహనో
జ్జ్వలమగు నీదుమూర్తి యటుచాటుగ నిల్చినయట్టు లయ్యెడున్—

ఏయనిర్వాచ్య పథము వహించి, మించి
ఆర్ద్రమై, ఆర్ద్రమై మానసాంబురుహము
సంతతానంద వీచికా స్నాతమగును
చెవిని బడినంత నూపుర శింజితములు.

నాతండ్రి! యిటులేలవచ్చితి? నితాంతానంద కల్లోలినీ
స్నాతుం జేయఁదలంపు పుట్టగదె! చంచద్రాగ సమ్మర్దముల్
చేతోంభోరుహగంధ సంతతులు నేఁ జెల్లించు కాన్కల్ ప్రభూ!
జోతల్ వెట్టెద స్వీకరింపుమి ముఖజ్యోతుల్ ప్రసారింపఁగన్

మురళి నీయది మ్రోయింప! ముగ్ధగోపి
కానమునయం బపుడపుడె, కానవచ్చు,
తరళ చంద్రికాచకిత సౌందర్య, యమున,
కనుల పండువై కనవచ్చుఁ గన్నతండ్రి!

ఒక నిముసమ్ములోపల ననూన మహావిభవాత్తమైన తా
వక మధుమూర్తి దర్శనము భద్రము సేసితిఁ బో యశోదయున్,
జకచక నందుఁడున్ వ్రజము సర్వమువచ్చును, వచ్చు రాధ వి
రికి నపరాధమేమి యొనరించితి నింతటి స్వార్థమే ప్రభూ!

మీరా! మీరు మహానుభావులరు, మీ మీనంగతుల్, మీరగా
క్త్రైరె నందెలియం గలారలె! మిమ్ముఁ గీర్తింపఁగా వచ్చునే!
ధారా వాహవినీలకోమలతనూ తారళ్యమీపాట నా
పై రానిచ్చునె! త్వత్కృపామృత మహావర్షమ్ము ధారాగతిన్—

మీ రూపాకారము జూచి మోహపడి, తామేమేమొ, నృత్యమ్ములన్
జేయం జూచియు నీలకంఠములు, వంశీనాద ధారాతరం
గాయత్తమ్ములు, మీదు భంగిమలు నృత్యస్మృతి విస్ఫూర్తిమై
దాయన్ వచ్చిన నీయది నృత్యరచనా దర్పంబు వీడున్ ప్రభూ!

ఓయి! ఘనశ్యామ! మన్మథు కోటికలిత
మంజుమూర్తి! త్వన్నూపురశింజితములు
గర్జనలుగాగ! వర్షింపు కరుణ; ఊన
రంబయిన యీమెడీద పండు రాజనములు.

ఓయి! గిరిధర! నీకుగానొక్కరీతి
మనము వెచ్చఁ బెట్టినతన్వి! మాన్యచరిత
మీరా! ఆమె భక్తిరసము స్మేరదీపి
తానముఁడవయి యెంత నీవాన లేదు!

అంకితము సేతు! నీయుజ్జ్వలాంఘ్రియుగళిఁ
దన్మధుర మోహన చరిత్రంబు నేను,
అంకితము సేసెగా నీ పదాంకమునను
మీరా మున్నె స్వీయహృదయ సౌరభముల.

(అంగీకృతి)

గోపీ గోపక నాట్యవ్యాపారాసక్త మానసాంభోరుహుండై
గోపకుమారుఁడు కొంచెము సేపుగ ఘల్ ఘల్లు మ్రోయఁ జిందులు వేసెన్—

ప్రాంచచ్చపలాకృతి వ్రజ
చంచల నేత్రలు సుధారసపాత్రలునై, న
ర్తించిరి, కృష్ణుని ప్రేమ దృ
గంచలవీథుల మెరయఁగ, గజ్జలకేళుల్—

నాలో నాకెఘటిల్లమై పులకలానందాబ్ధి నోలాడితిన్
లీలా మానుష విగ్రహుండపుడు కేళీ లాస్యమున్ సల్పి, యు
ద్వేల ప్రక్రియ మేఘపంక్తి వెనుకన్ దేజోమయుండైనఁ ద
ల్లీలాంభోరుహ వీక్షణ ప్రతితి వర్షించెన్, సుధామాధురుల్—

---

# దొంగలు

★

శ్రీ బలివాడ కాంతారావు

రాత్రి పన్రెండు గంటల పది నిమిషాలయ్యింది. రైలు వచ్చిన కోలాహలమేమీ లేదు. ఆ స్టేషనులో దిగింది ఒక్క బాబూరావే. స్టేషనులో కూలీల మాట అటుంచి దీపాలు కూడా లేవు. ప్లాటుఫారం మీదనుంచి పెట్టె బేడాలు రెండుచేతులమీద మోసుకవెళ్లి స్టేషనుకు ఆనుకొని వున్న చిన్న షెడ్‌లో పెట్టాడు. ఇటూ అటూ చూశాడు. కారు చీకటి. చలివేస్తోంది. యే బండీ లేదు. ఈ నాలుగు మైళ్ల దూరం నడిచేలేనా అనుకున్నాడు కాని భయంగానుంది.

స్టేషను గదిలో దీపం వెలుగుతోంది. రైలు వెళ్లిపోవటంవల్ల కునుకుతున్న స్టేషనుమాస్టరు దగ్గరకు వెళ్లాడు. టికెట్ యిచ్చి "యెవరైనా కూలీ దొరుకుతాడా?" అన్నాడు. మాస్టరు కళ్లద్దాలు పెట్టుకొని తనను గురించి ప్రశ్నలు కురిపించాడు. బాబూరావు క్లుప్తంగానే సమాధానాలిచ్చి అసలు ప్రశ్న మళ్లీ వేస్తేనేగాని సమాధానం రాలేదు. "ఎంత మీ నాన్నకు సీరియస్‌గా వున్నా యీ రాత్రి మీద వెళ్లటం యేం మంచిపని కాదు. ఈ రోజుల్లో యిటువేపు దొంగలు యెక్కువైపోయారు."

"కూలీ వుంటే అంత భయం లేదనుకుంటాను"

"నమ్మినవాళ్లే ద్రోహం చేస్తున్న రోజులివి. రాజా కూలీ యేకమైతే రాజ్యాలేలే టట్టే వుంది" వ్యాఖ్యానించాడు మాస్టరు.

దొంగ భయాలకులవ యీ రాత్రి మీద యే మంచి మనిషీ రాడని యెవడూ బండి తీసుకరాడని, తెల్లవారే సరికి యీ చుట్టుపట్ల గ్రామాలనుంచి అద్దెబండ్లు వస్తాయని అప్పుడే క్షేమంగా పోవచ్చుని మాస్టరు నొక్కి చెప్పటంవల్ల గత్యంతరం లేక షెడ్‌లోనికి వెళ్లాడు. నాలుగు అగ్గిపుల్లలు వెలిగించి పరుపు పరుచుకున్నాడు. సిగరెట్ ముట్టించాడు. నిద్దరపట్టక తల ఆలోచనలతో నిండిపోయింది. రెండేళ్లయింది—ఢిల్లీ వుద్యోగ రీత్యా వెళ్లిపోయాక తన గ్రామం మళ్లీ చూడబోవటం. ఈ లోగా యెన్ని మార్పులు వచ్చాయో!

ఇంతలో స్టేషను మాస్టరు చేతిలో లైటుతో వచ్చాడు. "స్టేషను గదిలోనికి వచ్చి పడుకోండి. ఇక్కడ వుంటే తెల్లవారే సరికి మీరు కూడా మిగలరు."

"ఫరవాలేదండి. ఇంటికి వెళ్లేవరకు నాకు నిద్దర పట్టదు."

"మొన్న మా యింట్లో అందరం తెలివిగావుండగానే దీపాలు వెలిగించే వేళకే అన్నంకుండ కాజేసేశారు. అలాం టప్పుడు"—బాబూరావు కలుగజేసుకొని "ఇంకేమైనా పోలేదు కదా?"

మాస్టరు సగంపండిన మీసాలు మెలివేసి సహజమైన వుత్సాహంతో అన్నాడు "ధాన్యపుగాదెలే దొంగిలిపోతున్నాయ్. పొలాల్లో చేనే మాయమైపోతోంది. యేం కరువిది. బాగా ఆలోచించు. దేశం యిలా దొంగల ముఠాలపాలైతే యేం కాబోతుందో?"

బాబూరావు మాటాడకుండా పరుపు చుట్టాడు. స్టేషను గదిలో ప్రక్క వేశాక "రెండేళ్ళ క్రితం యిలాంటి దొంగతనాలేవీ వుండేవి కావు. మీ మాటలనుబట్టి పరిస్థితులు చాలా మారిపోయాయన్న మాట!"

"బాగానూ!!" మాస్టరు చుట్ట వెలిగించి కిటికీతలుపు మూస్తూనే అన్నాడు.

పరుపుమీద వ్రాలి రగ్గుకప్పుకుంటూనే "పెళ్ళయిందా?" అన్నాడు. లేదన్న బాబూరావు సమాధానంవిని స్వీయచరిత్ర ప్రారంభించాడు.

"ఈయేడు చిన్నకూతురి పెళ్ళిఘనంగా చేశాను"

"అల్లుడుగారేం చేస్తున్నారు?"

"రెవెన్యూ యిన్‌స్పెక్టరు"

"కట్నమెంత యిచ్చారు?"

"మూడు వేలుగాని—ఖర్చులు చాలావరకు అయ్యాయిలెద్"

బాబురావింకే ప్రశ్నావెయ్యలేదు. గదిలో వెచ్చగా వుండటంవల్ల ఆయన చెప్తున్నమాటలకు వూఁకొట్టూనే నిద్రపోయాడు.

మాస్టరు వేకువఝామునే లేపి "మీ వూరుబండీ ఒకటి వచ్చింది. రూపాయికంటే హెచ్చు యివ్వకండి" అన్నాడు.

బాబూరావును చూడగానే బండివాడు "దండం బాబూ" అన్నాడు. తండ్రి ఒంట్లో కొంచం నయంగా వుందని విన్నాక తొందరపాటు తగ్గింది. మాస్టరువద్ద సెలవు తీసుకొని, ఆ, బాగా ధూళి అంటుకున్న బట్టలు చెదిరిపోయిన జుత్తు, పాలిపోయిన తోనే బండి యెక్కాడు.

పొలాల్లో పెసర చేనువుంది. యెద్దుల బండి గంటల చప్పుడుతో పొలాల గ్రోవనుంచే పోతోంది. ఒక దగ్గర బండి ఆపించాడు. మిరపచేనుకు యేతాం సహాయమున నీరు పోస్తున్నారు. పళ్లు తోముకొని చేతికొన్ని పెసరకాయలు పట్టుకొని పరగడుపునే తినటం మొదలుపెట్టాడు. లింగాలపాడు దాటాడు. తన

గ్రామం బుచ్చిపేట కనిపిస్తోంది. బండి వాడిని లోనికి పంపించి కొరడాపట్టుకొని మొఖరమీద కూర్చొని యెద్దులను వడిగా అదురు తున్నాడు. అప్పన్నా యేదీ పాట అన్నాడు. పాడమంటేను— మళ్లీ గసిరాడు. వాడు గొంతుక సవరించుకొని సమయానికే యెదరగా వస్తున్న మనిషిని కొద్దిగా గుర్తుపట్టినా వాడవునో కాదనో సంశయిస్తుంటే అప్పన్న అన్నాడు. "అడుగో బాబూ—మీ చిన్న తాత—బుద్ధులేమీ బాగలేవు."

"ఏం ఏం?"

"దొంగ బాబూ; దేనికైనా మీ తాత ముకం మీ మామ ముకం సూసి వూరోలు యిడిచిపెట్టేసినారు"

సీతయ్య యెదురుగా వచ్చి బండి ఆపి "నా నాయనా వచ్చావురా? కళ్లు కాయలుకాసి పోయినట్లు చూస్తున్నాం. పెద్ద వైద్యుణ్ణి పట్నం నుంచి తెప్పించారు. ఇప్పుడు మీ నాన్న తేరాడులే!"

ఎదురుగా పొడుగు మనిషి—మూతి నిండుగా మీసాలు—లోతు కళ్లు. గడ్డం బాగా మాసివుంది. జుత్తు డిప్ప కత్తిరింపు. శరీరచ్ఛాయ నలుపే గానీ కారు నలుపు కాదు. మీసాలు అక్కడక్కడ పండు వెంట్రుకలతో వున్నాయ్. మాసిపోయిన పంచె కట్టుకున్నాడు. మీద చింకి గుడ్డ కప్పుకొని కొంచం చలికి వణుకు తున్నాడు.

"ఇంత ప్రొద్దున్న యెక్కడికిరా తాతా?" అన్నాడు బాబురావు.

"మీ అవ్వ ఒంట్లో బాగాలేదు. లింగాలపాడు వైద్యుడు మందిస్తున్నాడు" ప్రక్కకు తప్పుకొని "వెళ్లు నాయనా! మరి వుంటావుకదా?" బండి మెల్లగా వెళ్తోంది. బాబురావు వెనుకకు తిరిగి చూచి "తాత బాగా యెండిపోయాడే" అనుకొని అప్పన్నతో అన్నాడు. "మా చిన్న తాతని దొంగని చేసేస్తున్నారేమోయ్. వాడికి దొంగతనం చేసే ఖర్మమేం వొచ్చింది?"

"ఏమీ లేకపోతే వూరోలు వూరకనే అంటారా బాబూ? పొలాల్లో రాతిరిమీద సేనికాసినప్పుడు సెట్టుకి కట్టేసి వాతలేసి పోరురు. మరి మీ తాత ముకంసూసి..."

అప్పుడే పొలాలు దాటి బండి మామిడి తోటలోనికి పోయింది. అప్పన్న మొఖరమీదకు వచ్చాడు. బాబురావు బండి దిగి వెనుక మెల్లగా తల వంచుకొని నడుస్తున్నాడు. తాటి చెట్ల పెంటె దగ్గర నిల్చున్నాడు. అక్కడకు తను లెక్క లేనన్ని సార్లు చిన్న తాతయ్యతో వచ్చాడు. పదేళ్ల క్రితం జరిగిన సంఘటనలవి. వేసవి శెలవుల్లో తను వచ్చే సరికి చిన్న తాత తన కోసం యెన్నో కబుర్లు వస్తువులు దాచిపెట్టేవాడు. భుజంమీద యెక్కించుకొని కానుమంతు నీలా గెంతులేసుకొని జీడితోటకు తీసుకపోయేవాడు. వచ్చి పిక్కలు తీసి చేతికి జీడి అంటుకున్నా కలిచి చేరపెట్టి పలుకులను తినిపించేవాడు. పదునైన కత్తి పట్టుకొని యీ తాటి పెంటెకే తీసుకవచ్చి గెలకు గెలా తెగనరికి కాయక్కాయాకోసి తాటి ముంజలను తినిపించేవాడు. మొదటిసారి "ఒరే తాతా! తోట మనిషి వస్తే తాత"—మనుమని భయానికి నవ్వి "దొంగ నను కున్నావురా నాయనా! అడిగే వచ్చాను. మా మనమడు వస్తే యివిగో యీ నాలుగు బొండ్లకాయలున్న తాటి చెట్టూ వాడివి అని ముందే చెప్పాను. నన్ను కాదన్నవాడు యీ వూర్లో లేడనుకో."

అప్పన్న కేక వేశాడు. బాబూరావు ముందుకు సాగాడు. గుడ్డెమీద చెఱుకు పంట—అ ప్రక్క నుంచే వరి గట్టు వెంబడిబండి పోతోంది. చలికాలం ప్రవేశించగానే యేటి ఒడ్డున కొయ్యలు పాతి నీటిలో నక్కుతులసి, వెంపలి కంపలతో పెచ్చులు వేసేవాడు. చిన్నవల పట్టుకొని తెలవారుఝామున, సాయంత్రం ఆ పెచ్చులు యెత్తి చేపలు తెచ్చేవాడు. మంచివన్నీ మనుమడికే. మారుపు పడిందంటే తన దగ్గర కూర్చోవాలి. మనుమడు నవ్వుతూ తృప్తిగా తినాలి. ఒకసారి తగువు తీసుక వచ్చాడు. తన పెచ్చులు దొంగతనంగా యెత్తి చేపలు అపహరించాడని ఒక కుర్రాడ్ని చావ మోదాడు. ఆ కుర్రాడి తల్లిదండ్రులు యేడుస్తూ ఆ సమిష్టి కుటుంబపు యింటి పెద్దవద్దకు వస్తే ఆయన తమ్ముని చీవాట్లు పెట్టాడు. అరుగుమీద కూర్చున్న బాబురావిదంతా చూస్తున్నాడు. చిన్న తాత చివరకు విజృంభించాడు. 'దొంగబతుకూ ఒక బతుకే— కడుపు కక్కుర్తి తీరకపోతే చచ్చిపోవాలి గానీ—దొంగతనం చెయ్యటమా?"

"నయానో భయానో బుద్ధి చెప్పాలి గానీ అలా చావ మోదుతావటరా?" బాబురావు తల్లితండ్రియైన యింటి పెద్ద విరుచుక పడ్డాడు. దానితో చలించి మనుమడి దగ్గరకు వచ్చేస్తూ "నడు నాయనా." అంతదూరం తీసుకపోయి "తల్లైనా తోబుట్టువైనా న్యాయం దగ్గర వొకటేనరా! నా కొడుకు దొంగతనం చేసినా వదిలేస్తానా? యెముకలు యిరిచేనూ?"

ఊరు దగ్గర పడింది. గోర్జ (పుంత) సందివీధి వేపు బండి పోతోంది. బాబూరావు అగపడ్డ వాళ్ల పలకరింపులకు సమాధానా లిస్తూనే యింటికి చేరుకున్నాడు.

రాత్రంతా నిద్రలేక పోవటంవల్ల ప్రయాణ బడలికవలన నిద్రనుంచి లేచేసరికి సాయంత్రం నాలుగు గంటలైంది. సీతయ్య నడవ అరుగుమీద స్తంభంచాటున కూర్చున్నాడు. కిటికీనుంచి చూచి "రారా తాతా లోపలికి" అన్నాడు. సీతయ్య జంకుతూనే వచ్చి గొణగడం ప్రారంభించాడు. "నా నాయనా. వచ్చావురా! నా సంతోషం అలా వుంచు. మీ అవ్వకి జ్వరం పోయిందనుకో. నే వచ్చాను అన్నం పెట్టేవాళ్లకి అడగాలంటే—చలికాలంకదా- యీ చింకి గుడ్డ పాత మూసి మనమడు వూరుకుంటాడటే."

బాబూరావు విశ్చేష్టుడయ్యాడు. ఇలాంటి మాట లిదివరకు వినలేదు. తను గడిస్తున్న యీ నాలుగేళ్లలోనూ రెండేసార్లు రెండురూపాయ లిచ్చాడు. ఇచ్చేవరకూ యెప్పుడూ అడగలేదు యిలా నిరాశా వాక్యాలు యెప్పుడు వెళ్లగక్కలేదు. అంతలోనే చప్పున "వస్తాను నాయనా" అంటూ గొణుక్కునే గదినుంచి వెళ్ళిపోయాడు.


పీపుల్సు ఆర్టుప్రొడక్షన్సు వారి
పల్లెటూరు
డైరెక్షన్: ప్రకాశరావు
రచన: వాసిరెడ్డి, సుంకర, సంగీతం: ఘంటసాల
నిర్మాత: పి. శివరామయ్య. నిర్వాహకులు: M.S. చౌదరి, R.D. ప్రసాద్.

బాబూరావు ముఖంలో సంశయం తొంగి చూసింది. గది లోనికి కాఫీగ్లాసుతో వచ్చిన తల్లి "యేం అడుగుతున్నాడు" అంది. కొంత సేపటికిగానీ "యేమీ లేదని" చెప్పలేక పోయాడు.

కాఫీ త్రాగాక గదిబయటకు వచ్చాడు. ఇంటిచుట్టూ తిరిగాడు. సీతయ్య కనిపించలేదు. బట్టలు మార్చి తాతగారింటివేపు వెళ్లాడు.

తాత కోర్టుపక్షి. గొంతుక యెత్తాడంటే చిన్నపిల్లలు జడుస్తారు. ఆ చుట్టుపట్ల వూర్లలో యే తగవులైనా పరిష్కారానికి తన దగ్గరకు రావలసిందే. రెండువేపులా కాసి డబ్బు చేసుకోవటం పరిపాటి. ఇంటికి పెద్ద అయినందుకు గడించా డింతో. యింటిపేరు కూడా అలానే నిలబెట్టాడు. తమ్ముళ్లు ముగ్గురు. పెద్దవాడికి ఒక కూతురు, రెండోవాడికి పిల్లలు లేరు. చిన్నవాడైన సీతయ్యకు నలుగురు ఆడపిల్లలు, యిద్దరు మొగపిల్లలు. పెద్దవాడు పదహారేళ్లవాడు. చదువు సంధ్యా లేదు. ఇంట్లో వ్యవసాయపుపనీ చేతకాదు. ఊర్లో కుర్రాళ్ళకి పెద్ద కుర్రాడు మావుకి దద్దమ్మ, తెలివికి మొద్దు.

ఇక యింటిపెద్దకు ఒక కొడుకు ఒక కూతురు. కొడుకు మైనరు తరఫున గ్రామ మునసబు పనిచేస్తున్నాడు. కూతుర్ని వూర్లోనే యిచ్చారు. వాక్కాలమాష్టరు భార్య, బాబురావు తల్లి.

అమ్మమ్మ, తాత మనుమణ్ణి కుశల ప్రశ్నలు అడగటం మొదలుపెట్టారు. బాబురావు యీ సంవత్సరం యేమాత్రం పండిందన్నాడు, నౌకర్లు కొట్టులో ధాన్యం పొయ్యటం చూసి. తాత అన్నాడు. "నాలుగు గరిసెల వరకూ వుంటాయి. అయినా దానికి మదుపులు తక్కువయ్యాయంటావా? ఇదివరలో రెయిపుడుపుకి అనా అంటే వచ్చేవారు యిప్పుడు అర్ధరూపాయి ముందాయిస్తే గానీరారు. ఐదువందలకు పైగా మదుపులే అయ్యాయి యింకేం తింటాం?"

ఈ మాటలు వింటుండగానే మనసులో తిరిగిన ప్రశ్న వెయ్యకుండా వుండలేక పోయాడు. "విడిపోయారుకదా వాళ్లకే మిచ్చారు?"

"ఇచ్చాముగా! ఆ వెధవలు కృతఘ్నులు. పెద్దలు వదిలిన ఆస్తిపాస్తులెంతో తెలుసుగా! మరి వాళ్ళ పెళ్లిళ్ళకి, వాటికి వీటికీ తక్కువ తగలేశారా? ఎన్ని అప్పులయ్యాయో నీకేం తెలుసు? ఐనా వాకు అన్యాయం యెందుకు? నలుగురు పెద్దమనుష్యులు ఛేష్ అన్నట్టే యిచ్చాను. ఏం యిచ్చినా యేముంది? వా యింటా వంటా లేనిపని ఆ సీతిగాడు చేస్తున్నాడు. తలెత్తుక తిరగలేక పోతున్నాం."

బాబూరావా విషయం తరచి ప్రయోజనం లేదని వూరుకున్నాడు. ఆయన నోటిలో నోరు పెట్టేశక్తి ఆ చుట్టుపట్ల గ్రామాలలో యెవరికీ లేనప్పుడు తన కెక్కడుంటుంది?

ముసలాడు అన్నాడు "నివ్వు రెండేళ్ళక్రితం యిచ్చావే— ఆ కమీజా మొన్ననే చిరిగిపోయిందిరా. కుట్టిద్దామన్నా అలాంటి దిట్టమైన బట్టలు యిటు లేవు లేవు"

బాబురావు "మళ్లీ వస్తానుతాతా" అంటూ లేచిపోయాడు.

"కమీజా అడుగుతున్నావని గాని లేచిపోతున్నావురా?"

"అబ్బే! ఇంకొకటి తీసుక వచ్చానులే తాతా!" అన్నాడు.

వీధిలో పడేసరికి చింతచెట్టు చాటున నిల్చున్న సీతయ్య దగ్గరకు వచ్చాడు. "అంత భయమెందుకురా తాతా" అంటే "నీకు తెలీదు నాయనా! ఎవరైనా చూస్తే నిన్ను కష్టపెట్టున్నావని అన్నతో చెప్తే కేకలు వేస్తాడు. తిట్తాడు!"

"విడిపోయారుగా—ఇంకా తిట్తాడా?"

"పెద్దాడు. తిడితే వూరుకుంటాను గానీ తిరగబడ్తానా?"

కొన్ని సంవత్సరాలు గొడ్డులా కష్టపడి యెద్దులా తినే మనిషి, యెందరి యెదరగానైనా నాకేం అన్నట్టు మెసలిమీసాలు మెలివేసిన మనిషి. యీ నాడు వక్కి వక్కి మెసలినా అర్థాకలితో వున్నా, యెండిపోయినా యిద్దర్ని కొట్టే బలం లేకపోలేదు. బాబూరావు యీ తాతవేపు చూసి తృప్తితో నవ్వాడు.

నాలుగడుగులు వేశాక గొణిగాడు. "రాతిరి మీ అవ్వ పూష్టంతోనే అంబలి వండిందిరా! ఈ వేళ నివ్వు వచ్చావు. మా మనమడు వచ్చాడు—యీ రాతిరికే యిచ్చేస్తానురా అని కోమటి నాగేశం దగ్గర రూపాయి బియ్యం అరువు తెచ్చాను. నీ యిష్టం నాయనా!"

బాబురావు వెనకకు తిరిగేసరికి మనిషి అప్పుడే యెక్కడో నక్కిపోయాడు. ముందుకు చూచేసరికి తాలూకాఫీసుకు వెళ్ళిన మునసబు తిరిగివస్తున్నాడు. అంతదూరం నుంచే "యేమోయ్ అల్లుడా? ఢిల్లీ భోగట్టా లేమీ చెప్పావు కాదు—యింటికి పదు."

"మళ్లీ వస్తాను మామా" అన్నా బలవంతం చేసి యింటికి తీసుకుపోయాడు. ఈ కబురూ ఆ కబురూ చెప్పుకొనేసరికి సాయంత్రమైంది. రెండో వీధిలో వున్న తన యింటివరకూ సాగనంపాడు. కోమటి తాత చూస్తా నంటున్నాడురా అలా ఒకసారి వెళ్ళమని అమ్మ చెప్పటంవల్ల వెళ్లాడు. ఇదివరకున్న గడ్డి యిల్లు యిప్పుడు పెంకుటిల్లుగా మారింది. వీధి వరండాలో కిరాణాకొట్టు వుంది. కోమటి తాత విధవ చెల్లెలు దుకాణంమీద వుంది. చిన్న బల్లమీద కూర్చోబెట్టి కోమటితాత అన్నాడు "సిగరెట్టు లేవు— బీడీ లేనా?"

"ఏదీ వద్దులే తాతా" అన్నాడు.

"నీకేం మహాపట్నంలో వున్నావ్—అక్కడ ధరవరలెలా వున్నయ్ తాతా?"

"ఏదో వున్నాయ్" అన్నాడు హోటల్లో తింటున్న తన కేమీ తెలియదని చెప్పే బదులు.

"ఏంటో కాలమాన మేమీ బాగులేదు. దొంగతనాలకి అడ్డూ అపూ లేదు. మరి కరువు సంగతా చెప్పలేం—చిన్నపిల్లాడి దగ్గర నుంచి నా వరకూ కష్టపడినా చాలకుండా వుంది. ఈ కాలంలో వుద్యోగంచేసుకున్నంత మంచిపని యింకేమీ లేదు. ఆ లేమి సంపారానికి నీ చెయ్యి వేగం కలిసొచ్చినందుకు మీ బాబు అదృష్టవంతుడు."

హరికేన్ లాంతరు వెలిగించారు. ఆ వెలుగులో బొగ్గ నలుపు, పొట్టి దుబ్బు మనిషి వేపు యెగాదిగా చూశాడు. పెద్ద బొజ్జను చుట్టిన గావంచా జారిపోతోంటే సర్దుకుంటూనే "చిన్నప్పుడు మా యింట్లో బెల్లం అంతా నువ్వే తిన్నావు తాతా! ఆ పట్నం నుంచి యేం తెచ్చావో యేంటో?"

బాబురావు నవ్వేశాడు. ఇంట్లో తోడికోడండ్రు పోరు చేసుకోవటంవల్ల తాత లోపలకు అరుచుకుంటూ వెళ్ళాడు. బాబురావు ఆ స్తంభంచాటున కూర్చొనే కొనటానికొచ్చిన మనుషులవేపు చూస్తున్నాడు.

మాసిపోయిన చింకిబట్టలు. ముళ్ళడొంకల్లాంటి జుత్తులు. పేదరికం కళావిహీనంచేసిన ఆశలేని ముఖాలు. బ్రతుకుభారం మోయలేని మానవులు! అర్ధనగ్నంగా, అర్ధాకలితో వున్నా అమానుషంగా ప్రవర్తించలేని అమాయక వ్యవసాయపు కూలిజనం— చేతుల్లో వున్న చేటల్లో, బుట్టల్లో, చీరకొంగుల్లో—చెమటకార్చి గడించిన ధాన్యపుగింజలు మహాప్రీతితో ఒకరి తరువాత ఒకరు వేస్తున్నారు. దుకాణదారిణి పెద్దసోలతో ధాన్యం కొలుస్తోంది. చిన్నసోలతో వుప్పయిస్తోంది. ఒక మహాత్ముడు యిటువంటి పేదజనానికి చౌకగా వుప్పు లభ్యంకావాలని సత్యాగ్రహం చేశాడు!

ఒకరితరువాత ఒకరు వెళిపోతున్నారు. కొసర వేసి నందుకు సంతోషాన్ని వెలిబుచ్చినవాళ్లుకూడా లేకపోలేదు.

ఒక మూలనుంచి తలమీద బట్ట కప్పుకొని "నారాయణమ్మా! యింట్లో దీపంలేదు. వేగంగా కిరసనాయిలుయిచ్చే" అంటూ సీతయ్య ప్రవేశించాడు. "ఇస్తాను, బయటేవుండు బయటే వుండు" అని కసిరిం దావిడ. లేచి ముందుకువెళ్లి ధాన్యం అందుకొని చప్పున కొలిచి సీసాలో కిరసనాయిలు పోసింది. కసిరాడు సీతయ్య. "నీ తల్లిదండ్రికి దండం పెట్తాను, వెళిపోతండ్రీ" అంటూ కొంచెం పోసింది. సీతయ్య వెళిపోతూ "నివ్వు కొసర వేస్తావమ్మా—చెప్పుకోవాలి" అని గొణుక్కోవటం విన్న మనుమడు సగానికి సగం దోపిడీచేసిన నారాయణమ్మ యెదురుగా వుండలేకపోయాడు.

మరుచటిరోజు తండ్రిదగ్గర కూర్చొని మాటల్లోమాటగా "సీతయ్య తాతని దొంగంటున్నారే" అన్నాడు బాబురావు.

"నిజమే" అన్న క్లుప్తమైన సమాధానం తప్పించి యింకే విషయం బయటపడలేదు. బహుశః నీరసంవల్ల మాటాడలేకపోతున్నారేమోనని తరచి అడుగలేదు. ఇంతలో యిద్దరు రైతులు రావటంవల్లకూడా అప్పటికి యీ విషయం అపుచెయ్యవలసి వచ్చింది.

ఆవేళ సాయంత్రమే యేటిఒడ్డున చిన్నతాతను కలుసుకున్నాడు. కాల్చిన పెసరకాయలు చేతికిస్తూ "యివి ఒంటికెంతబలమంటావ్—వున్నన్నాళ్ళూ రోజూ తెస్తానులే" అన్నాడు. నిన్ను అందరూ దొంగ అంటున్నారే, యెంతవరకు నిజం, అన్న ప్రశ్న బయటకు అనే సాహసం లేకపోయింది. ఇద్దరూ నడుస్తూ నీలాటిరేవు దాటిపోయారు.

సీతయ్యతాతకు యీ రోజుల్లో యే మాటకూ గొణుక్కోవటమే అలవాటైనట్లుంది. "తినిలేదంటే మహాపాపంనాయనా! ఆనాడూ రెండుసార్లు రెండు రూపాయలిచ్చావు. నీతల్లికడుపు చల్లగుండాల. రాతిర రూపాయి యివ్వబట్టే మాట నిల్చింది. ఈ వేళ అన్నమాట నిలబెట్టకపోతే రేపెవరైనా నమ్ముతారా?"

ఊరంతా దొంగన్న మనిషి యీ వాక్యాలు అంటుంటే బాబురావు మరేం మాటాడలేకపోయాడు. చిన్నప్పటినుంచీ తనకూ యీ తాతకూ వున్న బంధం అలాంటిది. సమిష్టి కుటుంబంలో పశువులకీ పాలాలకీ పెద్దతను—తను చెమట కార్చాలి భూమిపండాలి—తను ఆవులను మేపాలి—అన్నరాత్రి శేరుపాలు త్రాగాలి. పేదారోదకి చేసుకోపులిచ్చి "అన్నా! యిది వాళ్ళకిచ్చానురా" అని చెప్పి పాలుగు చీవాట్లు తిన్నరోజులు కూడా లేకపోలేదు.

ఒకసారి మనుమడితో చెప్పుకున్నాడు "చూడరానాయనా! మీ అవ్వ యెంత పాపం చెయ్యమంటోందో? నాకేక తెగాలి గానీ వాళ్ళకళ్లు కప్పి ధాన్యం అమ్మి డబ్బుచేసుకుంటానా? పిల్లలున్నారు. ఉన్నపాటున వాళ్లు యిలా యింటినుంచి తగిలేస్తే మనకేం కావంటుంది. మా అన్నలాంటి పెద్దమనిషిమీద అంటాకే అని ఒక్కటేశాను. ఛా ఛా! పాపం చేస్తే అదిపామై యేనాడో కరవదా? ధర్మం గొడుగై కాస్తుందని పెద్దలంటారు నాయనా!"

అప్పుడే ప్రొద్దుక్రుంకుతోంది. ఏటి ఒడ్డున యిసుకతిన్నెమీద యిద్దరూ కూర్చున్నారు. బాబురావు పెసరకాయలు గీకుతూ తొక్కలు నీళ్లలో విసరుతున్నాడు. కొంచం చలి వేస్తోంది. ఈ ఆలోచనలు తలలో తిరుగుతున్నప్పుడే తాత మళ్ళీ గొణగడం ప్రారంభించాడు.

"కాలమానం యెలాగుందో పట్నంలో వున్నావ్ నీకు తెలీదు నాయనా! ఈ యేడు రూపాయికి శేరుబియ్యం అమ్మారు. పిల్లలుమాడిపోయారు. మీ అవ్వ నెత్తి బాదుకొని యేడుస్తుంది. నామాట విన్నావు కాదంటుంది. నేను చేతకానివాడి నంటుంది. వినున్నా పడాలి మరి—దాని ఒళ్లు కప్పలేకపోయాను. అదలా వుంచు—పిల్లలు గిజగిజ గింజుకొని గిన్నె పట్టుకొని మీ అమ్మ దగ్గర కొస్తే—యిచ్చింది చెప్పుకోవాలి—ఇంత అన్నం గంజి పోసేది. సముద్రమైనా నిండుతుందిగానీ కడుపునిండుతుందా? తెల్లారేసరికి పరగడుపే!!"

ఈమాటలతో బాబురావు "చలివేస్తోందిరా తాతా" అంటూ లేచిపోయాడు.

ఆరాత్రి భోజనం దగ్గర అమ్మ తినమని బలవంతంచేస్తోంది. సరియైనతిండీ, సదుపాయంలేక యిలాగైపోయినందుకు చింత వెలబోస్తోంది. ఇంకా యెదురుగావున్న అన్నంలో నలభైయైదేళ్ల చిన్నతాత దైన్యంగా కనిపిస్తున్నాడు. అమ్మ అన్నమాటలకు తలెత్తకండానే "పాపం! సీతయ్య తాత యెలా యుండి పోయాడో?" అన్నాడు.

కన్నతండ్రిని సమర్థిస్తూ పినతండ్రి మీద యింత చెప్పిందితల్లి. ఇంట్లో అందరికీ గాదె కడుపులనీ పిన తల్లి నాలుగురోజులు చెయ్య వలసింది ఒకపూటలో లేదనిపిస్తుందని యింకా ఆమె చేస్తున్న దానాన్ని కూడ చెప్పతుంది.

బాబురావు లేచిపోతూ "మాకుపూటలు అంబలిజుర్రితే కడుపులు గుళ్లదేరవా అమ్మా! మా పేర్మవుంటే యిలా జరగనిచ్చేరా ? అన్నాడు.

తల్లి యింకేదో అంటున్నా వినిపించుకోకండా అంగటి గదిలోనికి వెళ్లి కర్రపెట్టె మీదకూర్చొని రొందరగా మంచంమీద నీరసంగాపడున్న తండ్రితో మాటలు కలిపాడు.

"సీతయ్యతాతని వూరంతా దొంగంటున్నారే! "అన్నాడు మళ్లీ.

"నిజం !"

గోడకున్న దీపం మసగ్గా వెలుగుతోంది.

"విడిపోయారు కదా యే మాత్రం పొలంయిచ్చాడు ?"

కొంతసేపటికి గానీ సమాధానంరాలేదు. ఆగి ఆగిచెప్ప కొచ్చాడు "ముసలమ్మ చావుకు సిద్ధంగా వుండగా మీతాత వీలు పుట్టించాడు. స్మారకం లేనప్పుడు మంచిరాత్రిమీద మామ్మ బొటనవేలి ముద్దర వీలుమీద వేసుకున్నారు. పెద్దలు గడించిన ఎకరా యిరవైసెంట్లే నలుగురికీ చెల్లుతుంది. సమిష్టిగావున్న ప్పుడు గడించిన ఆరుయెకరాలపొలం అప్పులతో సహా పెద్దవాడు గడించాడు కాబట్టి వాడికే చెల్లుతుంది"

"ఇదెక్కడి న్యాయం?"

"వాళ్లకదే న్యాయం! మామ్మకాలంచేసిన సంవత్సరానికే వేర్లుపెట్టి మిగతా ముగ్గురికీ చెరో ముప్పయిసెంట్లు యిచ్చాడు"

"ఊరంతా యేం చేస్తున్నారు ?

"మీతాత వాకళ్లేకప్పుడోతే వూరి కళ్లు కప్పలేదా ? వీలు మీద సాక్షి సంతకం పెట్టమంటే కాదన్నా నని నాతో యీ నాటికీ మాటాడతాడనా ? ఎవరో ఒకరు అడిగితే ఫలానప్పుడు యింత అప్పుతెచ్చాను అంత అప్పుతెచ్చానని దొంగపత్రాలు నాలుగు వేలు వరకూ చూపించాడు."

"నమ్మారా?"

"నమ్మక యేం చేస్తారురా కోడుకోన్న కొడుకే పూర్తైతే ! మీకూ నాకూ అబద్ధంకానీ కోర్టులో నిలిచేపత్రాలు కనిపిస్తున్నాయ్‌గా. అందులో నాలుగూళ్లలో పెద్దమనిషని పేరుపొందాడుగా! నేనూ నలుగురితో యీ అన్యాయం చెప్పాను. అన్యాయమని ఒప్పుకోవేవాళ్లే గానీ అడిగి సాధించేవాళ్లెవరూ లేరు !"

బాబురావు పెట్టెమీద కూర్చోలేక పోతున్నాడు. పెదాలు నొక్కుకుంటున్న కొడుకువేపు చూసి మళ్లీ మెల్లగా అన్నాడు :

"నిరుడు బాగా పండిందెంతో కరువంత హెచ్చింది. మీ సీతయ్యతాత అన్నదగ్గరే భూమిమీద మూడువందలు తెచ్చాడు అన్నదగ్గరే రూపాయికి శేరుబియ్యం కొన్నాడు. ఈయేడు పంట వర్షేగాకట్టె అప్పుడే అడుక్కుతింటున్నాడు. తప్పలేదు లే."

బాబురావు యీ చివర వాక్యానికి సంశయంగా చూశాడు. నే చెప్పాను "అప్పతీసుకరాకు. అమ్మితే స్తే ఆరు వంద లొస్తుంది. ఆ డబ్బుపెట్టి యేదో వర్తకం చేసుకుంటే యిటు కడుపుకీ గడుస్తుంది. వాడి అదృష్టం బాగుంటే నాలుగుపైసాలు గడించుకుంటా"డని. నామాట విన్నాడు కాదు. కూలికి వెళ్లలేడు నాకేమని రెండేళ్లక్రితం వరకూ బ్రతికాడుగా. ఇప్పుడిప్పుడూ పెట్టిన్నా అందరికి భయమే !"

కష్టసమయంలో వంద సలహాలు చెప్పేవాళ్లుంటారుగానీ కొంత బాధ పంచుకోలేవాళ్లరుదు. ఈ ఆలోచనలతో బాబూరావు అక్కడ వుండలేక వెళ్లిపోయాడు.

మళ్లీ చీకటిరాత్రులు వచ్చాయి. సెలకోజుల కెలవు పూర్తి కావస్తోంది. ఎల్లుండి ప్రయాణమవగా యీవేళ చీకటిపడ్డ సమయానికి తాతగారింటికి వెళ్లాడు. తాత వాకిట్లో నిల్చొని కేకలు వేస్తున్నాడు. మునసబు అప్పుడే వీధినుంచి వస్తుంటే తాత అర చాడు. "ఆ వెధవనుంచే వూళ్లో వుండలేకపోతున్నామా, ఇక యీ సంటపనవ తయారయ్యాడు. వెధవల్ని వూరినుంచి లెగ లేస్తేనేగానీ తలెత్తుక తిరగలేమురా ?"

ఎదురుగా నిల్చున్న సాయన్నని జరిగినసంగతేమిటని అడిగాడు. అంతావిని వెళ్లవ యింటికిరానీ కాళ్లు విరగగొట్టి మళ్ళీ ఆపని చెయ్యలేడని మునసబు హామీ యివ్వగానే సాయన్న వెళ్లిపోయాడు.

అక్కడే నిల్చున్న బాబురావు తెలుసుకున్న విషయ మిది : ఆవూరికి తూర్పుదిక్కున శివాలయంవుంది. ఆ ఆలయం యెదురుగా ఒక పెద్ద మామిడితోట, తోటచుట్టూ దట్టమైన ముళ్లడొంకలున్నాయ్. ఆ వూళ్లో దొంగసారా అమ్ముతున్న సాయన్న మట్టికూజాతో ప్రొద్దుగ్రుంకేవేళకు సారా తెచ్చి ఆ తోటలో ఒక పీతాలక్షింతాల పాదక్రింద గొయ్యత్రవ్వి దాచాడు. సీతయ్య పెద్దకొడుకు యెలాచూశాడో యేమో వెళ్లి కూజా బయటకు తీశాడు. దూరంనుంచి చూస్తున్న సాయన్న మాసిన కాకికోటు వేసుకొన్న వాడినిచూసి యే పోలీసుజవానో అనుకొని భయపడి చెట్టు చాటున దాగుండిపోయాడు. కూజా పట్టుకొని ఆలయం వేపు పరుగెత్తుకుండగా పోల్చివెంటతరిమాడు. చేతిలో కూజా జారి బద్దలై సారాఅంతా నేలపాలైంది. కుర్రాడు దొడుతీసిమాయమైపోయాడు. ఆలయం దగ్గరగానే వున్న పాకలో సాధువు సాక్షిగా వేశాడు సాయన్న. ఊరంతా గౌరవించే ఆసాధు, కుర్రవాని దొంగతనాన్ని నిరశించి మునసబుగారితో వెళ్లి చెప్పరా అని మరీ పంపించాడు.

ఈ లాభంలో భాగస్వామియైన మునసబువేపు చూసి జాలి పడ్డాడు బాబురావు. పెరటివేపు సీతయ్య తాత యిల్లువుంది. ఇంకా ఆ పెరటకు చింతచెట్టు—ఆ చెట్టు దగ్గరగానే పాకు నుయ్యివుంది. గగ్గోలు వినిపించటంవల్ల బాబూరావు పెరటకు వెళ్లాడు.

సీతయ్య తాత వాకిట వుగ్రనరసింహరూపం దాల్చి వున్నాడు. పులి మేకమీదకు వురికినట్లు కొడుకుమీదకు వురికి ఒళ్లంతా పచ్చడి చేస్తున్నాడు. కుర్రాడి చింకి వదులు మిలటరీ కోటు భుజాలు బాగా చిరిగిపోయాయ్. "అమ్మో! బాబో! చచ్చాన్రో—రండ్రో అమ్మో—అమ్మో!" ఒకటే గోల—ఒకటే అరుపు—ఆ గోలతో రెట్టింపు దెబ్బలు పడుతున్నాయ్. సీతయ్య తాత పళ్లు బిగబట్టి "చచ్చిపోరా యెధవా" అని హుంకరించాడు. నేల కూలిన వాడిని కాళ్ళతో కూడా తన్నటం మొదలు పెట్టాడు. ఇప్పుడు గడపదాటి వాకిటకు వచ్చి పెళ్ళాం అడ్డు పడింది. పెళ్ళాన్ని ప్రక్కకు నెట్టి మళ్ళీ గొడ్డును బాదినట్లు బాదుతున్నాడు. పెద్దవాళ్లు కూడా భరించలేని శిక్ష అది. అడ్డు కోడానికి శక్తిలేని భార్య నోరు చేసుకుంది. "నిప్పూ దొంగవే—నిన్నెవడు కొడ్తాడు?"

ఒకవాడు, తాత అన్న మాటలు యీ నాటికి దొంగైనా ఆచరణలో పెట్టడం చూసి అలా దూరంగా నిల్చొనే స్తంభించి పోయాడు బాబురావు. తల్లి తప్పించి మిగతా వాళ్లంతా మరి నాలుగు చాడీలు చెప్తున్నారే గాని అడ్డుపడలేదు.

ఈసారి అడ్డుపడ్డ భార్య దెబ్బమీద కొట్టాడు. దెబ్బ పట్టుకొని అడ్డగా నిల్చొనే అనరాని మాటలుకూడా అంటోంది. బాబురావు దగ్గరగా వెళ్ళి తాత చెయ్యి పట్టుకొని పెరటకు తీసుకెళ్ళాడు. వెనుకకు రాబోతూనే అరుస్తున్నాడు "నివ్వుండు నాయనా! యెముకలు విరిచేస్తేనే గానీ మళ్లీ దొంగతనానికి వెళ్లడు!"

లేవశక్తినా లేవలేని పరిస్థితిలో కొడుకు వున్నాడు. తల్లి మూల్గుతోంది. ఐనా తల్లికి కొడుకుని వెంటేసుకొని వాకిట్లోకి తీసుకపోయే శక్తి వచ్చింది.

బాబూరావు తాతను పెరటకు తీసుకపోయాడు. చింత చెట్టుక్రింద యిద్దరూ యెదురెదురుగా నిల్చున్నారు. చింత గిరుగీమంటోంది. చల్లనిగాలి వీస్తోంది. బాబురావు చెట్టుకు ఒక చేతిని ఆన్చి నిల్చొని "తాతా! అవ్వయేమందో వినుపించుకున్నావురా?"

పసుబలమంతా శక్తి వేసిన తర్వాత పొందిన విస్రాంతకళ్లల్లో నీటిని పూరించింది. జవాబురాలేదు. నడుముకు కట్టిన చింకిమాసినగుడ్డ విప్పి కళ్లు ఒత్తుకుంటూ కొంచం వెక్కుతూ ఆగి ఆగి అన్నాడు "అంటారు నాయనా! నా...దినాలు—బాగులేనప్పుడు—యెవరైనా అంటారు—నేను దొంగనే. పూరంతా అన్నప్పుడు—మీ అవ్వ యెందుకు మిగలాలి?"

కమ్ముకొస్తున్న చీకటికి యెంత భీకరమైనదో యీశోకం అంతే. నోటిముందు గుడ్డ అడ్డుపెట్టుకొని శోకాన్ని విజృంభించనివ్వకుండా తగ్గించి మనుమని వేపు గుడ్లు పైకి తేల్చి చూసి గొణిగాడు "దొంగనని పేరు పడిపోయాను నాయనా! పిల్లలు కొనవూపిరితో వుంటేయేం చెయ్యమంటావ్? చంపేమంటావా? నీతో చెప్పకేం? ఇప్పటికి నాలుగుపార్లే దొంగతనం చేశానురా! నాలుగుపార్లు దొరికిపోయానురా!"

తణికిస్తున్న చలికి గుడ్డ కప్పుకున్నాడు. అంతకంటే దారుణమైనది తన హృదయంలో వున్నా లేనట్లు తాత మెసలుతుండటం చూచి బాబూరావు విస్తుపోతున్నాడు. తాత యీసారి మరీ దగ్గరగా వచ్చి గొణిగాడు "మాయిద్దరం పస్తుండి పిల్లలకు ముందు చూస్తున్నామా? ఆ గాడిదకి యీ పాడుబుద్ధి యెందుకు పుట్టాలి? ఆ.సాధు పావలాయిస్తాను కూజా తెచ్చీమంటే యీ యెధవ తెచ్చీడమే!"

"ఆసాధుని పోయి తన్న లేకపోయావా?"

"ఉష్! యెవరితో చెప్పకు. అలాంటివాళ్ళని యేమీ అనకూడదు పాపం!"

బాబురావుకు నవ్వాలో యేడవాలో యేమీ తోచలేదు. చిన్నతాత అన్నాడు "పురుగూబుర్రా వుంటుంది నడువాయనా" నడూస్తానే "నాయనా వెళిపోతావురా! మళ్ళీ యెప్పుడో యేంటో? ఆపట్నం వెళిపోయినా యీదొంగతాతని మరచిపోకేం?"

బాబురావు కళ్లెదుట మళ్లీ స్టేషను—చీకటి—నల్లని కోటుతో వున్నవి మనిషి స్టేషను మాస్టరు దొంగలు గురించి చెప్పటం—అప్పుడు భీకరంగా అగపడిన దొంగలు బహుశః యిలాంటి దొంగలే అన్న ఆలోచనలో యింటివేపు నడిచాడు.



# ఉగాది కానుక

★

శ్రీ చింతలపాటి నరసింహదీక్షితశర్మ

శ్రీయుత నందనాబ్ద మధురీకృత మానవ భాగ్యరేఖతోఁ
జేయినిగల్పి; లోకముల జీవన మెల్ల నడల్చి మాయమై
పోయిన నీరసాబ్దముల ముచ్చటమాని; రసైకమాని!! మో
హా? యన యాత్ర సల్పు మవిగో! చనుదెంచెను నందనద్యుతుల్.

మందారంబులు చూతమంజరులు పద్మంబుల్ గదా? నీకు నా
నంద స్ఫూర్తులు చిందువంద మకరందంబిచ్చి లాలించు; నీ
వెందో చక్కని నోమునోచుకొనినా, విందిందిరా!! కాక; యా
మందారాంచిత నందనస్థితులు సామాన్యాప్త లాభంబులే??—

నిర్మలస్మిత మృదుపద్మినీ ముఖాబ్జ-మును నతంబును ముద్దిడుకొనుచుఁ బొంగి
పోయెదవుగాని? రాజపైఁ బొంచియుంట-మాయురే? మొఱుంగ వెట్టి
యమాయకుఁడవో?

తుమ్మెదరాయ! పైపయినఁదోఁచెడు మెచ్చులఁ జెచ్చరిల్లి "ఝుం
ఝుమ్మని" పువ్వు పువ్వునకు సోయగముల్ ప్రకటింప నేగు నీ
కెమ్మెయి సాధురీతి ఘటియిల్లును-నందను జూచి యైన లో
పమ్ములు దిద్దికొమ్ము బుధవర్గము కన్నుల కింపునింపఁగన్.

ఒకటిగ సంచరింతురుగదోయి? సుఖస్థితి మీరు మాట మా
టకు నల లేనిపోని జగడాలకు లోఁబడి జుట్టుపట్లకై
మొకము నిగుడ్చఁ బోక; సతమున్ విధిగాఁ గ్రమశిక్షణాలలో
నొకని కొకండు సాయపడుచుందురు నందనలక్ష్మిబంటులై

ఖరవిధానమ్ము లోకమూలఁ గట్టిపెట్టి మధుర మధురనవపరిమళము లొలుక;
నందన శరత్సరోజ మందాలు జిందు. నందనవిహారి! అందు నానందమందు!!

శుకముఖ మందునో భ్రమరసోదర! వ్రాలకు మోయి నూత్న కిం
శుకముకుళభ్రమన్, దొలుత సుంత విచార మొనర్చు బుద్ధి చా
లక శుకమల్ల నేరెదుఫలంబని నిగ్గబళించునేమొ? యూ
రక పొరపాటుచేఁ గలవరంపడబోకు వివేక వర్తనా!

సంపెఁగపూలపై వలపునందడి దండడిసేయ వ్రాలి నీ
కొంప మునుంగుటే తెలిసికోలేక దుర్విషయ ప్రవృత్తి లీ
తంపులమారి జీవిత కథారచనం గొనసాగనీయ క
డ్డంపడు-నంత మాత్రనకటా? వికటార్భటులేల? భృంగమా?

చిత్తరువందుఁ గల్గు సరసీజముఁగాంచి భ్రమించి భృంగ! నీ
చిత్తము పల్లవింప నటుజేరెద వేటికి? మార్దవంబు రే
కెత్తదు? కమ్మతావులన లే ప్రసరింపవు, తేనెసోనజా
లెత్తదు—సిగ్గుపాటగు నిసీ! పసిలేని వృథాప్రయత్నముల్

అంతయు గాలితాకున నయారె? మరందము చిందిపోవు? నూ
రంతలు వాడి వత్తలయి యాదళముల్ చెడ రేగెఁ దాను నొ
క్కింతయుఁ దావిలేక కృశియించె, మధువ్రత! యింకనైన వా
సంతిక మాలతిన్ విడువఁజాల వదెక్కడి ఘాటుమోహమో??

భాస్కరుఁడు కేవలము పద్మబాంధవుండు
కుముదమాత్రైక మిత్రుండు హిమకరుండు
నందనవిలాసి! నీవెపో? నళినకుముద
సర్వవాల్లభ్య దక్షిణ నాయకుఁడవు

మధురశ్రీలాలికించు నందనరమామందార మాధ్వీకముల్
మధుమాసా! కుతియారఁగ్రోలి ఖరసంపన్మత్త చండద్యుతి
వ్యథితాంగ శ్రమ వీడి; సౌఖ్యసుమనఃపర్యంకడోలాస్థితిన్
విధిగా నొందుము; నందనాప్త సుషమావిఖ్యాతి సంతోషముల్.

బంధనంబగు కేల సబ్జగృహమందు
దానమునకేఁగ గజకర్ణ తాడనములు.
ప్రాణభంగంబు కాంచనసూనమందు
భ్రమర! సర్వత్ర నీకు నాపదలెకదర??

దూరమునుండి తెమ్మెర యిదో? లవమంత పరీమళంబు చే
కూరిచినంతఁ; దేటి! యటకుం బరుగెత్తెద వేటికి దురా
చారపిపాస! కోపన భుజంగ సుసంగత చందనాళినే
వారతి మేలె? నందన నవప్రసవస్థితి మేలొ? యెన్నుమా??

విజయాగ్రేసరనంద నందన సమావేశంబె సౌభాగ్య మౌ
యి? జగత్యాళికి?-దివ్యనందన విలాసీంద్రా! జయోల్లాసముల్
నిజశక్తిం బ్రకటింప మన్మథుఁడు వెస్వెంటన్ బ్రయాణింప; వి
శ్వజనీనంబగు రాజకీయ రమ నీ జాడల్ విలోకింపఁగన్

నైజగుణాభిమాన ఖరనాయక దుష్ప్రదవుల్ నశింపఁగా!
లేజిగురాకుఁ గొన్నలవలీలత ముద్దుల రాచపూఁబొదల్
రాజిల; విజ్ఞహృత్కమల రాజి మరంద రసంబు లూర; ని
ర్వ్యాజపదాప్తి "నందనవిహారి" విహార మొనర్పుఁ గావుతన్.

# ప్రాచీనాంధ్ర చారిత్రికభూగోళము

★

శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

భరతఖండమునం దే భూమండల మాంధ్రదేశమని వ్యవహరింపబడుచున్నదో, యాధరణీతలము శ్రీ మద్రామాయణ మహాభారతములనాఁ డెట్టి పరిస్థితులలో నుండెనో తెలిసికొనుట యాంధ్ర చరిత్ర పరిశోధకుల కత్యంతావశ్యకము. శ్రీమద్రామాయణ మహాభారతములం దాంధ్రుల యొక్కయు, నాంధ్రదేశము యొక్కయు ప్రశంస గలదు.

## శ్రీమద్రామాయణము - ఆంధ్రులు

శ్రీమద్రామాయణమునందు నదీతీరములు, పర్వతములు, పట్టణములు, దేశములు కథాసందర్భానుసారముగ వర్ణింపబడినను, ముఖ్యముగా నాలుగు తావుల వివిధదేశముల యునికిపట్టు విపులముగా జెప్పబడినది.

1. శ్రీరామభద్రుడు సౌమిత్రీసమేతుడై విశ్వామిత్రుని యాగరక్షణార్థము కౌశికుని వెంట బోయి, మిథిలానగరము చేరు మార్గము.

2. భగీరథునకు గంగను భూమికి దెచ్చు సందర్భము.

3. భరతునకు గిరివ్రజమునుండి అయోధ్యకు వచ్చుమార్గము.

4. శ్రీరామచంద్రుని దండకారణ్య గమనము.

రామాయణములో కిష్కింధాకాండమున ఆంధ్రుల ప్రశంస గలదు.

"సహస్రశిరసం వింధ్యం నానాద్రుమలతాయుతం।
నర్మదాంచ నదీం దుర్గాం మహోరగనిషేవితాం॥ శ్లో. 8
తతో గోదావరీం రమ్యాం కృష్ణవేణీం మహానదీం।
వరదాంచ మహాభాగాం మహోరగ నిషేవితాం॥ శ్లో. 9
మేఖలా ముత్కలాంశ్చైవ దశార్ణ నగరాణ్యపి।
అశ్వవంతీ మవంతీంచ సర్వమేవానుపశ్యత॥ శ్లో. 10
విదర్భా నృషికాంశ్చైవ రమ్యాన్మాహిషకానపి।
తథా వంగాన్కళింగాంశ్చ కౌశికాంశ్చ సమంతతః॥ శ్లో. 11
అన్వీక్ష్య దండకారణ్యం సపర్వత నదీం గుహాం।
నదీం గోదావరీం చైవ సర్వమేవానుపశ్యత॥ శ్లో. 12
తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ చోళాన్ పాండ్యాన్ కేరళాన్.

కిష్కింధాకాండ, ఏకచత్వారింశస్సర్గ.

'హనుమంతుడు మొదలగు వానరుల దక్షిణ దిక్కునకుఁ బుచ్చుట.'

"కపివరులారా, మీరు దక్షిణ దిగ్భాగంబున కరిగి యచట నచట సీతారావణుల వెదకుచు సహస్ర శృంగంబగు వింధ్యంబున కేఁగి నర్మదా వేత్రవతీ తీరంబుల నానావింధ్య పారవన దుర్గ గుహల జానకిని వెదకి వేగవతీ కృష్ణవేణీ దేవికా మేఖలోత్కలా కంబుతీతీంద్రవతీ సమీపంబుల విదర్భర్షికా మహిష్మతీ పట్టణంబుల శకప్రకిండ నిషధ దశార్ణకుకురాది దేశవనగిరి కందరంబుల సీతను వెదకుచు దండకారణ్యంబున కరిగి యచట గిరివనదుర్గంబుల గోదావరీతీరంబుల నంధ్రపుండ్ర కేరళ కురుదేశంబులఁ బరికించుచు చిత్రపుష్పిత పాదదండవనశోభితంబైన మలయపర్వతంబున కుంజరియా పర్వత కందరచందన మందలతావనంబులం జూచుచు నటమీఁద*

శ్రీమద్రామాయణములో పైన వివరింపబడిన ఆంధ్రదేశ ప్రశంస ప్రక్షిప్తమనియు, రామాయణ కాలమునాటికి ఆంధ్రులు లేరనియు, ఆంధ్ర ఆంధ్రేతర చరిత్ర పరిశోధకుల యభిప్రాయము. శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రులుగారు, ప్రాచీనాంధ్రదేశ చరిత్రనుగూర్చి వ్రాయుచు, తముచే రచింపబడిన 'పన్నయభట్టారక చరిత్రము'నం దీవిధముగ వ్రాసియున్నారు.

"రామాయణము మనకు మిగుల పురాతన గ్రంథముగాను బూర్వులచరిత్రను తెల్పునదిగా నున్నది. శ్రీరాముడు కైక కోరిన వరముల దీర్చి తండ్రి యాడినమాట నిలుపుటకై దేశములందును గ్రామములందును బ్రవేశింపక వట్టి యరణ్యములందే పదునాల్గు వత్సరములు నివసింప శపథముపట్టివచ్చి యాప్రాంతములందు సంచరించినట్లును, ఈ భూమి ఘోరారణ్య ప్రదేశమైనట్లును, శ్రీమద్రామాయణమునందు దెల్పబడియున్నది. మఱియును సీతను రావణుండెత్తికొనిపోవుచున్నప్పు డామె మొరనాలించి రక్షింపవచ్చుటకు గాని, యామె యిడు ఆనవాలను భద్రముచేయుటకు గాని గోదావరిమొదలు పంపానదివఱకును నా మహాసాధ్వి కెవరును గాన్పించి యుండలేదు. ఆ పైనమాత్రము సుగ్రీవాదులు గాన్పించిరి. దీని చేత తెలియవచ్చునది యేదనగా రామాయణము నాటికి మన హిందూదేశముయొక్క యుత్తరపు కొనయును దక్షిణపు కొనయును జనాకీర్ణములైన దేశములుగా నుండె ననియు మధ్యభాగమంతయు వట్టి ఘోరారణ్య మనియు

---

*శ్రీమద్రామాయణము సాధారణముగా జేసికొని తెలుగున రామాయణము లనేకములు వెలువడినవి. ఆంధ్ర రామాయణములలో సుప్రసిద్ధమైన భాస్కర రామాయణమునుండి మూలమునుండి తెనిగింపబడిన భాగముల వీలైన పట్టుల నుటంకించియున్నాను.

భాస్కర రామాయణము కిష్కింధాకాండము పుట 281-282.

చెలుటయే. ఈ రామాయణమునందే కిష్కింధా కాండములో నాంధ్రాదిదేశముల ప్రశంస కలదు. కాని యది ప్రక్షిప్తముగా గ్రహింపబడలసియున్నది. ఏమనగా మన మీ భూభాగమును ఆంధ్ర దేశముగా గ్రహించుచున్నామో, యా ప్రదేశము జనరహితమగు మహాదండకారణ్యమని హేతుసహితముగా గూడ నుత్తరకాండమున విస్పష్టముగా దెల్పబడియున్నది. ప్రక్షిప్తభాగములను గ్రంథములను జేర్చువారు తాము నూతనముగా జేర్చుదానికి తగు తావేదియని చూచుకొని సందర్భముగల చోట నతుకుదురేగాని కథాభాగము నంతయు దిద్దజాలరు. దేశముల పేర్లున్నచోట నీ యాంధ్రదేశము మొదలగు నవీన దేశములనుగూడ మనవారు చేర్చిరకాని, కథా భాగమువలన దేలుచున్న భావమేమో తెలిసికొనలేకపోయిరి. దొంగతనము బయలుపడుమార్గ మిదియేకదా." *

పై యభిప్రాయముతో 'నవీన చంద్రదాసు' అను వంగ దేశీయ చారిత్రక పరిశోధకుడు తెలియపఱచియున్నాడు. ఈతడు వాల్మీకి రామాయణమునందలి భూగోళవిషయమునుగూర్చిన గ్రంథమునందు రామాయణములోని, ఆంధ్ర, చోళ, పాండ్య కేరళ దేశ ప్రశంస ప్రక్షిప్తమనియు, పండితమ్మన్యు లెవరో తర్వాతి కాలమున ఆంధ్ర చోళ పాండ్య కేరళ రాజ్యవంశజాల స్తుతిపాఠము నకై పై శ్లోకముల జొన్పించియుందురనియు వ్రాసియున్నాడు. విమర్శకాగ్రేసరుడగు బ్రహ్మయ్య శాస్త్రిగారి నిర్వచనమును, వంగదేశపండితుని వాక్యములును సమంజసముగ తోచుచున్నవి.† కాని ఆంధ్రచరిత్రకారుడీ వాదము నంగీకరింపడు. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ ఆంధ్రుల చరిత్రము ప్రథమభాగము, మూడవ ప్రకరణమునందు బ్రహ్మయ్యశాస్త్రిగారి వాదము విశ్వసనీయము గాదని యీ క్రిందివిధమున వ్రాసియున్నారు. "పై నుదాహరింపఁబడిన ఐతరేయ బ్రాహ్మణ వచనమునుబట్టి యాంధ్రులను నాగరిక ఆరణ్యకజాతివా రొకరు కలరని తేటబడినది. ఆ యనాగరికాంధ్రులు నివసించు దేశమే యాంధ్రదేశ మనంబడుచున్నది. నాగరికులు వసియింప శక్యముగాని యంధకారబంధురమైన మహారణ్యప్రదేశమునందు నివసించువారగుటచేతనే యార్యులు వీరి దేశము నాంధ్రదేశమనియు, వీరి నాంధ్రులనియు పాడుచువచ్చిరి. అనాగరికులయిన యాంధ్రులు నివసించుదేశమున మిద్దెలు, మేడలు నెట్లు గానవగును?

అనాగరిక దేశమునందుఁ బుణ్యతీర్థము లెట్లు గానవగును?... .........కాబట్టి రామాయణమహాభారతములనాటికి దక్షిణాపథమున నాంధ్రులు లేరని ఆంధ్రదేశము లేదని చెప్పుట సాహసము." ‡

శ్రీమద్రామాయణములోని కిష్కింధాకాండలోని దక్షిణ దేశముల వర్ణన ప్రక్షిప్తములే యని యొక చరిత్రకారుడు వ్రాసియున్నాడు.

ఈ దేశములు మూలములో లేవనియు, క్రీ. శ. పూర్వము, ఆరవ శతాబ్దమునకు తర్వాత కాలమున నున్న దేశవిభాగమును సంకల్పించుకొని, యిమిడ్చిన ప్రక్షిప్తభాగములే యనియు, శ్రీ శేషయ్యంగారు వ్రాసియున్నారు. *

## దండకారణ్య గాథ

రామాయణకాలమున వింధ్యపర్వత దక్షిణ దిగ్భాగమంతయు నొక మహారణ్యముగానుండి, యచ్చటచ్చట తాపసవరేణ్యుల పుణ్యతపోవనములతో నింపారుచుండెను. ఈ మహారణ్యమునకు దండకారణ్యమని పేరు. దీని కానామ మేలగల్గెనో రామాయణమందలి ఉత్తరకాండలో కడపటి సర్గలయందు వివరింపబడెను. ఇక్ష్వాకుని కుమారుడగు దండుడనువాడు వింధ్యాటవీ దక్షిణప్రాంత భూముల పాలించుచుండెను. ఒకనాడతడు ఉద్యానప్రదేశముల సంచారము చేయుచుండ రాక్షసుల గురువగు భార్గవుని కూతు నరజ యను కానినిజూచి కామోద్దీపితుడై, యామెను బలాత్కరించి యామెతో సంగమించెను. ఈవిషయము కుమార్తెవలన శుక్రుడు తెలిసికొని, దండుని రాజ్యమునం దేడుదినములు మృద్వర్షము గురియునట్లు శాపమిచ్చెను. ఆ శాపము విని అరజ యామె తపము చేయుచోట దశయోజనపర్యంతభూమి పాంసువర్షముచే బాధింపబడకుండునట్లు తండ్రిని వేడగా నతడట్లనుగ్రహించెను. ఈ శాపకారణమున నా దక్షిణ భూభాగమంతయును దండకారణ్యమయ్యెను. దండకారణ్య మన్యప్రదేశమైన దశయోజనవిస్తీర్ణమైన భూమండలము జనులకు వాసయోగ్యమగుటచే దానికి జనస్థానమని పేరు వచ్చెను.

"నామతస్సతు దండేతిపితా చక్రేఽల్పమేధసః
అవశ్యం దండపతనం శరీరేఽస్య భవిష్యతి॥ శ్లో. 15
అపశ్యమాన స్తం దేశం ఘోరం ప్రత్యగ్రరాఘవ
వింధ్యశైవలయోర్మధ్యే రాజ్యం ప్రాదాదరిందమ॥ శ్లో. 16
సదండస్తత్ర రాజాభూ ద్రమ్యే పర్వతరోధసి
రంచాప్రతిమం రామ న్యవేశ దనుత్తమం॥ శ్లో. 17
పురస్య చాకరో న్నామ మధుమంత మితిప్రభో
పురోధసం చౌశన సం వర్తయామాస సువ్రతమ్॥ శ్లో. 18
ఏవం సరాజా తద్రాజ్యం చకార సపురోహితః
ప్రహృష్టమనుజాకీర్ణం దేవరాజ్యం యథా వృషా॥ శ్లో. 19

* నన్నయభట్టారక చరిత్రము. పుటలు 85-88.

† "The passage within verse 12 is evidently the work of unskilled hand inserted in much latter times to suit the vanity of the comparatively modern dynasties of Andhra, Chola, Pandya and Kerala" Page 61 and also 71. A note a to Ancient Geography of Asia - Compiled from Valmiki Ramayana with Map and Index by Nobin Chandra Das.

‡ ఆంధ్రుల చరిత్ర ప్రథమ భాగము పుట 19.

* The four Cantos in Book IV of the original Ramayana which in describing Sugrivas instructions to the moukey chief represent Dandakaranya as ocaupying only a limited portion of South India and make copius illustrations to the flourishing kingdom of South India, are here taken to be interpolations belonging to an epoch later than 6th century. B. C. Dravidian India. Vol. I Page 17-18.

అథ కాలేతు కస్మింశ్చి ద్రాజా భార్గవమాశ్రమం
రమణీయముపాక్రామ చ్చైత్రే మాసి మనోరమే॥ శ్లో. 3
తత్ర భార్గవ కన్యాం స రూపేణాప్రతిమాం భువి
విచరంతీం వనోద్దేశే దండోఽపశ్య దనుత్తమాం॥ శ్లో. 4
దృష్ట్వాతాం స సుదుర్మేధా అనంగశరపీడితః
అభిగమ్య సుసంవిగ్నాం కన్యాం వచనమబ్రవీత్॥ శ్లో. 5

..........................................

ఏవముక్త్వాతు తాం కన్యాం దోర్భ్యాంగృహ్యబలాద్బలీ
సంస్ఫురంతీం యథాకామం మైథునాయోపచక్రమే॥ శ్లో. 16
అరజాపి రుదంతీ సా ఆశ్రమ స్యావిదూరతః
ప్రతీక్షతే స్మ సంత్రస్తా పితరం దేవసన్నిభం॥ శ్లో. 18
పశ్యధ్వం విపరీతస్య దండస్యావిజితాత్మనః॥
విపత్తిం ఘోరసంకాశాం క్రుద్ధా దగ్నిశిఖామివ॥ శ్లో. 6
యస్మాత్సకృతవానాపాపమీదృశం ఘోరసంహితం
తస్మాత్ప్రాప్స్యతి దుర్మేధాః ఫలం పాపస్య కర్మణః॥
శ్లో. 6
సర్వసత్త్వాని యానీహ స్థావరాణి చరాణిచ
మహతా పాంసువర్షేణ విలయం సర్వతోగమన్॥ శ్లో. 9
సతథోక్త్వా మునిజన మరజా మిద మబ్రవీత్
ఇహైవ వసదుర్మేధే ఆశ్రమే సుసమాహితా॥ శ్లో. 13
ఇదంయోజన పర్యంతం సరస్సురుచిరప్రభం
అరజే విజ్వరాభుంక్ష్వ కాలశ్చాత్రప్రతీక్ష్యతాం॥ శ్లో. 14
త్వత్సమీపేచయే సత్త్వావాస మేష్యంతి తాం నిశాం
అవధ్యాః పాంసువర్షేణతే భవిష్యంతి నిత్యశః॥ శ్లో. 15
శ్రుత్వానియోగం బ్రహ్మర్షే స్సారజా భార్గవీతదా
ఇతేతి పితరం ప్రాహ భార్గవం భృశదుఃఖితా॥ శ్లో. 16
ఇత్యుక్త్వా భార్గవోవాస మన్యత్ర సముపాశ్రయత్
తచ్చరాజ్యం నరేంద్రస్య స భృత్యబలవాహనం॥ శ్లో. 17
సప్తాహో దభుస్మసాద్భూతం యథోక్తం బ్రహ్మవాదినా
తస్యదండస్య విషయో వింధ్యశైవల యోర్నృప॥ శ్లో. 18
శప్తోబ్రహ్మర్షిణా తేన వైధర్మ్యే సహితేకృతే
తతః ప్రభృతి కాకుత్స్థ దండకారణ్య ముచ్యతే॥ శ్లో. 19

కం॥ మనువంశ రాజశేఖర
మనుజను దొర తొల్లి గగనమణి కులమణియౌ
మను పతినిక నిక్ష్వాకుఁడు
మనుజస్తుతుఁ డుద్భవించె మహనీయ రుచిన్.

చం॥ మనుసుతుఁ డుం దదుక్తముగు మార్గమునం
బ్రజనెల్లఁ బ్రోచుచున్
తనమతి పుత్త్రకాంక్షలకుఁ
దావలమాటయు దానధర్మముల్
మనుకొని యాచరించి మఖముల్
శతతింబును సంఘటించి యం
దుఁ గనియెన్ కుమారకుల
నూర్గురఁ గాంతవు లుత్సహింపఁగన్.

తే. వారిలోపల నగడఁ గొట్టుఁవాఁడు
దండుఁడను దురాత్ముఁడన్నల యటులుగాక
శ్రుతులు పరుషక సాధుసంగతుల మనక
హితులమాటలు వినక యథేచ్ఛ మెలఁగు.

చం॥ అతఁడొక చైత్రమాసమున
హర్షముతోఁ జని భార్గవాశ్రమ
క్షితి కొకచోఁ గనుం గొనియెఁ
జిత్తజ రూతన రాజ్యలక్ష్మితోఁ
బ్రతియనుదాని తేఁ గొమరుఁ
బ్రాయమునన్ జెలువొందుదాని, నే
కతమున నున్నదాని శొక
కామిని మత్తమరాళగామినిన్.

చం॥ శరము భయంబునొంది ముల కన్నియ యిట్లను కోయి రాజ! నీ
వురుఁడనమించు శుక్రుతొలిపూతుర నయ్యనఘుండు మార్గ్యశి
ష్యరజ యటంచు బిల్చు వతఁడింపగ జాపవి నిష్కరి కన్యకా
తరమున నున్న దాని దగు ధర్మముదప్పఁ దలంప నేటికిన్.

కం॥ ఆక్రోశింపఁగ నిటువలె
శుక్రాత్మజ బలిమిఁబట్టి సురతవిలాసో
పక్రమముఁ జూపి యాపా
పక్రీడాపరుఁడు పనియెఁ బట్టణమునకున్.

చం॥ ఈరునగక యొల్లలోకములు
నొక్కటఁ గ్రమింగడు యద్రుపోలికన్
బడిబడిఁ గోపముప్పతిల
బంధులదిట్టుచు శుక్రుఁడుగ్రుఁడై
చిడిముడిపాటుతో నెదుటిశిష్యులఁ
గన్గొని వింటిరే భయం
పడక మదీయ పుత్త్రిఁ గని
బల్మి రమించిన క్రించు చెయ్దముల్.

ఉ॥ మంటకుఁ జేరి కా మిరుతిమాడ్కి నశింపక మత్కుమారి నే
నంటియు నింటికేఁగి బదలంటిన దుర్మతి సేనతోడఁ గ్రిం
దంటఁగ మంటివానసురియున్ గల దేశ దినంబులింక నే
మంటినొయుంచు నెంచవలదప్పుడె యప్పురి నేల పాలుగన్.

తే॥ అప్పురంబు రజోవృష్టి నడఁగి యడవి
యగుట నది దండకారణ్య మనఁగ బరఁగెఁ
గావ్యుని మకోగ్రశాపంబు కతన నాఁట
నుండియుఁ బ్రాణిశూన్యమై యుండునధిప.

ఉ॥ తాను సురాత్తినయ్యరజ దారుణమైన తపంబొనర్చె న
క్కానన మధ్యసీమమునగల్గ రజోమయవృష్టి కోర్వక
ఆమ్రనిని చేరి రల్ల మధుమంతము పొరులుదానిచే జన
స్థానమునంగ నెన్నెలవు ధ్యాతిఁ బ్రసిద్ధివహించె రాఘవా.

(కంకంటి పాపరాజు ఉత్తర రామాయణము సప్తమాశ్వాసము. దండకారణ్య వృత్తాంతము.)

తిక్కన సోమయాజి దండకారణ్య వృత్తాంతమేలకో నిర్వచనోత్తర రామాయణమునందు వదలివేసెను.

ఈ దండకారణ్యమున కుత్తరమున జాహ్నవీనదియు, దక్షిణమున కృష్ణవేణియు, పశ్చిమమున మలయాద్రియు, తూర్పున మహేంద్రగిరులును గలవు. శ్రీరామభద్రుడు అయోధ్యనుండి వెడలి సీతాలక్ష్మణ సమేతుడై భరద్వాజాశ్రమమునకు వచ్చి, యచ్చట నొక రాత్రిగడపి చిత్రకూటాద్రిని జేరెను. చిత్రకూటమునుండి అత్రిమహర్షి యాశ్రమమునకు వచ్చెను. ఈ చిత్రకూటము ప్రయాగకు డెబ్బదిరెండు మైళ్లదూరమున మందాకినీ నదీ సమీపమున గలదు. అత్ర్యాశ్రమమునుండియే రాముడు దండకారణ్యము ప్రవేశించెను. ఈ దండకారణ్యము రామాయణమునందలి యరణ్యకాండ ప్రథమసర్గలో నభివర్ణింపబడెను.

"ప్రవిశ్య తు మహారణ్యం దండకారణ్య మాత్మవాన్
దదర్శ రామో దుర్ధర్షం తాపసాశ్రమమండలమ్॥
కుశచీరపరిక్షిప్తం బ్రాహ్మ్యా లక్ష్మ్యా సమావృతమ్
యథా ప్రదీప్తం దుర్దర్శం గగనే సూర్యమండలమ్॥
శరణ్యం సర్వభూతానాం సుసమ్మృష్టాజిరం తథా
మృగైర్బహుభిరాకీర్ణం పక్షిసంఘైస్సమావృతమ్॥
పూజితం చ ప్రవృత్తం చ నిత్యమప్సరసాంగణైః
విశాలై రగ్నిశరణైస్స్రుగ్భాండై రజినైః కుశైః॥
సమిద్భిస్తోయకలశైః ఫలమూలైశ్చ శోభితమ్
ఆరణ్యైశ్చ మహావృక్షైః పుణ్యైస్స్వాదు ఫలైర్వృతమ్॥
బలిహోమార్చితం పుణ్యం బ్రహ్మఘోష నినాదితం
పుష్పైర్వన్యైః పరిక్షిప్తం పద్మిన్యా చ సపద్మయా॥
ఫలమూలాశనైర్దాంతైశ్చీరకృష్ణాజినాంబరైః
సూర్యవైశ్వానరాభైశ్చ పురాణై ర్మునిభిర్వృతమ్॥
పుణ్యైశ్చ నియతాహారైశ్శోభితం పరమర్షిభిః
తద్బ్రహ్మభవనప్రఖ్యం బ్రహ్మఘోష నినాదితమ్॥
బ్రహ్మవిద్భిర్మహాభాగైః బ్రాహ్మణై రుపశోభితమ్"

"పుణ్యచరిత్రుఁ డత్రిమునిపుంగవు వీడ్కొని రాముఁ డంచితా
గణ్యగుణాభిరాముఁ డుపకంఠమునం జని కాంచె దండకా
రణ్యము సిద్ధసంయమి విరాజిత చారుతపోనుజాత స
త్పుణ్యము నిర్మలాంబువర పుష్కరపూర్ణ సరోవరేణ్యమున్.

(భాస్కర రామాయణము, అరణ్యకాండము ప్రథమాశ్వాసము ప. 2)

ఈ యత్ర్యాశ్రమము ఇప్పటి మధ్యపరగణాలలోని యుత్తరముననున్న సిరగుజమండల మధ్యమున నుండెను. శ్రీరామభద్రు డచ్చోటనుండియే దండకారణ్యము ప్రవేశించెను. దండకారణ్యమున కొంతదూరము జరిగినపిమ్మట విరాధు వనము ప్రవేశించెను. ఈ విరాధవనము ఇప్పటి మధ్యప్రదేశము (*Central province*) నందలి బిలాసపూరు మండలమునం దీశాన్యదిక్కునం దుండెను. శోణానదికి దక్షిణమున, బిలాసపూరున కుత్తరముననున్న అమరకంటకపర్వతప్రాంతమే విరాధుని నిలయము. శ్రీరామచంద్రు డచ్చటనుండి శరభంగమహాముని యాశ్రమమును జేరెను. విరాధుని వధించి, శ్రీరామచంద్రమూర్తి సీతాలక్ష్మణులతో శరభంగాశ్రమమునకు ప్రయాణముచేసెనని, వాల్మీకములో నిట్లు వ్రాయబడినది.

"హత్వా తు తం భీమబలం విరాధం రాక్షసం వనే
తతస్సీతాం పరిష్వజ్య సమాశ్వాస్య చ వీర్యవాన్
అబ్రవీత్ లక్ష్మణం రామో భ్రాతరం దీప్తతేజసమ్॥ శ్లో. 1
కష్టం వన మిదం దుర్గం న చ స్మ వనగోచరాః
అభిగచ్ఛామహే శీఘ్రం శరభంగం తపోధనమ్॥ శ్లో. 2
ఆశ్రమం శరభంగస్య రాఘవోఽభిజగామహ
తస్య దేవప్రభావస్య తపసా భావితాత్మనః॥ శ్లో. 3
(అరణ్యకాండము పంచమసర్గ.)

క॥ తదనంతరంబ రఘువరుండు జనకనందనం జేర్చి లక్ష్మణుం
గనుంగొని

చ॥ ఇది కడుఘోరమైన వన మిక్కడ నక్కడ దాపసోత్తముల్
మెదలరు దుష్టరాక్షస సమీపముగావున నింక నిందు ని
ల్చెదమవరాదు తుంబురుడు చెప్పిన యా శరభంగునాశ్రమం
బది మనకున్ నివాసమగు నందుల కేఁడు వసింత మిమ్ములన్.

తే॥ అంత శరభంగుఁ జేరంగ నరిగి రామ
చంద్రుఁ డమ్ముని పుంగవు చరణములకుఁ
బ్రణతుఁడై సమ్మునీంద్రుండు ప్రణుతి తోఁ ద
నర్చనములీయఁ గైకొని యతని గొలిచి.

(భాస్కర రామాయణము, అరణ్యకాండము ప్ర. ఆ. ప. 39-42.)

ఈ శరభంగాశ్రమము మధ్యపరగణాలలో శరంగపూరని పిలువబడుచున్నది. బిలాసపూరు మండలములో నుత్తరమున సీతావ్యపురాల నున్నది. శరభంగాశ్రమమునుండి రామభద్రుడు చాల దూరముపోయి నదీనదములను పర్వతములను దాటివచ్చి సుతీక్ష్ణాశ్రమమును జేరెను. ఈ సుతీక్ష్ణాశ్రమము బస్తరుసంస్థానమున ఇంద్రావతీ నదికి దక్షిణపుటొడ్డున నుండెను. అనగా విశాలాంధ్రదేశమున నుత్తరపు టెల్లయనదగు బస్తరుమండలమున శ్రీ సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణాశ్రమమును జేరి యాంధ్రభూమండలమున బ్రవేశించిరని చెప్పవచ్చును. ఈ సుతీక్ష్ణాశ్రమప్రాంతమే యిప్పుడు కాంతిస్పూరనునామముచే పిలువబడుచున్నది. తరువాత సుతీక్ష్ణాశ్రమమును వీడి బహుదూరము గడచిపోయి పంచాప్సరస్సరోవరమును గాంచెను. ఈ సరోవరము సహితము మధ్యపరగణాల లోనిదె.

"ఇత్యేవముక్త్వా వచనం మహాత్మా
సీతాం ప్రియాం మైథిల రాజపుత్రీమ్
రామో ధనుష్మాన్సహలక్ష్మణేన
జగామ రమ్యాణి తపోవనాని.

తౌ పశ్యమానౌ వివిధాన్ శైలప్రస్థాన్వనాని చ
నదీశ్చ వివిధా రమ్యా జగ్మతుస్సహసీతయా
పంచాప్సర తటాకస్య శ్రుణ్వంతో మహిమాం ద్విజైః
ప్రవిశ్య సహ వైదేహ్యా లక్ష్మణేన చ రాఘవః

సుతీక్ష్ణాశ్రమమును వీడి దానికి దక్షిణముగా అగస్త్య మహాముని సోదరు నాశ్రమమునకు వచ్చి, యచ్చట విశ్రమించి, పిమ్మట రామభద్రుడు కుంభసంభవానుజా తపోవనమునకు యోజనదూరమున నున్న అగస్త్యాశ్రమమును జేరెను. ఈ యాశ్రమము బస్తరుమండలములో దక్షిణపుదెస నుండెను.

> యోజనాన్యాశ్రమా ద స్మాత్తస్థా చత్వారి వై తతః
> దక్షిణేన మహాన్ శ్రీమానగస్త్యభ్రాతురాశ్రమః॥ శ్లో. 38
> దక్షిణం దిశ మాస్థాయ వన షండస్య పార్శ్వతః
> తత్రాగస్త్యాశ్రమ పదం గత్వా యోజనమంతరమ్॥ శ్లో. 42
> అరణ్యకాండ 11 వ సర్గ.

శ్రీరామచంద్రుడు అగస్త్యుని యాశ్రమమున నా మహాముని యాతిథ్యమునొంది, క్రమముగా పంచవటిని జేరెను. అదియే నేడు పర్ణశాల యని పిలువబడుచున్నది.

## జనస్థానము-పంచవటి-పర్ణశాల

ఈ జనస్థానము దండకారణ్య మధ్యమున తూర్పుదెస యందుండెను. ఇది బస్తరుమండలములో గొంత భాగమును, గోదావరీ నదీ యుత్తర దక్షిణ దిగ్భాగమును, హైదరాబాదు రాజ్యములో నుత్తరప్రాంతమునై యున్నది. రామాయణకాలమున రావణుని సోదరుడగు ఖరుడీ జనస్థానమున పాలకుడై యుండెను. అగస్త్య మహామునిని వీడ్కొని, శ్రీరామభద్రుడాయన యాజ్ఞానుసారముగ పంచవటమునకు బయలుదేరెను. మార్గమధ్యమున జటాయుదర్శనము లభించెను. ఆ విహంగపతిని బూజించి, యాతని వీడుకొని పంచవటము చెంతకు వచ్చెను.

> "సతత్రసీతాం పరిధాయ మైథిలీం సహైవ తే నాతిబలేన పక్షిణా
> జగామ తాం పంచవటీం సలక్ష్మణో రిపూన్ దిధక్షన్ శలభానివానలః." శ్లో. 35
> (అరణ్యకాండ 14 వ సర్గ.)

ఉ॥ బాంధవమొప్పవిట్లు తెగఁ బల్కిన పక్షిపతిం బ్రియోక్తిసం
బంధమెలర్ప వీడుకొని బాహుబలోద్భట శక్తిశౌర్యగ
ర్వాంధ విరోధి భూద్రభిదురాయుధుఁడా విభుఁ డేఁగెసల్లతా
గ్రంథిల కుంజపుంజములుగల్గిన పంచవటంబు చెంతకున్.

శ్రీరామభద్రుడా ప్రదేశమునకు వచ్చినతర్వాత లక్ష్మణుని చూచి యచ్చట పర్ణశాల నిర్మింపుమని యాజ్ఞాపించెను.

> "ఏవము క్తస్తు రామేణ లక్ష్మణః పరవీరహా
> అచిరేణాశ్రమం భ్రాతు శ్చకార సుమహాబలః॥ శ్లో. 20
> పర్ణశాలాం సువిశాలాం తత్ర సంఘాత మృత్తికామ్
> సుస్తంభాం మస్కరై ర్దీర్ఘైః కృతవంశాం సుశోభనామ్॥ శ్లో. 21
> సగత్వా లక్ష్మణ శ్రీమా న్నదీం గోదావరీంత దా
> స్నాత్వా పద్మాని చాదాయ సఫలః పునరాగతః॥ శ్లో. 24
> (అరణ్యకాండ 15 వ సర్గ.)

కం॥ దని యచ్చట నమజన్మునిఁ
గనుఁగొని యొకపర్ణశాలఁ గావింపుమనా
మన మిచ్చట నిట మీఁదట
వనవాసదినంబు లుండవలయుం బ్రీతిన్.

మ॥ అనినన్ వాస్తువిధిజ్ఞతం బరఁగుదాత్రాదిద్రుమచ్ఛేద సా
ధనముల్ గైకొని భూరిపర్ణతృణ సంతానంబు చేదెంచి, ద
య్యెన సంధించి యమర్చికట్టిన తదీయాగారమున్నంతఁ జూ
చిన రేంద్రుండు నిజానుజుం బొగడిచేర్చెం గౌఁగిటం జిక్కఁగన్॥

(భాస్కర రామాయణము అరణ్యకాండము, ప్రథమాశ్వాసము ప. 113-114.)

ఈ పంచవటి, తూర్పుగోదావరి జిల్లాలోని భద్రాచలమున కుత్తరముగా ఇరువదిరెండుమైళ్ల దూరముననున్న పర్ణశాల యను గ్రామపరిసరములలో నుండెను. సీతాపహరణానంతరము రామభద్రుడు భద్రాచలప్రాంతముల గొంతకాలము నివసించెను. ఈ ప్రాంతములనుండియే గోదావరిని దాటి నైరుతిమూలగా వచ్చి కిష్కింధకు వచ్చెను. ఈ పర్ణశాల బొంబాయిరాజధానిలో నాసిక పట్టణమున నిర్మింపఁబడెనని మహారాష్ట్ర, పాశ్చాత్యచరిత్రకారుల యభిప్రాయము. కాని, శ్రీరాముని దండకారణ్య గమనవర్ణనము ననుసరించియు, జనస్థానస్థలనిర్దేశముబట్టియు, పర్ణశాల యిప్పటి భద్రాచలమున కుత్తరముననున్న పర్ణశాలయేనని, నిస్సంశయముగా చెప్పవచ్చును. మహారాష్ట్ర చరిత్రకారులలో పేర్గాంచిన వైద్య పండితుడు, మహారాష్ట్రభాషలో నిట్టి నిర్ణయమే గావించెనని తెలియుచున్నది. *

---

* (1) ఆంధ్రులచరిత్ర ప్రథమభాగము పుట 14.

(2) శ్రీరామాయణ సారోద్ధారము. అరణ్యకాండము పుట 123. (ఈ గ్రంథము బ్రహ్మశ్రీ ములుకుట్ల నరసింహావధానులు గారిచే సమకూర్పబడినది.)

"శ్రీరామచంద్రుఁ డగస్త్యాశ్రమమునకు రెండు యోజనముల దూరముననున్న గోదావరినది కుత్తరపుటొడ్డునఁగల పంచవటియందుండెనని తెలియుచున్నది. పంచవటి యను నీస్థలది ప్రస్తుతము తూర్పుగోదావరిజిల్లాలోని భద్రాచలమను ప్రసిద్ధ పుణ్యక్షేత్రమునకు మూఁడు యోజనముల దూరముననున్న 'పర్ణశాల'యని నేఁడు పిలువఁబడు ప్రదేశమనియే తోచుచున్నది. ఈ పంచవటీ నిర్ణయమున మహారాష్ట్రదేశస్థులు కొందఱు మహారాష్ట్రదేశమునందుఁ గల నాసికాపట్టణ సమీప ప్రదేశమని నిర్ణయించిరిగాని, యాదేశస్థులలోనే కొందఱు విమర్శకాగ్రేసరులు వినాయకవైద్య మొదలగువారు మహారాష్ట్రభాషయందు ఆంధ్రదేశమందున్న పర్ణశాలయే పంచవటి యని నిర్ణయించిరి. సౌకర్యమునకు మన మీ రెండువాదముల నింకను సులభ మొనరించుటకై కొంతవఱకు విమర్శించిన యెడల శ్రీమద్రామాయణమునందుఁ జిత్రకూటమునుండి పంచవటి వఱకుఁగల శ్రీరామచంద్రుని యరణ్యమార్గము విచారించిన నాసికాపట్టణమందే పంచవటియున్నచో మార్గమధ్యమున శ్రీరామచంద్రునకు సర్వపురాణ ప్రసిద్ధములగు వింధ్యపర్వతము, నర్మదానదియు తప్పక కనంబడి తీరవలెను. శ్రీమద్రామాయణమునందు వాని వర్ణనము మందునకైనను లేకపోవుటచేతను, ముందొనర్చబోయెడు జనస్థానప్రదేశ నిర్ణయమువలనను, తోలుత రామాయణమునందు పేర్కొ-

భద్రాచల సమీపముననున్న పర్ణశాలయే పంచవటియని నిర్ణయించుటకు భవభూతి మహాకవి విరచిత ఉత్తర రామాయణ నాటకము ప్రబలసాక్ష్యముగా నున్నది. ఆ నాటకములోని ద్వితీయాంకమున శ్రీరామచంద్రునకును, శంబూకునకును జరిగిన సంభాషణములో దండకారణ్య, జనస్థాన, పంచవటీ ప్రశంసల పరిస్పర స్థల నిర్దేశములు గమనింపనగును.

రామః—కింనామ దండకేయం (సర్వతోఽవలోక్య) హా, కథమ్—

"స్నిగ్ధశ్యామాః క్వచిదపరతో భీషణాభోగరూక్షాః
స్థానే స్థానే ముఖరకకుభో ఝాంకృతైర్నిర్ఝరాణామ్
ఏతే తీర్థాశ్రమ గిరిసరిద్గర్త కాన్తారమిశ్రాః
సందృశ్యన్తే పరిచితభువో దండకా వింధ్య భాగాః."

శంభూకః-దండకైవేయం అత్రకిలపూర్వం నివసతా దేవేన
"చతుర్దశ సహస్రాణి చతుర్దశ చ రాక్షసాః
త్రయశ్చ దూషణఖర త్రిమూర్ధానో రణే హతాః
యేన చ సిద్ధక్షేత్రే జనస్థానేఽస్మిన్నాదృశామపి జనపదానామకుతో భయః సంచారః సంవృత్తః.
రామః—న కేవలం దండకైవ జనస్థానమపి.

శంబూకః—బాఢమ్। ఏతాని ఖలు సర్వభూతలోమహర్షణాన్యున్మత్త చండశ్వాపదకులాక్రాంత వికటగిరి గహ్వరాణి జనస్థాన పర్యంత దీర్ఘారణ్యాని దక్షిణాం దిశ మభిప్రవర్తన్తే।..............
రామః—.

పశ్యామిచ జనస్థానం భూతపూర్వ ఖరాలయమ్
ప్రత్యక్షానివ వృత్తాంతా న్పూర్వాననుభవామి చ॥
..........................................

అపిచ।

ఏతేత ఏవ గిరయో విరువన్మయూరా—
స్తా న్యేవ మత్తహరిణాని వనస్థలాని
అమంజువంజులతా నిచితాన్యమూని
నీరంధ్రనీరనిచులాని సరిత్తటాని॥
మేఘమాలేవ యశ్చాయ మారాదివ విభావ్యతే।
గిరిః ప్రస్రవణః సోఽయం యత్రగోదావరీనదీ॥
తథాహి-
అస్యైవాసీన్మహతి శిఖరే గృధ్రరాజస్య వాస
స్తస్యాధస్తాద్వయమపి రతా స్తేషు పర్ణోటజేషు।
గోదావర్యాః పయసి వితతానోకహ శ్యామలశ్రీ—
రన్తః కూజన్ముఖరశకునో యత్ర రమ్యో వనాంతః॥
అత్రైవసా పంచవటీ యత్ర.................

పై సంభాషణమువల్ల దండకారణ్య మధ్యభాగమున జనస్థానముగలదనియు, నదియే ఖరదూషణాదుల వాసస్థలమనియు, దానికి దక్షిణమున గోదావరీ తీరమున ప్రస్రవణపర్వతమును, దాని సమీపముననే పంచవటియుగలదని స్పష్టమగుచున్నది. కావున ఈ పంచవటి యొక్కడనో జనస్థానమునకు పశ్చిమదిశను, ఇప్పటి బొంబాయి రాజధానిలో నాసికాపట్టణము సమీపమున గలదని చెప్పుట కాధారము మృగ్యము.

శ్రీరామచంద్రుడు, సీతాపహరణమైన తరువాత సుమిత్రానందనునితో, పంచవటీసమీపముననే గోదావరిని దాటి దక్షిణాభిముఖముగా గొంతదూరము నడచి, తరువాత నైరృతిమూలగా పంపాసరోవరమునకును, కిష్కింధకును వచ్చిచేరిరి. ఆమార్గము పటములో చూపింపబడినది.

## పంపాసరోవరము - పంపానది - కిష్కింధ

శ్రీరామచంద్రుడు గోదావరినిదాటి, యిప్పటి నైజాము రాష్ట్రము దక్షిణమున గొంతదూరము నడచి, తర్వాత తూర్పు ముఖముగా నరిగి, నైరృతిమూలగా సీతాన్వేషణముగావించి, క్రౌంచారణ్యమును సమీపించెను. మార్గమధ్యమున జటాయుసందర్శనమును అతని కగ్నిసంస్కారము లొనర్చుటయు సంభవించెను. క్రౌంచారణ్యముకడ దాశరథు లయోముఖియను నిశాటినిగాంచి, యామెను సంహరించిరి. తర్వాత వారు కబంధుని జూచిరి. ఈతడే దాశరథులకు రావణుని సీతాపహరణమునుగూర్చి చెప్పెను. ఈతడే ఋశ్యమూకశైలమున నివసించియున్న సుగ్రీవుడు వారికి సహాయుడై పంక్తిగ్రీవుని సంహరించుటయందు తోడ్పడగలడనియు, సీతను దెచ్చి సమర్పింపగలడనియు చెప్పెను. కబంధుడు రామలక్ష్మణుల చేత దహింపబడి, దివ్యరూపముదాల్చి నాకలోకమున కరిగెను, అంత సోదరులు కబంధునకుచెప్పిన మార్గమునుబట్టిపోయి పంపా తీరమును జేరిరి. మార్గమధ్యమున శబరినిజూచి, యామెను గరుణించి. మాతంగాశ్రమమును గడచి, పంపాసరోవరమును జేరిరి,

"సామిత్రే శోభతే పంపా వైడూర్య విమలోదకా
ఫుల్లపద్మోత్పలవతీ శోభితా వివిధై ర్ద్రుమైః శ్లో. 8

నబడిన ప్రదేశములబట్టియు నాంధ్రదేశమునం గల పర్ణశాలయే 'పంచవటి' యని నిశ్చయింపనగును. అటులగానిచో సామాన్య ప్రదేశము సహితము విశేషముగా వర్ణించు శ్రీ వాల్మీకి మహర్షికి జగత్ప్రసిద్ధములగు వింధ్యనర్మదలను వర్ణించు నవసర మేల లేకపోయెను? మఱియు శ్రీమద్రామాయణమునందు సీతాపహరణానంతరము శ్రీరామచంద్రుడు పంచవటి మొదలు పంపానదివరకును నడచిన యామార్గప్రమాణము విమర్శించినను, నాసికవద్దనుండి పంపకున్నంతదూరములేని కారణములనను ఇతరార్ష రామాయణముల యనుగ్రహమువలనను ఆంధ్రదేశమునందున్న పర్ణశాలయే పంచవటి యని స్పష్టముగ నిర్ణయింపవలసివచ్చును. అట్టి పంచవటియందు శ్రీరామచంద్రమూర్తి సీతాలక్ష్మణులతోఁ గూడ రెండు సంవత్సరములుండెను.

(3) Madras District Gazeteers, Godavari. Page 263.

"It is widely believed in the distiict that this is the spot on the banks of Godavari described in the Ramayana wue.e Ravana carried off Sita."

హేమాద్రే పక్షసంపాతాః కానకం శుభదర్శనమ్
తత్రరాజంతి శైలాభా ద్రుమాస్సశిఖరా ఇవ॥ శ్లో. 4
కిష్కింధాకాండ, 1 సర్గ.

మ॥ ప్రవిలాసాంచిత పద్మభిర విమలాంభః పూర సంసేవ్యమా
న విహంగోత్కర పద్మదావహమహానక్రశ్రితాభ్యంతరా
ఘనిశేషోర్మితరంగసంకుల జనశ్లాఘ్య ప్రభావా సరః
ప్రవరంబుంగని రా నృపాత్మజులు పంపం జెంపుసొంపారగా.
భాస్కర రామాయణము, అరణ్యకాండము ద్వి. ఆ. ప. 425.

శ్రీరామలక్ష్మణులు పంపాసరోవరమునుండి, ఋశ్యమూక పర్వతమును జేరిరి. తర్వాత శ్రీరామ సుగ్రీవులకు హనుమంతుడు సఖ్యము చేయుటయు, శ్రీరాముడు సప్తతాళముల గూల్చుటయు, వాలి సంహరణము, కిష్కింధా నగరమున సుగ్రీవుని పట్టాభిషేకము మొదలగు విషయములు జరిగెను. సీతాన్వేషణమునకై హనుమదాదులు నాల్గు దెసలకు వెడలుటయు, హనుమంతుడు లంకకు బోయి, సీతను వెదకి, యా వృత్తాంతము శ్రీరామభద్రునకు నివేదించుటయు, రావణు సంహరణార్థము కపిసైన్యము లంకకు దాడి వెడలుటయు, వానరులు సేతువును గట్టుటయు, రావణుని మరణము మొదలగు విషయములు రామాయణమున వర్ణింపబడినవి.

## పంపానది - కిష్కింధ - విజయనగరము

రామాయణమున వర్ణింపబడిన పంపానదియే యిప్పటి తుంగభద్ర. పంపాసరోవరము, నైజాము రాష్ట్రమున నున్నది. కిష్కింధయే యిప్పటి హంపీ విరూపాక్షమను, విద్యానగరము లేక విజయనగర మను నామమున విరాజిలు పుణ్యస్థలము. ఇక్కడనే ఋశ్యమూకము, మాల్యవంతము, మొదలగు పర్వతములు గలవు. తుంగభద్రానది రామాయణములో వర్ణింపబడిన అంజనపర్వతము, మాల్యవంతము, మతంగపర్వతము, ఋష్యమూకము అను పర్వతముల నంటుకొని ప్రవహించుచున్నది. పంపకే కన్నడభాషలో హంప యను నామము కల్గినది. విరూపాక్ష మహేశ్వరుని దేవాలయముండుటచే ఈ క్షేత్రమునకు హంపీ విరూపాక్షమని పేరువచ్చినది. ఈ దేవాలయమున కెదురుగా మాతంగపర్వతమున్నది. ఋశ్యమూకపర్వతము నైజాము రాష్ట్రములో తుంగభద్రా ప్రవంతి కుత్తరమున నున్నది. ఈ కిష్కింధానగరస్థలముననే శ్రీ హరిహర బుక్కరాయలు, మాధవ విద్యారణ్యులు విద్యానగరమును నిర్మించిరి. ఈ చరిత్రాంశమునుగూర్చి హైందవచరిత్ర పరిశోధకులును, పాశ్చాత్య చరిత్ర పరిశోధకులు నేకగ్రీవముగా నంగీకరించిరి. *

శ్రీరామలక్ష్మణులు వానరబలముతో లంకకు ప్రయాణమై మార్గమధ్యమున సహ్యమలయాచలముల గడచి, మహేంద్రపర్వతము నెక్కి సముద్రతీరమును జేరిరి. ఈమార్గము పటములో నిరూపించితిని. తూర్పుతీరమునమున్న పర్వతపంక్తులకు మహేంద్రపర్వతములని పేరు. వీనినే యిప్పుడు తూర్పుకనుమలని (*Eastern Ghats*) పిలుచుచున్నారు. ఈ పర్వతము లుత్తరమున ఓఢ్రదేశములోని మహేంద్రపర్వతము మొదలుకొని, దక్షిణమున మధురజిల్లాలోని పర్వత పంక్తులవఱకును వ్యాపించియున్నవి.

శ్రీరామభద్రుని దక్షిణారణ్యమార్గము ప్రక్కనున్న పటములో జూపింపబడినది.

## మహాభారతము - ఆంధ్రులు

మహాభారతములో సభాపర్వములో సభాక్రియాపర్వణాధ్యాయములలోను, సహదేవకృత దక్షిణ దిగ్విజయసందర్భమునను, అశ్వమేధపర్వములో పాండవమధ్యముని దిగ్విజయ అధ్యాయానుసారము నందును ఆంధ్రుల ప్రశంసగలదు.

"జటాసురో మద్రకానాంచ రాజా కుంతిః
పుళిందశ్చ కిరాత రాజః
తథాంగవంగౌ సహపుండ్రకేణ
పాండ్యోడ్ర రాజౌ చ సహాంధ్రకేణ॥
అంగో వంగస్సుమిత్రశ్చ శైబ్యశ్చామిత్రకర్శనః
కిరాతరాజ స్సుమనో యవనాధిపతి స్తథా॥
చాణూరో దేవరాతశ్చ భోజో భీమరథశ్చ యః
శ్రుతాయుశ్చ కాళింగో జయత్సేనశ్చ మాగధః
సభాపర్వము - సభాక్రియాపర్వణము.
"మాత్రైరేవ స చ్చక్రే కరంసైనా సదాపయత్
పాండ్యాంశ్చ ద్రవిడాంశ్చైవ సహితాం శ్చోడ్రకేరళైః॥
ఆంధ్రాంస్తాలవనాంశ్చైవ కళింగానుష్ట్రకర్ణికాన్
ఆటవీంచ పురీం రమ్యాం యవనానాం పురం తథా॥
సభాపర్వము - సహదేవకృత దక్షిణ దిగ్విజయము.

---

* (1) Bellary Gazet teer- Page 260.

"If legendary history and local troadition be credited there was a town at the site many centuries before the Kings of Vizianagar selected for its Capital. Some of the most dramatic scences in the great epic of Ramayana occured at a place called in the poem 'Kiskindha' and it is asserted by the local Brahmins and generally acknowledged by the learnedin such matters that the Kiskindha is close to Hampi."

(2) Rice. Mysore Gazetter. Vol I Page 277.

(3) Wicks History of Mysore. Vol I Chap I Page 9.

(4) Bombay Gazetter. Vol I Part II Page 142.

(5) కాని పండిత సింహులు, విమర్శకాగ్రగణ్యులు నగు శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిలుగారు "కాని విజయనగరము రామాయణ కాలమునఁ గిష్కింధ యను స్థలమునఁ గట్టఁబడినదను నిరాధారవిషయమును నిస్సందేహముగాఁ జెప్పుట సాహసమని తోఁచుచున్నది" అని శ్రీ లక్ష్మణరావుగారు 'మహమ్మదీయ మహాయుగము' పుట 299 లో విజయనగరము కిష్కింధ యను స్థలమునఁ గట్టఁబడెనని వ్రాసిన విషయమును ఖండించిరి. శ్రీ శాస్త్రిగారు వారి వాదమున కాధారము జూపలేదు.




రామాయణ కాలంలో
దక్షిణాపథం




భారత కాలంలో
దక్షిణాపథం

"పౌండ్రకో వాసుదేవశ్చ వంగః కాళింగక స్తథా
ద్రావిడాస్సింహళశ్చైవ రాజా కాశ్మీరక స్తథా॥
"ఆకర్షం కుంతలశ్చైవ మాళవాశ్చాంధ్రకా స్తథా
కుంతిభోజో మహాతేజః పార్థివో గారవాహనః
సభాపర్వము - నిమంత్రిత రాజానుగమనము.

ఆంధ్రమహాభారతమునుండి, పై భాగముల నాంధ్రీకరించిన పద్యముల నిచ్చుచున్నాను.

క॥ తాళవన పాండ్యకేరళ
కాళింగ ద్రవిడ యవన కరహాటకభూ
పాలకుల నోడిచి దక్షిణ
వేలావనభూములందు విడిసె కడంకన్. ప. 263

వ॥ మఱియు సహదేవానుశాసనంబున బుత్త్రమిత్త్రభ్రాతృ సమేతులై విరాట ద్రుపద శిశుపాల గాంధార రాజులును, ప్రాగ్జ్యోతిషంబున భగదత్తుండును, శకసాల్వ బృహద్బలదేవ ప్రద్యుమ్న కూరసేనాది యదువృష్ణి భోజాంధకవరులును, వంగవంగ కళింగ కాశ్మీర కాంభోజ గౌడాంధ్ర సింహళ కేరళ కుంతల ద్రవిడ మరు యవనిపకులును......వచ్చి......284.
సభాపర్వము - ప్రథమాశ్వాసము.

వ॥ కురుకుమారోలూక కేకయ కాశ్మీర కాంభోజ గాంధార మద్ర ద్రవిడ మగధ మాళవ కళింగాంగవంగ బంగాళ గౌడాంధ్ర కేరళ కోసలాది మహీపతులును......113.
సభాపర్వము - ద్వితీయాశ్వాసము.

వ॥ అ శ్లోకలక్ష్యనందనుం దనవశంబు సేసికొని ధనంజయుండు హయంబు ననుగమించె నదిమరలి మఱియును దక్షిణాభిముఖం బయి చని తిరుగఁ పౌండ్రాంధ్ర ద్రవిళ కేరళ కర్ణాటదేశాధీసుల నవాయాసంబున వశగతులం గావించికొనియె...113.
అశ్వమేధపర్వము - చతుర్థాశ్వాసము.

ఆదిపర్వములో వర్ణన తీర్థ యాత్రా సందర్భమునగాని, భీష్మపర్వములో భారతీయ నద్యాదినామ కథనములోగాని, ఆంధ్రుల ప్రశంస మూలములో లేదు. నన్నయభట్టు ఆదిపర్వములో వర్ణన తీర్థాభిగమనములో వేంగీదేశమును వర్ణించెను. ఈ వర్ణన తన ప్రభువైన రాజరాజును ప్రశంసించుటకే గాని, మఱియొకటిగాదు. భారతీయ నద్యాదినామకథనములో, మూలమందాంధ్రుల ప్రశంస లేకపోయినను, సోమయాజి భాషాంతరీకరణములో నాంధ్ర జనపదమును మిగిలిన జనపదములతో జరిపూర్చెను.

"ఔండ్రాః పౌండ్రాస్సైసికాః పార్వతీయాశ్చమారిష
అథాపరే జనపదా దక్షిణా భరతర్షభ
ద్రావిడాః కేరళాః ప్రాచ్యా మూషికా వనవాసికాః
కర్ణాటకా మహిషకా వికల్ప్యా మూషక స్తథాః
ఝిల్లికా కుంతలాశ్చైవ సౌహృదావల కావనాః
కాకుద్రకా స్తథా చోళాః కొంకణాః మాళవానకాః॥
భీష్మపర్వము - తొమ్మిదవ అధ్యాయము.

వ॥ పాంచాల పాండ్య బర్బర కర్ణప్రావర్ణ మగధ మాళవ కళింగ కుకుర కొంకణ టెంకణ త్రిగర్త సాముద్రి పార్శ్వకూరసేన సుదేష్ణ సుహ్మకురు కరూశకాశ కోసలయవనయుగంధ రాంధ్ర సింధుచేది చోళ పుళింద పుండ్రక పాండ్యాభీర సౌవీరసౌరాష్ట్ర మహారాష్ట్ర విదేహ విదర్భ ద్రవిడ దశార్ణ కర్ణాటక గౌళాంగవంగ మరాటలాట బాహ్లికబహుదానకిరాత కేకయాశ్మంతక కాశ్మీర గాంధార కాంభోజ కేరళ మాళవ నేపాళ ఘూర్జర కుంతలావంతి కోనాపాది జనపదంబులును...
భీష్మపర్వము - ప్రథమాశ్వాసము 40.

## ఆంధ్రులు కౌరవసైన్యమును జేరి పాండవులతో యుద్ధమొనర్చుట

మహాభారతమును జదివినచో ఆంధ్రులు యాదవ పాండవ విరోధులై, కౌరవపక్షమును జేరి నిహతులైనట్లు తెలియవగును. దాక్షిణాత్య జనపదవాసులలో, ఆంధ్ర, కేరళ, టెంకణ, కర్ణాట, కోసలులు, కాళింగులు, కుంతలవిదర్భదేశజులు, కౌరవపక్షమువను, చోళ పాండ్యరాజులు పాండవపక్షమునను బోరాడిరి.

భీష్మపర్వము - ద్వితీయాశ్వాసము ప. 21, 27, 59, 60, 67, 96, 98, 295.

ద్రోణపర్వము - ప్రథమాశ్వాసము ప. 220, 222, 313.
ద్వితీయాశ్వాసము ప. 64.

కర్ణపర్వము ద్వితీయాశ్వాసములోనీ క్రింది వచనము నను సరించి, పుళింద బాహ్లిక, టెంకణ, ఆంధ్ర భోజానీకము కర్ణుని వాహినీ ని వహమునందుండి పాండవులతో యుద్ధమొనర్చినట్లును, పాండ్యరాజైన మలయధ్వజునితో బోరాడినట్లును, ఆ సంకులసమరములో మలయధ్వజు డశ్వత్థామచేత జచ్చినట్లును వర్ణింపబడినది.

"సకళక్షత్రసాప తూణీరానశ్వారోహాన్ హయానపి
పుళిందఖస బాహ్లిక నిషాదాన్ధ్ర కుంతలాన్
దాక్షిణాత్యాంశ్చ భోజాంశ్చశూరాన్ సంగ్రామకర్కశాన్
విశస్త్ర కవచా బాణైః కృత్వా సైవా కరోద్వ్యసూన్.
మహాభారతము-కర్ణపర్వము-పాండ్యవధ.

వ॥ అటమున్న గొనవుల్ల మొనయును గద్దని మొగ్గరంబును రెండు ముఖంబులం జెవంగుచుండి కయ్యంపు టుచితత్వంబునం గలసె నట్టియెడ రారాజు పురికొల్ప రాధేయునకుఁ బ్రాపయి పుళింద బాహ్లిక టెంకణాంధ్ర భోజానీకంబు గలిసినం గాంగేయ బలంబునకు భరంబగుటయు—
మహాభారతము - కర్ణపర్వము - ద్వితీయాశ్వాసము వ. 317.

## ఆంధ్రులు - యాదవులు

శ్రీకృష్ణుడు చాణూరాంధ్ర నిషూదనుడని హరివంశ భాగవత పురాణములందు జెప్పబడినది. మహాభారత అనుశాసన పర్వాంతర్గత శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రమునందు, శ్రీ విష్ణుమూర్తికి చాణూరాంధ్ర నిషూదను డనునామము సహస్రనామ సంకీర్తనములలో నొకటి.

"సులభ స్సువ్రతస్సిద్ధ శ్శత్రుజిచ్ఛత్రుతాపనః।
న్యగ్రోధోదుంబరోఽశ్వత్థ శ్చాణూరాంధ్ర నిషూదనః॥

శ్రీ కృష్ణుడు పాండవ పక్షపాతి గనుక, ఆంధ్రులు పాండవ వ్యతిరేకులై కౌరవపక్షమున చేరియుండవచ్చు.

మహాభారతములో వర్ణింపబడిన దక్షిణదేశానుక్రమణిక ననుసరించి, ప్రక్కను సూచించిన పటము వ్రాయబడినది. ఈ పటములో సహదేవుని దక్షిణ దిగ్విజయయాత్రయు, కౌరవ, పాండవ పక్ష దేశములును సూచింపబడినవి. మహాభారత రచనాకాలము క్రీ. శ. పూర్వము ఐదవ శతాబ్దమునియు, ఆ తర్వాత మూడవ, ప్రథమ శతాబ్దములమధ్య క్రమక్రమముగా ఆదిగ్రంథమును పెంపొందించి, యా శతాబ్దములనాటి దేశకాలపరిస్థితుల ననుసరించి, పెక్కు శ్లోకములు పలువురిచే సంకలితమయ్యెననియు, ఆ శతాబ్దములనాటి దేశములే ముఖ్యముగ సందర్భానుసారము వర్ణింపబడెననియు, చరిత్ర పరిశోధకుల యభిప్రాయము. అట్లే క్రీ. శ. పూర్వము ఆరవ శతాబ్దమున వాల్మీకము వ్రాయబడియుండెననియు, దానిలోని దక్షిణదేశములోని ఆంధ్ర, పాండ్యదేశాదివర్ణనలు ప్రక్షిప్తములనియు చరిత్రకారుల నిశ్చితాభిప్రాయము. మహాభారత యుద్ధకాలమున దాక్షిణాత్య దేశములైన ఆంధ్ర, కర్ణాటక, కుంతలాది దేశములుగాని, ఆ దేశజాలుగాని యుండిరా యనువిషయము సందేహమని, ఆ కాలమునగూడ దక్షిణాపథమంతయు నిర్జనారణ్యముగ నుండెనని పలువురి పండితుల యభిప్రాయము. *

అయినను, ఆంధ్ర చరిత్రకు, మన పురాతన గ్రంథములయిన రామాయణ మహాభారత గ్రంథములలో, దానినిగూర్చిన యంశములనుగూర్చి చేర్చుకొనుట మన కర్తవ్యమని, మహాభారతమునుండి పై యంశముల గ్రోడీకరించితిని.

* నన్న యభట్టారక చరిత్రము, పుట 36, 37. ఆంధ్ర చరిత్రకారు డీవాదము నంగీకరింపడు.

# బృందావనము

★

శ్రీ ఎక్కిరాల రామకృష్ణాచార్య

అచ్చటి భానూదయమ్ము వినూత్నమ్ము
యమునలో మణికాంతు లుమియుచుండు
అచటి పచ్చిక బీళ్ల యందమ్ములే వేరు
లేడిపిల్లలు దూకులాడుచుండు
అట నీటిపడియల యమలత్వ మొకతీరు
హంసల పిల్ల లీదాడుచుండు
ఆ పొందు పట్టుల యడవి చిక్కన వింత
కొమ్మ తావుల కగ్గికొనలు దేరు
కొండలా పొందు పట్టుల నుండు ప్రజకు
గాలివానల కడ్డుగఁ గాపునిలచు
లూనబర్హిస్సు ఋషి చిన్నెలూని యచటఁ
బావనత నిల్పు పరిసర ప్రాంతములకు.

తీయని యామునాంబువులు తీయవు నెండలనైన; నెన్నడున్
బాయవు శాద్వలంబులను బచ్చని చాయలఁ దారువృక్షః లో
ఛాయ నొసంగు సధ్వగుల సంతతికెన్నఁడుఁ దాళవృక్షముల్
పాయని గోపురంబులటు బారులు తీరుచుఁ జుట్టుపట్టులన్

చెఱువుల నిండఁ గల్వలును జెల్వగు తామరపూలు; నీరముల్
బుఱదలుగావు! వెన్నెలలు పోసిరి యన్నటు లుండు; నెల్లెడం
బఱువిడుచుండు మానవుల బారునఁ గొంగలు చెట్టునుండి తుం
పుఱులు విదిర్చుచున్ ముఱిసిపోవును జెట్టుననుండి చెట్టుకున్.

ఒక లేడి చూచి తా నున్న లేళ్లను బిల్చు
లూనాగ్ర బర్హిస్సు లున్నయెడకు
ఒక పిట్ట చూచి తానున్న పిట్టలఁ దెచ్చు
ఫల పుష్ప సంపత్తి వఱలు కడకు
ఒక యావు చూచి తానున్న యావులఁ బిల్చు
శాద్వల శ్యామల స్థలుల కడకు
ఒక గోపబాలకుఁ డున్న బాలురఁ బిల్చుఁ
దెచ్చిన ఫలములు తినుట కొఱకు
అచటి మందానిలమ్ములయందుఁ గూడ
గుంపులైవచ్చి విహరించు గుణమె కలదు

అచట నమితిభావమె యెల్లయుండుఁ దోచు
నందు కానరా దెందు నేకాంత తుష్టి.

ఎంతో విశాలమై పరిమళించెడుఁ దోటల దొడ్లనొప్పు చే
మంతులు బంతిపూలు గిరిమల్లెలు మల్లెలు సన్నజాజులున్
దొంతరమల్లె సంపెఁగలు తుందిరిపూవులు పొన్నపూవులున్
వంతులు తిర్చి కుల్కు దిగివచ్చిన యచ్చరలేమలన్నటుల్.

యమునకుల్యల పాయల నానియున్న
చోటులందున నల్దిక్కులఁ జూపు మ్రింగ
రాని దూరము పైరులు రంగు దిరుగు
కంకులం గన్న చెదరంగఁ గానుపించు.

నెమ్మికొనినట్టి నదిదాపుఁ జెమ్మలురియు
చల్లనౌ చేవడుల నిండఁ గొల్లలైన
ఫలభర ద్రుమజములఁ బండి పగులు పండ్లఁ
దీగలై సాగుఁ గ్రీయూట తేటవారి
ధేనుగణ మచ్చట న్గామధేను గణము
వృక్షతతి యచ్చట స్గల్పవృక్ష వితతి
ధాత్రి యెల్లను నట భూతధాత్రినైన
యదితి యననొప్పు దేవతలచటి ప్రజలు.

ఎందేని రుచిచూడ నెఱుగు యామున నీల
మమల నిర్ఝర నిస్స్రుతాంబు సమితి
నెందేని విహగాళి యొసఁగు శ్రుతుల్ విన
నేఁటట విహగంబు లేగుదెంచు
మొదవులు నెందేని మొదవుల కడనేర్పఁ
గొనలు త్రుంపిన దర్భకోఱకు నిష్ఠ
మృగశాబములు వచ్చి యొసఁగి మానవులలో
నిర్భీతిఁ దిరుగ నెందేని నేర్పు
నచటఁ గనుచూపు మేరలో నార్యులైన
బ్రహ్మఋషులుండు నుటజముల్ బఱగి యుండుఁ
బొనఁగి ముప్పూట నచ్చట పుణ్యహోమ
ధూమములు గోకులమువైపుఁ దూగుచుండు.

---

# అభిమానాలు

★

శ్రీ కాళీపట్నం రామారావు

సాయంత్రం ఆఫీసునుంచి వచ్చిన భాస్కరం బట్టలు మార్చుకుని కాఫీ కూడా ముగించి తీరా షైర్ బయలుదేరే సమయానికి "అన్నట్టు ఒక్క నిముషం ఉండండి" అంటూ వంటయింటిలోనుండి అడ్డగా వేసింది రాఘవి.

వీధి తలుపు తెరచిన భాస్కరం అట్లాగే ఆగిపోయాడు.

అప్పటి అలవాటు ప్రకారం కాకుండానే రాఘవి ఒక పాత కవరుతో చేతులు తుడుచుకుంటూ ప్రవేశించి కవరు తలుపు మీదకు గిరవాటేస్తూ "అది చదవకుండానే ఎక్కడనుండి వచ్చిందో పోల్చుకోవాలి!" అని పుస్తకాల అలమర వంక నడిచింది.

భాస్కరం వెనుదిరిగి రెండడుగులు వేస్తూ భార్య చేతిలోని ఉత్తరం అందుకోబోయాడు.

రాఘవి నవ్వుతూ "కాదు! దూరంనుంచే చూసి పోల్చుకోవటానికి ప్రయత్నించాలి!" అంటూ కార్డు ఎడంగా లాక్కుంది.

కాని భాస్కరం ఉత్సాహం కూడా మరీ క్షీణ స్థితిలో ఉండటంవల్ల అతను వేడుకగా ఓటమినే అంగీకరించి ఊరుకున్నాడు. రాఘవి కూడా మాటల్లో సంపూర్ణ పరిచితిని భాస్కరం హృదయ స్థితిని ఒక్క చూపుతో గ్రహించటం చేయగలిగి ఉన్నది. అందుచేత ఆమె కూడా స్త్రీ సహజమైన మూర్ఖత్వానికి పోకుండా సరసమంతటితో ఆపి కార్డు అందిచ్చింది.

భాస్కరం ఉత్తరం చేత పడగానే ముందు దస్తూరీ గుర్తించటానికి ప్రయత్నించాడు. కాని అతడా దస్తూరీ చూడటం అదే మొదటిసారి! ఎవరో అక్షర మాత్రాభ్యాసకుడు వ్రాసినట్లుంది. పిదప సంతకం కోసం వెతికాడు.

'వ్యా. దళపతి'

భాస్కరం గుండె ముందు గతుక్కుమంది. కాని వెంటనే — రాఘవి ఆ ఉత్తరాన్ని హాస్యమాడుతూ అందివ్వటం జ్ఞాపకం వచ్చింది. అందుచేత సులభంగానే ధైర్యాన్ని నిలవ త్రొక్కుకొని మెల్లిగా చదవసాగాడు.

భాస్కరానికా ఉత్తరం చాలా తమాషాగా అగపడ్డది. మళ్లీ చదివాడు. కొటేషా స్థలం పరాశ్రయంగా ఉన్నాయి. తరువాత ఇట్లా ఉంది.

'మహారాజ శ్రీ వ్యా. భాస్కరం చిన్నాన్నగారికి ఇట్లు తమ కుమారుడు దళపతిరావు అనేక నమస్కారములు చేసి చేయగల విన్నపములు.

చిన్నాన్నగారూ! నేను క్షేమం. మన ఊరిలో మహారాజశ్రీ నాన్నగారూ మహాలక్ష్మీ సమానురాలైన అమ్మగారూ చిరంజీవి సౌభాగ్యవతి చెల్లెళ్లూ అంతా క్షేమం. అక్కడ మహారాజశ్రీ మీరూ మహాలక్ష్మీ సమానురాలైన పినతల్లిగారూ చిరంజీవి సౌభాగ్యవతి చిన్న చెల్లెలూ అందరూ క్షేమం అనుకుంటున్నాను. ఇంతే సంగతులు. వ్రాయువాడను — వ్యా. దళపతి రెండవ ఫారం 'బి' మునిసిపల్ హైస్కూలు శ్రీకాకుళం.

చిత్తగించవలెను,

వ్యా. దళపతి.

ఉత్తరంలో అడ్రసు మాత్రం ఇంగ్లీషులో ఉంది. చాలా కొట్టివేతలూ కొద్ది గుడుపులూ పెట్టినా ఇంకా అక్కడక్కడ అక్షరాల తప్పులు మిగిలేపోయాయి.

భాస్కరం రెండవసారి కూడా ఉత్తరం పూర్తిగా చదివాక ఒకసారి క్రిందా మీదా తిరగవేసి దానిని ఎదురుగా ఉన్న రాఘవి చేతిలో పెట్టాడు. ఆమె ముఖంలో కుతూహలం స్పష్టంగా వ్యక్తీకరమౌతోంది. అయినా భాస్కరం పెదవైనా కదపకుండా బయటకు పోయాడు.

రాఘవికి ఒక విధంగా కోపమే వచ్చింది. ఆమె చేతిలో ఉత్తరాన్ని చట్న అల్మైరాలోకి విసరివేసి వంటయింట్లోకి పోయింది.

## 2

భాస్కరం ఆనాడు ఎనిమిదైనా ఇల్లు చేరుకోలేదు. అసలే కోపంగా ఉన్న రాఘవికి ఇది మరీ కోపకారణమయ్యింది. ఆ నాడు చిట్టి కూడా చాలా వేగంగానే నిద్రపోవటం పొరుగింటి పిల్లలైనా కాలక్షేపానికి లేకుండా ఆ నాడే సినిమాకు పోవటం — కూడా రాఘవి పెరిగే కోపానికి దోహదకారణాలే అయ్యాయి.

కాని తీరా భాస్కరం ఇంటికి వచ్చే సరికి — అంతకన్నా అతని ముఖం చూచేసరికి రాఘవి కోపమల్లా అతి విచిత్రంగా హరించుకపోయింది.

అసలా దినం ఆఫీసునుండి వచ్చేసరికే భాస్కరం మనసు బాగులేనట్లుంది. అప్పటప్పటా అతడికలా ఉండటం సహజం కూడా. అయితే అట్టి దినాలలో షైర్ నుంచి తిరిగి వచ్చేసరికి ఎప్పటి మనిషిగా తేరుకునేవాడు. కాని ఇవాళ అప్పుడు కూడా అతడు ముఖం గంటు పెట్టుకునే వచ్చేసరికి — రాఘవి ఆలోచనలో పడ్డది.

వడ్డన వేళ భోజన సమయంలోనూ కూడా ఇరువురూ మౌనంగానే ఉన్నారు. చివరకు తన భోజనం ముగిసే ముందు భాస్కరం తల ఎత్తి అన్నాడు.

"ఆ ఉత్తరాన్ని గూర్చి నీ అభిప్రాయమేమిటి?"

రాఘవి వెంటనే ఏ ప్రత్యుత్తరమూ ఈయలేదు. భాస్కరం అస్వస్థ చిత్తానికి కారణాన్ని గూర్చి వెతుకుతూ ఆ సాయంకాలం వచ్చిన ఉత్తరాన్ని గూర్చి కూడా ఆమె పరామర్శించుకొన్నది. కాని అది కారణం కావడానికి అవకాశమున్నట్టు ఆమెకెక్కడా స్ఫురించలేదు. అట్టిది ఇప్పుడు భాస్కరం ఆకస్మాత్తుగా యిట్లా ప్రశ్నించేసరికి రాఘవి కొంత విచలిత అయ్యింది. అయినా ఆమె అప్పటికి కూడా అది ఎట్లా కారణం కాగలదో ఊహించలేక పోయింది. అందుచేతే అన్నది.

"నేనేమీ అనుకోలేదు. బహుశ క్రొత్తగా ఉత్తరం వ్రాయటం నేర్చుకొని ఉంటాడనుకొన్నాను......"

అయితే యిలా అంటూనే ఆమె అర్థోక్తిలో ఆగిపోయింది. ఆ క్షణాన ఆమెకు స్ఫురించిన విషయమే ఆమె గొంతును మూసివేసింది.

అన్యోన్యం అభిమానాలు ప్రేమలు కలిగి—ఏ విధాన చూచినా చింత లేకుండా సుఖ జీవనం చేయడానికి సర్వావకాశాలూ గల ఆ దంపతుల నడుమ ఒకే ఒక విషయం ఉంది—అది తీయని రాగంలో అపశ్రుతిలా తెల్లని వస్త్రాలపై నల్లని మరకలా అమృతహృదయుని చరితలో అపవాదులా—ఉండీ ఉడిగీ ఆ దంపతుల హృదయాలను కలస్తూ ఉంటుంది. ఇప్పుడు కూడా రాఘవికి స్ఫురించిన విషయం ఆ గుప్త విషయాన్నే ఆమె దృష్టిలోకి తీసుకవచ్చింది. తోడనే ఆమె మూగవోయింది.

భాస్కరానికి రాఘవి స్వభావం తెలుసు. రాఘవి అర్థోక్తిలో అట్లా ఆగిపోగానే అతడామె పరిస్థితిని ఆకట్టుకొన్నాడు. అంతటితో మరి పెదవి కదుపలేదు.

భర్త భోజనం పూర్తిచేసి లోనికి వెళ్లిన పిదప రాఘవికూడా భోజనం ముగించింది. మరి ఒక అరగంటలో వంట యింటి చక్కబాట్లూ తలుపులు తాళాలు వేసుకోవటం, బట్టలు మార్చుకోవటం అయిందనిపించుకొని పడకటింట్లోకి పోయింది.

భాస్కరం పేపరైనా చూచినట్లు లేదు. అట్లా వెల్లకిల పండుకొని ఉన్నాడు.

రాఘవి గోడ చేరువనున్న తన మంచం వాల్చుకొని ప్రక్కనే వేసి ఉయ్యాలలోనున్న చిట్టినిలేపి పాలీయ సాగింది. చిట్టి బద్ధకంగా ఒళ్లు విరుచుకొని పాలు త్రాగ సాగింది.

వాతావరణమంతా బహు నిశ్శబ్దంగా ఉన్నది. ఇంటి ఉనికి ఊరికి ఒక చివర వీధిలో అవటంవల్ల సాయంత్రం ఏడూ ఏడున్నరకే అక్కడ ఊరు మాటు మణిగినట్లుంటుంది. గదిలో హరికేన్ లాంతరు దీపశిఖ స్పష్టాస్పష్టప్రహృదయ స్పందనంవలె దీక్షగా గమనిస్తేగాని తెలియరాని రీతిని కొట్టకొట్ట ఎగురుతూ నిర్విరామంగా వెలుతురులు విరజిమ్ముతోంది. చిట్టి పాలు త్రాగేటప్పటి గుక గుక శబ్దాలూ చిట్టి కదలికలూ చిన్ని నిట్టూర్పులూ తప్ప అంత వాతావరణంలోనూ కొంచెమైనా చలనం లేదు.

చిట్టి చివరకు ఎప్పుడు నిద్రపోయిందో పాలు త్రాగుతూ త్రాగుతూనే నిద్రపోయింది. రాఘవి ఆ పిల్లను పదిలంగా పట్టుక పోయి మంచంపై పరుండబెట్టి తలుపులు గడియలు వేసింది. పిదప తన మంచ వంక పోయే ముందు క్షణకాలం సందేహంలో పడింది. తరువాత నెమ్మదిగా భాస్కరం మంచాన్ని సమీపించి వారగా కూర్చుంది.

భాస్కరం కదలనైనా లేదు. మోచేతితో రెండు కండ్లూ కప్పుకొని అట్లానే నిశ్చలంగా ఉన్నాడు.

రాఘవి కొంతసేపు అతడి ముఖంలోకి చూసేసరికి ఆకస్మికంగా ఆమెకొక అనుమానం కలిగింది. కొంతసేపు ముందు వెనుకలు ఊగులాడి చివరకు చేతిని కదుపటానికి ప్రయత్నించింది. భాస్కరం చేతిని కదుపనీయలేదు.

రాఘవి మరి కొంతసేపు అట్లానే కూర్చొని పిదప పోయి తన ప్రక్కపై పండుకొన్నది. ఆమెకు చాలా సేపటివరకూ నిద్ర రాలేదు. ఆమె భాస్కరంవంక చూస్తూ గడిపిన ఆ అంతకాలంలోనూ అతడు ఒక్కసారిమాత్రం కదిలాడు. ఆ కదలికతో వెల్లకిల పరున్నవాడు మంచం చేరువనున్న గోడ కభిముఖుడయ్యాడు.

అంతే!

తెల్లవారుజామున భాస్కరం ఆమెను నిద్రలేపి తాను ఇంటికి వెళ్లనున్నానని చెప్పాడు. రాఘవి ఎందుకని అడుగలేదు. ఎప్పుడు వస్తారనిమాత్రం అన్నది. అదికూడా అతడు వీధి మెట్లు దిగుతూ ఉంటే.

## 3

ఏకో గూఢార్థ గర్భితమేమోనని సందేహింపబడ్డ చలపతి ఉత్తరం నిజానికి వడ్లగింజలో బియ్యపుగింజ. ఈ విషయం భాస్కరం ఇంకా ఇంటివరకూ పోకుండా దారిలోనే తెలుసుకున్నాడు. అసలు శేఖరుడే స్వయంగా యీ రహస్యాన్ని వెల్లడించాడు. ఐతే అక్కడి వాడి పరిస్థితులన్నీ పరిశీలించాక భాస్కరం ఇంకొక క్రొత్తవిషయం తెలుసుకున్నాడు. చలపతి ఆ ఉత్తరం వ్రాయటంలో ప్రత్యేకార్థాన్ని దేనినీ ఉద్దేశించకపోయినా అది అర్థరహితంమాత్రం కాదు.

జరిగినసంగతి ఇదీ.

భాస్కరం మొదట తిన్నగా ఇంటికే తన ప్రయాణాన్ని ఉద్దేశించాడు. కాని తను దిగవలసే స్టేషనులో ఈ నడుమ బస్సులు సరిగా దొరకటంలేదని విన్నాక విధిగా తన ప్రయాణాన్ని శ్రీకాకుళం వరకూ పొడిగించవలసి వచ్చింది. అందు కతడు విచారించలేదు కూడా.

శ్రీకాకుళం భాస్కరానికి కేవలం క్రొత్తకాదు. అతని విద్యార్థిదశలో అధికభాగం అక్కడే గడచింది. ప్రస్తుతం తను

కటి చుట్టూ ఎక్కడ లేకపోయినా చాలామంది స్నేహితు లున్నారు. కాగా చలపతిని చూడటానికై ఎట్లాగూ అతి దక్కడకు పోవలసిఉన్నది. ఐతే వాడి ఇంటియడ్రసు ఇప్పుడు తనకు తెలియదు. భాస్కరం ఆలోచించి ముందుగా చలపతిని పది గంటలకు స్కూలువద్ద పట్టుకోవడానికీ పిదప ఒకరిద్దరు స్నేహితులను కలుసుకొని రెండుగంటలకు శ్రీకాకుళం—విజయనగరం బస్సును అందుకొని సాయంత్రానికి ఇంటికి పోవటానికీ నిర్ణ యించుకొన్నాడు. కాని ఈ నిర్ణయాన్ని ఆచరణలోకి తీసుకు రాబోయేసరికి మాత్రం ఆదిలోనే హంసపాదు పడింది.

ఏవిధాన చూచినా పదిగంటల లోపునే స్టేషనునుంచి శ్రీకా కుళం చేరుకుంటుం దనుకున్న బస్సు తీరా చేరేసరికి పదిన్నరగంట లయ్యింది. నిర్ణీతసమయం పదిగంటలే—కాని ఒక పోలీస్ ఆఫీ సరు గారి రాకకై త్రోవలో ఒకచోట బస్సు అరగంటకుపైగా నిరీక్షించవలసి రావటంచేత యీ ఆలస్యం సంభవించింది. ఏతా వాతా బస్సుదిగి చేతిలో సంచీతో కూలీలబారినుండి ఎట్లాగో తప్పించుకొని బయటపడ్డ భాస్కరం—అక్కడినుండీ కర్తవ్య నిర్ణయంకై మథనపడవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి.

అయితే నిజానికి పరిస్థితులు ఒకసారి భాస్కరాన్ని తమాషా చేసి చూశాయి. అంతేగాని నిజంగా అవి అతణ్ణి వంచించటానికి ప్రయత్నించలేదు. అందుచేతే ఇంక ఆనాటికి తన ప్రయాణం ఆపుకోవటం తప్ప గత్యంతరం లేదనుకున్న భాస్కరానికి ఒక్క తమాషా సంఘటనతో ఆకస్మికంగా పరిస్థితులన్నీ సుముఖమై ఊరుకున్నాయి. అంతేకాదు లాభదాయకంగాకూడా నడచొచ్చా.

భాస్కరం ఇట్లా బస్సుస్టేండు వరకు నిలుచొని దిక్కు తోచక తికిలి పరికిస్తున్న సమయంలోనే ఆ తమాషా సంఘటన జరిగింది. పరధ్యానంగాఉన్న భాస్కరాని కీవంకనుండి ఒకడూ ఆవంకనుండి ఒకడూగా ఇద్దరు కుర్రాళ్లు వరుసగా విరుచుకుపడ్డ రెండు తుపాకీ గుళ్లలా భాస్కరాన్ని ఇంచుమించు దూసుకుంటూ రివ్వున పరుగులు తీశారు. ఆ వైవంకనుండి వచ్చారో అతనికి తెలియదుగాని పరుగెత్తటం మాత్రం హాస్పిటల్ వంక పరుగెత్తు తున్నారు. భాస్కరం ఆదేమిటా అని అటు తిరిగిచూస్తూ ఉండ గానే ముందు పరుగెత్తుతున్న కుర్రవాడు అనతిదూరంలో ఆగి పోయాడు. వాడికి పన్నెండేళ్లుంటాయి.

వాడు గిర్రున వెనుదిరిగి తరుముకవస్తున్న వానివంక చూచి "ఆగూ!" అన్నాడు కుడిచేతి తర్జనితో నిర్దేశిస్తూ. వాడి ఎడమచేతి పుస్తకాల బొత్తి ఉన్నది. ముఖాన కొంటె నవ్వు కురుస్తోంది. అంతవరకూ కుడిచేతి బహుశః ఒక రాయి ఎడం చేత పుస్తకాలు తీసుకొని వాడివెనుక తరుముకవస్తున్న చిన్నవాడు ఆ ఆజ్ఞతో—ప్రయోగోన్ముఖంగా ఎత్తిన చేతిని కూడా దించేశాడు. అయితే మొదటివాడికన్నా వయసులో కొంత చిన్నగా, పీలగా సంస్కారహీనమైన తలకట్టుతో మాసిన గుడ్డలతో దిగజారిపోతున్న నిక్కరులోనున్న ఆ రెండవ కుర్రవాడి రూపురేఖలు చూస్తే వాడి దర్పకు ఆశ్చర్యపోవలసిన పని ఉండదు.

అయినా వాడు ఆకోడికి, మేకపోతు గాంభీర్యంగా మొద టివాడి మీదిమీదికి పోతూ అన్నాడు—

"నన్నెందుకలా అన్నావ్?"

జవాబు సిద్ధంగానే వచ్చింది—

"నువ్వలా ఉన్నావు కాబట్టి!"

రెండవవాడు ఈ జవాబు విని క్షణకాలం అలానే నిలిచి పోయాడు. వాడి ముఖంలో ఏ భావాలు ప్రకటిత మౌతున్నాయో తెలుసుకోవడానికి వాడు వెనుదిరిగి ఉండడంవల్ల భాస్కరానికి వీలయ్యింది కాదు. వాడట్లానే కొంతసేపు నిలబడి నిలబడి ఆక స్మాత్తుగా రాయి పారవేస్తూ అన్నాడు—

"ఈసారి నన్నేమనా అను!"

నిజానికి చేతగాని బెదరింపు మొదటివాడిని తప్పకుండా నవ్వించి ఉండాలి. అయినా వాడా బెదరించేవాడి ముఖంలో ఏం చూశాడో గాని దానికి జవాబివ్వలేదు. పైగా నవ్వుతూ వాడి కంఠాన్ని తన కుడిచేతితో పెనవైచి ఏదో అన్నాడు. రెండవ వాడు ఈ చర్యకు ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు.

అంతవరకు కంఠస్వరం వినే సందేహిస్తున్న భాస్కరం ఆ కుర్రవాడట్లా ముఖం ప్రక్కకు త్రిప్పుకోవటంతో సందేహం తీరిపోయింది. కాని ఆ పరిస్థితుల్లో వాడిని పలుకరించటానికి నోరు వచ్చిందికాదు. అందుచేత ముందుకు కదలిపోతున్న వారిని మెల్లి దిగా అనుసరించసాగాడు.

కొంతదూరం పోయాక చలపతి అకస్మాత్తుగా తన భుజం మీద ఉన్న జట్టుగాని చేతిని విదిలించుకుంటూ అన్నాడు.

"నేను నీకు ఏం చేశానురాయ్...నిన్ను ఎప్పుడైనా ఒక్క మాటైనా అన్నానా!...నన్ను గడిగడీకీ......ఎందుకు ఉడికి స్తావ్!"

రోషం, దుఃఖం, అవమానం దుర్బలతో ముప్పిరి గొనగా దుఃఖాధిక్యతచే పట్టుకుపోయిన గొంతులోనుండి మాటలు కొట్టుకుంటూ కొట్టుకుంటూ అన్న ఆ తీరు చూసి బహుశః ఆ స్నేహితుని నిర్దాక్షిణ్య స్వభావం కూడా కరిగిపోయినట్టుంది. వాడు కూడా జవాబివ్వ లేదు. మౌనంగా తలవంచుకు ఊరుకున్నాడు.

చలపతి ఆదే ధోరణిలో అంటున్నాడు.

"నేను.........అందరికీ అలుసే!" దుఃఖాధిక్యతచే క్రమ క్రమంగా వాడి మాట మాటకూ ఎడం హెచ్చు అవుతూ వచ్చింది. "ఉదయం...అలాగే...తెలుగు మేష్టరు కొట్టేశారు...తప్పు... చేసింది...ఒకడూ! దెబ్బలు...నాకూ!"

చలపతి ఆగిపోయాడు. స్నేహితుడు మౌనంగానే మిగిలి పోయాడు.

ఒక ఫర్లాంగు దూరం నడిచాక వాళ్లు ఒక సందులోకి మళ్లారు. ఇంతసేపూ ఎవరూ మాటాడలేదు. వాళ్ల ననుసరిస్తున్న భాస్కరం కూడా సందులోకి మళ్లాడు.

పిదప వారు ఒక ఇంట్లో ప్రవేశించారు. అట్లా ఇంట్లోకి పోయే ముందు మాత్రం చలపతి తన చొక్కా ముందుభాగంతో దుఃఖమలినమైన తన ముఖాన్ని ఒకసారి పూర్తిగా తుడుచుకున్నాడు.

భాస్కరం కూడా కొంతసేపు కాలహరణం కావించి పిదప లోనికి వెళ్ళాడు.

* * * * *

భాస్కరం చలపతితో గడిపిన కాలం ఎంతో ఎక్కువ కాదు. ఒక్క గంటన్నరే. అయితే ఆ గంటన్నరలోనే అతను ఎన్నో క్రొత్త విషయాలు తెలుసుకున్నాడు. అసలే రగులుతున్న అతని వేదనాహృదయం యీ నవవిషయ పరిజ్ఞానంతో మరీ మండిపోసాగింది.

అనుకోని ఈ ప్రయాణంలో అతను అప్రయత్నంగా తెలుసుకొన్న ఆ కొత్త విషయాలు—అతని ఎంతగా ఉద్విగ్నుణ్ణి చేశాయో చెప్పటానికి ఒక్క సంఘటన చాలు.

భాస్కరం బస్సుకు ప్రయాణమైనప్పుడు వెంట చలపతి కూడా వచ్చాడు. బస్సులో కూర్చున్న పిదప భాస్కరానికి ఆకస్మికంగా ఒక ఆలోచన కలిగింది. యుక్తాయుక్త విచక్షణ చేసే శక్తి చాలాసేపటి క్రితమే క్షీణించిపోయి ఉండటంచేత ఆలోచన కలగటమేమి అది నాగ్రహాన బయటపడటమేమి రెండూ ఒకేసారి జరిగాయి.

"ఏం రా చలపతీ! నువ్వుకూడా నాతో ఇంటికి వస్తావేమిటి?" అన్నాడు.

సందర్భశుద్ధిలేని ఈ ప్రశ్న చలపతికి ఇంచుమించు అర్థమే కాలేదు. అందుచేత వాడు ఏమనటానికీ తోచక అట్లా పినతండ్రి ముఖంలోకి చూస్తూ ఊరుకున్నాడు కాని పినతండ్రి అదే ప్రశ్నను రెట్టించి ఇంకొకరూపంలో అడిగేసరికి వాడికి అప్పుడు అర్థం అయ్యింది కాబోలు—అన్నాడు.

"మా మేష్టరుగారితో చెప్పలేదు." అన్నాడు వణుకుతూ. మేష్టరుగారంటే ప్రైవేటు మేష్టరుగారు, రూమ్ గార్డియన్ అన్నమాట. కాని భాస్కర మీ జవాబుతో అంతకన్నా ఆ జవాబిచ్చేటప్పుడి ఆ పిల్లవాడి ముఖంలో గొంతులో వ్యక్తమైన నిస్సహాయత నైరాశ్యం గమనించాక—మరీ ఉద్రిక్తుడయ్యాడు.

"చెప్పకపోతే ఏం?" అన్నాడు అతి నిర్లక్ష్యంగా! అతని కాక్షణంలో ఒకరి సంరక్షణలోనున్న కుర్రవాడు పాటించవలసిన విధులవిషయం గాని, సంరక్షణాభారం వహించిన పెద్దమనిషికి ఉండే యిబ్బందుల విషయం గాని కొస్త కూడా గుర్తున్నట్టులేదు. అతని ఆతరువాతి వాక్యాలు కూడా అవిషయాన్నే స్ఫురింపజేస్తాయి. తన సవాలుకు చలపతినుండి జవాబు రాకపోయేసరికి తానే ఆజవాబు నూహించి చెపుతూ అన్నాడు.

"కొడతాడా ఏం? ఈసారి కొట్టబోతే చెప్పు! నే చెప్తాను! అనవసరంగా కొడితే మర్యాద దక్కదను. నీకు మీనాన్న దగ్గర భయమైతే నాకు ఉత్తరం వ్రాయి. వెంటనే వచ్చి తీసుకుపోతాను!"

భాస్కరమిట్లాతను చెప్పదలచినది పూర్తి చేసి ఆపిదప సింహావలోకనం ఆరంభించాడు. సహజమే మరి! కడుపులో ఉన్న ఇముడని పదార్థమేదైతే ఉందో అదికాస్తా వాంతి చేసుకున్నాకే మనిషికి స్తిమితత్వం స్వాస్థ్యం చిక్కేది.

అయితే ఆసరికి అతను కోల్పోయిన విచక్షణాశక్తులను కొంత్త సమీకరించుకోగలిగినా జరిగినదానికి పశ్చాత్తాపపడే స్థితికి కోలుకోలేదు. అందుచేతే అతను చలపతిని తనతో తీసుకపోయే ఉద్దేశం విరమించుకున్నా ఆ సందర్భంలో చలపతికిచ్చిన అమూల్యమైన తన సలహాను గాని అద్వితీయమైన తన హామీని గాని ఉపసంహరించుకోకుండానే చలపతినీ శ్రీకాకుళాన్నీ విడిచిపెట్టి స్వగ్రామాభిముఖుడై పోసాగాడు. అయితే యీ సందర్భంలో ఇంకొక్క విషయం చెప్పుకోవాలి.

నిజానికి భాస్కరం ఇట్లా ఆవేశంలో అనాలోచితంగా మాటాడినందువల్ల ఇంకొక కుర్రవాడైతే దానిని ఎట్లా ఉపయోగించుకొనేవాడో తెలియదు. కాని చలపతి మాత్రం దానిని దుర్వినియోగం చేసుకోలేదు. అయితే ఒకనాడు అవసరం వచ్చినప్పుడు భాస్కరం ఇట్లా మాట్లాడినదే ఎంతో ఉపయోగకారి అయింది.

## 4

సాధారణంగా జీవితంలో మనుష్యుడు అనుకునేది ఒకటే జరిగేది వేరొకటే అవుతూ ఉంటుంది. ఈవిషయం భాస్కరానికి బాగానే తెలుసు. అయినా అతను ఈప్రయాణంలో క్షణక్షణం ఆశ్చర్యపోవక తప్పటంలేదు. ఆదిలో రెండేళ్ళ అనంతరం మళ్లా ఈనాడు స్వగ్రామం పోతున్న భాస్కరం తన ప్రయాణం అనేక విచిత్రసంఘటనలకు మూలకారణం అవుతుందనుకున్నాడు. ఆమాట కొంతవరకూ నిజమే అయింది. కాని అతడూహించినవిధంగా కాలేదు.

భాస్కరం ఇల్లు చేరుకునే సరికి దీపాలవేళ దాటిపోయింది. వేసుకున్న సూటూబూట్ల ప్రభావంవల్ల ఒకరిద్దరి దృష్టిలో పడ్డా అతనించు మించు గుర్తింపబడకుండానే ఇల్లు చేరుకున్నాడు. చూచినవాళ్లైనా "ఓహో చాలాకాలానికి!..." అని మాత్రమే అన్నారుగాని అతనూహించినట్టుగా అతడినేమీ దుయ్యబట్టుకోలేదు. చివరకు అన్నా వదినా కూడా భాస్కరానికి ఆశాభంగమే కలిగించారు.

బయట పిండారబోసినట్లు వెన్నెల, చీకటిగా ఉన్న వరండాలో చాప ఒకటి ప్రక్కగా పరచి లక్ష్మమ్మగారు చిన్నపిల్ల పార్వతిని జో కొడుతున్నారు. ఇంట్లో శారద ధాటిగా కుమారీశతకంలో పద్యాలు ఎగర గొడుతోంది. జానకి పేర్లు కూడబలుకుతోంది. పద్మనాభంగారు ఇంకా ఇంటికి రాలేదు. ఇట్టి సమయంలో భాస్కరం అకస్మికంగా ఆకాశంనుండి ఊడిపడ్డట్టు టాక్‌టీక్ మని బూట్లు చప్పుడు చేసుకుంటూ వచ్చి ఇంట్లో ప్రవేశించి అందరికీ చాలా ఆశ్చర్యం కలిగించాడు.

ఇట్టి ఆకస్మిక సమావేశాల అనంతరం సాధారణంగా నిన వచ్చే తొలి సందడులూ వ్యాఖ్యానాలూ అయ్యాక లక్ష్మమ్మగారు నెమ్మది నెమ్మదిగా చిట్టి రాఘవుల క్షేమ సమాచారాలూ విశాఖపట్నంలో ఉన్న భాస్కరం అత్తవారి క్షేమసమాచారాలు ఒకటొకటే ప్రశ్నలు వేస్తూ తెలుసుకొనవారంభించారు. చివరకు కొంత సేపటికి ఆమె ప్రశ్నలన్నీ పూర్తికాగా భాస్కరం తొలి ప్రశ్న వేశాడు.

"అన్నయ్య ఊరులో ఉన్నాడా వదినా?" అన్నాడు సందేహంగా.

ఉన్నాడని చెప్పగా భాస్కరం తాపీపడి బట్టలు మార్చుకోవటానికి లోనికి వెళ్లాడు.

తరువాత అచిరకాలంలోనే పద్మనాభంగారు కూడా వచ్చేశారు. ఆయన వస్తూనే ఏదో చాలా పని తొందరలో ఉన్నట్టు శారదను లైటూ కళ్లజోళ్లా మొదలైన వేవో తెమ్మని శారదకు పురమాయించారు. కాని భాస్కరం వచ్చాడని చెప్పగానే "భాస్కరమా? ఏడీ" అంటూ చివచివ ఇంట్లోకి వచ్చేశారు. భాస్కరం అప్పుడే లోనుండి బయటకువస్తున్నాడు. అతడిని చూస్తూనే అన్నగారు.

"ఏంరా ఎప్పుడొచ్చావ్" అంటూ అతడిని అనుగమించి నట్టింటనున్న మంచంమీద కూర్చున్నారు.

భాస్కరం అప్పుడే వచ్చినట్టు చెప్పగా శారదాలక్ష్మమ్మగారూ ఆ రావటం ఎంత తమాషాగా వచ్చాడో వర్ణించి చెప్పారు. శారదైతే సాభినయంగా కూడా వర్ణించింది.

తరువాత పద్మనాభంగారి వంతు కుశలప్రశ్నావళికూడా పూర్తయింది.

అక్కడనుండే సంభాషణ క్రమంగా కుంటుపడసాగింది. కొంతసేపు ఖరగ్‌పూర్‌లో ఉన్న తమ యింకొక సోదరుని కుటుంబాన్ని గూర్చి స్థితిగతులగూర్చీ వారా వదును ఒకసారి ఇంటికి వచ్చి పోయినపుడు జరిగిన సంఘటనలగూర్చీ సంభాషణ సాగింది. పిదప ఒక స్థితికి వచ్చాక ఆ సంభాషణ మరి సాగలేదు. అంతట లక్ష్మమ్మగారు జ్ఞాపకం చేయగా భోజనాలకు లేచారు.

భోజనాలవద్దకూడా మొదటల్లా మౌనంగానే గడిచింది. కాని పద్మనాభంగారు వెతికివెతికి చివరకొక మంచివిషయాన్ని బయటకు లాగారు. ఆయన కొంతకాలం ఆ విషయాన్ని గూర్చి అప్పుడే ప్రస్తావించటంలోని ఔచితినిగూర్చి సందేహించిన పిదప, ఏమనుకున్నారో మళ్లా—ప్రారంభించేరు.

"చలపతిని శ్రీకాకుళం హైస్కూలులో ప్రవేశపెట్టాను?"

ఇల్లా ప్రవేశికను విడిచి పద్మనాభంగారు కాస్తసేపు ఆగారు. కాని భాస్కరం ఎట్టిప్రశ్నా వేయలేదు. ఇంతవరకూ జరిగిన సంభాషణలో మితంగానే అయినా అతడు పాల్గొంటునే ఉన్నాడు. కాని ఈ క్రొత్తవిషయం ఎత్తుకునేసరికి అతడు మౌనం వహించాడు. ఈ విషయాన్ని గుర్తిస్తూ పద్మనాభంగారు సందేహం తీర్చుకోవటానికి కాబోలు మరొక వాక్యం విడిచి చూశారు.

"ఇప్పుడు సెకండ్ ఫారం చదువుతున్నాడు!"

కాని భాస్కరం ఈసారికూడా మాటాడకపోయేసరికి అతను ఒక నిర్ణయానికి వచ్చాడు. తరువాత ఆ విషయమై ఇంక మాట్లాడటమా మానడమా అని మథన పడిపడి చివరకు ప్రారంభించారు. ఆయన ఒకసారి భార్యవంక తలఎత్తి చూచి "ఎప్పుడే?... గత దసరాలముందు కదూ?" అంటూ ఆమె బలపరచకముందే చెప్పుకపోసాగారు "...అంతే దసరాలముందే. అగస్టు ఇరవైనాలుగవ తేదీన తీసుకవెళ్లాను. అక్కడ నారాయణగారని ఒక మునిసిపల్ స్కూలు హెడ్మాస్టరుగారు ఒకరు ఉన్నారు. వీడి ఉనికి వారియింట. గత సంవత్సరమంతా ప్రైవేటుగా తర్ఫీదు ఇవ్వటానికీ ఈ సంవత్సరం మూడవఫారంలో ప్రవేశపెట్టడానికీ పరతు. నెలకు పదిరూపాయలు కావాలన్నాడు. మంచిదే అన్నాను. ఈయేడాదే అసలు మూడవఫారంలోనే ప్రవేశపెడుదురు కాని పునాది దిట్టం ఉండదని నేనే వద్దన్నాను. రెండవఫారంలో జాయినుచేశారు. ఇప్పుడుకూడా ఆయన దగ్గరే చదువుతున్నాడు. నేను మరేమీ తగ్గించలేదు. ఒక్క భోజనమే హోటల్లో... పెట్టె బేడా ఉనికీ సర్వం వాళ్లయింట్లోనే" అంటూ క్షణమాగి మళ్లా ఒకసారి తల ఎత్తి భార్య ముఖంలోకి చూస్తూ అన్నారు. "వాడు తిన్నగా చదువుకోవాలిగాని చాలామందికి లేని సదుపాయాలన్నీ వాడి కున్నాయి. అహర్నిశలా ఎప్పుడు కావాలంటే అప్పుడు హెడ్మాస్టరుగారు సిద్ధంగానుంటారు. వంటరితనం—దిగులూ లేకుండా వాళ్ళయింట్లో వీడూ ఒక పిల్లడుగా కలిసిఉండవచ్చు. వాళ్లు వీడిచే పిన్నిగారూ మామ్మగారూ అంటూ వరసలు పెట్టి పిలిపించుకుంటారు కూడా. ఇంక ఏటువచ్చి చేస్తే పట్నం పోకిళ్ళమాట—దానికి అవకాశం లేదు. వీధిలోకి వెళ్ళాలన్నా, సినిమాకు వెళ్లాలన్నా హెడ్మాస్టరుగారి అనుజ్ఞ తీసుకోవలసిందే. ఇక్కడిలా గెంతటానికీ ఆడటానికీ అసలే వీలులేదు!" పద్మనాభంగారు ఆగిపోయారు. భాస్కరం మాటాడలేదు. ఈ విషయం భార్య గుర్తించిందో లేదో అని కాబోలు పద్మనాభంగారు ఆమె దృష్టి తనవంక తిరిగిన వేళ ఒక వ్యంగ్యహాసం చేశారు. తరువాత మరి కొంతసేపు ఊరుకొని ఇంకా తృప్తితీరనివారిలా ఆరంభించారు.

"మొన్న నీమధ్య ఏవో పరీక్షలయ్యాయి. కొన్నిట్లో బాగానే మార్కులు వచ్చాయి గాని కొన్నిట్లో సరిగా రాలేదు. నేను పెద్ద బాధ పడలేదు కూడా. ఇన్ని ఏర్పాట్లు చేశాకకూడా వాడికి మార్కులు రాకపోతే వాడి ఖర్మం. అదే అన్నాను." అంటూ మరి కొస్త విరామంతో "కాగా అదీ మంచిదేలే అల్లా అయితే తిరుకు ఫారంతో మానిపించేయవచ్చు. ఆట్టే శ్రమ ఉండదు. వాడి కరితేకాని కడి చాలు కూడా" అంటూ బయటికే ఒక వ్యంగ్యహాసం చేశారు.

భాస్కరం దీని తరువాతకూడా ఏమీ మాటాడలేదు. అతడు సావధానంగా భోజనం ముగించి లేచి అవతలకు పోయాడు. అతడు బయటకు పోయిన తరువాత లక్ష్మమ్మగారు మందలిస్తున్న ధోరణిలో అన్నారు.

"ఏమిటా మాటలు!"

కాని పద్మనాభంగారు ఈ ప్రశ్నకు కూడా తనకు అనుకూలమైన అర్థంతీసి అన్నారు. అది కూడా అనవసరంగా గొంతు పెంచుకొని—

"అవునే పెద్ద చదువు చదువుతే పట్నాలంబడి ఉద్యోగాలకు పోతారు. అప్పుడు నీ గతేం కానూ?"

ఈ మాటలపై లక్ష్మమ్మగారు పెట్టిన ముఖభంగిమ చూసి చివరకు శారదకూడా ముసిముసినవ్వులు నవ్వుకొన్నది.

భోజనమయ్యాక షికార్లకి పోయిన భాస్కరం తిరిగివచ్చేసరికి చాలా ఆలస్యమయ్యింది. అతడు వచ్చేసరికి ఒక్క లక్ష్మమ్మగారు తప్ప అంతా గాఢనిద్రలో ఉన్నారు. ఆమె కూడా మగత కళ్లతో భాస్కరానికి కావలసినవి చూచాక వెంటనే నిద్రపోయారు.

భాస్కర మానాడు కూడా ఆలస్యంగా నిద్రపోయి లేవటం మాత్రం ప్రొద్దెక్కి లేచాడు. లేచేసరికి అది కలో నిజమో తెలియదు గాని నిద్రలో ఎవరో లేపినట్టు, వెళ్లివస్తాను. నువ్వు వుంటావు కదూ అన్నట్టూ గుర్తుకు వచ్చింది. శారద నడుగుతే అది నిజమేనని గతరాత్రి తెల్లవారుజామున తండ్రి ఊరుకు వెళ్లారనీ చెప్పింది.

## 5

భాస్కరం బద్ధకంగా స్నానాదులు ముగించేసరికి దగ్గఱగా పది గంటలవేళ అయింది. నీడలు తిరిగి నిలువెత్తులకు చేరుకున్నాయి. పల్లె వీధులలో ఉదయపు జనసంచారం తగ్గి, ఉండీ ఒడిగీ పొలంనుంచి తిరిగివచ్చే ఒక రైతూ, దూరపు సంతలకు సరుకులుతీసే ఒక కావిటివాడూ, కోమటింటినుండి ఇంటికిపోయే ఒక కుటుంబినీ, కనిపిస్తున్నారు. పూరిఇండ్ల కప్పులలోనుండి నెమ్మది నెమ్మదిగా పొగలు వెలువడటం ప్రారంభమయ్యింది.

లక్ష్మమ్మగారు పెరటి వరండాలో ఒక పెద్ద కత్తిపీటా కొన్ని కొండకాయలూ కడిన్ని నీళ్లతో ఒక గిన్నె ముందేసుకుని తీరికగా కూరలు తరుగుతూ ఉంటే, భాస్కరం నెమ్మదిగా ఫలహారం చేస్తున్నాడు. అతని ఫలహారం ముగిసే వేళకు శారద వేడివేడి కాఫీగ్లాసును తొందరగా తెచ్చి అతని ముందుంచి పరికిణీ చెంగులు ఒడిలోకి లాక్కుంటూ పొదికట్టు గుమ్మాన కూర్చున్నది. భాస్కరం కాఫీ త్రాగుతూ ఉంటే శారద అన్నది.

"అయితే చిన్నాన్నా రెండేళ్ళ కోసారా రావటం!"

కూతురు ప్రశ్నకు లక్ష్మమ్మగారి ముఖాన చిరునవ్వు రేఖలంకురించాయి. ఆమె గత పది పదిహేను నిముషాల్లో యే ప్రశ్న అయితే వేయటానికై సాహసం చాలక ఊరుకున్నారో ఆ ప్రశ్నే శారద వేసింది. కాని భాస్కరం జవాబిచ్చాడు.

"రెండేళ్ళ కోసారైనా నేనే వచ్చాను కదమ్మా!"

ఆ గొంతు వినేసరికి తన నోట ఆ ప్రశ్న రాకపోవటం సుకృతమే అనుకున్నారు లక్ష్మమ్మగారు. కాని శారదకి వెనుక గ్రహించే జ్ఞానం లేదు. ఆమె తన ప్రశ్నకు సదుత్తరం వచ్చినట్టే భావించుకొని ఆతరువాత ప్రశ్న వేసింది.

"అయితే మరి పిన్నినీ చెల్లినీ తీసుక రాలేదేం?"

భాస్కరం దీనికి కూడా జవాబిచ్చాడు.

"నువ్వు పొమ్మంటావని"

ఈ మాటలంటూ అతడు శారద ముఖంలోకి చూచి నవ్వాడు కూడా. అయినా లక్ష్మమ్మగారు పొరపడలేదు.

శారద తన ధోరణిలో అన్నది

"నే నెందుకు పొమ్మంటానూ?"

భాస్కరం దీనికేమీ జవాబివ్వలేదు. అది చూచి లక్ష్మమ్మగారన్నారు. అయితే అది ఆమె ఏమీ దెబ్బకు దెబ్బగా అనలేదు. పరిస్థితిని రక్షించటానికి ఆడవాళ్లు సాధారణంగా ఉపయోగించే తిగృత్రిమాస్త్రంగా వాడారు. ఆమె అన్నారు

"నువ్వు కాకపోతే మీ నాన్న గారు."

కాని శారద వదలలే—

"మా నాన్న గారు ఎందుకు అంటారూ. ఆయనా అనరు."

ఎందుచేతో ఈసారి వదినా మరిదీ ఇద్దరూ మౌనమే వహించారు. ఈలోగా భాస్కరం ముఖం క్రమక్రమంగా రంగులు మార్చుకుంటోంది. అయితే ఆ విషయం లక్ష్మమ్మగారి దృష్టిని దాటిపోలేదు. ఇంతలో శారద ఇంకొక ప్రశ్న వేసింది.

"చిట్టిచెల్లి ఎలా ఉంటుంది చిన్నాన్నగారూ?"

భాస్కరం ఎందుచేతో ఈ ప్రశ్నకు చప్పన ఉద్విగ్నుడయ్యాడు. కాని మెల్లగా దానిని గ్రహించుకోగలిగాడు.

శారద ఇంతవరకూ పరిస్థితిని కొంచెం కూడా గ్రహించలేదు. కాని ఈ కళవళపాటులో ఆమె కూడా ఈ సంభాషణ వెనుక ఏదో అప్రియవిషయం దాగిఉందనీ అందుచేత ఇంతతో తాను నోరుమూసుకోవటం ఉత్తమమనీ గ్రహించింది. గ్రహించటమే కాదు ఆచరణలో పెట్టింది కూడా. మరికొంత సేపటిలోనే ఏదో పని కల్పించుకొని అక్కడనుండి కొద్దినిముషాలు అట్లాగే గడిచాయి—

తరువాత భాస్కరం నెమ్మదిగా అడిగాడు. అతడు వదిన గారి వంక తిరుగుతూ అన్నాడు.

"నువ్వు ఎప్పుడైనా చలపతి ఉంటున్న ఇంటికి వెళ్లావా వదినా?"

ఇది ఎంత అసంబద్ధమైన ప్రశ్నో బహుశా భాస్కరం అప్పుడు గుర్తించగలిగే స్థితిలో ఉండి ఉండడు. లేకతిన చెప్పదలచుకొన్న విషయానికి ప్రవేశికగా అంతకన్న ఈ ఉత్తమమైన ప్రశ్న తోచలేదో— కాని అది ప్రశ్న కాదు. అయినా లక్ష్మమ్మగారన్నారు.

"లేదు. ఏం?"

"ఊహూఁ. రాత్రి అన్నయ్య వాడి ఉన్న గిరి గూర్చి చేసిన బందోబస్తు విషయం జ్ఞాపకంవస్తే అడుగుతున్నాను." అతడిమాటల

ధోరణి శాంతంగానే ఉన్నా అంతకన్నా గంభీరంగా కూడా ఉన్నది. అతడడిగారు.

"పోనీ ఎట్లా ఉంటుందని వాడి నెప్పుడైనా అడిగావా?"

లక్ష్మమ్మగారికి ఏం జవాబు చెప్పాలో తెలియలేదు. నిజాని కామె ఈవిషయమై కొడుకును ఒకసారి ప్రశ్నించడం వాడు ఏదో వచ్చునచ్చుగా చెప్పి మొత్తంమీద బాగానే ఉంటుందనే అభిప్రాయం వెలిబుచ్చటం జరిగింది. కాని భాస్కరం ధోరణి ఆమెను మూగదానిని చేసింది. ఆమె కన్నార్పకుండా మరిది వంకే చూస్తూ "లేదు" అని మాత్రం అన్నారు.

భాస్కరం ఈసారి తలవంచి కొంతసేపు ఆలోచించి అన్నాడు.

"వాడిని ఈ ఉన్న పాటున ఇట్లా చదివించేకంటే చదువు మానిపించేయటం ఉత్తమం. ఈ దేశంలో నూటికిపదిమందే చదువు కున్న వాళ్లు. తక్కిన తొంభైమందీకూడా బ్రతుకుతు న్నారు. వాడుకూడా బ్రతకలేకపోడు." అంటూ క్షణమాగి "ఆయనమాట ఎట్లా ఉన్నా బహుశా నీకు నామాటమీద పూర్తిగా నమ్మకంపోయి వుండవచ్చుననుకుంటున్నాను. అందుచేతే నీకు చెపుతున్నాను. నా మాటమీద ఏమాత్రం విశ్వాసం ఉన్నా ఈ ఉన్న పరిస్థితులలో చదువుమాన్పి ఇంట్లో ఉంచటానికైనా ప్రయత్నించు. లేదా కనీసం ఆ జైలులోంచైనా వాణ్ణి తప్పించు"

భాస్కరం ఆగిపోయాడు. లక్ష్మమ్మగారు తను ఏం వింటున్నదీ తెలుసుకోలేక తెల్లబోయి చూస్తున్నారు. ఆమె గుండెలుమాత్రం దడదడ కొట్టుకోసాగాయి. భాస్కరం మళ్లా ఆరంభించాడు.

"మనుష్యులు—అందులో చిన్న పిల్లలు ఎప్పుడు ఏ అఘాయిత్యం చేస్తారో తెలుసుకోవటం కష్టం. ఇప్పటికి మా ముగ్గురు అన్నదమ్ముల బిడ్డలలోనూ వాడు ఒక్కడేమగపిల్లడు..."

భాస్కరం చప్పున నోరురాక ఆగిపోయాడు. కాని సామెత ఉండనే ఉన్నది. అందుచేత కొంతసేపు పోయాక ఇంకొక పద్ధతిని ఆరంభించాడు.

"వాని జీవితం ఎట్లా ఉంటుందో తెలుసా వదినా—జైలులో ఉండేవాడి జీవితం వెయ్యిరెట్లు నయం! ఆ మేష్టరు ఒక—అతనికి పెట్టటానికి ఒక పేరు నాకు దొరకకుండా వుంది. అటువంటి వాడాయన! లేక అతనట్టివాడు కాకపోయినా కొడుకు శ్రేయస్సుకై ఈయనగారు అతని నట్లా తయారుచేసి ఉండాలి!

ఈయనన్నట్లు నిజంగానే వాడు కనీసం సాయంత్రం వేళైనా నా జంటల వాడు వీధిలోకి పోవటానికి వీలులేదు. వాడెట్టి అస్వతంత్రుడో తెలుసా? వాడికి రోజుకి ఐదుగంటలు తప్పితే ఆరుగంటలు కన్నా నిద్రపోవటానికి హక్కులేదు. వాడు రాత్రి ఎన్నిగంటలకు పడుకోవాలో తెలుసా. పదిగంటలకు. తెల్లవారు జామున ఎన్నిగంటలకు లేవాలో తెలుసా మూడు—మూడున్నర—మహా ఐతే నాలుగు దాటటానికి వల్లకాదు. జగమంతా గాఢసుషుప్తిని మునిగేవేళ ఈ పిల్లవాడొక్కడూ లైటుముందేసు కొని భగ భగమండేకళ్ళతో అర్థం తెలియని ఆ యింగ్లీషు పాఠాలువల్లె వేస్తూ కూర్చోవాలి. నిద్రనాపలేక కునికి పాట్లు పడితే అనిద్రపోవటానికి వాడికి మందేమో తెలుసా. పేపరువెయ్ట దెబ్బలు, అంతేకాదు వాడికి సాయంత్రం ఆటకుపోదామనే దుర్బుద్ధిగాని, లేక తనవాళ్ళను తలచుకొని ఏడ్చే జబ్బుగాని పొడచూపినా—వాటికి కూడా పేపరువెయ్టే మందు. లెఖ్ఖలు బోధపడకపోయినా ఇంగ్లీషుపాఠం రాకపోయినా అదివచ్చేటట్లు చేయటానికి కూడా పేపరువెయ్టే ఉపయోగించబడుతుంది"

భాస్కరం ఇక్కడ కొంత ఆగాడు. లక్ష్మమ్మగారట్లా కొయ్యకట్టి కూర్చుని గుడ్లప్పగించి వింటున్నారు. భాస్కరం మరలా ఆరంభించాడు.

"వాడీవయసు పదకొండేండ్లు నిండాయో లేదో—వాడి నెత్తిన వేసిన భారం మాత్రం సామాన్యంకాదు. వాడిని తీసుకపోయి రెండవఫారంలో జాయిన్ చేశారు. చిలకపలుకులుగా రెండుముక్కలు పరీక్షకు కావలసినవి కంఠస్థం చేయించి మేష్టరు తన బాధ్యత వదుల్చుకున్నాడు. స్కూల్లో చెప్పే పాఠాలు అయోమయంగా ఉంటాయి. చెప్పేవి బోధపరచుకోలేపోతే విసుక్కొని అక్కడి స్కూల్లో మేష్టర్లూ కొడుతూనే ఉంటారు. మార్కులు తక్కువవస్తే యీయనేమో యిట్లా మాటాడతారు. వాడెలా ఓపిక పెట్టుకుంటాడూ?" భాస్కరం మరి కొంత విరామంతో "ఇన్ని భారాలన్నీ మోసే వయసేనా? ఈ సమస్యలన్నీ వాడంతట వాడా పరిష్కరించుకుంటాడు? దుర్భరమైన జీవితం గడుపుతూ వాడికి ఏడవటానికైనా హక్కు నీయవక్కరలేదా?. వానికి కూడా దెబ్బలే?" అని ప్రశ్నించి ఊరుకున్నాడు.

తరువాత మరికొంతసేపు మౌనంగా గడిచాక భాస్కరం అన్నాడు.

"ఈ వయసులో వాడికి వాడు సంరక్షణ చేసుకోవాలి! వాడికివాడు నీళ్లుపోసుకోవాలి! వాడి బట్టలు వాడు జాగ్రత్త పెట్టుకోవాలి! దుఃఖంవస్తే కష్టంవస్తే వాడినివాడే ఓదార్చుకోవాలి! వాడు చేసినది చిన్నతప్పైనా పెద్దతప్పైనా క్షమ అన్నదిలేదు! జాలి అసలేలేదు!" అంటూ కొంత ఆగి "—వాడెలా ఉంటాడో తెలుసా—మొన్న నేను చూచిననాడు తలకు నూనెలేదు. క్షవరం ఎన్నాళ్ళయి చేయించుకున్నాడో తెలియదు! మాసిన గుడ్డలతో, సిరామరకలతో గుండీలులేని లాల్చీతో జారిపోతున్న నిక్కరుతో ముఖాన అసహాయతా, భీతీ, అమాయకతా, తాండవిస్తుండగా ఒక వెర్రివెధవలా ఉన్నాడు." అంటూ మళ్లా ఆగిపోయాడు.

లక్ష్మమ్మగారు అట్లానే కదలక మెదలక వింటున్నారు. ఆమె ముఖం క్షణక్షణం పాలిపోతూ ఉండటం భాస్కరం గమనించలేదు. అతడు అన్యాభిముఖుడుగానే మళ్లా కొంతసేపు పోయాక ఆరంభించాడు.

"పిల్లలు చిన్నతనంలో నా అన్న వాళ్ళను విడిచిఉండవలసి వస్తే అదెట్టి దురదృష్టమో—ఆ జీవిత మెంత దుఃఖభాజనమో

ఆయనకు తెలియదు కదినా. దానికితోడు వాడికా నరకవాసం కూడా విధిస్తే ఎలా? దుఃఖభారాన్ని వాడు ఓపికగా భరిస్తే బాధ లేదు. కాని వాడి చిన్న హృదయం దానిని భరించలేక ఏ అఘాయిత్యమో చేస్తే?" భాస్కరం ఆగిపోయాడు. తరువాత కొంత సేపటివరకూ అతడు మాటాడలేకపోయాడు. చివరకు లేచిపోయే ముందు అన్నాడు,

"ఇదంతా ఎందుకో తెలుసా? నన్ను సాధించటానికి— నన్ను శిక్షించే ప్రయత్నంలో ఆ నిర్భాగ్యుడికీ నరకవాసం విధించాడు."

భాస్కరం ఇట్లా అంటూనే అక్కడనుండి విసురుగా వెళ్లిపోయాడు.

లక్ష్మమ్మగారు మాత్రం అప్పటికీ కదలలేదు. చివరివరకూ చేష్టలు దక్కి అలానే కూర్చున్నారు. భాస్కరం గమనించలేదు గాని అతడు వెళ్లేసరికి ఆమె గోడకు చేరగిలబడిపోయారు. పిదప అతడూ వెళ్లగానే ఆమె కూర్చున్న చోటనే అలానే సోలిపోయారు. కొంతసేపు పోయాక అక్కడికువచ్చిన శారద ఆమె స్థితిని చూచి ఏమమ్మా అంటూ గాభరాపడ్డది. లక్ష్మమ్మగారు సైగలతోనే నివారించి మంచినీళ్లు తెమ్మన్నారు. తేరుకున్నాక శారద ఏమమ్మా అంటే "పైత్యంగా ఉండనీ కళ్లు తిరిగాయనీ" తేల్చేశారు.

## 6

నిజానికి లక్ష్మమ్మగారికి చలపతి స్థితినిగూర్చి కొంత తెలుసు కాని వాడి పరిస్థితి ఇంత అధ్వాన్నంగా ఉన్నదని నైలి తెలియదు.

దానికి కారణం పిల్లలకు ఇవ్వవలసిన శిక్షణను గురించి ఆ ఇంట్లో పద్మనాభంగారికి ఉండే విచిత్రాభిప్రాయాలే. లక్ష్మమ్మగారి అభిప్రాయాలు భర్త అభిప్రాయాలకు ప్రతిబింబాలు.

ఆమె మాతృహృదయం ఒంటరిగా ఉన్న తన బిడ్డడి కష్టసుఖాలనుగూర్చి విచారించి తెలుసుకోవటానికి ఎప్పుడూ ఆత్రపడుతూనే ఉండేది.

కాని అందువల్ల పద్మనాభంగారు అన్నట్టు వాడికి ఇయ్యరాని చనువిచ్చి చెరిపినట్టవుతుందేమోనని ఆమె భయం. అందుకు తగ్గట్టుగానే జరిగింది కూడా.

చలపతి శ్రీకాకుళం వెళ్లిన తొలి రోజుల్లో ఆమె అక్కడివాడి పరిస్థితులను గూర్చి తెలుసుకో ప్రయత్నించారు. వాడు నచ్చు నచ్చుగా జవాబు చెపుతూ చివర శోక స్థితికి వచ్చాక అక్కుర్ల బుక్కుర్లు విడవటం ప్రారంభించాడు. లక్ష్మమ్మగారు ఎట్లాగో వాణ్ణి సముదాయించి ప్రశ్నిస్తే తను అక్కడ ఉండలేననీ ఎప్పుడూ తల్లీ మొదలైన వారు జ్ఞాపకం వస్తుంటారనీ చెప్పాడు.

లక్ష్మమ్మగారు అనేక విధాల బోధపరచి ధైర్యం అవలంబింప వలసిన ఆవశ్యకతను మరీ మరీ ఎత్తి చూపారు. కాని వాడు స్పష్టంగా నోటితో అనకపోయినా అది అసాధ్య మన్నట్టు జవాబిచ్చాడు. చివరకు కసురుకుంటే గాని వాడికి ధైర్యం కలిగించడం సాధ్యమయింది కాదు. అంతటితోనే ఆమె పిల్లలకు చను వివ్వటం మంచిది కాదనే భర్త సిద్ధాంతాన్ని పూర్తిగా అంగీకరించి ఊరుకున్నారు.

నాటినుంచీ ఆమె చలపతిని వాడి స్థితిగతులను గూర్చి ఎన్నడూ అడగలేదు. ఎప్పుడైనా వాడు స్పష్టాస్పష్టంగా సూచిస్తూ వచ్చినా "అవును గడువులో వాలే! లేకపోతే చదువు ఎలా వస్తుంది" అనేవారు. చలపతి ఏమనుకునేవాడో మరి మాటాడేవాడు కాదు.

కాని ఈనాడు భాస్కరం వాడి నిజ పరిస్థితిని వివరించేసరికి నోరు రాని తన బిడ్డడు ఎంత బడబాగ్నిని తన గర్భంలో దాచుకొని ఆనాడు అట్లా మాట్లాడాడో, ఈ సంవత్సరం తన దుఃఖభారాన్నంతా ఒంటరిగా తానే ఎట్లా మోస్తూ వచ్చాడో ఆమెకు తెలిసి వచ్చింది. ఆమె గుండె చెరువయ్యింది. కాని ఆలోచించగా భాస్కరం లేచేముందు అన్న మాటలుఆమెను మళ్లా సందేహంలో పడేశాయి.

భర్త ఒకప్పుడు ఏదో మాటలలో చెప్పారు "లోకంలో మనుష్యులు తమ అవసరాలను పట్టి గోరంతలు కొండంతలు చేస్తారు. కొండంతలు గోరంతలూ చేయవచ్చు. అంత మాత్రాన వాటి నిజస్వరూపం అదే అనుకొని భ్రమపడటం తెలివితక్కువ"

ఈ విషయం జ్ఞాపకం రాగా ఆమె ఇదమిత్థమని తేల్చుకోలేని స్థితిలో అనేక సందేహాలతో అనేక ప్రశ్నలతో బాధపడసాగారు.

## 7

మధ్యాహ్నం భోజనాలవుతూ ఉంటే తను ఆదినం ఒంటిగంటకే ప్రయాణం కానున్నట్టు ప్రకటించాడు భాస్కరం. అసలే ఆందోళిత చిత్తులై ఉన్న లక్ష్మమ్మగారు ఈ ప్రకటనతో మరీ తల్లక్రిందు లయ్యారు. ఆమె అన్నారు—

"అది కాదయ్యా మరి మీ అన్నయ్యగారు రాకుండానే ఎలా వెళిపోతావ్?" అన్నారు సందేహంగా. భాస్కరం మౌనం వహించాడు. అది ఆసరాగా ఆమె అన్నారు "ఆయన మరీ మరీ చెప్పారు కూడా—ఉంచేమని చెప్పమని"

కాని భాస్కరం అన్నాడు

"నేను రెండురోజులే సెలవు పెట్టాను, కదినా! ఇవాళతో సెలవు సరి!"

దీనిపై లక్ష్మమ్మగారు కొంత సేపు ఆగి అన్నారు. ఆమె గొంతు దీన అనునయం ధ్వనించేదిగా మారిపోయింది.

"చూడు భాస్కరం! నాకు ఆ సెలవులూ విషయాలూ అన్నీ తెలియవ్! అందుచేత నువ్వే ఆలోచించుకో. నీకు ఉండటానికి అసలే వీలులేకపోతే నే చెప్పలేను. కాని ఏమాత్రం వీలున్నా వెళ్ళకు!"

భాస్కరం ఏమీ అపార్థం చేసుకోలేదు. అయినా అతడు అవాళ వెళ్ళవలసి ఉంటుందనే చెప్పాడు. దానితో లక్ష్మమ్మ

గారు మరేమీ బలవంతం చేయలేదు. ఆమె కొంతసేపు ఏదో ఆలోచించి

"బస్సు ఎన్నిగంటలకూ ?" అన్నారు.

భాస్కరం చెప్పాడు. లక్ష్మమ్మగారు మరి కాస్త సేపు చూచి "నే నిప్పుడే వస్తాను" అంటూ శారదను వడ్డనకు పురమాయించి బయటకు వెళ్ళిపోయారు. భాస్కరానికి ఆమె చర్య ఏమీ బోధ పడలేదు. అతడి భోజన మయ్యాక ఆమె తిరిగి వస్తూ "భాస్కరం ఇంకో అరగంట టైముంటుంది కదూ!" అన్నారు. భాస్కరమా సరికే అప్పుడే బట్టలు వేసుకొని సిద్ధంగా ఉన్నాడు. అయినా ఆమె ముఖం చూసేసరికీ స్వరం వినేసరికీ ఆ తొందర ఎందుకో బోధ పడకపోయినా శ్రీకాకుళాన్ని రాత్రి రైలునూ జ్ఞాపకం తెచ్చుకొని ఉంటుందనుకున్నాడు. లక్ష్మమ్మగారు తృప్తిగా లోనికి వెళ్ళిపోయారు.

మరొక్క క్షణంలోనే శారద పరుగులు తీస్తూ ఎటో పోయింది. భాస్కరం గదిలో కూర్చుని జానకీ పార్వతులను దగ్గర కూర్చుండ బెట్టుకొని వాళ్ల ప్రశ్నలకేవో సమాధానాలిస్తున్నాడు. అట్లానే ఒక్క పావుగంట గడిచాక వీధి వరండాలోంచే శారద ఉత్సాహస్వరం వినిపించ సాగింది.

"అమ్మా! ఆ జగన్నాథం ఇంకా రాలేదే. సూరమ్మ దగ్గరేమో వంద రూ...యలున్నాయట. కావలిస్తే ఇస్తానం టోంది..." అంటూ మధ్యలో ఏమయ్యిందో యింకా చెప్పవల సిది పూర్తికాకుండానే గొంతు నొక్కకపోయిన దానిలా ఆగి పోయింది.

భాస్కరం చాలా వరకూ గ్రహించాడు. కాని అంత డబ్బును ఆమె ఆ క్షణంలో ఎందుకోసరం సంపాదింప ప్రయత్నిస్తున్నారో మాత్రం తెలియలేదు. అతడు ఆలోచించి తెలుసుకునే లోగా లక్ష్మమ్మగారే అక్కడకు వచ్చారు.

## 8

లక్ష్మమ్మగారు ఆ యింటికి కాపురానికి వచ్చి సుమారు పది హేనేండ్లు అయింది. ఆ సరికి భాస్కరం పదేండ్ల పిల్లవాడు. ఈ వదినా మరదుల వరుసనుండే స్నేహ వాత్సల్య గౌరవాలు కూడా సామాన్యమైనవి కావు. అయినా నేడుమాత్రం ఏమో ఎంతో మాటాడదామని వచ్చినా ఆ వదినగారు మరిది ముందు పెదవి కదుపలేక పోయారు. సుమారు నాలుగైదు నిముషాలు అట్లాగే మౌనంగా గడచిపోయాయి. వదినగారు పొదికట్టుకొన్నా భాస్కరం మంచంమీదా మూగగా కూర్చున్నారు.

చివరకు లక్ష్మమ్మగారే ప్రారంభించారు.

"నేనొక మాట అడుగుతాను—నువ్వు ఏమీ అనుకోవుగదా భాస్కరం!" అంటూ "నువ్వు యిప్పుడు ఇక్కడకు ఏల వచ్చినట్టూ ?" అన్నారు నెమ్మదిగా.

భాస్కరం జవాబివ్వ లేదు. అతడి ముఖం చూస్తే ఆ ప్రశ్నను ఎట్లా అర్థం చేసుకోవటమా అని తికమక పడుతున్నట్టుంది. అది గ్రహించి లక్ష్మమ్మగారన్నారు.

"అది కాదు నాయనా నువ్వు అపార్థం చేసుకోకు. నేను అనుకునేది ఏమంటే—నువ్వు మామూలుగా చూడటానికే వస్తే ఇంత తక్కువ వ్యవధితో రావు. ఒకవేళ మీ అన్నయ్యగారితో ఏమైనా మాట్లాడటానికి వచ్చావేమోనని నా ఉద్దేశం. అందుచేత అట్లా అడిగాను."

ఈ వివరణలో భాస్కరం అర్థం చేసుకున్నట్టు అగపడ్డాడు. కాని అతడనుకున్నది వేరు. అతడు తన ధోరణిలో కొత్త క్రొత్త సంకేతాలలో క్షణకాలం మునిగి తేలి చివరికన్నాడు.

"లేదు. నేను బయలుదేరే టప్పుడు ఏ ఉద్దేశ్యంతో బయలుదేరానో నాకు జ్ఞాపకంలేదు. కాని ఇప్పుడు నే నతనితో ఇంక మాటాడటానికి ఏమీ లేదు"

పాపం భాస్కరం తూచి తులమెత్తి ఏవంకా పొంగకుండా మాట్లాడాడు కాని ఈ మాటలు లక్ష్మమ్మగారికి ఆశాభంగం కలిగించటమే కాక కాస్త భయచకితను కూడా చేశాయి. అందుచేతే ఆమె క్షణకాలం వెనుక ముందు లాడి చివరికివిధంగా ప్రశ్నించి చూచారు.

"చలపతి నీకెట్లా తారస పడ్డాడూ."

భాస్కరం ఆ సరికైనా గ్రహించలేదు. ఈ ప్రశ్నకు ఒక మామూలు ప్రశ్నకు ఎట్లా జవాబిస్తారో అట్లానే అదీ బహు సంక్షిప్తంగా చెప్పాడు.

"వస్తూ త్రోవలో శ్రీకాకుళంలో దిగాను"

లక్ష్మమ్మగారు ఇంకే మనుకున్నారో ఈ జవాబుతో తమ ఉద్యమం విరమించుకున్నారు. పిదప మళ్లా ఆమె ఆలోచనలో పడవలసి వచ్చింది. ఇంక ఉన్నది ఒక్క అంశమే. కాని ఆ విషయమై ప్రస్తావించటానికి ధైర్యం కూడదీసుకో వలసి వచ్చింది. చివరకు అన్నారు.

"అయితే చిట్టిని ఎప్పుడు చూపిస్తావ్ నాకూ ?"

ఆమె ఏమో అనుకున్నారు గాని ఈ ప్రశ్నించే పద్ధతి ఆమె చెవులకు అప్రకృతిగానే వినవచ్చింది. భాస్కరం మౌనం వహించగా ఆమె అన్నారు.

"అది కాదయ్యా! యీ యేడాది సంవత్సరాదికి అక్కడకు వెళ్ళకండి. తిన్నగా ఇక్కడకు వచ్చేసేయండి. ఈసారి నా పురిటికి మా అక్కయ్య రాగలుగుతుందను కోను. నీకు దయఉండి ఒక నెల్లాళ్లు ఉంచగలుగుతే ఆ వెసెదకూడా ఒడ్డెక్కిపోతుంది. లేక వెంటనే వెళ్ళవలసి ఉన్నా బాధ లేదనుకో - నా తిప్పలు నేను పడతాను. ఊరికే నే నే చెప్పాను."

లక్ష్మమ్మగారిట్లా క్రిందపడి మీదపడి ఏదో చెప్పటం పూర్తిచేశారు. కాని భాస్కరం తన మౌనం వీడలేదు. పైగా క్షణక్షణం అతని ముఖం రంగులు మార్చుకొంటోంది. లక్ష్మమ్మగారు కొంతసేపాగి చివరకు విషయానికి వచ్చారు.

"ఏం అప్పుడు రావడానికి సర్వ సన్నాహాలూ చేసుకున్నాం. తీరా బయలుదేరే వేళకు అతిథులెవరో వచ్చి పడ్డారు."

పోనీ నేనైనా వద్దామంటే ఎన్నడూ ఒక్కసారైనా ప్రయాణాలు చేసిన దానిని కాను. ఆఖరికి పోనీ మర్నాటికైనా బయల్దేరామన్నాను. కాని ఆయన సంగతి తెలుసుగా అంతా అయిన వెనుక వెళ్ళడమేమిటి? నవ్వుతారు! మన పిల్లను మనం ఇవాళ కాకపోతే ఇంకోనాడు చూస్తాం తొందరేం?' అన్నారు." అంటూ లక్ష్మమ్మగారు క్షణకాలం ఆగి "ఏతావాతా పుల్లా కదలడమయ్యింది కాదు. మూడవ నెలంటే ఐదవ నెల విదియంటే అల్లా అయిపోయాయి. ఇప్పుడు ఆరోనెలకానోసు! ఇంత వరకూ రావడమయ్యింది కాదూ..." అంటూ ఇంకా ఆమె ఏదో చెప్పబోతున్నారు. కాని భాస్కరం మధ్యలో అడ్డువస్తూ అన్నాడు—

"అదంతా ఎందుకు వదినా! ఇప్పుడు మీరు రాదలచుకోక పోతేమాత్రం కాదనటానికి నాకేం హక్కు ఉంది!" భాస్కర మిల్లా ప్రశ్నించేసరికి లక్ష్మమ్మగారు ఆగిపోయారు. తరువాత అతను ముఖాన కనుపిస్తున్న వికృత హాసంకూడా క్రమక్రమంగా క్షీణిస్తుండగా చెప్పసాగాడు.

"ఎట్లాగైనా నేను అన్నదమ్ముడి వాడినికదా వదినా! నాకు మీరు చేసినది కూడా తక్కువకాదు... నాన్నగారు చిన్నప్పుడే పోయారు. అమ్మకూడా జ్ఞానం వచ్చాక పోయింది. మీరే పెంచి పెద్దను చేశారు. చదువు చెప్పించారు. పెండ్లికూడా చేశారు. ఇంకా మీనుండి ఏదో ఆశించడం అన్యాయంకాదా వదినా..." అంటూ చప్పన ధోరణి దానంతటదే మారిపోగా "పెండ్లికాక ముందల్లా మీ బిడ్డడివంటి వాడినే అయినా పెండ్లయిపోగానే అకస్మాత్తుగా పెరిగి ఒక్కసారి పెద్దవాడినయిపోయాను." అంటూ నిగ్రహంకోసరం వ్యర్థ ప్రయత్నాలు చేస్తూ "ఇప్పుడు పిల్లల తండ్రినికూడా అయానా నాతో మీరు సమంగా కక్షకట్టి సాధించవచ్చు" అంటూ కంఠం పూడుకుపోగా ఆగిపోయాడు. అతని కండ్లలో నీళ్లు సుడులు తిరగ నారంభించాయి.

మితభాషీ ధీరస్వభావుడూ అయిన భాస్కరంకు కన్నీటితో కార్యాలు సాధించటం అలవాటు లేదు. ఆ విషయం లక్ష్మమ్మగారికి బాగా తెలుసు. అట్టివాడు ఇట్లా కరిగి కన్నీరౌతూ ఉంటే ఆమె విహ్వల చిత్త కాసాగారు. భాస్కరం మరల ఆరంభించాడు.

"ఒకనాడు కాదు రెండునాళ్లు కాదు. నిండు రెండేండ్లు గడిచిపోయాయి. ఈలోగా ఒకసారికూడా నేను రాలేదు. మీరు గట్టిగా రమ్మనలేదు. రెండేండ్లు మీ రెప్పుడైనా నన్ను చూడకుండా ఉండగలిగారా వదినా! చివరకు ఈనాడు నా అంతట నేను వచ్చాకైనా ఏమిరా ఇట్లా చేశావని మందలించలేదు! చివరకు నువ్వుకూడా—మా అమ్మ తరువాత అమ్మకన్నా ఎక్కువగా చూసుకున్న దానివి నువ్వుకూడా అడగలేదు. చిన్న పిల్లకాబట్టి—దానికి నేను చేసిన ఘోరపాప మేమిటో ఇంకా తెలియదు కాబట్టి అది అడిగింది"

భాస్కరం ఆగాడు. అయినా లక్ష్మమ్మగారు మాటాడలేదు. ఆమె కాస్థితిలో భాస్కరం అపశ్యారోపణలను ఖండించటానికి ధైర్యం చాలింది కాదు. భాస్కరం క్షణకాలం తరువాత మళ్ళా ఆరంభించాడు. అతి దాపరికి దుఃఖప్రవంతి తొలివెల్లువలు క్షీణించగా కొంత స్తిమితమైన ధోరణిలో చెప్పసాగాడు.

"నాకు ఒక్క సందేహం ఉంది. నిజానికి నేను చేసినది పొరపాటు అవునో కాదో కాలమే ఋజువుచేయాలి. ఎందుచేతంటే అతను తనంత తాను పరీక్షించటానికి ప్రయత్నించటం లేదు కాబట్టి! కాదమ్మా ఒకవేళ పొరపాటే అయితేమాత్రం— అది ఇంక సరిదిద్దుకోరానిదే కదా వదినా? కాగా ఆయన అభిప్రాయాన్ని ఒక్క ఈ పెండ్లి విషయంలో కాక ఇంకే విషయంలోనైనా ఎన్నడైనా ఎప్పుడైనా వ్యతిరేకించడం జరిగిందా? అదైనా అతను మనస్ఫూర్తిగానో, కాకనో చివరకు దిగిరావటం వల్లనే జరిగింది కాని అతను కాదూ కూడదూ అని పట్టు బడితే ఈ పెండ్లి చేసుకునేవాణ్ణా వదినా? అట్టి దానిని అతను క్షమించక పోవటంలో ఉద్దేశ మేమిటి? నేనూ మూర్ఖుణ్ణే అయితే......ఆజన్మాంతం ఉండవలసిన మా బంధం తెగిపోవలసిందేనా?" అంటూ క్షణమాగి మళ్లా గిర్రున తిరిగే కన్నీటితో చెప్పసాగాడు.

"ఒక చిన్న దోషంకోసరం అతను తన రక్తంలో రక్తం తన జీవంలో జీవం—సమస్తం పంచుకుపుట్టిన నన్ను ఎప్పటికీ కూడా దూరం చేయడానికి వెనుకాడటం లేదు. లేక ఇది శిక్షించటమే అయినా ఇంత అన్యాయమైన శిక్ష తగదు. ఇది ఎంత ఘోరమైన శిక్షో తెలుసా వదినా?" భాస్కరం తిరిగి తాను సంబాళించుకో వటానికి క్షణకాలం ఆగాడు. కాని ఆ కాలం అతను మరీ దుర్బలుడవడానికే ఉపయోగపడింది. అతను స్పష్టాస్పష్టపు నుడులతో చెప్పసాగాడు.

"ఆనాడు బారసాలకు వాళ్ల అక్కలూ చెల్లెళ్ళూ బావలూ అన్నలూ తండ్రులూ తల్లులూ అంటూ పదిమంది చేరితే వాళ్ళ అందరి నడుమా నేను ఒక్కడిని! వాళ్లు పదే పదే ప్రశ్నించే వారు. నేను ఏమని చెప్పను? నేను నిజంగా చెపుతున్నాను. మీరు ఏమైనా చేయవచ్చేమో గాని అంతమంది మధ్య నన్ను చిన్నబుచ్చటానికి సాహసిస్తారనుకోలేదు. కనీసం నువ్వైనా నాకు తల్లీ తండ్రీ లేరన్న సంగతి అన్నయ్యకు జ్ఞాపకం చేస్తావను కున్నాను." అంటూ గొంతు పెగలక కొంతసేపు ఆగి అది మరల స్వాధీనం కాగా మళ్ళా ఆరంభించాడు "ఆనాడు క్షణక్షణం మీ కోసరం ఎదురుచూశాను. పీటలమీద కూర్చుని ఉన్నానే కాని లేచేవరకూ ఉండీ ఉడిగీ ద్వారంవంక చూస్తునే ఉన్నాను. చివరికా వేళ దీపాల వేళ వరకూ కూడా నా ఆశ ఉడిగిపోలేదు. వచ్చి త్రోవలో బస్సు పాడయ్యిందనో రైలు ఆలస్యమయ్యిందనో చెపుతారనుకున్నాను. కాని... కాని......అట్టి దేదీ జరగలేదు."

భాస్కరం ఈసారి వచ్చిన దుఃఖపు వెల్లువను నిగ్రహించుకోవడానికి చాలా శ్రమపడవలసి వచ్చింది. అతని గుండెలూ, కంఠం, పెదవులూ, ముఖంలోని ప్రతి కండరం ఎంతో కష్టపడి

చివరకు సాహస్యం కాక పట్టు విడిచేశాయి. వెంటనే భాస్కరం ముఖం దాచేసుకున్నాడు. అతడు మళ్ళా తేరుకునేసరికి ఒక పావుగంట పైగా గడిచింది. ఇంతసేపూ ఆ గదిలో గాఢనిశ్శబ్దం వెలసింది.

భాస్కరం తలయెత్తి చూసేసరికి ఎప్పుడు వచ్చిందో శారద కూడా అక్కడనే ఉన్నది. ఆమె తల్లి వెనుక నిలుచుని చకిత నేత్రాలతో పినతండ్రివంక చూస్తున్నది. పిల్లలిద్దరూ బిక్కబోయి క్షణకాలం భాస్కరం వంకా క్షణకాలం తల్లివంకా చూస్తున్నారు. లక్ష్మమ్మగారి కండ్లు ఎఱ్ఱగా ఉన్నాయి. పరాయత్త చిత్తాన్ని ప్రతిఫలించే ఆమె ముఖంలో రోషంకోపం ఆవేదనా చిహ్నాలుగూడా సంకీర్ణంగా ప్రతిఫలిస్తున్నాయి.

భాస్కరం ఆ తరువాత మరికొంతసేపు కూడా మౌనంగానే మిగిలిపోయాడు. పిదప అన్నాడు. అతడి గొంతు ఆ వాతావరణంలో దట్టమైన వర్షానంతరం కాసే చక్కటి ఎండ కలిగించే అనుభూతిని కలిగిస్తోంది.

"నేను దీని నేమీ మనసులో పెట్టుకోలేదు వదినా? ఆయన ఈనాటికి కాకపోతే యింకొక నాటికైనా తన పడ్డ పొరపాటును గుర్తిస్తాడనే ఆశిస్తూ వచ్చాను. కాని ఆయన ఇట్లా ప్రతివిషయంలోనూ మమ్మల్ని ఎడపెడుతూనే వస్తుంటే చివరకు ఆశ్చర్యపడవలసి వస్తోంది. చలపతిని నాతో మాటమాత్రమైనా అనకుండా ఇంకొకచోట పెట్టేసరికి పరిస్థితి నీ విధంగా అర్థం చేసుకోవలసి వచ్చింది. నాకు పెండ్లి కాకముందల్లా ఏమనేవాడూ, ఆ భాస్కరాన్ని కావా వదినా?" భాస్కరం ప్రశ్నించి జవాబుకోసరంలా క్షణకాలం ఆగాడు. పిదప తానే జవాబును సూచిస్తూ అన్నాడు. "పోతే 'ఆమేగదూ మారింది! కాని ఆమె తను అనుకున్న మనిషి అవునో కాదో తెలుసుకోవడానికి ఒక్కసారైనా ప్రయత్నించారా వదినా?" అంటూ కాస్త కాస్త వ్యవధితో "అన్ని విషయాలూ అందరకూ తెలియవు వదినా—కాని దురదృష్టవశాత్తు చాలామంది ఈ విషయాన్ని అంగీకరించరు. అందువల్లే తాము మోసపోయి నష్టపడటమే కాక ఇతరులను కూడా అందుకు గురిచేస్తూ ఉంటారు" అంటూ ఆగిపోయాడు.

కాని లక్ష్మమ్మగారు అప్పటికీ ఏమీ మాటాడలేదు.

మళ్ళా కొంతసేపు పోయాక భాస్కరమన్నాడు. అతని గొంతు ఆ నిశ్శబ్ద వాతావరణంలో బహు మందరంగా కించిద్వేదనాపూర్వకంగా దీనంగా వినపడుతోంది.

"నేను ఎవరికైనా ఏమని సంజాయిషీ చెప్తానువదినా! 'నేను అయోగ్యుడను—అందుచే నా వారు నన్ను ఎడపెట్టారు' అని చెప్పుదునా లేక, 'నా వారు ప్రేమాభిమానాలు లేనివారు అందుచేత నన్ను ఎడపెట్టారు' అని చెబుదునా? ఏమని చెపితే బాగుంటుంది చెప్పూ?"

భాస్కరం ఆగిపోయాడు. గదిలో ఎప్పటి నిశ్శబ్దమే తాండవించ సాగింది.

కొంతసేపు పోయాక భాస్కరం చేతి గడియారం చూసుకొని ఇంకా కాస్త వ్యవధి ఉండగా ఓ దీర్ఘ నిశ్వాసం విడిచి అన్నాడు. అతడి దృష్టి శూన్యంలో ఏమో చూస్తోంది.

"మా తల్లి కన్న ముగ్గురిలో ఒకడు చాలా కాలం క్రితమే కుటుంబానికి దూరమయ్యాడు. అతడు ఉన్నా లేనట్టే అవసరాలకు కాకుండా ఏ రెండుమూడేళ్ళకో ముఖం చూపి పోతూ ఉంటాడు. ఇంక నేనున్నాను. నా నుదుటను కూడా అదే వ్రాసి ఉందేమో!"

గడ్డం క్రిందచేయి చేర్చి అట్లా శూన్యంలోకి చూస్తూ భాస్కరం ఉండుండీ ఉడిగి చెపుతున్న మాటల నన్నింటినీ వింటున్న లక్ష్మమ్మగారు ఒక్క ప్రశ్నకు గాని ఒక్క సందేహంకు గాని జవాబివ్వలేదు. ఆమె వింటున్నారా లేదా అన్నట్లు నిశ్చలలై కూర్చుని ఉన్నారు. కాని భాస్కరం చివరి మాటలకుమాత్రం ఆమె జవాబిచ్చారు. అయితే అది వెంటనే కాదు. భాస్కరం మాటాడి విడిచిన కొంతసేపు తరవాత ఆమె అన్నారు. ఒక్క కదలికతో కూర్చున్న పద్ధతి మార్చుకుంటూ ఆమె భాస్కరం వంక ఒకసారి చూసి పిదప క్రిందపడి ఉన్న ఏ చీపురుపుల్లనో ఏరుతూ అన్నారు.

"అది ఒకొక్కరి జాతక లక్షణం నాయనా! ఎంత చేసీ ఏమి చేసీ కూడా మాట దక్కించుకో లేకపోవటం దౌర్భాగ్యం! ఏం చెప్తాం?"

లక్ష్మమ్మగారీ మాటలని పిదప ఒక దీర్ఘోపన్యాసానికి ఆయత్తులు కాసాగారు. అంతవరకూ లక్ష్మమ్మగారి మౌనాన్ని ఎట్లానో అర్థంచేసుకుంటున్న భాస్కరం ఆమె పర్యవసానాభిప్రాయం వింటూనే క్షణకాలం నిరవుడయ్యాడు. పిదపకొంత ఆలోచనానంతరం ఏదో చెప్ప నుద్యమించేసరికి లక్ష్మమ్మగారారంభించారు. ఆమె అన్నారు.

"ఆయనకు కొన్ని విషయాలు తెలియవ్! చెపితే వినరు! అసలు ఎదుటివారిని మాటాడ నివ్వరు! ఏం చేస్తాం?"

లక్ష్మమ్మగా రాగారు. ఆ ప్రశ్నధోరణికూడా ఆమె దీర్ఘోపన్యాసాయత్తతనే సూచిస్తోంది. కాని అది సాగలేదు. లక్ష్మమ్మగారు మళ్ళా ప్రారంభించబోయేసరికి పెరటిద్వారంవద్ద సూరమ్మగొంతు వినిపించింది. అందుచేత ఆమె లేచి వెళ్ళక తప్పిందికాదు. ఈలోగా భాస్కరం వాచీ ప్రయాణకాలాన్ని సూచించసాగింది. భాస్కరం లేచి వదినగారివద్దకు పోబోతూ ఉంటే ఆడవాళ్ళిద్దరూ రహస్యం మాట్లాడుకున్నారు. భాస్కరం ఇవతక్క వెళ్ళిపోబోయాడు. సూరమ్మ అంటోంది.

"భాస్కరం బాబుకు కూతురా!... చెప్పావుగావు." భాస్కరంబుద్ధిని అణచిపెట్టి అక్కడే నిలుచుండిపోయాడు. ఇంతలో సూరమ్మ మళ్లా అన్నది.

"అవును. అది బాగోదు కూడాను."

అంతే ఆరొండు పొడివాక్యాలతోనూ లక్ష్మమ్మగారి ధన సంపాదనా యత్నాలను గూర్చికలిగిన భాస్కరం సందేహం పూర్తిగా తీరిపోయింది.

తరువాత లక్ష్మమ్మగారు మూరమ్మ దగ్గరనుండి తెలిసి చేసికొని రాగానే భాస్కరం పై మయ్యిందని తెలుసుకున్నాడు.

## 9

మరునాడు ప్రొద్దున ఊరునుండి వచ్చిన పద్మనాభం గారు రెండిళ్ళవాకిట కాళ్ళూ చేతులూ కడుక్కుంటూనే "భాస్కరం ఉన్నాడా" అన్నారు. వెనకటింటి వరండాలో కాఫీపొయ్యి వెలిగిస్తున్న లక్ష్మమ్మగారు అతను గత దినమే వెళ్ళిపోయాడని చెప్పగా—

"నే ఉండమన్నాను" అన్నారు ఎదురుగా ఉన్న శారద వంక చూస్తూ.

"సెలవు లేదట" అన్నది శారద.

"అయితే ఆ కాడికి ఎందుకు వచ్చాడూ! మొహం చూపించి పోవడానికా?" అంటూ బట్టలు మార్చుకోవడానికి ఇంట్లోకి వెళ్లారు. వెంట శారద కూడా వెళ్లింది. తరువాత ఒక్క ఐదునిముషాల లోనే బట్టలు మార్చుకొని తిరిగివస్తూ—

"పోనీ మీ మరిదీ నువ్వూ తీరికగా కూర్చుని ఏడిచారట ఎందుకూ" అంటూ వచ్చి కాఫీ పొయ్యికి ఎడంగా గోడను చారబడి కూర్చున్నారు.

లక్ష్మమ్మగారు మాటాడలేదు.

పద్మనాభంగారు తన ప్రశ్నను రెట్టించగా ఉదాసీన స్వరంతో అన్నారు.

"ఆ చెప్పినవాళ్ళే అడగలేకపోయారా?"

పద్మనాభంగారు వసారా స్తంభంవద్ద నిలుచునివున్న శారదవంక చూసి నవ్వుతూ "నువ్వు చెప్పలేదూ" అన్నారు భార్య నుద్దేశించి.

కాని లక్ష్మమ్మగారు అవుననిగాని కాదనిగాని అనలేదు. తరువాత పద్మనాభంగారు గొంతుమార్చి సౌమనస్యం ధ్వనించే స్వరంతో,

"కాని ఎందుకు ఏడ్చారూ?" అన్నారు.

ఈసారి లక్ష్మమ్మగారు కొంత తాపీగా జవాబిచ్చారు.

"ఎందుకు ఏడుస్తారూ? మనసు నొప్పికే ఏడ్చారు."

"అదివరికే ఎవరి మనసు నొప్పెట్టింది ఎందుకు నొప్పెట్టింది?"

ఈ ప్రశ్నకు చాలాసేపు ఊరుకొని పిదప జవాబిచ్చారు.

"తనకు తల్లీ తండ్రీలేని లోపము ఇవాళ తెలిసిందా వాడికి."

"అంటే"

"బాలసారె పీటలమీదకు ఒంటరిగా పోవలసిన ఖర్మం పట్టిందని."

"ఆటంకాలొస్తే వాళ్ళు మాత్రం రెక్కలుగట్టుక ఎగురుతారేమిటి."

"రెక్కలుగట్టుక ఎగరకపోయినా బిడ్డపుట్టిన ఆరుమాసాల వరకూ పుట్టినబిడ్డను చూడబోవటానికి నిర్లక్ష్యం చేసి ఉండరు."

ఇట్లా అంటూనే ఆమె కాఫీగ్లాసు ఎదుటవుంచి అక్కడ నుండి వీధియింటిలోకి వెళ్ళిపోయారు.

లక్ష్మమ్మగారు ప్రయత్నపూర్వకంగానే చివరి జవాబును కొత్త పదును పెట్టి విడిచారు. అంతవరకూ ప్రతి జవాబుకూ రంగులు మార్చుకుంటూ వచ్చిన పద్మనాభంగారి ముఖం ఆ చివరి జవాబుతో జేవురించి ఊరుకుంది. కాని లక్ష్మమ్మగారిచ్చిన విరామంలో కొంత స్వస్థతకి చేరుకోసాగింది. అంతలో లక్ష్మమ్మగారు తిరిగి వచ్చారు. ఆమెను చూస్తూనే పద్మనాభంగారు అడిగారు.

"అయితే ఏడ్చి ఎవరిని సాధిస్తారూ?"

ఈ సంభాషణ జరిగే అంతసేపట్లోనూ లక్ష్మమ్మగారు భర్త ముఖంవంక చూడలేదు! ఈ ప్రశ్న యిట్లా వేసేసరికి అంతకన్నా ఆ గొంతు వినేసరికి ఆమె ఒకసారి భర్త ముఖంలోకి తీక్షణంగా చూశారు. అంతే చివరివరకూ మరి మాటాడలేదు. పద్మనాభంగారు ఉత్తేజితస్వరంతో ప్రారంభించారు.

"చేసేవా డుంటే ప్రతివాడూ చివరివరకూ చేయించు కుంటాడు." అంటూ కొంత ఎడమిచ్చి మరికొంత వేడి హెచ్చగా "ఈనాడు తలపుకొచ్చి ఏడుస్తున్న అమ్మా నాన్నా వీడికి పదేళ్ళప్పుడు ఒకళ్లూ పదిహేనేళ్ళప్పుడు ఒకరూ పోయారు. ఆనాటి నుంచీ—వీడికి ఇప్పుడు పాతికేళ్లు పైబడ్డాయి ఈనాటివరకూ ఎవరు చేశారు. ఆ పెద్దవాడు కొంత సమర్థుడయ్యాడూ అనేసరికి పోయి ఫగర్ ఫూర్‌లో కూర్చున్నాడు. పదేళ్లయి ఉద్యోగం చేస్తున్నాడు ఒక్క దమ్మిడీ సంపాదా? ఇంకా చాలదని ఏడుస్తూ నావద్దనుంచే గుంజుకు పోతాడు.

మరి వీడికి ఇంటర్లూ బియ్యేలూ—ఆ చదువుల కాలంలో వేషాలూ చదువూ, పెండ్లీ ఎలా జరిగాయి? నాన్న మూటకట్టి ఉంచిన డబ్బేనా? ఏమీ లేదుకదా? వీడికింత చేసినది చాలక ఇంకా వీడు పిల్లల్ని కంటే పిల్లలకూ—ఆ పిల్లలు మళ్లా పిల్లల్ని కంటే ఆ పిల్లలకూ కూడా చేసే చేయాలా? చేయకపోతే ఏడ్చి సాధిస్తాడూ?"

అంటూ క్షణమాగి ఈసారి కొంత వేడి తగ్గగా—

"నాకెవరు చేశారు. నాకు మా నాన్న వీడికి నేను చేసిన పాటిలో సహస్రాంశమైనా చేయలేదే. ఏదో గాలి కబ్బిన చదువు నాల్గవతరగతి వరకూ చదువుకున్నాను—అలాంటప్పుడు నేనెంత ఏడవాలి, ఎవరిమీదపడి ఏడవాలి?"

అంటూ మరొక విరామంతో ఈ సారి పూర్తి చేశారు.

"చేసేవాడుంటే—చెప్పేవాడుంటే అందరూ ఏడుస్తారు! ఏడుపుల కేం భాగ్యం! !"

అంటూ పూర్తి చేశారు.

లక్ష్మమ్మగారు మాటాడలేదు. ఉదయం పది గంటలే ఐనా, మబ్బు లేని ఎండకాస్తున్నా, పద్మనాభంగారు మాటాడి విడిచిన వెనక ఆ వాతావరణం లక్ష్మమ్మగారి పాలిట ఎట్లా ఉన్న

దంటే, కొంత వెలుగుల్లో పండు వృద్ధిగా పరిణతి చెలిసిన సాయం సంధ్యలా ఉంది.

రెండూ మూడూ నాలుగు ఐదు నిముషాలు అట్లానే గడిచాయి. పద్మనాభంగారేమీ మాట్లాడలేదు.

కాని లక్ష్మమ్మగారు మాత్రం ప్రతిక్షణం ఏ క్షణాన అకస్మాత్తుగా పెళ పెళమంటూ ఉరుములు వినవస్తాయోనని ఎదురు చూస్తూనే ఉన్నారు.

పది నిముషాలు గడిచాయి. అంతటితో పద్మనాభంగారు ఏమనుకున్నారో ఏ విధమైన ధరలి వాక్యం పలకకుండానే అక్కడినుండి లేచి వెళ్లిపోయారు.

## 10

అది ఒక లోపమే ఐతే—లక్ష్మమ్మగారిలో మనుష్యులలో సాధారణంగా కనుపించే పాటి తార్కిక శక్తి కూడా లేదు. ఆ లోపాన్ని అంగీకరించవలసిందే. ఆమె సాధారణంగా చేసే పనులు చెప్పే మాటలూ వేనివి పరిశీలించినా ఈ విషయం స్పష్టమౌతూనే ఉంటుంది. శివరాత్రి ముందుజేసి అనాడు ఏదో మాటలలో తనంత తానే మళ్లా గతాన్ని త్రవ్వటం చూసినా ఆ విషయమే స్ఫురిస్తుంది.

అది—నాడు భాస్కరం ఆమె ముందు హృదయం విప్పి గాయాలను ఒకటొకటే చూపడంవల్ల వీర్యస్థ హృదయాంతర్గతతో లేక ఇంకే అంతరంగికములైన భావాల పరిణతి ఫలమో తెలియదుగ్గా గత రెండేండ్లుగా అంతరాంతరంగా మానీభావం వహించిన భావస్ఫురం విషయాలను పురస్కరించుకొని అతడి తరఫున భర్తతో వాదన ఆరంభించింది.

నిజానికి ఆమె పద్మనాభంగారి ధోరణిని, ఆయన మాటల వెనక అనుక్షణం ప్రతిబింబించే అతని హృదయాన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించి అర్థం చేసుకొని ఉంటే ఆ విషయమై ప్రస్తావించటం ఎంత నిష్ప్రయోజనమో తెలుసుకొని ఉండేవారు. కాని అట్లా జరగలేదు.

ఆ నాడు మాఘ మాసపు మేఘాలు ఆకాశాన్ని మూసి పట్టి ఉంచి ఉండి ఉడికి చరచంలా అసహాతడపో కొద్ది కొదిగా వర్షిస్తున్నాయి. మధ్యాహ్నం మూడు గంటల వేళ భోజనానంతర విశ్రాంతి తీసికొని ఒకరు చాప చింకిమైనా వేరొకరు మంచంమైనా ముఖాముఖిగా కూర్చుని విచారణ ఆరంభించారు. పార్వతి లక్ష్మమ్మగారి ప్రక్కనే చాపమై మధ్యాహ్నం నిద్ర తీస్తోంది. శారదా జానకులు మరికొందరి పిల్లల తో వెనకటింటికూర్చుని ఏదో ఆడుకుంటున్నారు.

విచారణ కాండ ప్రస్తవానంతరం ఇట్లా సాగింది. లక్ష్మమ్మగారు భర్త చేసిన ఆరోపణను ఖండిస్తూ అన్నారు.

“అన్యాయం మాటలాడకండి! అతనిని విరోధపడనీరాదూ! అతనితో మాట మాత్రమేనా అనకపోతే అతనికెలా తెలుస్తుంది.”

ఈ సారి గునగునమేమంటే లక్ష్మమ్మగారు వెనకటిలా పద్మనాభంగారిని బోనులో నిలువ బెట్టకుండా బోనులో నిలుచున్న మరిదిని రక్షించుకొనే ప్రయత్నంలో మాట్లాడుతున్నారు. అందుచేత సంభాషణ సాఫీగా సాగింది. పద్మనాభంగారు శాంతంగానే అడిగారు.

“అంటే నేను వెళ్లి వాడిని నోటితో యాచించాలనా?”

“పోనీ అతడితో కూడా నా భాగానేనా అన్నారా?”

“అలా అనకేం అంటకన్నా బాగానే అన్నాను.”

“ఎప్పుడూ?”

ఇది మరిది మాటలను తలచుకొని లక్ష్మమ్మగారు అనుమానిస్తూ అడిగారు. పద్మనాభంగారు కూడా వివరంగానే జవాబిచ్చారు.

చలపతి ఐదవ తరగతి పాసైన ఏడాది—అంటే ఏడెనిమిదేండ్లయి అప్పుడే అనకాపల్లిలో కాపురం ప్రారంభించిన రోజులలో—వాళ్ల ప్రధానోపాధ్యాయుల ఇనస్పెక్టరుగారికి పంపకముందే అప్పలస్వామి తెచ్చి ఇచ్చి వాడిని పాస్ చేస్తున్నట్లు చెప్పారు. నేను ఆ తరువాత రెండు మూడు రోజులలోనే ఏడిపించి ఉత్తరం వ్రాస్తూ అందులో ఇలా చలపతి ఈ యేడాది ఐదవ తరగతి పాసయ్యాడు. అని వ్రాశాను.

పద్మనాభంగారు ఆగారు. లక్ష్మమ్మగారు కొంత ఆలోచించి ఒక పాయింటు పట్టుకొని అడిగారు.

“అంతేనా?”

“కాకపోతే!” పద్మనాభంగారు అవ్యవధానంగా అందుకున్నారు. “మరేమని వ్రాయమన్నావ్? అయ్యా నా కొడుకు ఇంక పట్నంలో చదువవలసి ఉన్నది! దయచేసి వాడిని నీ యింట పెట్టుకొని నన్ను కటాక్షించు అని వ్రాయాలా?”

ఇది ఎట్టి పరిపక్వమైనా తర్క శాస్త్రంలో పరిచయం ఉన్నవారు కాదు కదా దాని ముక్కా మొహం తెలియనివారు కూడా చెప్పవచ్చు. కాని ఇద్దరు అసమానుల మధ్య సాగే వాదం సాధారణంగా యిట్లానే ముగుస్తూంటుంది. దానితో బలహీనుల యుక్తులన్నీ ఎంత బలమైనవైనా గాలికీధూళికీ పోవడం వారు నిరుత్తరులై ఊరుకోవటం సర్వ సాధారణం.

లక్ష్మమ్మగారు కూడా ఇట్టి స్థితిలోనే నిరుత్తరులై ఊరుకున్నారు. కాని పద్మనాభంగారు కూడా మాటాడక పోయేసరికి అది ఒక ప్రశ్న కాకపోయినా వేసి చూశారు.

“అయితే దానికతనేం జవాబిచ్చారూ?”

“—అసలు జవాబే లేదు”

దానితో ఆమె మరి మాటాడలేదు. కొంతసేపు పోయాక పద్మనాభంగారే అన్నారు.

“కొడుక్కి యాచించావనే కట్టు. అంత ముఖ్యంగా ఉండటానికి ప్రయత్నించే వాడితో ప్రయోజనమేముంటుంది? ఉన్నా అదే మాత్రం సవ్యమైనది?”

అతనాగారు.

లక్ష్మమ్మగారికి ప్రత్యర్థి వాదంలో కొంత కూడా నమ్మకం లేదు. అయినా సర్వం అంగీకరిస్తున్నట్టు వింటూ ఊరుకున్నారు. తరువాత ఆమె ధోరణిలో ఆమె ఆలోచిస్తుండగా పద్మనాభంగారు కూడా అట్లాగే తమ ధోరణిలో తాము ఆలోచిస్తూ చివరకొక దీర్ఘ నిశ్వాసం విడిచి అన్నారు.

"నీకు నువ్వూ నీ కుటుంబం తప్ప లోకం తెలియదు. మనుష్యులంతా నీ వంటి వారూ కారు—లోకమంతటా ఇక్కడి నీ జీవితం లానూ ఉండదు.

పట్టణాలకూ పల్లెలకూ సహస్రాంతం తేడా ఉంది. పల్లెటూరి వారివి కుటుంబాలు వేరైనా జాతులూ చివరకు కులాలూ వేరైనా వారిలో వారికి ఆత్మీయత ఉంటుంది. శుభాశుభాలకు ఒకరికొకరు అడ్డుపడతారు. వారిది పొయ్యిలు వేరైన ఒక పెద్ద సమిష్టి కుటుంబం. కాని పట్టణ వాసులు అలా కారు. ఒంటరి జీవులు. పొరుగువాడింట దొంగలు పడ్డా చూస్తూ ఊరుకునే స్వభావులు. ఎవరికి వారే చిన్ని నా పొట్టకు శ్రీరామ రక్ష అనుకునే స్వభావాలు వారివి. సమస్తం రూపాయలణా పైసలలో కొలుచుకోవటానికి అలవాటు పడ్డవాళ్ల స్వభావాలు చివరికట్లా తయారౌతాయి. వాళ్లే కాదు పదేళ్లు నువ్వు అక్కడ ఉంటే నువ్వూ అట్లాగే తయారౌతావు. అది వాళ్ల దోషం కాదు. వాళ్ల పరిస్థితుల దోషమువాలి" అంటూ కొంత ఆగి మళ్లా—

"ఇంత ఎందుకు భాస్కరాన్నే తీసుకో! వాడిన్నాళ్లైనా ఇట్లా మారుతాడని కలలోనైనా అనుకున్నామా! వాడు అదిలో రెండేళ్లు మనను చూడకుండా ఉండగలిగే మనిషేనా? పట్టణ జీవితం వాడిని ఎలా మార్చేసిందో చూడు. పరీక్షలు పాసై తన ఇష్టం వచ్చిన ఉద్యోగం, తను ప్రేమించిన అమ్మాయి, తన భవిష్యత్తూ అంటూ స్వార్థమే చూసుకున్నాడుగాని వాడిని అంత వాడిని చేసిన నా ఇష్టా యిష్టాలేమో, వాడి మీద నేను పెట్టుకొన్న ఆశలేమో కనీసం ఊహించడానికైనా ఒక్కసారైనా ప్రయత్నం చేశాడా! వీడే నాకు ఇన్ని కబుర్లు చెబుతున్నాడు. నేను కూడా వీడిలా నా స్వార్థమే చూచుకుంటే వీడెక్కడ ఉండేవాడు. ఏమై ఉండేవాడు?"

అని ప్రశ్నించి ఆగిపోయారు. లక్ష్మమ్మగారికి తమ స్వల్ప లోకజ్ఞానంతో పద్మనాభంగారు నిర్వచించిన సత్యాలను అర్థం చేసుకోవటమే శక్తికి మించిన పని. అట్టిది ఆమె అందరి నిజానిజాలను తర్కించుకోలేదంటే అందులో ఆశ్చర్యం లేదు. పోతే భాస్కరాన్ని గూర్చి ఆయన చిత్రణం మాత్రం బాగానే అర్థమయ్యింది. అంతతో ఆమెఒక విచిత్రమైన అనుభూతిలో పడ్డారు. ఒక మనిషి తాను తెల్లగా చూస్తున్న లోకాన్ని చూస్తుండగానే పచ్చగానో ఎఱ్ఱగానో చూడవలసి వస్తే ఆ మనిషి ఎట్టి విచిత్రానుభూతిని పొందుతాడో ఆమె కూడా అట్టి చిత్రానుభూతినే పొందసాగారు.

కొంతసేపటి తరువాత పద్మనాభంగారు మరల ప్రారంభించారు. ఆయన మాట్లాడే ధోరణి అటు 'స్వగతమూ' కాక ఇటూ 'ప్రకాశమూ' కాక మధ్యస్థితిలో ఉన్నట్టుంది. అన్నారు.

"అసలిందలి మూలమంతా పిల్లలు చదువుకునే చదువులోనే ఉందనుకుంటాను. చదువుకున్న వాళ్లకు ఎలాగైనా లోకజ్ఞానం ఎక్కువ లభిస్తుంది. జ్ఞానం కలవాడెప్పుడూ దాని ప్రయోజనాన్ని అజ్ఞానిని మోసగించటంలోనే పొందుతుంటాడు. లోకంలో జరుగుతున్నదదే. ఈ పట్టణవాసులందరూ బ్రతుకుతున్నది పల్లెలను దోచుకునే! కష్టపడేదీ, గొడ్డుల్లా చాకిరీ చేసేదీ పల్లెవాసులు. దాని ఫలితాల్ని అనుభవించేది పట్టణవాసులు. మళ్ళా వీళ్లను చూస్తే తెగనీలుగుతారు. వాళ్లకు తెలియదు—ఆ మేడలూ ఆ కారులూ ఆ వేషాలూ ఆ సినీమాలూ ఎక్కడినుండి వచ్చాయో. వాళ్లు కనీసం తెలుసుకోవడానికైనా ప్రయత్నించరు!......"

పద్మనాభంగారు ఎందుచేతో ఆగిపోయారో ఆగిపోయారు. బహుశః తన శ్రోతకు ఈ ఉపన్యాసమంతా అయోమయమనే విషయం అప్పటికి గ్రహించారేమో లేక తన అన్యాపదేశాన్ని ఆమె గ్రహించిపోతుందని సందేహమే పడ్డారో...

ఏమైనా ఆయన తన ఉపన్యాసాన్ని అంతటితో ఆపేశారు. అంతే కాదు. మరి కాస్సేపటికి ఒక చోటినుండి అగ్గిపెట్టె ఇంకొక చోటినుండి చుట్టా తీసి ఆ రెండిటి ఉపయోగాన్ని సమష్టిగా పొందుతూ అవతలకు కూడా వెళ్లిపోయారు.

లక్ష్మమ్మగారు మాత్రం అక్కడే కూర్చున్నారు. ఆమెగారు తన ప్రయత్నాలు గుప్తవాంఛలూ గాలికి ధూళికి ఎగిరిపోగా ఒక చిత్రమైన సందిగ్ధావస్థలో పడ్డారు.

వస్తుతః లక్ష్మమ్మగారు పద్మనాభంగారన్నట్టు నిజంగానే తన ఇల్లూ లోకమూ తప్ప లోకం ఎరగని మనిషి. అందుచేతే ఆమె ఎవరైనా వచ్చి ఒకఆకారాన్ని చూపి 'ఏమమ్మా ఇది పంది కదూ?' అంటే 'ఔనూ' అంటుంది. తరువాత ఇంకొకరు వచ్చి "ఇది పంది కాదటమ్మా!" అంటే 'ఔను సుమీ' అంటుంది. కాని ఆ తరువాత అంతరంగంలో మాత్రం సందేహంలో పడేవారు.

ఈ కారణం చేతే ఆమె ఇప్పుడు తను విన్న రెండవ వాదాన్ని మొదటివాదంతో సరిపోల్చుకుంటూ అది నందో పందో తేల్చుకోలేక ఇరుకున పడి కొట్టుకోసాగారు.

## 11

తర్కమనేది ఎట్టిదంటే అది ఒక అద్భుతమైన విశేషం. అది తనను దూరంనుండి చూచేవారిని చకితులను చేస్తుంది. తన్ను దరిసిన అసమర్థులను ఎటు జూచినా తానై ఉక్కిరి బిక్కిరి చేసి ఒడ్డున విసరి వేస్తుంది. సమర్థులై తన్ను తరించగలవారికి రత్నరాసులందిస్తుంది. దాని అంతులు తెలియ ప్రయత్నించేవారి కది అపారమై అమేయమై మిగుల గంభీరమై బడబాగ్ని గర్భమై సకల సమర్థమై కానవస్తుంది.

తర్కం అటు లక్ష్మీదేవికీ ఇటు జ్యేష్ఠాదేవికీ, అటు హాలాహలానికీ ఇటు అమృతానికీ, ఉత్పత్తిస్థానమైన మహాజలధి వంటిది. అంతే కాదు. దానిని తరచి ప్రయోజనాన్ని సాధించగలిగే సామర్థ్యంకూడా అటు దేవగణానికి చెందినవారికో ఇటు రాక్షసగణానికి చెందినవారికో మాత్రమే ఉంటుంది. మానవగణానికి చెందిన

నేడే శాంపిల్ చూడండి.

## మీ శిరోజములకు గొప్ప వరప్రసాదము

# కామినియా ఆయిల్ రిజిష్టర్డు

కేశపోషణకు కావలసిన ప్రకృతి సిద్ధమైన దినుసులు కలిగిన తలనూనెను శ్రద్ధగా ఎంచుకొనటంలోనే ముఖ్యంగా మీ కేశసౌందర్యమాధారపడి యుంటుంది. వెంట్రుకల పుష్టాబుకు సొంపైన **కామినియా ఆయిల్** సాటిలేనిది. వెంట్రుకలు రాలిపోవటం, నెరవటం, బిరుసెక్కటం, చుండు మొదలైన తల చర్మము, కేశముల సంబంధమైన అన్ని అనారోగ్యములను నివారించును. మెదడును చల్లబరిచి ఆరోగ్యవంతమైన నల్లని కేశముల వృద్ధిపొందించుటకు తోడ్పడును. దీని—మనోహర పరిమళము ఈరోజున కూడా అపూర్వమైనది.



పోస్టేజికి ఒకటిన్నర అణాబిళ్ల పంపి ఒక శాంపిల్ ఉచితముగ వాడిచూడండి.

## పరిమళముల రాజు ఆటో దిల్బహార్

(రిజిష్టర్డు)

మజాగా ఉండే ఈ ప్రాచ్యదేశపు టత్తరుయొక్క ముగ్ధ పరిమళం జగత్ప్రసిద్ధము. ఇది ప్రశస్తమైన జాజి, మల్లెపూలసారము. "అత్తరులరాజు"గా ప్రజానీకంలో ప్రసిద్ధమైనది. ప్రతివారికి అందుబాటులో నుండు ధరలకు అనేక సైజులలో దొరకును. అన్నిచోట్లను అమ్మబడుచున్నది.

పోస్టేజికి నాల్గణాల బిళ్లలు పంపి శాంపిలు ఉచితముగ వాడిచూడండి.




## కేటి వైట్ రోజ్ అయిల్

(రిజిష్టర్డు నం. 777)

ఇది లావణ్యమగు (తాజా) గులాబిపూల అద్భుత పరిమళము కలది. మెదడుకు చలవచేయును. కేశపోషణకు ఆదర్శప్రాయమైన నూనె.

మీరు అంగడికి వెళ్లినప్పుడు కేటి వైట్ రోజ్ హెయిరాయిల్ నెం. **777** ను మాత్రమే కోరండి. ప్రత్యామ్నాయ మేదీ అంగీకరించకండి.

అదే విధముగా పేరొందిన దిగువ నూనెలుగూడ ఒకసారి వాడండి.

## కేటి పుష్పసేన తలనూనె నెం 777
## కేటి పుష్పమాలతి తలనూనె నెం 777

## కేటి ఆటోరోజ్ (రిజిష్టర్డు నం. 777)

మనోహరమైన నవ గులాబిపూల కమ్మటి సువాసనను స్వచ్ఛముగా నిరూపించును. మిక్కిలి నిగ్గుదేర్చినది గనుక విశేష కాలము నిలుచును. అత్తరు ప్రేమించేవారి కతి ప్రియమైన యీ సెంటు ఒక్కమారు వాడితే చాలు. మిమ్మును ముగ్ధపరచును.




## ఆటో మధుకర్ (రిజిష్టర్డు)

అపరూపమైన యీ క్రొత్త అత్తరును ఒకసారి వాడిచూడండి.

పోస్టేజి మొదలగువాటికి నాలుగణాల బిళ్లలు పంపి ఉచితముగ శాంపిలుకు వ్రాయండి.

Sole Agents:

**ANGLO INDIAN DRUG & CHEMICAL CO.,** BOMBAY, 2.

గారు దానిని తరవబోవటంవల్ల సాధారణంగా భంగపాటును మాత్రమే పొందుతూ ఉంటారు.

పద్మనాభంగారితో కూడా చివరకు అంతే అయింది. ఈ లోగా అందుకు ప్రధానదోహదకారులైన సంఘటనల ఒక్కటి రెండు చెప్పాలి.

ఆ యేడాది శివరాత్రి మరీ మతిలేకుండా మంగళవారం పడ్డది. చలపతి కేలండర్ అనుకూలంగా మారే అవకాశం ఎన్ని విధాల చూచినా కనుపించకపోవటం చేత తన గార్డియన్ మేష్టరు గారి మతిని అనుకూలంగా మార్చటానికే కృషి చేశాడు. ఎట్లా అయ్యాడో కాని కృతకృత్యుడు కూడా అయ్యాడు.

వాడు శనివారం ఉదయం మొట్టమొదటి బస్సులోనే బయలుదేరి చేత ఒక పెద్ద సంచితో యిల్లు చేరుకున్నాడు.

కాని వాడు తీరా ఇంటికి వచ్చేసరికి మొదట తల్లే "ఏంరా అప్పుడే వచ్చేశావ్?" అన్నారు.

వాడప్పుడే అనుకున్నాడు. అనుకున్నంతా అయ్యింది కూడా. అసలా పరిస్థితులన్నీ కూడా అది దురదృష్టమనండి గ్రహచారమనండి ఒక్కలా దాపురించాయి. జరిగిన దదీ

వాడు ఇంటికి వచ్చినపిదప ఒక్క పది నిముషాలు ఎట్లా ఓపికపట్టాడో ఓపికపట్టి తల్లి ఆరోగ్యంను గురించి చేసిన కుశ్శంకలన్నిటికీ తగురీతిని సమాధానాలిచ్చాడు. పిదప ఆమెచే సరి అనిపించుకోగానే ముగ్గురు చెల్లెండ్రనూ వెంటపెట్టుకొని నట్టింటోకి వచ్చాడు. ముందు జాగ్రతకోసరం వీధి తలుపులు మూయించేశాడుకూడా—

ఆతరువాత వాడు స్థిమితుడై చెల్లెళ్ళను చుట్టూ కూర్చుండ పెట్టుకొని వారికై తాను తెచ్చిన అమూల్య సంపదను ప్రదర్శించడం ఆరంభించారు.

గారడివాడు తన సంచిలోంచి వింతలపై వింతలు తీస్తూ ఉంటే ప్రేక్షకులెట్లా విభ్రాంతులై హర్షధ్వానాలు చేస్తారో అల్లానే చెల్లెళ్లు అన్న బయటపెడు తున్న ఒక్కొక్క వస్తువే చూస్తూ" హాయ్‌హాయ్! హాయ్ హోయ్!" అంటూ అరవసాగారు.

సరిగా ఇట్టి సమయంలోనే పద్మనాభంగారు వీధిలోనుండి తిరిగివచ్చారు. కొడుకు వీధి తలుపు మూయించేస్తే తండ్రి పెరటి దారిన ప్రవేశించారు.

గదంతా ఒక్కసారి నిశ్శబ్దమయ్యింది. ఆయన అడుగుల చప్పుడు వింటూనే చలపతి చెవులు రిక్కించుకొని—పోల్చుకొని "నాన్నగారు! ఇవన్నీ దాచేయ్" అంటూ ఒకఛిలి సూచకం, ఒక చిన్న ఆర్డరూ వదలి ప్రక్కగదిలోకి దాటేశాడు. పాపం శారద—గుట్టుదాచటానికి శాయశక్తులా ప్రయత్నించింది. కాని అనవసరంగా దొరికిపోయింది.

పద్మనాభంగారు నెమ్మదిగా పెరటిద్వారాన ప్రవేశిస్తూ గదిలో పిల్లల్ని చూచి "వీధి తలుపులు మూసుకొని చీకట్లో ఏం చేస్తున్నార్రా" అంటూ దిక్కులు పరికించసాగారు.

ఆసరికి పిల్లలంతా దొంగ మొహాలేసుకొని నిలుచుండి పోయారు. అప్పుడే సామానంతా సంచీలోకి కుక్కినశారద—ఆయన నిజానికి చూడక పోయినా చూశారనుకొని— స్తబ్ధయై నిలుచుండిపోయింది.

పద్మనాభంగారికి మొదట బోధపడలేదు. పిదప దిక్కులు పరికించి శారదచేతిలో సంచిని గమనించి సందేహిస్తూ "ఏమిటది!" అన్నారు. శారద మాటాడకుండా సంచీ అందిచ్చింది. తరువాత ఆయన అక్కడే వాల్చి ఉన్న మంచంమీద కూర్చుని ఒకటొకటే చొప్పున అందలి వస్తుజాలం బయటకు తీయసాగారు.

రంగురంగుల గుడ్డ పేలికలూ రెండుమూడు రిబ్బన్లూ, ఒక చిన్న అట్టను, రెండు క్రిమెన్నుపిన్నులు, ఇంకొక డజను సేఫ్టీ పిన్నులూ బయటపడ్డాయి.

"ఇవన్నీ ఎక్కడి వర్రా"

ఆ సగం చీకటిలో కూడా పద్మనాభంగారి మొఖంలో ఆశ్చర్యరేఖలు స్పష్టంగా కానవస్తున్నాయి. కాని ఎవరూ మాటాడలేదు. చివరకు చిన్నపిల్ల పార్వతికూడా పులుకూ పులుకూమని చూస్తున్నదే గాని దాని ధర్మమా అని పెదవి కదప లేదు. అయినా పద్మనాభంగారికి సంగతి తెలిసిపోయింది. ఆయన సంచీలోనుండి ఈసారి చలపతి నిక్కరు ఒకటి బయటకు లాగుతూ—

"అన్నయ్యవచ్చాడేమిటి?"—అన్నారు శారదవంక తిరిగి. శారద ఊఁకొట్టింది. వెంటనే ఆయన దిక్కులు చూస్తూ.

"ఏడీ" అన్నారు

అచిరకాలంలోనే చలపతి గదిలోనుండి బయటపడ్డాడు. నక్కుతూ నక్కుతూ వచ్చిన చలపతిని చూసేసరికి పద్మనాభంగారికి జాలివెయ్యటానికి బదులు ఎందుచేతో కోపం రాసాగింది. కొడుకుముఖంలోకి చూస్తూ—

"ఎప్పుడొచ్చావోయ్! అప్పుడే వచ్చావేం?"అన్నారు ఆశ్చర్యాన్ని ధ్వనింపజేసే గొంతుకతో—

చలపతి చెప్పాడు. కాని ఆయన పూర్తిగా నైనా వినిపించుకోకుండానే అన్నారు.

"ఓప్ ప్రోగ్రెస్ కార్డు సంతకంకోసరం నువ్వు స్వయంగా వచ్చేయాలా? ఎవరిచేత పంపినా సరిపోయేది కదూ? అసలు సంగతి అది నెపంపెట్టుకొని వచ్చేశావు! అంతేనా?"అన్నారు.

చలపతికి జవాబు చెప్పడానికి ధైర్యం చాలకుండాఉన్నది. కాని వెంట వెంటనే జవాబులివ్వకపోతే తండ్రికి—ఎలానూ తప్పకపోయినా ఆవచ్చేకోపం చప్పన వచ్చేస్తుంది. అందుచేత అన్నాడు—

"మంగళవారం శలవు"

"ఎందుకూ"

"శివరాత్రి!"

"అదీ సంగతి !!" అంటూ ఆయనకొడుకును నిలవేస్తూ "శివరాత్రీ, ప్రోగ్రెస్ కార్డూ"అన్నారు.

చలపతి తత్తరపాటులో జేబులు వెదికి తీసి ఇచ్చాడు. తండ్రి ప్రోగ్రెస్ కార్డువంక క్రిందామీదా చూస్తూ.

"ఒక్క లెఖ్ఖలూ తెలుగూనా పాసయ్యావ్ !"అన్నారు. చలపతి జవాబివ్వలేదు. వాడిముఖం క్షణక్షణంకూ పాలిపోతూ ఉండటం కాస్త ఎడంగా ఉన్న వారదకు కూడా కనిపిస్తునే ఉంది. అంతేకాదు తండ్రి ముఖంలో కోపరేఖలు కూడా అదే నిష్పత్తిని దట్టమౌతున్నాయి.

పద్మనాభంగారు ప్రోగ్రెస్ కార్డువంక చూస్తూ చూస్తూ చప్పన తలయెత్తి అంతేకన్నా ఆకస్మికంగా ఉత్తేజితమౌతున్న స్వరంతో అడిగారు.

"ఇలా సెలవులు వచ్చాయనేసరికల్లా ఇంటికి పారిపో రాక పోతే—ఏం—?—అక్కడ ఉండి నేర్చుకోరాదూ?" అన్నారు.

చలపతికి ఆ స్వరం విన్నాక చెవులు గింగుర్లెత్త సాగాయి; అందుచేతే నీరసంగా అట్లానే నిలువుగ్రుడ్లతో చూస్తూ కొంతసేపు పోయాక గ్రుక్కిళ్లు మ్రింగసాగాడు. తరువాత ఆకస్మికంగా అను కోని ఇంకో ప్రశ్న వచ్చిపడ్డది.

"ఇవన్నీ కొనడానికి నీకు డబ్బెక్కడిది?"

"చిన్నాన్న ఇచ్చారు"

చలపతి యీ జవాబు ఫరవాలేదు అనుకుంటూ చెప్పినది కాని తండ్రి ముఖంలో కోపరేఖలీ జవాబుకు తగ్గవలసిందిపోయి దట్టం కాసాగాయి. ఆ మార్పు ఆయన గొంతులో కూడా విని పిస్తుండగా అన్నారు.

"ఏ చిన్నాన్న"

"భాస్కరం చిన్నాన్న"

"ఎంత ఇచ్చాడు"

"ఐదురూపాయలు"

పద్మనాభంగారు ఎందుచేతో ఇక్కడ క్షణకాలం ఆగారు. ఈలోగా కోపం చప్పన పెరిగిపోగా అన్నారు.

"ఐతే ఎవరేమిస్తే అది పుచ్చుకోవడమే నేమిటి"

చలపతికి అంతకుముందుమంచే గుండె దడదడలు ప్రారంభ మయ్యాయి. క్రమక్రమంగా కాళ్లలో శక్తి సన్నగిలుతుండటం పిదప చెవులు గింగుర్లెత్తటం కూడా ఆరంభమయ్యాయి. ఈ చివరి ప్రశ్న వింటూ కన్నీరు కూడా విడువసాగాడు. పద్మనాభంగారి గొంతు ఎక్కణ్ణుంచో వస్తున్నదానిలా వినిపిస్తోంది. ఎదురుగా ఆ ముఖంమాత్రం రౌద్రం తాండవిస్తుండగా అతి సమీపాన్నే ఉన్నట్టు స్ఫురింపజేస్తోంది.

"చెప్పు! మాటాడవేం ?"

వాడు మాటాడగలిగే స్థితిలో లేడు. అందుచేతే మాటాడటం లేదు. కాని కోపానికి యోచనకూ చుక్కెదురు పద్మనాభం గారు—వాడి దగ్గరనుండి రెండవసారి కూడా జవాబు రాకపోయే సరికి ఉగ్రుడౌతూ లేచివెళ్లి ఆచి ఒక్కటి చెంపమీద చరిచారు.

కాళ్లలోపట్టు ఏనాడో తప్పిపోయిన చలపతి గూబలు గుయ్యిమంటుండగా త్రూలివెళ్లి గోడను చేరబడిపోయాడు.

తరువాత ఆ గొడవలో వాడి జేబులోనుండి సిగరెట్ కేస్ క్రిందపడిపోవటం తండ్రి దానిని తీసి తెరవటం, పిదప ఒకటి రెండు మాటలు ఏవో అనటం లీలగా జ్ఞాపకమున్నాయి. ఆ తరువాత తండ్రి వీపుమీద చరిచిన మొదటి దరువుతో వాడు క్రింద పడిపోయాడు.

అంతే ఆ తరువాత కొంతసేపటివరకూ జరిగిన దేమిటో వాడికి తెలియదు.

మళ్లా వాడికి స్పృహ కలుగ నారంభించేసరికి ముఖమంతా చెమటతో నిండి ఉన్నది. తాను మనిషంతా ఒక ముద్దలా ఉమ్ము చుట్టుకొని ఒక గోడచేరువను ఉన్నాడు. శరీరమంతా క్రమ క్రమంగా మంటలు ఆరంభిస్తున్నాయి. తండ్రి ఏదో మాట్లాడు తున్నట్టుంది. ఆ క్షణకాలానికి వినబడి ఇంకోసారి వినపడక క్రమక్రమంగా స్పష్టం స్పష్టతరం విస్పష్టంగా వినిపించసాగాయి. ఆయన మాటల్లో వాడికి జ్ఞాపకం ఉన్నవి చాలా కొద్ది. ఒకసారి అన్నారు.

"...నువ్వు ఈ మధ్యాహ్నమే అక్కడకుపో! మళ్లా ఈసారి పెద్దపరీక్షలు ఈలోగా తిరిగి ఇక్కడకు వచ్చావో... పాతేస్తాను మాటే! జాగ్రత్త!..."

ఇంకోసారి—

...ఈ పరీక్షే గాని పోయిందో ఇంక చదువూ గిదువూ ఏమీ లేవు. గోచీ ఒకటి పెట్టించి ఇంట్లోంచి తగిలేస్తాను. అంతే!"

చివరకు తండ్రిమాటలు ఆగిపోయాయి. అపరికి చలపతి చెవులు స్పష్టంగా వినగలుగుతున్నాయి.

ఈసారి కండ్లు విప్పసాగాడు. ఎప్పుడు తెరిచారో వీధి తలుపు తెరచారు. గదల్లా వెలుతురుతో నిండిఉన్నది. తండ్రిపాదాలు గది వంక పోతున్నాయి. అచిరకాలంలోనే చెల్లెళ్ల తడబడే పాదాలు గదిలోంచి పెరటిద్వారం వంక దూకుతూ పోవటం కానవచ్చింది.

తరవాత గదిలో ఏవో పెట్టెలు తెరిచిన శబ్దాలూ మరల వానిని మూయటం వినిపించింది. పిదప తండ్రితిరిగి వస్తున్నట్టు పాదాలచప్పుడు వినిపించగానే చప్పన కళ్లుమూసేసు కున్నాడు.

చివరకు కొంతసేపటి తరవాత వాడు రెండవసారి కళ్లు తెరి చేసరికి ఎదురుగా తండ్రిపాదాలు కాక ఇంకొకరి పాదాలు కానవస్తున్నాయి. ఆచిన్నపాదాలు మెల్లిమెల్లిగా తనను సమీ పిస్తూ వచ్చి ఆగాయి. చలపతి కళ్లు అప్రయత్నంగానే గదల్లా ఒకసారి కలయజూచాయి. ఇంకెక్కడా ఎవరిపాదాలూ కాన రాలే. చివరకా కండ్లు తనముందున్న పాదాలను సమీపించి వానిపై నిలచిపోయాయి. మట్టెలు పాంజేబులతో అలంకరింపబడ్డ ఆప ద్వనిపాదాలను చూస్తూ ఉంటే అంతవరకూ కంట ఒక్కనీటి చుక్కకూడా లేని చలపతి కండ్లు ఉండి ఉండి చప్పన అశ్రు పూర్ణము లయ్యాయి. చూస్తూండగానే మాలీగారి వావాతో

ఊపైనవచ్చినట్టు చలపతిగుండెలు క్రిందికీ మీదికీ పొంగుతూ క్రుంగుతూ ఉండగా ముక్కుసోటా కూడా ఉచ్ఛ్వాసనిశ్వాసాలు కొనిస్తూ చివరకొకస్థితికి వచ్చాక చిన్న రోదన మారంభించాడు.

లక్ష్మమ్మగారు కూడా ముక్కు చీదుస్తూ రెక్కపుచ్చుక వాడిని లేవనెత్తి బొంగురుపోతున్న కంఠంతో "లే! లేచి అవతకు పోయి యేడువు" అంటూ వాడిని పెరటి వరండాలోకి తీసుకపోయి విడిచారు.

చలపతి అక్కుర్లు బుక్కుర్లు ఏడుస్తూ వెనుకటింటి సందులోకి వెళ్లాడు.

* * * * *

దుఃఖితుడూ దురదృష్టజీవీ అయిన చలపతి, తండ్రి ఆదేశాన్ననుసరించి ఆ మధ్యాహ్నమే పట్నం ప్రయాణమయ్యాడు. వాడు నిర్మానుష్యములైన పల్లెపట్టుల కాలిబాటవెంబడి ఒంటరిగా పయనిస్తూ తోవలో తాను ఎంతగా ఏడ్చాడో వాడికే తెలియాలి. దానిని ఊహించడానికైనా అందరికీ సాధ్యం కాదు. పదకొండేళ్ల వయసే తల్లిదండ్రులను విడిచి పరాయిచోట అందులో నరక సదృశమైన వాతావరణంలో కాలం గడుపుతూ నెత్తిన తలకు మించిన భారం ఉంచబడి దానిని వహింపలేకపోతే నిర్దాక్షిణ్యంగా శిక్షింపబడుతూ అల్లరీ, ఆటపాటలు చివరకు నిద్ర కూడా కరవు కాగా జీవితాన్ని నిలుపుకుంటూ వచ్చిన నిర్భాగ్యులు చలపతి కాక ఇంకెవరైనా ఉంటేవాళ్లుమాత్రం ఊహించగలరు.

వాడు వాడు ఇంటికి రావటాన్ని గూర్చి నిండు ఇరవై ఎనిమిది రోజులు కలలు కన్నాడు. వాడు పండుగకు ఇక్కడనుండి తిరిగివెళ్లే లెక్కలు గణించాడు. ఈ ప్రయాణాన్ని కూడా వాడు వాడే నిర్ణయించుకున్నాడు. అప్పుడు తను విడిచిపెడుతున్న స్వగ్రామం, అడుగడుక్కీ దూరమౌతున్న స్వగ్రామం యిరవై ఎనిమిది రోజులు గడిచేసరికి అట్లానే క్షణక్షణం అడుగడుక్కీ దగ్గరౌతుంది.

ఇరవై ఎనిమిది రోజులంటే నిండు ఆరువందల డెబ్బదిరెండు గంటలు—నలభై వేల మూడువందల యిరవై నిమిషాలు—యిరవై నాలుగు లక్షల పందొమ్మిది వేల రెండువందల సెకనులు.

అయితే అందులో సగం నిద్రలోనే గడిచిపోతాయి. మిగిలిన వానిలో సగం స్కూల్లో గడిచిపోతాయి. మిగతా సగమే తాను గడపాలి. ఏముంది గంట గడిచిందంటే మూడువేల ఆరువందల సెకన్లు పోతాయి. ఇప్పుడే లెక్కలు చేస్తుంటేనే ఒక రెండు మూడు వందలు గడిచిపోయిఉంటాయి. ఎట్లాగో కళ్లు మూసుకోవాలి. అప్పుడు ఈ యిరవై ఎనిమిది రోజులూ గడిచి పోతాయి. ఆవాళ ఉదయం తెల్లవారకముందు మొట్టమొదటి బస్సులో తాను వచ్చేస్తాడు—'

చలపతికీ జ్ఞాపకాలతో మరొకతెర దుఃఖం ముంచుక వచ్చింది 'ఆ దురదృష్టపు రోజు ఈ దినమే. ఏ దినంకోసరం—ఏ శుభగడియలకోసం తాను సెకనులు లెక్కపెడుతూ ఇరవై ఎనిమిది దినాలు గడిపాడో ఆ దినమిదే! దుర్దినం ?!'

చలపతి మరి ఒకసారి వెక్కివెక్కి ఏడ్చాడు.

'ఈ వేళ ఉదయమే తను ఈ మార్గంగుండానే ఉరకలువేసి ఉత్సాహంతో ఇంటికి నడిచాడు! నిర్భాగ్యుడు!! తనకు తెలియదు అక్కడనుండి ఇట్లా ఈవాళే తిరిగిరావలసివస్తుందని!'

చలపతి దుఃఖం మరొక చిన్న అలగా లేచిపోయింది. కాని వాడెట్లాగో నిగ్రహించుకున్నాడు

'ఈ విశాల విశ్వంలో తనమీద జాలిచూపే వారెవరు! ఒక్క భాస్కరం చిన్నాన్న ఉన్నాడు. కాని లాభం లేదు. అతనికీ నాన్నగారంటే భయమే. తనను అందరూ ఏడిపిస్తునే ఉంటారు. అక్కడ స్నేహితులు పల్లెటూరి గబ్బిలాయనీ నిద్రభంగనీ ఏడిపిస్తూ ఉంటారు! తను ఏమీ చేయకపోయినా వాళ్లేమీ అనకపోయినా కాస్తయినా జాలి ఉండదు వాళ్లకు! ఆ మేష్టరు ఎప్పుడు కొడుతునే ఉంటారు. కళ్లనిండా నిద్రఅయినా పోనివ్వరు! బడిలోనూ దెబ్బలే! పోనీ తనవాళ్లుగదా అని ఇంటికి పోతే ఇంటిదగ్గర కూడా కొట్టి తగిలేశారు. పండుగనైనా చూడ లేదు!

వాడి మనఃపథాన అకస్మాత్తుగా తల్లి ఎదురయ్యింది.

ఆమె తను బయలుదేరటప్పుడు ఏడుస్తూఉంటే తను కూడా కళ్లనీళ్లు త్రిప్పుకొని "ఊరుకో నాయనా! ఏడవకు !! నాన్నగారి కోపం ఎంతోసేపు ఉండదులే! నేను ఆతరువాత ఆయనతో చెపుతాను. నువ్వు బుద్ధిగా ఉండు! ఏం చెయ్యమన్నావు చెయ్యి—ఆయన కొట్టారంటే నీ మంచిని కోసే !!!" ఇట్లా అంటూ చీరచెరగుతో తన కన్నీళ్లు తుడుస్తూ తన తలను దగ్గరకు తీసుకుంది.

చలపతి కీసారి వచ్చిన దుఃఖంవెల్లువ తల మునకలయ్యింది. వాడు స్పష్టాస్పష్టపు సడులలో "అమ్మా!...అమ్మా!!......అమ్మా!!!..." అంటూ పంచె క్రిందకు జారవిడుస్తూ నడుస్తున్న చోటే కూలబడిపోయాడు.

తరువాత హృదయభారం తీరేవరకూ అక్కడే కూర్చొని వెక్కివెక్కి ఏడ్చాడు. తనకూ తన నిర్భాగ్య జీవితానికీ తల్లినీ తలచుకొని ఎన్నెన్ని విధాల ఏడ్వాలో అన్నివిధాలా ఏడ్చాడు.

కాకైనా కానరాని ఆ నిర్మానుష్యపధాన ఆకైనా అల్లాడని ఆ నిశ్శబ్దగంభీర వాతావరణంలో చలపతి రోదనధ్వనులు అలలుగా మారి దిగంతరాళాలలో కలిసిపోతూ వచ్చాయి.

చాలాసేపయ్యాక ఆ దుఃఖితుడు తనను తానే సంబాళించుకొని లేచి పంచె తీసుకొని రోడ్ వంక నడిచాడు. చలపతి రోడ్ చేరుకునేసరికి బస్ కదలటానికి సిద్ధంగా ఉన్నది. చలపతి పరుగెత్తివెళ్లి అందుకున్నాడు.

## 12

చలపతితండ్రిచేత తరుచుదెబ్బలుతినేవాడు కాకపోయినా పద్మనాభంగారు వాడినికొట్టడం ఇదే మొదటిసారి కాదు.

ఆయన సాధారణంగా పిల్లలను కొట్టకేకొట్టరు. కొట్టారో చావదన్నిగాని విడువరు. అసలీపద్ధతివల్లే పిల్లలకు ఆయనంటే అంతహడలు. పిల్లలేకాదు లక్ష్మమ్మగారూ చివరకు భాస్కరం

కూడా నిజానికి ఆయనగారి యీధోరణివల్లే బెదురుగా ఉంటారు. అందులో లక్ష్మమ్మగారివిషయం చెప్పనేఅక్కర లేదు.

అయితే అట్టిలక్ష్మమ్మగారుకూడా యీసారి చలపతిదెబ్బలు తిన్న సందర్భం పురస్కరించుకొని చాలా గొడవచేశారు. ఉన్న పరిస్థితుల్లో చూస్తే దానిని ఒకవిధమైన తిరుగుబాటనికూడా అనవచ్చు—అంతగొడవ చేశారు. అయితే అంతసాహసం ఆమెకు ఎట్లా చిక్కిందీ అని ఎవరైనాఅనవచ్చు. అది ప్రశ్న గాదు. ఒక్కొక్క పరిస్థితిలో స్త్రీకైతే ముఖ్యంగా అది తనసంతానవిషయమైనప్పుడు అంతసాహసమేగాదు ఎంతసాహసమైనావస్తుంది. ఇక్కడకూడా లక్ష్మమ్మగారిసాహసం ఆవిధంగావచ్చినదే.

చలపతిని పద్మనాభంగారు తరిమివేసినపిదప ఒకపగలూ ఒకరాత్రీ ఆమె ఏకధారగా ఏడ్చారు. ఆమె సాధారణంగా కన్నీటితో భర్తకంటపడి ఎరుగదు. ఈసారిమాత్రం భయపడలేదు. అంతేకాదు ఆ రాత్రీమరునాడూకూడా శారదే పద్మనాభంగారికి వడ్డించింది. అయితే మూడవనాడు లక్ష్మమ్మగారు వడ్డించవస్తే పద్మనాభంగారు విస్తరివద్దనుండి లేచిపోయారు.

దానితో ఒక వారంరోజులవరకూ లక్ష్మమ్మగారిపని వండటం శారదపని వడ్డించటంగా జరిగింది. ఈలోగా లక్ష్మమ్మగారు కొన్ని ఏకాదశులూ శనివారాలుకూడాచేశారు. ఇంక శివరాత్రినిజమైన శివరాత్రేఅయింది. ఇవన్నీ చూచాయగా పద్మనాభంగారికి తెలుస్తూనేవచ్చాయికూడా అయినా పరిస్థితులేమీ చక్కపడలేదు. అంతట లక్ష్మమ్మగారు ఒక శుభముహూర్తం చూసి ముఖాముఖిని పోట్లాటకుదిగి ఊరుకున్నారు.

ఆవాళ మామూలుగానే పద్మనాభంగారు పెరటివరండాలో భోజనానికి కూర్చున్నారు. శారద తొలివడ్డనపూర్తిగా వించింది. పద్మనాభంగారు పరిషేచనపట్టి ఏదో ఆలోచిస్తూ పప్పూఅన్నంకలపటం ఆరంభించారు. అయితే అల్లా ఎంతసేపు కలిపినా అందులో మామూలుగా కురిసే ఆజ్యధార కురియలేదు.

“నెయ్యేదమ్మా?” అంటూ పద్మనాభంగారు తలఎత్తారు ఎదురుగా తడవిడపడేచేతులతో లక్ష్మమ్మగారు నేయి వడ్డిస్తున్నారు. ఆయన ఎడమచేయి అంత ఆకస్మికసంఘటనలోకూడా అప్రయత్నంగానే మంచినీటిగ్లాసు మీదికిపోయింది. కాని ఏడుపువల్ల గాదరించినముఖం—ఆ ముఖంలో ఇంకా అతిదట్టంగా కొనవచ్చే దుఃఖమేఘాలూ చూచేసరికి చలనత్వరపడలేకపోయారు. కొంతసేపు ఆలోచనపిదప ఆయన మెల్లిగా ఎడంచేతిగ్లాసు అందుకోగారు. లక్ష్మమ్మగారు చప్పననేతిగిన్నె క్రిందనుపెట్టి ఉచ్చస్వరంలో అరవసాగారు. కాని శోకార్ద్రమవటంవల్ల ఆ గొంతు బహువికృతంగా వినిపించసాగింది. ఆమెఅన్నారు.

“చూడండీ! చూడండీ! మీరు అన్నంవద్దనుంచి లేచారంటే నే నిప్పుడే నూతిలోదూకి చస్తాను. ఇవాళ నేను చెప్పేమాటొకటీ చేసేమాటొకటీకాదు. పైన మీ ఇష్టం!”

పద్మనాభంగారు తలఎత్తిచూశారు. ఎర్రని ఆమె నేత్రాల నుండినీళ్లు జలజలజల రాలుతున్నాయి. ఇంకా ఎడతెగని ప్రవాహంగా అవిసుడులు తిరుగుతున్నాయికూడా. దుఃఖభారంవల్ల ముఖంలోని కండరాలన్నీ వికృతరూపాలు పొందగా ముఖమల్లా కూడా వికృతంగా కనుపిస్తోంది. మొహంలో పద్మనాభంగారు గత పదిహేనేండ్లలోనూ చూడని అపూర్వమైన సాహసముద్రస్పష్టంగా కానవస్తోంది. ఆమె ముఖంచూస్తూఉంటే ఏభావం ప్రేరేపించిందోకాని అతనికి నవ్వురాసాగింది. ఆయన దానిని నొక్కిపెడుతూ అన్నారు.

“ఎందుకైనామంచిది ఉత్తరంఒకటి వ్రాసిపెట్టి దూకు!” అన్నారు.

లక్ష్మమ్మగారు దీనికి జవాబివ్వలేదు. పద్మనాభంగారు కూడా తలవంచి మెల్లిగా భోజనం కానివ్వసాగారు. లక్ష్మమ్మగారట్లా అక్కడే నిలబడి దుఃఖం ఆగిందాకా ఏడుస్తూ మధ్య మధ్య పద్మనాభంగారికి కావలసినవాటిని చూసుకుంటూ వడ్డించసాగారు. చివరకు పద్మనాభంగారి భోజనంకాగా ఆయన లేచి వెళ్లిపోయారు.

తరువాత ఆ మధ్యాహ్నం ఆయనంతట ఆయనేకదలవేశారు. కొంత రాద్ధాంత సిద్ధాంతాలయ్యాక లక్ష్మమ్మగారన్నారు. “అది బాగుంది నేను ఏడవటానికికూడా నాకు హక్కులేదేమిటి?” దీనిపై పద్మనాభంగారు నవ్వుతూ అన్నారు.

“ఐనకటికెవడోఒక భావకవిఅన్నట్టన్నావ్! కాని పతివ్రతైనస్త్రీకి భర్తఆజ్ఞ లేనిదే అందుకుకూడా హక్కు లేదు.”

అంటూ మరికొంతచర్చ తరువాత ఇద్దరూవిషయానికి వచ్చారు. పద్మనాభంగారన్నారు.

“సరే నేను కొట్టడానికి కారణాలువిను. ఒకటి వాడిసిగరెట్లు. దానికి నువ్వేమీ జవాబివ్వలేవు. రెండు వాడు భాస్కరం దగ్గర డబ్బుపుచ్చుకోవటం— ఇవాళ వాడిదగ్గరయ్యింది రేపు ఇంకొకడిదగ్గర. కాగా, వాడికి వీడిని దగ్గరపెట్టుకొని బాగుచెయ్యటానికి అభిమానం లేకపోయిందిగాని, వీడికి విదులూ పదులూయిచ్చి చెరపటానికి ఎక్కడలేని అభిమానంపుట్టుకవచ్చింది—”

ఇక్కడ లక్ష్మమ్మగారేదో చెప్పబోయారుకాని పద్మనాభంగారు “ఉండుఉండు” అంటూ మళ్లా “తరువాత చెప్పుదువుగాని— అది వాడితప్పుకాదంటావుసరే మూడవది పరీక్షలు రెండునెల్లు పెట్టుకొని ఒకరోజు సెలవుకు నాలుగురోజులు ముందుగారావటం! వీడికి నే నెన్నిసార్లు మంచిగా బోధపరచానూ—అల్లా మూడు మూడురోజులకూ రావద్దనీ దానివల్ల చదువు పాడవుతుందనీ! ఆ పరీక్షల్లో చూడబోతే రెండింటతప్ప అన్నింట్లోనూ పేస్‌మార్కులకు తక్కువేవచ్చాయికదా! యీ యేడాదిపరీక్షపోతే?”

లక్ష్మమ్మగారు నిరుత్తరులైపోయారు. పద్మనాభంగారు అన్నారు.

“—ఏమైనాఅంటే చిన్నవాడు తల్లిదండ్రులనువదలి ఉండటం కష్టంకాదా. అంటావు. నిజమేకాని జాలిపడిచెయ్యవలసిందేముంది చదువుమానిపించలేంకదా. చదివించేటప్పుడు వాడిని పరీక్షలో పాసయ్యేటట్టు చూడకవిధిలేదు. వాడికి చదువుమీద

శ్రద్ధాలేకపోతే మనం భయపెట్టో భంగపెట్టో ఆ శ్రద్ధను కలిగించకపోతే ఎలా?"

పద్మనాభంగారు ప్రశ్నించి ఆగగా లక్ష్మమ్మగారినోట వచ్చి వెలక్కాయపడ్డట్టు కాసాగారు. ఆమెకు భాస్కరం చెప్పిన విషయాలు హృదయాన్ని కలుస్తున్నాయి. కాని వాటిని బయటపెట్టటమో మానటమో నిర్ణయించుకోలేకపోయారు చివరకొక చుట్టుదారిని విషయానికి వచ్చారు. కాని పద్మనాభంగారు ఆరాలుతీసి అంతా బయటకు లాగారు. అంతావిన్నాక ఆయన కాస్త ఆలోచించి అన్నారు. "సరేనాకు అన్ని విషయాలూ తెలియకనే అనుకుందాం. మీ మరిదివాడు పడుతున్నకష్టాలగురించి చెప్పినదంతా కూడా నిజమనేఅనుకుందాం. అందులో అతిశయోక్తి కాస్తకూడా లేదనే ఒప్పుకుంటాను. అయితేమాత్రం చేయగలిగింది ఏమున్నదో చెప్పమీ? వాడి మానాన్ని వాడిని ఒక్కడినీ ఏ లాడ్జిలోనో ఉండమనలేంకదా. భాస్కరం వాటేలా అక్కడ మనచుట్టాలెవరూ ప్రస్తుతం లేరుకదా? మరి?"

పద్మనాభంగారు ప్రశ్నించి ఆగిపోయారు. ఎంతసేపైనా లక్ష్మమ్మగారుమాత్రం జవాబుచెప్పలేకపోయారు. చివరకు పద్మనాభంగారే అన్నారు. "సరే నీ మనసులో ఉద్దేశంప్రకారం వాడిని తీసుకువెళ్ళి ఎక్కడో ఎనభైమైళ్ళదూరానవున్న మీ మరిదిదగ్గరచే పెట్టాననుకో — అప్పుడేమౌతుందో తెలుసా? ఇప్పుడు ఒకరిముఖాన్ని ఒకరు చూచుకొని ఏడ్చిన వదినామరుదులే అప్పుడు ఎడమొఖాలూ పెడమొఖాలూ పెట్టుకుంటారు!"

లక్ష్మమ్మగారు ఈ మాటలను వింతగా వినసాగారు. పద్మనాభంగారు కాస్త ఊరుకొని చెప్పనారంభించారు. "నీకింకా మీ తోటికోడలుగారిస్థితి పూర్తిగా అర్థమైనట్టులేదు. ఆమె నీలా పల్లెటూరిలో పుట్టలేదు. వాళ్ళకేపల్లెటూరన్నా పల్లెటూరి మనుష్యులన్నా ఎట్టి సదభిప్రాయంఉంటుందో ఊహించలేవు. జ్ఞాపకమున్నదా—వాళ్లు ఏనాళ్ళకు ఇక్కడకువచ్చారు! అప్పుడు వాళ్లెలామాటాడారో జ్ఞాపకంఉన్నదా! ఒకరికి ఈ బండి కుదుపులకు ఒళ్ళల్లా ముద్దఅయిపోయింది. యింకొకర కండ్లకు ఈ ఊరు చుట్టూఉన్న చెట్లు అడివిలా కనిపించాయి. బహుశః—దాని అర్థం ఇక్కడఉన్న వాళ్లు జంతువులని అన్నా అనవచ్చు. వాళ్ళవాళ్ళ ఉద్యోగాలగురించీ వాళ్ళగొప్పలగురించీ ఎట్లా డాబులుకొస్తూ మాట్లాడారో మరిచిపోలేదనుకుంటాను. ఆ అమ్మాయివాళ్ళమధ్య పుట్టి పెరిగిన అమ్మాయేకద! మీ మతికి అపసంతి చలపతిని దగ్గర పెట్టుకొని చాకిరీచేస్తుందా?...ఐతే మన భాస్కరం లేడా అంటావు. ఉన్నాడు. ఉంటే రోజుకు ఎన్నిగంటలు ఇంటివద్ద ఉంటాడు, ఆ తరువాత!"

పద్మనాభంగారు ఆగిపోయారు. లక్ష్మమ్మగారు మరొకసారి విభ్రాంతులౌతూ మూగపోయి అట్లానే ఊరుకొన్నారు.

చాలాసేపటి తరువాత పద్మనాభంగారు ఒక నిట్టూర్పు విడుస్తూ అక్కడినుండిలేచి పోబోయి మళ్లా ఆగి అన్నారు.

"నీకు లోకంసంగతి తెలియదు. మనుష్యులు ఎంతమాటాడితే అంత హృదయంలోంచే వచ్చిందనుకోకు. ఏదైనా ఒకవిషయం గూర్చి ఒకరు ఒకవిధంగాచెపితే అది అలా వుండటం కారణం కాదు. దానివెనుక నిజమైనకారణం ఇంక ఎక్కడో ఉంటుంది." ఇట్లా అంటూనే ఆయనలేచి బయటకెళ్లిపోయారు.

# 13

జీవితంలో సాధారణంగా దగ్గర వారి నడుమ సంయోగ వియోగా లేర్పడేది శుభా శుభాల్లో. ఒక్కొక్కప్పుడు క్రమ గతిని ఇంకొకప్పుడు విపర్యయాలు గానూ ఏర్పడేయీ సంయోగ వియోగాలు చిత్రమైన అనుభూతులు కలిగిస్తాయి. సుఖంలో సుఖం దుఃఖంలో దుఃఖం కలిగించే వాటి మాట అటుండగా సుఖంలో దుఃఖం దుఃఖంలో సుఖం కలిగించేవే చిత్రమైనవి.

పద్మనాభంగారి ఇంట్లోకూడా అట్టిదే ఒకటి జరగడంతో పరిస్థితంతా తారుమారయ్యింది.

అవి వేసవి ప్రవేశించిన తొలి రోజులు. చలపతిని శివరాత్రి ముందు తరిమివేసిన పిదప పద్మనాభంగారు ఉత్తరం వ్రాసినప్పటికీ వాడు సంవత్సరాదికి ఇంటికిరాలేదు. పద్మనాభంగారు నవ్వుకోగా లక్ష్మమ్మగారు ఏడిచారు. ఐతే పిదప పరీక్షలై వేసవి శెలవులు ఇచ్చిన తరువాత నాలుగు రోజులు గడిచినా వాడు రాకపోయేసరికి 'దొరగారిని పిలవాలి కాబోలు' అంటూ పద్మనాభంగారా ఉదయం శ్రీకాకుళం ప్రయాణమయ్యారు. అందుచేత లక్ష్మమ్మగారికి కావలసినంత తీరిక లభించింది. వెంటనే ఆమె ఆ పదవ కాళాన్ని వృథా పోనివ్వకుండా సుమారు పదికుంచాల వరకూ కందులు వేయించటానికి పూనుకున్నారు.

శారద చిన్నదే ఐనా దానికి చాలా విషయాలు తెలుసు. తల్లి నెలలు నిండవచ్చిన చూలాలనీ అట్టి సమయాల్లో బరువు పనులు చేయరాదనీ ఆ పిల్లకెట్లా తెలుసో తెలుసు. అందుచేత ఆపే "పోనీ నేను వేయించటం నేర్చుకోనా అమ్మా?" అన్నది. కాని లక్ష్మమ్మగారు "నీ మొహం! కావలస్తే తిరగలి సాయం పడుదుగానిలే!" అనేశారు.

రెండు మూడు వాయలు వేగాయి. తరువాత వాయిదించి వాయి వేయబోతూ ఉంటే శారద వీధిఇంట్లోంచి పరుగెత్తుకు వచ్చి—

"అమ్మా అమ్మా నాన్నగారు వచ్చేశారే!" అన్నది ఆశ్చర్యంగా

నిండా చెమటలు పోసిన ముఖాన్ని శారదవంక త్రిప్పి ఆమెవంక అలానే చూస్తూ ఆలోచనలో పడ్డారు లక్ష్మమ్మగారు. శారద మళ్లా అన్నది.

"నాన్నగారు ఏమిటోగా ఉన్నారు! దస్తుపెట్టి తెమ్మన్నారు. తెచ్చి ముందుపెడితే ఒకసారి నాముఖం కేసీ ఒకసారి దస్తుపెట్టి కేసి అలా రెండుమూడుసార్లు చూచారు. తరువాత పెట్టె తెరిచారు. ముందట రెండువంద రూపాయనోట్లు తీశారు. మళ్లా పెట్టె మూసేశారు. మళ్లా తెరిచారు. మళ్లా కొంతడబ్బు తీశారు. మళ్లా..." శారద పూర్తి చేయనేలేదు లక్ష్మమ్మగారు కదిలి లేచి వీధిఇంట్లోకి నడిచారు. పద్మనాభంగారు నల్లగా

మాసి ఉన్న ముఖంలో చెమటకు తడిసిపోయిన లాల్చీతో తప్పు అకోసరం ఎదురుచూస్తున్నారు. లక్ష్మమ్మగారు నెమ్మదిగానే ఎంతో మారిపోయిన గొంతుకతో

"నేను ఊరుకు వెళ్తున్నాను. ఒకటి రెండు రోజులు ఆలస్యమైనా గాభరా పడకు" అన్నారు.

లక్ష్మమ్మగారు చటుక్కున "ఏ ఊరు?" అన్నారు. అన్నాక తను చేసిన తప్పు గ్రహించి భయపడ్డారు. కాని ఆయన మాత్రం అది గ్రహించే స్థితిలో లేరు. ఇందుమించు అప్రయత్నంగా "శ్రీకాకుళం" అన్నారు. ఈజవాబు విన్న లక్ష్మమ్మగారిని ఇచ్చిన పద్మనాభంగారినీ కూడా ఉత్తలపెట్టింది. పద్మనాభంగారు నిలువ గ్రుక్కుకుంటూ అన్నారు—

"నువ్వు అనవసరంగా గాభరాపడకు, చలపతికి ఒంట్లో బాగులేదని జాబులో తెలిసింది. అవసరం ఉంటుందేమోనని డబ్బు కోసరం ఇంటికి వచ్చాను.—"

అతను చెప్పేది పూర్తికానేలేదు లక్ష్మమ్మగారడిగారు

"ఏంజబ్బు!"

జరిగిన పొరపాటు గ్రహించి పద్మనాభంగారు అన్నారు.

"ఏమో జబ్బు తెలియదు. మామూల్లు జబ్బే అయివుంటుంది. ఊరికే నే ఎందుకైనా మంచిదని!"

కాని పద్మనాభంగారి వటన నిష్ప్రయోజన మయ్యింది. లక్ష్మమ్మగారు క్రమ క్రమంగా జీరబోతున్న గొంతుకతో అడిగారు

"ఎవరు చెప్పారూ!"

"భాస్కరం కబురంపాడు"

"ఐతే వాడెక్కడున్నాడూ!"

"శ్రీకాకుళంలోనే"

అంతతో లక్ష్మమ్మగారి ప్రశ్నలైపోయినట్లుగ పడ్డాయి. కాని ఇంకొక్కటి అడిగారు.

"ఏమని కబురంపాడూ!"

"నన్ను మాత్రం రమ్మన్నాడు గాబరా పడవద్దన్నాడు"

తరువాత కొంతసేపటి వరకూ నిశ్శబ్దం.

"పోనీ నేనూ వస్తే" అన్నారు లక్ష్మమ్మగారు మళ్ళా, ఇక్కడే పద్మనాభంగారు మరి ఒకతప్పు చేశారు. ఆయన ఆలోచిస్తూ,

"ఇవాళ కాదు... నేను వెళ్లివచ్చి రేపు తీసుకవెళ్తాను" అన్నారు. లక్ష్మమ్మగారు మరి మాటాడలేదు. కొంతసేపుపోయాక పద్మనాభంగారు ఆలోచనలు తెముల్చుకొని ఆమె కోసరం చూస్తే ఆమె అక్కడ లేదు. అంతట దగ్గరలోనున్న శారదతో "తను వెళ్తున్నానని" చెప్పమని ఆ మండుటెండలో గొడుగుకూడా మరిచి ప్రయాణం చేయసాగారు. అయితే కొంత దూరం పోయాక గొడుగు మాట జ్ఞాపకం వచ్చింది. 'కాని ఇప్పుడెలావస్తుంది?' అనుకుంటూనే ఆయన వెనుదిరిగి చూశారు. ఆయన ఆశ్చర్యానికి ఒక మనిషి తన వెనకనే పరుగెత్తుకుంటూ వస్తున్నాడు. వాడు తనను చూచి చేయి కూడా ఊపాడు. ఐతే వాడి చేతిలో గొడుగు లేదు. ఏమై ఉంటుందా అని అతను ఆశ్చర్యపోతుండగానే వాడు సమీపించి జాపోస్తూ

"మిమ్మల్ని వెనక్కి రమ్మన్నారు!" అన్నాడు.

పద్మనాభంగారికి మొదటి దరువు కొయ్య కట్టినే అంత పని చేసింది. ఆయన ఎట్లాగో నిగ్రహించుకొని "ఎందుకూ!" అన్నారు.

"లక్ష్మమ్మగారికి ఒంట్లో బాగులేదు."

ఇది రెండవ దెబ్బగా కాగా అక్కడికే అన్నారు.

"అంటే"

"నొప్పులు."

ఈ సారి మరి మాటాడలేదు. పిల్లాళ్ల తరువాతగాని రావను కొన్న యీ నొప్పులు ఆ వాళే వచ్చాయనగా నలుగురు బిడ్డల తండ్రైనా ఎందుచేతో ఆయన గుండెలు ఎండిపోయాయి.

## 14

ఆయన ఇంటికి వెళ్లేసరికి ఇల్లంతా ఆడవాళ్లతో నిండి ఉన్నది. ఆప్తులైన నలుగురైదుగురు మగవారు కూడా వీధి వరండాలో ఉన్నారు. పద్మనాభంగారు ఇంటికి రాగానే అంతా చుట్టు ముట్టేశారు.

ఒక పావు గంట కాలంలో వాళ్లంతా ఏమేమిమాటాడారో పద్మనాభంగారితో ఏం చెప్పడానికి ప్రయత్నించారో అంతా వ్రాయబోతే ఒక మహాగ్రంథ పరిమాణమంత తేలుతుంది. కాని దాని తాత్పర్యం మాత్రం చాలా తక్కువే.

పద్మనాభంగారట్లా వెళ్లగా శారదలోనికి వెళ్లింది. తల్లి కోసరం వెతికితే ఎక్కడా కనపడలేదు. చివరకు వంటింట్లో కనబడ్డారు. ముఖం తిరిగి ఉన్నారు. నీళ్లు చల్లి తెలివి తెప్పించి తండ్రి కోసరం పరుగెత్తుతానంటే ఆపేశారు. అలా ఒక పావుగంట వరకూ అక్కడే ఉన్నారు. పిదప అకస్మికంగా అమ్మో అంటూ గిరగిర చుట్టుకోసాగారు. శారద బెదిరిపోయి జగన్నాథం భార్య వద్దకు పరుగెత్తింది. వెంటనే సూరమ్మ జగన్నాథం క్రమంగా ఊరూ వాడా కూడా వచ్చారు. నెలలు నిండవచ్చిన మూలాలు కాబట్టి భయోత్పాతం కలిగించే వార్త వినగానే ఇట్టి పరిస్థితు లేర్పడ్డాయి. ఎందుకైనా మంచిదనీ అక్కడ చలపతి దగ్గర ఎవరో ఒకరు ఉన్నారు కాబట్టీ అతనిని వెనుకకు పిలిపించారు.

పద్మనాభంగారు అంతా వింటూ ఒక్క మాటైనా ఆడకుండా అట్లా కూర్చున్నారు. కథకులు కథనం పూర్తయాక వైరాగ్యోపన్యాసాలు ఆరంభించారు దాని సారాంశం కూడా చాలా కొద్దే.

'కష్టాలు ఎప్పుడూ ఒంటరిగా రావు. వాటికై బెదిరి పోకుండా ధైర్యంగా ఎదుర్కొనటమే మనుష్యుడి కర్తవ్యం. పైన భగవచ్చిత్తం'

తరువాత ఎప్పుడెప్పుడు ఎవరెవరికెట్టి ఎట్టి కష్టాలు ఎలా ఎలా కల్గుతూ వచ్చాయో వానిని వారు వారు ఎలా ఎదుర్కొన్నారో స్వీయ చరిత్రలలోంచి ఇతరుల చరిత్రలలోంచీ చివరకు పురాణ పురుషుల చరిత్రలలోంచీ కూడా వినిపింపబడ్డాయి.

పద్మనాభంగారన్నీ వింటూ కూర్చున్నారు.

క్రమంగా ప్రొద్దెక్కటంతో భోజనాల వేళ కాగా ఒక్కొక్కళ్లే తప్పుకున్నారు. ఒంటిగంటకు శారద వచ్చి భోజనానికి లెమ్మన్నది. ఎంగిలిపడి రమ్మని జగన్నాథం ఎన్ని విధాల చెప్పినా పంతులుగారు ఊకొడుతూ కదలలేదు. తరవాతి కాఫీ కాచిచే ఆది శాస్త్రిగారు.

క్రమంగా మధ్యాహ్నం సాయంసంధ్య రాత్రిపూర్వార్థం గడిచిపోయాయి. చివరకు పదకొండుగంటలయ్యాక రెండు నిముషాలకు మగపిల్లడు పుట్టాడన్నారు.

ఈ పది పదిహేను గంటలూ నొప్పులతో హృదయాన్ని కలంచేదిగులతో స్త్రీయుక్తవస్థరణ సందేహంవల్ల కలిగే బెంగతో ఆ ఆసన్న ప్రసవ ప్రాణం ఎంత హైరాణా పడ్డదో, ఆమె మూర్ఛలతో వేదనతో బాధను చూస్తున్నందువల్ల కలిగే జాలీసానుభూతులతో పరిసరులెట్లా కొట్టుమిట్టాడుకున్నారో, అన్నిటినీ మించి పద్మనాభంగారు ఎట్లాటి విషమసంకేతాలతో భయాలతో ఊహలతో గుండెలుపట్టుకొని కూర్చున్నారో వర్ణించటానికి భాష చాలదు.

పండ్రెండు గంటలకు పురుడు వచ్చిందని తెలిశాక కొంత స్థిమిత పడ్డారు. తల్లి చాలా రక్తాన్ని నష్టపోయిందనీ తెలివితప్పి పడిఉన్నదనీ అన్నారు. అయినా అతనిగుండె భారం కొంత తగ్గింది. చివరకు రెండుగంటలకు నిద్ర కూడా పోయారు.

అయితే ఆ నిద్ర ఎంతోసేపు సాగలేదు. నాలుగు గంటల వేళప్పుడు సూరమ్మ శారదచే పద్మనాభంగారిని నిద్రలేపించి అన్నది—

"మాట దక్కిందికాదయ్యా పెద్దబాబూ!"

మగత నిద్రలో ఉన్న పద్మనాభంగారికి అదికలో నిజమో తెలియడంలేదు. ఒకవంక శారద ఏడుస్తున్నట్లగపడ్డది. ముంచే కళ్లను అల్లారుస్తూ,

"ఏమిటి ?" అన్నారు. సూరమ్మ జవాబిచ్చింది.

"పిల్లడు పోయాడు"

నిద్రమత్తు సగం సగంవీడగా పద్మనాభంగారించుమించు అప్రయత్నంగా అడిగారు.

"ఏ పిల్లడు ?"

జగన్నాథం భార్య పాప శాంతినికోరుతూ అన్నది.

"పురిటి పిల్లడయ్యా! దబ్బ పండులాటి పిల్లడు మనకు అదృష్టంలేదు" అంటూ నిట్టూర్చింది. పద్మనాభంగారు మాటాడలేదు. ఆమె పోతూపోతూ ఆగిచెప్పింది.

"ఆ పిల్లల అదృష్టం నీ అదృష్టం యింతవరకూ బాగానే ఉన్నది. ఇకముందైనా బాధలేకపోవచ్చు. ప్రస్తుతానికి మాత్రం ఒంటిమీద స్మారకంలేదు. పిల్లడు పోయాడని తెలిసి ఇప్పుడిప్పుడే స్మారకం తప్పిపోయారు", అంటూ అక్కడనుంచి వెళ్లిపోయింది. పద్మనాభంగారికి ఆ సరికి నిద్రమత్తు పూర్తిగా పోయింది.

అది తెల్లవారుజామైనా వాసంతి ప్రత్యూషపవనాలు నెమ్మదినెమ్మదిగా వీచనారంభించాయి. పట్టింట బెడ్ లైటు ఆరిపోయినట్టు మరీ మసకవెలుతుర్లు చిమ్ముతోంది. బయట వాకిట పున్నమరేయి వృద్ధచంద్రుని వెన్నెల కూడా అట్లానే బహు హీనంగా ఉన్నది.

దీపాలు బాగా తరిగిపోవటంవల్ల చీకటికి స్థానం అధికంగా లభిస్తోంది. పురిటింట ఆడవాళ్లు ఉండీఉడిగీ మాట్లాడేటప్పటి స్పష్టాస్పష్టపు మందర ధ్వనులు తప్పిస్తే సమస్త వాతావరణం బహు ప్రశాంతంగా ఉన్నది.

చీకటిగా ఉన్న వరండాలో మంచంపై కప్పుకొని కూర్చుని ఉన్న పద్మనాభంగారు అట్లా గుండెలు పగలజేసే ఆ నిశాంత ప్రశాంతతను [illegible] కాలం గడిపారు.

తూరుపు తెలుపెక్కింది. కాకులు కాకా శబ్దాలతో జగత్తును మేలుకొలుపులు పాడాయి. చివరకు బాగా తెల్లవారింది.

జగన్నాథం వచ్చి ఎట్లా ఉన్నదన్నారు. పద్మనాభంగారు అంతలో కొంత స్థైర్యాన్ని కోలుకున్నట్టు మాటాడినారు.

జగన్నాథం సలహాతో సూరమ్మ మొదలైన వారిచ్చిన హామీతో పద్మనాభంగారు—ఆ మధ్యాహ్నంవరకూ చూడటానికి అప్పుడు పట్నంపోవటానికి నిశ్చయించుకున్నారు. కాని పదిగంటలవేళ పట్నంనుండి రెండవకబురు వచ్చేసరికి ఏం మరి మార్చుకున్నారో ఆకస్మికంగా ప్రయాణమై పోయారు.

## 15

లోకంలో అనేక రకాల మనుష్యులుంటారు. అందులో ఒక రకం వారి స్వభావాలు అతి విచిత్రమైనవై ఉంటవి. వారు సాధారణసమయాల్లో అతి ధీరస్వభావులుగానూ మంచి యోచనాపరులుగానూ కనుపిస్తారు. కాని తీరా ఒక ఆపద వచ్చేసరికి వాళ్ళంత పిరికివాళ్లూ ఆలోచనా శూన్యులూ ఇంకొకరు ఉండరని ఋజువుచేస్తారు. జరిగే చిత్రమేమంటే వారి అసాధారణ యోచనాశక్తే విషయాలను గూర్చి యోచించటంలో అతిగా యోచించి మోసం చేస్తుంది. దానిలో లేని ఆపదలూ జరగబోని ప్రమాదాలూ కూడా వచ్చి తీరినవన్నట్టూ పొంచి సిద్ధంగా ఉన్నట్టూ ఊహించి అనవసరంగా పిరికిమందు వేస్తారు. అంతే. అంతటితో వారి వివేకజ్ఞానం మొక్కవోయి ఊరుకుంటుంది.

పద్మనాభంగారు సరిగా ఈ తెగకు చెందిన మనిషి.

కాని ఒక దెబ్బ భరించి తిన గుండె పగులకపోవటం చూచుకోగానే ఆయన కోల్పోయిన ధైర్యాన్ని చేకూర్చుకోసాగారు. కాగా అది ఎట్లా స్ఫురించిందో తెలియదు. ఆయన కొక చిత్ర

మైన భావం స్ఫురించింది. 'అదృష్టదేవత ఏకారణానో అలిగి విసిరిన అమ్ము ఆయువుపట్టున తగలకుండా కొద్దికాలంలో మాని పోయేగాయం చేసి విడిచింది. అందుచేత బహుశః ఇంక పరవా ఉండరారు'—ఈభావం కూడా ఆయనకు చాలా ధైర్యం కలిగించింది. ఆయన పండ్రెండుగంటలకల్లా ఇంచు మించు శాంతించిన హృదయంతోనే శ్రీకాకుళం చేరుకున్నారు.

బస్సుదిగుతూనే ఆయన మేష్టరుగారి ఇంటికి వెళ్ళారు. కాని అక్కడ చలపతి ఉన్న జాడగాని, భాస్కరం వచ్చినజాడ గాని చివరకు మేష్టరుగారి జాడకూడా కనుపించలేదు. మొదట ఆయన దబ్బున మళ్ళా బెంగటిల్లిపోయారు. పిదప మేష్టరుగారి భార్యవచ్చి విషయాన్ని వివరింపగా శాంతించారు.

అయితే పద్మనాభంగారికి భాస్కరం స్నేహితుని ఇంటి ఉనికి తెలియదు. కాగా సాయంత్రం మాష్టరుగారు వచ్చే వరకూ ఎదురుచూస్తూ కూర్చోవటమూ సాధ్యంకాదు.

ఆలోచిస్తూ ఆయన బస్సు స్టేండుప్రాంతాల తారట్లాడ సాగారు. చివరకు అనుకోకుండా భాస్కరం అగుపించాడు. అచిరకాలంలోనే వారు తమ బసను సమీపించారు.

అక్కడ చలపతి మంచం ప్రక్కను కూర్చొని ఒక ఇరవై యేండ్ల ఆరూఢయువ్వని వాడితో ఏమో మాటాడుతోంది. పద్మనాభంగారు ఆమెను ఆయింటివారికి సంబంధించిన స్త్రీగా అర్థంచేసుకొని ఆమెకు అక్కడనుండి పోవటానికి అవకాశమిస్తూ ద్వారంవద్దే నిలచిపోయారు. కాని ఆమె "అరుగో నాన్నగారు" అంటూ చలపతితో అనగానే ఆమెను రాఘవినిగా గుర్తించ గలిగారు.

చలపతికి తండ్రిముఖంచూస్తే చాలా ఆశ్చర్యం వేయసాగింది. ఆతని ముఖమంతా నల్లగా మాడిపోయి ఉన్నది. కండ్లు లోతుకుపోయాయి. వారంరోజులై నిద్రాహారాలులేని మనిషిలా ఉన్నారు. ఆయన వాడి మంచాన్ని సమీపించి వారగా కూర్చుంటూ "ఎలా ఉందిరా?" అన్నారు స్నేహాన్ని ధ్వనించే గొంతుతో—చలపతి ఈ ప్రశ్నకేమీ జవాబివ్వలేదు. పద్మనాభంగారు వాడికేసి ఒకసారి ఆపాదమస్తకం చూచి వాడివంటిమీద చేయివేసి కాస్త కాస్తగా తడివి చివరికొక నిట్టూర్పు విడిచారు.

అసలే ఆశ్చర్యపోతున్న చలపతికీ చర్య మరీ ఆశ్చర్యాన్ని కలిగించింది. ఐతే ఆయన స్నేహాన్నీ సానుభూతినీ పొందటానికి వాడి జీవితంలో బహుశ ఇదే మొదటిసారి అంటే అందులో ఆశ్చర్యమేమీ ఉండదు.

తరువాత అన్నదమ్ములిద్దరూ కొంతసేపు చలపతికి వైద్యం చేస్తున్న డాక్టర్ను గురించీ తమకు నిలువనీడనిచ్చిన భాస్కరం స్నేహితునిగురించీ మాట్లాడుకున్నారు. పద్మనాభంగారు ఉండీ ఉడిగే ఒకటే అలా ప్రశ్నలు వేస్తుంటే భాస్కరం క్లుప్తంగా సమాధానాలిస్తూవచ్చాడు. పిదప రాఘవి గుమ్మంవద్ద అగపడగా భాస్కరం లేచి లోనికి వెళ్ళాడు.

భాస్కరం కొద్దిసేపట్లోనే తిరిగివచ్చి "నువ్వు భోజనానికి లే" అన్నాడు అన్న నుద్దేశించి. కాని ఆయన అది పరధ్యానంవల్లో మరెందుచేతో ఎన్నడూచేయని పనిచేశారు. "నేను భోజనం చేశేశాను"అన్నారు నెమ్మదిగా. కాని ఇంకో క్షణం పోయాక రాఘవివచ్చి "వడ్డించేశాను" అని చెప్పేసరికి ఆయనే మారు మాటాడకుండా లేచి దుస్తులు మార్చసాగారు. భాస్కరం చాలా ఆశ్చర్యపోతూ నూతి దగ్గరకు తీసుకవెళ్ళాడు.

## 16

నిజానికి—ఇట్లా చెప్పి పెట్టకుండా చలపతి ఆకస్మికంగా జబ్బు పడటంగాని, ఆజబ్బు పడ్డవార్త పదిమైళ్ళదూరంలో ఉన్న తండ్రికన్నా ముందుగా ఎక్కడో ఎనభైమైళ్ళదూరాన ఉన్న పినతండ్రికి తెలియటంగాని, అన్నిటినీ మించి రాఘవి వచ్చి ఇక్కడ కాపురంకూడా పెట్టి భావగారికొడుకుకి సేవచేయ సిద్ధపడటంగాని—ఇందులో ఏ ఒక్కటి తీసుకున్నా మనిషిలో ఉండగల కుతూహలాన్నంతటినీ ఆకట్టుకోగల సమర్థములు. అట్టివి ఇన్నీ కలిపినాకూడా ఈనాడు పద్మనాభంగారి కుతూహలాన్ని కదిలించలేకపోయాయీ అంటే కారణమేమిటా అనిపిస్తుంది. కాని అది విస్పష్టం. గత ముప్పదిగంటలలో వరుసగా అతనుపొందిన అనుభవాలు అతని చైతన్యాన్ని ఆహరించుకున్నాయి.అందు చేతే అతను ఇప్పుడు దేనినిగురించికూడా ఆశ్చర్యపోగల స్థితిలో లేరు—సరికదా ప్రశ్నించే స్థితిలో కూడా లేరు.

అతను భోజనంచేస్తున్నంత సేపూ ఆ విషయమే ఋజువయ్యింది. అతనేమేనా భోగట్టా లడుగుతారేమోనని భాస్కరం వచ్చి ఎడంగా ఒక పీట వాల్చుకొని కూర్చున్నాడు. ఆయన ఇంచుమించు భోజనమంతా మౌనంగానే ముగించి లేచేముందు అడిగాడు.

"నువ్వు ఎన్ని రోజులు సెలవు పెట్టావ్?"

భాస్కర మీ ఆకస్మిక ప్రశ్నకు క్షణకాలం ఆగి జవాబిచ్చాడు.

"మొదట వాడి ఈ తీరం చూడగానే మూడు రోజులు సెలవు పెట్టివచ్చాను. ఇందాకనే ఇంకొక రెండు రోజులు సెలవుకోసరం టెలిగ్రాం పంపాను"

పద్మనాభంగారు కూడా క్షణంసేపు ఆలోచించి అన్నారు- "బహుశా నువ్వు ఆ తరువాత వెళ్ళిపోవా లనుకుంటాను!" అని. అతడి దగ్గరనుండి వెంటనే జవాబు రాకపోయేసరికి నెమ్మదిగా అక్కడి పరిస్థితినంతా వివరించి చెప్పారు. భాస్కరం అంతా వినిన పిదపకూడా ఏమీ పలకకుండా ఊరుకున్నాడు. అంతట పద్మనాభంగారు మళ్ళా అన్నారు.

"నా కంతా అయోమయంగా ఉంది. ఇక్కడినుండి వీడిని అక్కడికి తీసుకపోలేం. అక్కడనుండి దానిని కదపటానికికూడా వీలున్నట్లు లేదు. ఒకవేళ కదప దలచుకొన్నా ఎక్కడికి? పాపం ఓళ్ళ కత్తిన ఎక్కాలి. కాగా దాని పరిస్థితి వీడికి తెలిసినా వీడి

ఎక్కడ ఎట్లా తగిలిందో తెలియదు. లేక వాడు పెదవులతో పద్దంటున్నా గొంతుతో రావాలనటాన్నే గ్రహించారో ఈ జవాబుతో ఇంత పద్మనాభంగారూ కన్నీళ్ళపర్యంత మయ్యారు.

## 17

నెలాళ్లు గడిచాయి.

ఈ నెలాళ్లూ విధివిరామం లేకుండా పద్మనాభంగారు ఇంటినుంచి దలపతివద్దకూ దలపతివద్దనుంచి ఇంటికీ ఎట్లా తిరిగారో సాధారణ సమయాల్లో దమ్మిడీలు లెక్కించే మనిషి డబ్బు ఎట్లా అతి నిర్లక్ష్యంగా ఖర్చుచేశారో చూస్తే చివరకు భాస్కరం కూడా ఆశ్చర్యపోయాడు. ఇంక దలపతివిషయమే చెప్పనే అక్కరలేదు. వాడు తనవంటి నిర్భాగ్యుడూ రోగిష్ఠి అయినంత ఐనవాడి ప్రాణంకు కూడా అంత విలువ ఉంటుందా అనుకోనాగాడు.

పద్మనాభంగారు ఆదిలో ప్రతిరోజూ ఉదయం వచ్చి సాయంకాలానికి తిరిగిపోతూండేవారు. క్రమంగా దలపతి ఆరోగ్యాన్ని కోలుకోవ నారంభించాక రోజువిడిచి రోజు వస్తూండే వారు.

కోరతేసి ధరలుపెట్టి మందులూ ఇంజక్షన్లే కాక డజన్ల కొద్దీ బత్తాయిపళ్ళూ పొట్లకొద్దీ ద్రాక్షపళ్ళూ ఒక్కొక్కటీ దూసాయిదూసాయిన్నారా పోసి దానిమ్మపండ్లూ కొనిపెడుతూ ఉంటే దలపతి నిర్బంధతోనూ "తన కనిపెయించటం లేదా"ని అవన్నీ అనవసరమని చెప్పి ప్రయోజనంలేని మొఖమాటాన్ని వ్యక్తంచేసేవాడు. ఏమైతే నేం నెల్లాళ్ళలో పద్మనాభంగారి శ్రమా వ్యయం ఫలించాయి. దలపతి తేరుకున్నాడు. డాక్టరుగారు వాడి ఆరోగ్య స్వాస్థ్యానికి ఆ చిరకాలంలోనే వారానికి రెండు రోజులు రోగిని చూసే షరతుపై ఇంటికి తీసుకొనిపోవటానికి— కూడా సమ్మతించారు.

ఆవాళ పద్మనాభంగారు ఇంటికి వస్తూనే రాఘవినుద్దేశించి "ఇంక మనం వెళ్ళిపోవచ్చునమ్మా" అన్నారు.

అప్పటికప్పుడే సెలవు ఇంక పొడిగించటానికి సాధ్యంకాక వారంరోజుల క్రితమే భాస్కరం అనకాపల్లి వెళ్ళిపోయి ఉన్నాడు. ఈవారం రోజులుకూడా కలుపుకొని రాఘవితో మాట్లాడటం ఆయనకు అదే మొదటిసారి.

ఇంతవరకూ అతను—వచ్చిన సమయంలో ఏదో కావాలీ అక్కర లేదనే అనటం తప్ప ఎన్నడూ ఏవిషయమున్యా ముఖస్తంగా మాటాడి ఎరుగరు. కాని ఇవాళతో అతని సమస్తమైన హృదయభారం వాదరబందీ మొదలైనవన్నీ సరి అనిపించటంచేత కాబోలు ఆయన వస్తూనే వంటగది వద్దకు వచ్చి దలపతికి పథ్యం పెడుతున్న రాఘవినుద్దేశించి పై మాటలన్నారు. ఐతే చిత్రంగా రాఘవి సిగ్గుపడ్డది.

రాఘవి నుద్దేశించి పద్మనాభంగారు ఆదిలో తమ మనః ప్రధాన చిత్రించుకున్న వికృతమూర్తి నంతా ఈ నెల్లాళ్ళయూ చెరిపి చెరిపి దిద్దుకుంటూనే ఉన్నారు. ఆ దిద్దు బాటుకూడా ఎంతవరకు వచ్చిందంటే ఇంక ఈ మూర్తి సృష్టిలో ఏం చెరిపి మార్చవలసి వచ్చినా అదిముల్లా వికృతికోసనికే కారణ మౌతుందనుకునే స్థితి వచ్చింది. కాని ఇప్పుడు రాఘవి చిత్రంగా సిగ్గుపడటంతో అతనికి తన నిర్ణయంలో లోపం తెలిసింది.

ఈసారి ఆయన దలపతి వంక చూస్తూ అన్నారు.

"రేపూ ఎల్లుండీ మంచిది కాదు. అవతల్లుండి దశమినాడు బండి తీసుకువస్తాను సిద్ధంగా ఉండండి" అన్నారు.

ఆయన ఆమధ్యాహ్నమే ఇంటికి వెళ్లిపోయారు.

తరువాత సరిగా అనుకున్న నాటికి బండి వచ్చింది. ఆయన వస్తూనే తిన్నగా డాక్టరువద్దకు పోయి తుదిసారి అనుజ్ఞతీసుకొని పిదప బజారుకు వెళ్లి సామానులు కొనుక్కొని పదకొండింటికి తిరిగి వచ్చారు. కాని ఆయన ఆశ్చర్యానికి ఇంటివద్ద సామానులు సర్దిన జాడ ఏమీ కానరాలేదు. వెంటనే ఆయన రాఘవి వద్దకుపోయి సూటిగా ప్రశ్నించారు. రాఘవి దలపతివంకా సాభిప్రాయంగా చూసినవ్వింది. అంతట దలపతి వివరించాడు.

"పిన్ని రాదటనాన్నగారూ !"

పద్మనాభంగారు ఇంచుమించు అప్రయత్నంగానే అడిగారు.

"ఎందుకు రాదూ ?"

దలపతి జేబులోంచి ఒక ఉత్తరాన్ని తీసి అందిస్తూ.

"చినాన్నన్న ఉత్తరం వ్రాశారు" అన్నాడు మెల్లిగా. కాని పద్మనాభంగారు ఉత్తరం అందుకోకుండానే అడిగారు.

"ఏమని"

"ఇంకొకసారి వెళ్లవచ్చునట తనకు హోటలు భోజనం పడటంలేదని అందుచేత ఒంట్లో బాగులేదని"

ఈసారి పద్మనాభంగారు ధోరణి మారుస్తూ అన్నారు.

"అదా! సరే నువ్వు వ్రాయి. 'చిన్నాన్నా! నీవు హోటల్లో పదేళ్లు భోజనాలు చేసి ఉన్నావుట...అందుచేత నీకు హోటల్ భోజనం బాగానే పడుతుంది. పోతే ఆ జబ్బేదో భోజనంవల్ల కాక ఇంకొకదానివల్ల వచ్చిఉంటుంది !' అని వ్రాయి"

పద్మనాభంగారిచ్చిన జవాబు విని దలపతి పిన్ని ముఖంలోకి చూశాడు. పిన్ని ముఖం మెలిక చేసుకొంది.

పిదప కొంతసేపు ముగ్గురూ మౌనంగా నిలిచిపోయాక పద్మనాభంగారడిగారు.

"ఏమమ్మా నీకింకా సందేహం పోలేదూ ?"

ప్రశ్న ఇట్లా సూటిగా వచ్చేసరికి రాఘవి తలవంచుకొని అన్నది.

"ఈసారికి పోనివ్వండి. ఇంకొకసారి వస్తాను"

"అదిసరే ! ఇంకొకసారి ఎల్లానూ తప్పదు గాని, ఇప్పుడు రావడానికేం ?"

రాఘవి నవ్వుతూ జవాబిచ్చింది. "ఆయన వద్దన్నట్టు వ్రాశాక వస్తే మనకు కష్టపెట్టుకుంటార"ని

కాని పద్మనాభంగారా నా రెండు చేతో ఎవ్వరినీ ఎన్నడూ నిర్బంధించనంతగా నిర్బంధించసాగారు. ఆయనన్నారు.

"ఇంతకూ అసలు సంగతి వాడు వ్రాయలేదు కదూ!"

రాఘవి దీనికి జవాబుగా దలపతివంక చూసింది. దలపతి మళ్ళీ వెనకటి ఉత్తరాన్నే అందివ్వబోతూ

"వ్రాశారండీ ఇదుగో" అన్నాడు. కాని పద్మనాభంగారు ఈసారి కూడా ఆ ఉత్తరం అందుకోకుండానే జవాబిచ్చారు.

"అది మీ పిన్ని వ్రాయించింది! మీ పిన్ని ఇక్కడనుండి వ్రాస్తే కదూ వాడు దానిపై అలా వ్రాశాడూ!"

ఈ అస్త్రం బాగానే పనిచేసింది. దెబ్బతో రాఘవి సామాను సర్దసాగింది.

* * * * *

ఆనాడు సాయంకాలానికి లక్ష్మమ్మగారు కొడుకు కండ్ల పడటంతోనే కండ్లనీళ్లు త్రిప్పుకుంటూ వాడిని దగ్గరకు తీసుకున్నారు. తిరువాత తన కుక్కహస్తాలను చాచి రాఘవి చేతిలో చిట్టి నందుకున్నారు.

రాఘవితో ఆమె గద్గదకంఠంలోనుండి ఒక్కమాట మాత్రం అనగలిగారు—'ఏమమ్మా' అని. అంతే తిరువాత కళ్ళనీళ్లు త్రుక్కుకుంటూ నిలుచుండిపోయారు.

శారద వచ్చి పిన్నితో మాట్లాడకుండానే చిట్టిని మాత్రం పెద్ద దీర్ఘాలతో పలకరిస్తూ చేతుల్లోకి తీసుకొని 'ఆయ్' తీసుకపోయింది. జానకీ పార్వతులు అక్కడే నిలుచుని—ఒడ్డున పడిన చేప స్థితిలో కొట్టుకుంటున్న రాఘవివంకా పరిశుభ్ర శరీరయై శోకం మూర్తిభవించినట్టున్న తల్లివంకా విడిచి విడిచి చూస్తున్నారు.

తిరువాత పద్మనాభంగారు వచ్చి "సంతోషించరక ఏడుస్తారేం? మంచి తెలివే" అంటూ మందలింపు నటించాక గాని లక్ష్మమ్మగారు నిగ్రహంకోసరం ప్రయత్నం చేయలేదు. అప్పుడు కన్నీళ్లు తుడుచుకొని రాఘవిని వెంటబెట్టుకొని పెరటి వరండాలోకి వెళ్లిపోయారు.

రాఘవి పుట్టిన ఇంటివారి క్షేమ సమాచారాదులు వినవినుక రాఘవి భాస్కరాలు అక్కడకు వచ్చిన నైనాలూ దలపతి జబ్బునుగురించీ కారణాలనుగురించీ ప్రస్తావించారు. రాఘవి వివరాలు చెపుతూఉంటే మధ్యలో లక్ష్మమ్మగారు మళ్లా కంటనీరు పెట్టుకుంటూ ఆరంభించారు. ఆమె శోకార్ద్రకంఠంతో చెప్పసాగారు.

"అతను అప్పుడే సూచాయగా చెప్పాడు. కాని నేను గ్రహించలేకపోయాను... గ్రహించి మాత్రం చేయగలిగింది ఏమున్నదిలే! ఆయన కెంత తోస్తే అంత. ఒకరు చెపితే వింటారా ఏమైనా..."

—అంటూ దబ్బన ఒక వెల్లువ దుఃఖం రాగా అందు మునిగి తేలుతూ స్పష్టాస్పష్టపు పదాలతో అన్నారు—

"ఈ యింటి పెద్దలు చేసిన ఏ పుణ్యఫలమో మిగులబట్టి వాడికి భగవంతుడా బుద్ధి పుట్టించాడు. లేక వాళ్లీ చిన్నాన్న దగ్గర కూడా వాడి కట్లాటి భయమే ఉంటే ఏనాడో ఒకనాడు చెప్పిపెట్టకుండా కళ్లు మూసేసేవాడు."

—అంటూ కంఠం పూడుకుపోగా శ్రమమూని నిగ్రహం చిక్కాక దీర్ఘ నిశ్వాసాలు విడుస్తూ అన్నారు—

"ఎందుకూ తల్లి తండ్రీ—ఉన్నాం పేరుకి. వాడికి కష్టానికి కాగలిగామా. సుఖానికి కాగలిగామా! సుఖంలోనూ కష్టంలోనూ కూడా మీరే తల్లి తండ్రీ అయ్యారు. అతను తండ్రై వాడి కష్టసుఖాలు కనుక్కుంటే నువ్వు తల్లివై వాడికి చాకిరీ చేశావు. పేరుకు మాత్రమే మేము తల్లి తండ్రీ!" లక్ష్మమ్మగారు ఆగారు.

గంభీర హృదయురాలైన ఆ మాతృమూర్తి అమేయమైన తన కృతజ్ఞతను వ్యక్తీకరించిన ఆ పద్ధతి ఎంత సహజంగానూ నిరాడంబరంగానూ ఉన్నదంటే వక్రదృష్టికలవారలకది ఈర్ష్య అనిపించేటట్టుంది.

తిరువాత ఆనాడూ—ఆనాడే కాదు ఆ వెనుక వారం పది రోజుల వరకూ కూడా తాను గడచిన రెల్లాళ్లూ పడ్డ తపనలూ వేదనలూ ఇబ్బందులూ ఒకరికొకరు వర్ణించుకోవటంతోనే సరిపోయింది.

# 18

జీవితం బహు విచిత్రమైనది. కొన్ని నాళ్లు సుఖం కొన్ని నాళ్లు కష్టం కొన్ని నాళ్ళు ఆనందం మరి కొన్ని నాళ్ళు దుఃఖం. మళ్లా అందులో పర్యవిపర్యాయాలు. అందులో ఎప్పుడు ఎందుకు ఏది వస్తుందో తెలియదు. తెలుస్తుందనుకుంటాంగాని నిజంగా తెలియదు.

రాఘవి వచ్చి అప్పటికి సరిగా పదిహేడు దినా లయ్యింది. ఈ పదిహేడురోజులలో ఆమె మూడుసార్లు ప్రయాణమయ్యింది. మూడుసార్లు పద్మనాభంగారే ఆపేశారు. మాధ్యస్థం వహించిన లక్ష్మమ్మగారితో ఆయన అనేవారు.

మొదట "వచ్చి నాలుగురోజులైనా కాలేదు అప్పుడేనా?" అన్నారు. అట్టి నాలుగులు రెండు గడవగా రెండవసారి "వాడలిగాడేమో ఆ అలకతీరి వచ్చి తీసుక వెళ్ళనీ తొందరేల?" అన్నారు. మూడవసారి కూడా మళ్లా ప్రయాణం విషయం వచ్చేసరికి ఆయనా రాఘవినే ఎదుటికి రప్పించుకొని "ఏమమ్మా యిక్కడ నీకు మీ నాన్నగారి ఇంటిలోలా గడవటం లేదేమిటి? ఇంటికి ఇంటికి అంటావుట నీ ఇల్లెక్కడ ఉన్నదీ?" అంటూ ప్రశ్నించి ఊరుకున్నారు.

రాఘవికి చివరకు కోపం తెచ్చుకోవడానికైనా వీలులేకపోయేసరికి ఏడుపువచ్చి ఊరుకుంది. ఆమె ఎవ్వరూ చూడకుండా చూసి ఒకసారి ఏడ్చేసింది.

సరిగా ఆ మరునాడే భాస్కరం దగ్గరనుండి ఒక ఉత్తరం వచ్చింది. కాని ఆ సరికి రాఘవ కుండ బరువు దించుకొని ఉంచటం చేత బాగానే ఉన్నది. లేకపోతే ఆ ఉత్తరమట్లా వచ్చినందుకు ఇంత మంచి రాఘవ అకస్మాత్తుగా చెడ్డదై ఊరుకుంటుంది. ఇప్పుడో మంచిది మరింత మంచిదయ్యింది.

ఆ ఉత్తరం వచ్చినది మధ్యాహ్నంవేళ. ఆసరికి తోడికోడళ్లిద్దరూ పిల్లలూ వీధియింటి పెరటివరండాలో కూర్చుని ఉన్నారు. పద్మనాభంగారు ఉత్తరాన్ని తీసుకవచ్చి భార్యకు చూపుతూ "మీ మరిది ఉత్తరం వ్రాశాడు" అన్నారు ఏదో అభిప్రాయం ధ్వనించేటట్లు. ఈ వార్త ఇద్దరు ఆడవాళ్ళనూ, పిల్లల్లో ఇద్దరి పెద్దవాళ్ళనూ వ్యగ్రులను చేసింది. అయితే ఇందులో నిజమైన వ్యగ్రత్వం ఎవరు చూపాలో వారిముఖానే అది తక్కువగా కానవస్తోంది.

లక్ష్మమ్మగారడిగారు.

"ఏమని?"

"ఏమైనా నువ్వే చదువుకో" అంటూ ఆ ఉత్తరం అక్కడ పడవేసి వెళ్ళి నట్టింట వాల్చియున్న మంచంమీద కూర్చున్నారు. అక్కడకు వారికి ఒక్క లక్ష్మమ్మగారి ముఖమే అగపడుతుంది. తక్కినవారంతా గోడచాటున ఉన్నారు.

లక్ష్మమ్మగారు ఒక నిష్ఠురవాక్యంతో భర్తను నిందించి తరువాత రాఘవని చదవమన్నారు. పద్మనాభంగారి ముఖాన హాసరేఖ మెరిసింది. కాని చివరికా ఉత్తరాన్ని చలపతే చదివాడు. ఆద్యంతాలు విడిస్తే ఉత్తర మిట్లా ఉన్నది.

"మా క్లోజ్లి తెరచి ఈసరికి అప్పుడే పదిహేను రోజులయ్యింది. వెనక చలపతి ఈ యూడాది పాసైనట్లు వ్రాసిన ఉత్తరం అందే ఉంటుంది. వాడి $T. C.$ కూడా శ్రీకాకుళంనుంచి తెప్పించేశాను. మీరు వాడిని పంపడమే తరువాయి. ఇప్పటికే చాలా ఆలస్యమయింది. తక్షణం పంపవలెను..."

చలపతి ఆగిపోయాడు. లక్ష్మమ్మగారు "ఊఁ" అంటూ ఊఁ కొట్టారు. అయితే చిన్నప్పుడు విన్న మూడి మూతిలోపడ్డ కథలా ఎన్నిసార్లు ఊకొడితే మాత్రం ఉత్తరంలోకి క్రొత్తగా అక్షరాలెలా వస్తాయి. చలపతి అదే అన్నాడు.

"అంతే మరి లేదు"

కాని లక్ష్మమ్మగారు నమ్మలేదు. పైగా "తప్పు నేర్పా! నువ్వు హాస్యాలాడ కూడదు" అంటూ మందలించ సాగారు. అయితే ఆ భ్రమ ఎంతోసేపు సాగలేదు. చలపతి కారదా ఒట్టువేసి చెప్పబోయేసరికి ఆమె నమ్మక తప్పిందికాదు. అంతట ఆమె కొంత కాలం ఆలోచించి "ఎట్లాగైనా మీ అన్నదమ్ములకు దాక్షిణ్యంగాని న్యాయంగాని లేవు" అన్నారు కటువుగా. పద్మనాభంగారు ఊరుకోలేదు. కవ్వించి విడిచారు. ఆమె అన్నారు "కాదూ—ఆ అమ్మాయి మన్యనేం చేస్తుందీ! మీరేమో బలవంతంచేసి తీసుకవచ్చేశారు. ఎన్నిసార్లు పోతానన్నా వెళ్లనివ్వరాయెను. యింక ఆయనగారు అలిమీదకోపం రోలుమీద చూపాడన్నట్లు మీ మీదకోపం చూపటం చేత కాక ఆవిడమీద చూపటమేమిటి?"

పద్మనాభంగారు ఆమె అమాయకతకు నవ్వుకుంటూ మరి కాస్త సేపుకూడా ఆడించాక అన్నారు.

"నీకేం పిచ్చా! ఆ ఉత్తరం అట్లా వ్రాయటంలో అర్థం నీకు తెలియకపోతే మీ చెల్లెల్నడుగు చెపుతుంది." అంటూ కొంత ఆగి "వీడిలా విరబిగిసినందుకు తమాషా చేసి ఉంచేవాడిని. అయితే పరిస్థితులు అంగీకరించకుండా ఉన్నాయి. లేకపోతే వాడన్నట్లు చలపతిని ఒక్కడినే పంపితే వాడికియింకొకరక్కటి పాపమయుండేది" అంటూ ముఖాన అటు అభిమానం యిటు శాంతం అటు ఆలోచనా ఇటు తిరస్కారం ఇంకా అనేక భావాలూ పంకులంగా ప్రతిఫలిస్తుండగా అక్కడనుండి లేచివెళ్లి పోయారు.

ఆమరునాడు ఉదయాన్నే ఒక రెండెద్దులబండిలో రాఘవీ చిట్టీ చలపతీ రైలుస్టేషనుకు ప్రయాణమయ్యారు. శకునాన్ని గమనించటానికై వీధివాకిట వచ్చి నిలచి, ఉన్న లక్ష్మమ్మగారు, దుర్గయ్యగారి చిన్న కోడలు మంచినీళ్ల బిందెతో ఎదురురావటం చూసి తృప్తిచెందిన ఆత్మతో లోనికి వెళ్ళిపోయారు.



# దివ్యదీక్ష

★

శ్రీ సామవేదం జానకిరామశర్మ

తడబడెడు గుండె, అడుగులు, నడికిరేయి
మోసికొనిపోయి చెన్నని మోల నిలువ
కటిక చీఁకటి హయశాలకడకు వచ్చి
శాక్యకులమణి మెల మెల్ల సంచరించె!

తన హృదయమ్ములోఁ గలుఁగు తాపము నిచ్చలు ప్రాణికోటిలోఁ
దనరెడు బాధనై, అసలు తానె తదీయము ప్రాణికోటినై
మనెడు మహాతపస్వియువమండనుఁ డిద్దమరేయి వేదనా
జనితభరమ్ము తోడుఁగొనిసాగె విచిత్ర పదక్రమంబునన్!

వెనుకను ముందుఁ బార్శ్వముల విస్మృతమైకడుఁ జుట్టునాంధ్యమున్
గని తొలగించుకోనయిన కార్యము నెంచుచు, లోని మోనలన్
గునుకుచు నున్న చెన్నని యకుంఠిత శీలుని దివ్యదాపునం
గని వెనుకాడి, ముందుఁజని, క్రమమ్ముదూక్తులఁ దెల్పె నాతఁడున్

"ఓయి ప్రభూ! ఇదేమియిది యూహకురానిది? చిత్ర చిత్రమై
నాయనుభూతి సర్వమొక నాటకమయ్యెను! నేటిరేయి యే
దోయొక యద్భుతమ్ము మదితోఁచెడు, దివ్య పదమ్ములాధృతిన్
ఈయెడ కిట్లు సాగుటకు హేతువులన్ సెలవీయవే ప్రభూ!

ప్రభు వెంతధీరుఁడో పఱతెంచె నీరేయి
వెలుఁగులు జిమ్ము నీవీధి యేల?
స్వామి కారుణ్యమ్ము సాగివచ్చెను నేఁడు
శాంతమ్ము నాట్యముల్ సలుపునేల?
శాక్యసంతతి దృష్టిసారించె జగమెల్ల
నిశ్శబ్దతలు దెసల్ నిండునేల?
యువరాజు మనసులో యోచించె నేదియో
ఆనందవాయువు లీను నేల?
అన్నియనుభూతులు రాశియైనయట్లు
కానిపించెడు; నేఁడుగాఁ బూనునవ్య
నవ్యరీతుల రాజ్యమ్ము దివ్యశోభ!
చెందమున కిది యెంత యానందరేఖ!

కనుల నేవో వింత కాంతులు పొడసూపె
విద్యుత్తు శోభల వీడనేమొ!
మేనిపై ధగధగల్ మిఱుమిట్లు గొలిపెడు
తరణి ప్రకాశమ్ము తరిగనేమొ
ఆననమ్మున శోభలందగించెను క్రొత్త
ఇందుబింబము కాంతి డిందెనేమొ!
తనుయష్టి పరివేషమును దాల్చెనవ్యమై
అగ్నికీలలు లుప్తమయ్యె నేమొ!

ఏమొ ప్రభువివ్వడీ రేయి నిన్నినాళ్ల
విధముతో చక క్రొంగ్రొత్త పథము నడచు
దివ్య తేజోవిలాసమ్ము దిద్దుకొనెను
అనుపమాద్భుత రమ్య మియ్యది తలంప!

చిఱునవ్వుల్ వెదజల్లుసామి! దయతోఁ జెప్పంగదే నీవనై
యరుదేరన్ గతమేమి? చూపులివి నాకాశ్చర్య సందేహముల్
కలవా కన్నులసన్నమాత్రముననే కార్యమ్ము సాధించు కిం
కరులీరాకకు హేతు వేమియగు లోకమ్మెల్ల మేల్కొల్పుటల్!

పరమాద్భుత మియ్యది సుం
దర వదనం బెత్తి పలుకఁ దలఁచి యుడుఁగుటల్!
పరమాశ్చర్యం బియ్యది
శిరమెత్తియుఁ జూపు నిలుపఁ జేయకుడుగుటల్!

చాలు మౌనమ్ము చాలు నీసరికి మనసు
విప్పి చెప్పంగదే! నన్ను వేఱురీతి
దలఁతువో! ప్రేమసింధు లుదారగుణులు
శాక్యకులులన్న నుడికి సంశయము కలదె?

అదిగదిగో మహాప్రభువు లాస్యము విప్పిరి రాజసేవలో
ముదిమిఁ గడించు నాదు తలపుల్ ఫలియించెను! ముత్తెపుంఝురుల్
కదలగసాగె! స్వామి కనుకంప జనించెను! సావధానతన్
మది పదిలించుకొందు" ననుమాటలు గౌతమ చక్రవర్తిలో

కదిలి, చెన్నని కండ్లలో మెదలిచూపు
లిట్టులుగనాదె గాంభీర్య ముట్టిపడగ
"శాక్యవంశమ్ము నీ ఋణ సాగరమ్ము
నధిగమించునో ఎన్నటికైనఁ జెన్న!

నీవాత్సల్యము నాయెడన్ అవధి లేనేలేనిదయ్యెంగదా!
సేవాధర్మము కీవ రూపము, త్వదాశీః ప్రాభవౌన్నత్యముల్
గావన్ రాజ్యము నాఁడు నాఁటికి జగత్కల్యాణ సంపాదియై
తీగల్ సాగుచు నెల్ల రాజ్యముల నందీపించు నైజప్రభన్!

నామనసు రాచకార్యమ్మునందుకన్న
నన్యమునఁ బోదు. తండ్రి యున్నారలనుచు
పెద్దతనమాట నూహింప రద్దికాక
ఎల్లియో నేఁడో భార మదెట్లొపడును!

ఈభారమ్మును మోవజాలనని యెంతే దూరముం బోదునో!
ఈభారమ్మును నేనమోతునని యెంతే దాపుగా నుందునో!
నాభావమ్మున రూపమేర్పడక చెన్నా! చిత్తసంక్షోభమై
శోభాహీనుఁడ నైతి నిద్ది నను సంశోధింపఁగా నెంచుఁబో!

పాలబుగ్గల నవ్వు పంట పండించెడు
పసిపాప లాలికించు భాగ్యరేఖ!
అవధి లేక యెడంద హత్తు నాలు మగల్ల
రమ్యమా ప్రణయ సామ్రాజ్యశోభ!
విజ్ఞాన బీజముల్ వెదజల్లు బుద్ధిమ
దగ్రేసరుల మనోహర మనీష
ఆనందసుధ పంచునట్టి యుత్తమకావ్య
కన్యల సృష్టించు కవుల ప్రతిభ
ఏమి చిత్రమ్మొ మన కండ్లయెదుట మృత్యు
భీకరోన్నత దంష్ట్రావిభిన్నమగుచు
మాయుటలు డెందమునకు నుమ్మలికఁ గూర్చు
తలఁచుటయు నిద్ది యెంత బాధాకరమ్ము!

నడయాడు శవమయి ముడుతల మేనితో
భయముఁ గూర్చెడు జరాప్రాభవమ్ము!
పాన్పువీడని యస్థిపంజరమ్ముగఁ జేసి
బాధ పెట్టెడు రుజాబహుళ శక్తి!
ఆకలి మంటలు సోక మిక్కుటముగ
వెతపెట్టు దారిద్ర్య విలసనమ్ము!
స్వార్థ పంకిలదృష్టి సంచరింప యథేచ్ఛఁ
గుత్తుక లొరసెడి కోపవహ్ని
ఎల్లెడలఁ దాండవింప నా యుల్ల మందుఁ
దత్త దనుభావములు తోఁచి తాపశాంతి
కలుఁగఁగాఁ బోదు. లోకమ్ము తెలిసి యెన్నఁ
డేని సుఖయించునా ఒకయింత చిన్న?

ఈ సర్వాపదలేను కారణముగా నీరాజ్య సంవాసులన్
గాసిం బెట్టునటంచు లోఁ దలఁతుఁ జెన్నా! అట్లయా. రాజతా
హీనంబేనియు హీనిఁ బాపుటకుఁ బ్రావీణ్యమ్ము నార్జింపఁడో
దోసంబందును. వాని యాప్రభుతతో దుఃఖమ్మె యావారికిన్!

నాదుప్రజ—కాదు. లోకమ్మునందునున్న
యెల్లరును శాంతి సౌఖ్యాల నుల్లసిల్ల
చిన్నమెత్తైన త్యాగమ్ము చేయవలయు.
వలదనఁగ నీవు మాత్రమ్ము దలఁతు వాక్కు!

ఆ నిరీక్షణమేమి చెన్నా! మదీయ
వాక్యముల యంతరార్థ సంపద నెఱింగి
సావధానుఁడ వగుము నీసాయమేను
కోరివచ్చితి కాదనఁగూడ దిపుడు!

ఈనడిరేయి రాజ్యము వ హీనసుఖమ్ములు తల్లిదండ్రులన్
సూనుని, ధర్మపత్నిని యశోధరనున్ విడనాడి తాపసుల్
పూనెడు ధర్మమార్గమునఁ బోయి వసింతు నరణ్యసీమ; లో
కానకు శాంతి సౌఖ్యములు గల్గెడు మార్గ మెఱింగి వచ్చెదన్!

ఈమహాదివ్య దీక్షలో నించుకంత
సాయపడు మీవు హయముల స్యందనమున
సజ్జితముచేసి వేవేగ సాగిరమ్ము.
అశ్రువు లివేల! యువరాజు నాజ్ఞయిద్ది!"

అని పలికిన నిమునములో
వినిపించె రథమ్మురవము వీథులతుదలన్;
కనిపించె దివ్య దీధితి
వినువీథిన్ సురలు మునులు వేడుకఁ జూడన్.





★
ముఖము
మీ
విలాస
చిహ్నము
★
RAJA (REGD.) SNOW
for Beauty & Complexion
MANUFACTURERS
MANYAM & CO.
BANGALORE
RAJA SNOW
RAJA SNOW
రాజా
స్నో
★ ముఖమును కాపాడును
★ ముఖ విలాసమును
పెంపొందించును
FAS-766
MANYAM & CO., BANGALORE, MADRAS, MADURAI, BOMBAY.


సౌందర్య శోభ
పండిత డి.గోపాలాచార్యులవారి
జీవామృతం
ఆయుర్వేద పునరోద్ధారకులు
కన్నుల పండువైన సూర్యాస్తమయం, చల్లని సము
ద్రపుగాలి, విచ్చిపోయే నౌకలతో గూడిన ఆకర్షణీయ
మగు చక్కని సముద్రతీరం, ప్రక్కన ప్రేయసి!
ఇవి ఎంత ఆనందాన్ని కల్గిస్తాయి! ఈ ఆనందాను
భవానికి అత్యావశ్యకమైన దేహారోగ్యమును,
ఉత్సాహమును ప్రసాదించగల "జీవామృతం"
సాటిలేని అద్భుత బలవర్ధక ఔషధం.
ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్
మద్రాసు 17.

# సాలార్ జంగ్
# పురావస్తుప్రదర్శనశాల



'బెంజోని'—అనే శిల్పి చెక్కిన "రాఛెల్ (మేలిముసుగులో)" విగ్రహం.

హైదరాబాద్ సంస్థానంలో, నవాబ్ సాలార్ జంగ్ బహదూర్ గారికి కళాప్రియులని, పురావస్తు సేకరణ దక్షులనీ మంచి పేరుప్రతిష్టలున్నవి. వీరి పేరు మీర్ యూసుఫ్ అలీఖాన్. ఎప్పటెప్పటి, పూర్వ నవీన, ప్రశస్త వస్తుసేకరణంలో తమ జీవితమంతా గడిపారు. 1949 లో వారు మృతిపొందగా సంతులేని కారణాన వారి జాగీరు ప్రభుత్వానికి వచ్చింది. ఆ కళా స్వరూపాలనన్నిటినీ, క్రమబద్ధంగా విభజించి, నేటికి వాటికి ప్రత్యేకస్థానాలు ఏర్పరిచి, రెండువందలఏండ్ల క్రింద మొగలయి శిల్పవిన్నాణంతో కట్టబడిన "దివాన్ దేవిడీ" అన్న ఒక మహాభవనాన్ని వాటికి నెలవు చేసి, సాలార్ జంగ్ మ్యూజియం అన్న పేరిట, కళా మయమయిన పురావస్తు ప్రదర్శనశాలనుగా చేసి హైదరాబాద్ ప్రభుత్వం సాలార్ జంగ్ గారి కళా ప్రియత్వానికి మెరుగు తెచ్చి, ఆ కళాపిపాసువుయెడ తమ శ్రద్ధాభక్తులను వెల్లడించారు. సాలార్ జంగ్ ఎస్టేటు కమిటీ అధ్యక్షులు శ్రీ పి వి. సుబ్బారావు గారు ప్రభుత్వం తరపున, సాలార్ జంగ్ మ్యూజిమ్‌యొక్క ఆర్ట్ ఎడ్వైజర్ గా శ్రీ జి. వెంకటాచలంగారిని ఆహ్వానించారు. ఈ ప్రదర్శనశాలలోని వస్తుప్రాశస్త్యాన్ని శ్రీ వెంకటాచలంగారు 'సాలార్ జంగ్ మ్యూజియమ్ సావనీరు' అన్న సంచికలో విపులపరిచారు. ఆ విగ్రహాలలో చిత్రాలలో ప్రశస్తవస్తువులలో కొన్నిటి ఛాయాచిత్రాల నిట ప్రదర్శిస్తున్నాము.

సాలార్ జంగ్ గారు, ఇటలీ, చైనా, ఫ్రాంసు, జపాన్, మొదలైన సర్వదేశాల పురాతన వస్తువులనే కాక, భారతీయ, పారసీక, మొగలాయి, పూర్వచిత్రాలను, శిల్పాలను, ఆధునికులైన భాగతాయి, దేవీ ప్రసాద్ రాయచౌదురి మొదలైన ప్రసిద్ధ భారతీయుల చిత్రాలనుకూడా తమ మ్యూజియంలోకి సేకరించారు.

పురావస్తుసేకరణలో, మంచిచెడ్డలను నిర్ణయించటం, రత్నపరీక్షవంటి బహుకుశాగ్రమైన జ్ఞాన విశేషం. సాలార్ జంగ్ గారు స్వతహాగా ఇట్టి జ్ఞాన సంపన్నులని, వీరి మ్యూజియమ్ వేయివిధాల వెలువరుస్తుంది.

ఇక్కడ ప్రచురించిన చిత్రాలలో భారత చక్రవర్తుల ఖడ్గాలు, వస్తువిశిష్టత గలవి. ఇటాలియన్ శిల్పాలు, ఐరోపీయ, పింగాణీవస్తువులు, కళాప్రాశస్త్యం కలవి. మింగ్ సామ్రాజ్యంనాటి చైనీయ విగ్రహం, కాన్‌యుస్ విగ్రహం. దాక్షిణాత్య, కంచు విగ్రహాలు, మొగల పారసీకచిత్రాలు, భారతీయకళా ప్రశస్తికి ప్రత్యక్షచిహ్నాలు.



మధుర శిల్పులు చెక్కిన దారు చెక్కడములు—19 వ శతాబ్దమునాటిది.



'సోమస్కందుడు'—దాక్షిణాత్య కంచువిగ్రహము 18 వ శతాబ్దమునది.



"దీపావళి"—షాజహాన్ కొలువునాటి మొగలాయీ చిత్రములనుంచి సేకరించబడినది.



డ్రెస్డెన్ పింగాణీ బొమ్మలు—లూయీ XV (ఫ్రాంసురాజు) నాటివి.



మెఫిస్టోఫిలీస్ - మార్గరీటా - ఇటాలియన్ దారు విగ్రహములు.



క్వాన్ యిన్ (చైనా కంచువిగ్రహము)
(మింగ్ సామ్రాజ్యమునాటిది)



ప్రముఖఖడ్గాలు=చరిత్రప్రసిద్ధులు ధరించిన ఖడ్గాలు. ఈ మ్యూజియంలో సేకరించబడ్డవి. ఎడమనుంచి వరుసగా-1. తానాషా, 2. బహదూర్ షా, 3. టిప్పు సుల్తాన్, 4. ఔరంగజేబ్, 5. అసఫ్‌ఝా,ల ఖడ్గాలు.



భారతీయ దంతపు నగిషీ చెక్కడపు బొమ్మలు


త్వరలో విడుదల!
రాగిణీ వారి
ధర్మదేవత
శాంతకుమారి.. లలిత... గిరిజ... లక్ష్మీప్రభ..
లింగమూర్తి... ముక్కామల... రేలంగి.. బి.యస్.ఆర్..
కౌసిక్... రామ్మూర్తి... మాష్టర్ మోహన్.. శివసరస్వతి
స్టూడియో వాహిని
డైరెక్టర్ పి. పుల్లయ్య

# పుణ్యాత్ములు

★

శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న

పొద్దు సుంకిపోయింది. చీకటిమాత్రం పడలేదు. శివరాత్రి ముందురోజు లేమో, చిన్న చలి వేస్తూనే ఉంది. గుర్రాల పాలల్లాగ వరసగా ఉన్న కూలీలయిళ్లు—రాతిపి బొగ్గు రాజేసిన కొలిములు—రెయిలుయింజన్లకిమల్లే గుప్పుగుప్పున పొగలు జిమ్ముతున్నాయి. పైనుంచిపడ్డ మంచుతెరా, క్రిందనుంచిలేచిన పొగమేఘాలూ, యిళ్లకి రెండుతాళ్లఎత్తున స్తంభించిపోయేయి. అంతా మసకమసకగా ఉంది. ఆ చాటునుంచి వీధుల్లో దీపాలు, నల్లచీర మీద పగడాల పేరులాగ, మందంగా ఎర్రగా కనిపిస్తున్నాయి.

అప్పుడే వొచ్చిన పాపకి అదంతా ఓ మాలోకం. ఇన్నాళ్లూ గురువులూ, వాడిపట్నం, ఆ "దూటీ"లూ అవీ వాళ్లూవీళ్లూ చెప్పుకుంటూ ఉంటేగా వినడం వేగాని, ఏనాడూ చూసేభాగ్యం పట్టలేదు యింతవరకూను. అసలు పెద్ద పండుగకే తీసుకువెళతానన్నాడు వాళ్లఅయ్య. అయితే, కమతగాళ్లని కూడగట్టుకోవడంతోనూ, కల్లంలో నూర్పులూ వాటితోనూ మరి తీరుబాటు కాలేదు అతనికి. కనుమా, ముక్కనుమా కూడా దాటిపోయినాయి. అప్పటికి వెళదాం అనే అయ్య తీరా బయలుదేరదాం అనుకున్ననాడే ఎల్లావు యీనింది. దాని జున్ను అయినా తీసుకువెళదాం అనుకుంది పాప.

"మా కరణం బాబున్నాడు గాదూ. ఎల్లావు కోడెదూడ్నేసిందని చెప్పేటప్పటి అయ్య. ఆయమ్మ జున్ను పాలంటూ పల్లిగిలించింది. ఆయమ్మ నీళ్లోసుకుందిసే. కాబోయినా, పేమ్మర్లే వొంచాల జున్ను" అంది పాప, గురువులు తల్లితో సిచ్చాపాటి మాట్లాడుతూను.

"పోనేటిపోయింది సెత్తా, పుణ్యెందే"అంది ముసలిది బోసి నవ్వు నవ్వుతూను. ఆ ముఖంలో మాతృత్వం వెల్లివిరిసింది.

"ఆయమ్మ మా మంచోరత్త మొన్న పెండిలికదేమో—ఇయాల పయనం అయినాం అనుకో, నిన్నన్నమాట—ఆయమ్మ నీలంతో దుత్తోంది. నూతికాడ కూకోని, సినంట్లుతో వుతున్నాను. 'పట్నం ఎలుతున్నాను కొతమ్మగోరూ' అన్నాను. ఏదో అడిగి లేని..."అంటూ రొజుకుంటూన్న కుంపటిలోనించి అగ్గితీసి చుట్ట ముట్టించింది పాప, 'అబ్బోసి, అలాగంటే. ఈ పాలి ఎల్లినానివి ఎల్లినట్టూత్తే వొప్పుకోను తెలిసిందా? అడితో కలిసిరావాల. ఇదుగో పాపా, పాత్తేలగట్టరూ' అని పిలిసి ఊరగాయెట్టిందా యమ్మ. మా మంచోరనే యత్త. ఆ యమ్మకి కొడుకుట్టిన్నా—నవనవనవనాడిపోతా ఎంత బాగుంటాదనుకున్నవత్తా..."వోరగా అంటుకున్న చుట్ట ఉప్పుఉప్పుని ఉఖటించి కాలూస్తూనే అంది పాప.

"నీకూ ఉనిశాకొన్నా. గురువులకి మనసే నీమీద." ముసలిది మురిసిపోయింది.

"పల్లకో, అత్తా" సిగ్గుతో కేపురించిన మొహం గుండెల్లోకి దించేసుకుంది పాప. ఒక్కనిముషం ఎవ్వరూ మాట్లాడలేదు. ఆ తృటికాలంలోనూ పాప, గురువుల సుఖపరిష్వంగంలో ఒళ్లు పైమరచిపోయింది. స్వాప్నికంగా నయితేనేం గాక, ముసలిదాని కయితే అరిచేతుల్లో మనవడు ఆడుకుంటూన్నట్టే కనిపించేడు.

"అడింకా రాడేం? పొద్దుగూకిపోనాది" పాప ప్రారంభించింది.

"యేలే యిది. వొత్తానే ఉంటాడు. ఇయాలే యినాగ యిందికాని, రోజా పెందలికడే "దూటీ". రేపటికాణ్ణుంచి అల బొద్దులేల కొచ్చేస్తాడ్నే—మాపిటిదాకా ఊసులాడుతూకూకుందువుగాని."

"లేయమ్మ. బియ్యంఅయినా కడుక్కొత్తాను. పొయ్యి ఊరికే మండిపోతాఉంది. అబ్బ. ఈ బొగ్గులేటో మరీ యేడి!!"

"రాబ్బసి బొగ్గమ్మా. నా కొడుకకి పనిసేత్తాడు. భునాదిగోతు న్నాగంతనోతు ఉంటాయనుకున్నా? ఓ పాలి తీసుకెల్లి సూపిస్తు. అటి కడో పేరు సెప్పినాడెమ్మా—నిత్తిరం. నాను అప్పుడే మరిసిపోనాను."

"గన్లు" అపూర్వ మధురంగా స్మృతిలో ఉంచుకున్న ఆ ముక్క ఛట్టున చెప్పుకుంది పాప, పాడ్యమి చంద్రవంకలాగ చిన్న నవ్వు నవ్వుతూను.

"ఆఁ. గన్లు. అటినోకల్లి బొగ్గు తవ్వుతారీల్లు."

"అంత నోతు కెలా గెడతారో?" పాప ఆశ్చర్యపడింది.

"పరంజాన్నాటి వుంటాయినే. అటిమీద దీల్లు కూకుంటారు. అటికి తాల్లుకట్టి మెల్లిగా దింపుతా రీల్లని."

"ఓలమ్మో!" ఎంతో ప్రమాదంఅన్నట్టు లోగొంతుకలోంచే అరిచింది పాప.

"మనం చేటి సెయ్యగలంనే. కూలి బతుకంటే యేటి? ఉంహూ నెను. అన్నింటికీ ఆ భగమంతుడే వున్నాడు. అడే రచ్చిత్తాడ్నే. ఏటి, కూలికెల్లినాల్లంతా సచ్చేపోతున్నా రేటి?"

## ౨

పాపకి ఆవూళ్ళో మనుషులతీరే అదేదోలాగ తోచింది. సమ్మంలో పేడనీళ్లు చల్లడం, ఓయిల్లు అలుక్కోవడం, పిడకలు కొట్టుకోవడం—చివరని ఓ పెయ్యని విప్పడం కూడా—యేమీ లేదు. ఎవడో తెల్లవారకుండా వొచ్చి పాలుపోసి పోతాడు. సమ్మంలోకివస్తే ముసలిది ఓఅణావి చిలగడదుంపలూ, అర్ధణా పచ్చిమిరపకాయలూ, వేడపెట్టి ఎండుపరిగెలూ కొంటుంది. "వీళ్లో సమ్మంలో పసువ్వూ లేదు; దొడ్లో మొక్కా లేదు. ఎలా గుంటన్నారమ్మా! డబ్బుకి దబ్బిచ్చి కొనేత్తారు పెతీదీని" అనుకుంది పాప ఓనాడు పొద్దున్నే లేచి, గురువులుకోసం చలిదికూడు ఎలాగైనిసం గిన్నెలో సర్దుతూను. గురువులు ఏఁవిటో హడావిడిగా తయారయిపోతున్నాడు.

"పలకర్ర నేసినావేఁటి? యిదపుడక" పాప వసారాలోంచే పలకరించింది.

"ఇంకా పలకర్రేటి? దూటీకెల్లిపోతూంటేని! గురువులంటే యేటో తెలుసా? పనోల్లందరోన్నికి ఘట్టుపరమాన్నం... అహాహ్హా..." హృదయం విప్పారేటట్టు నవ్వేడు.

"మాపెద్ద నేసినావ్. పాలేన్న. ఊ, యిరగబడి పోతున్న పిల్లోడు!"

"దూటీఅంటే యేటనుకున్నావేటి? ఇదో పాపా, యాదీపం మాసినావా? దొరగోడు కనిపెట్టేన్డు. ఇదొట్టు కెలిపోతే, అనా గలిపోడవే అడుక్కోనీ."

"నూతులో దిగిపట్టుంటారేట్రా, అదీ?" పాప యెంతో ఔత్సుక్యంతో అడిగింది.

"ఒకనుయ్యా? పాతాళ్ళంనే. జై పాతాళభైరవి" అంటూ పాప బుగ్గమీద చిటికవేసి చలిదిమూట అందుకున్నాడు గురువులు.

"అల్లకీ యీల్లకీ ఎట్టయ్యాక, సలిదికూంతె తిను. ఊరగాయ బద్దెట్టేను, మాసుకో. ఊరగాయంటే ఏటి అనుకున్నావో, కేమ్మర ఊరగాయబద్ద. వోర్రగుంటాది." వాడిమొహంమీద మొహంపెట్టి ఊరించింది పాప.

"అఁ అఁ. మరిసేపోనాను. అయినాక అల్లా రాఁవులికి కూంత కూడెట్టిండీమీ, పాపం. అడికి కింవటి వోరంఅల్లా మాపెద్ద జరం కాసేసింది. కూలికెల్లే నేపోనాడు."

"లేసనుగింజలు సాలవు గావాలరా" పాప అనుమానంగా అంది.

"ఎక్కడికేటి సాలడానికి? ఏటి? నాయొంకు అలబొద్దు అడికి పంపెయ్. రెండు పరిగెలుకూడా యెట్టు, మీ యమార గాయి బద్దాను. వోర్రగుంటే అడికి జిమ్మ సెగిపోత్తాది."

"మరి నీమాటరా?"

"నాకేటే. ఉండిపోతాదేటి పాట్టనోకూడు. ఏటి?... కాపీ కాగెత్తాన్నే వొట్లోను."

"అయితే నానూ తిన్నా."

"అదేటే! నువ్ తిను. మాయమ్మకి నీకూ కాకుంటే రెండు కేటి కూలిసెయ్యడం?"

"ఒద్దు నేరా. నాను తిన్నా." పాప నుండె లోతుల్లోంచి మాట్లాడింది. "ఈ పొద్దు నీయలబొద్దు. మాపిటికి నాయొంకు కూడున్నా. అడికిమాత్రం యెలాగొత్తాదేటి? కూలికె యెల్లనేదంటున్నావ్. పున్నెఁవేనే...సచ్చిపోఁవేటి ఓపూట కూడు నేక పోతేని."

"నీ యిట్టం. నేనెల్తాను మరి. తలుపేసుకో" అంటూ వీధిముఖం పట్టేడు గురువులు. గడపదాకా సాగనంపడానికి వెళ్లింది పాప.

"మరి నా మాటేటి చెప్పినావే?" గురువులు రహస్యంగా అడిగేడు.

"ఏటామాట?" ఏఁవీ తెలియనట్టే అంది పాప. కొంటెతనంగా.

"ఇదుగో పిల్లా—" మరీ దగ్గిరకి రాబోయేడు గురువులు.

"ఎర్రా, నీ వోలకం మవ్వాను. ఏటోలమ్మ, పిల్లోడి పరాచకాలు" చేపలాగ జారిపోయినపాప, మళ్లీ అక్కడే నుంచుంది, నవ్వుతో విసుక్కొని.

"కాదే మరీ. మీ యయ్యతో చెప్పొద్దంటే—"

"పల్లోరా. అఁ. ఇదేటోలమ్మ అదేమాట." ఈసారి పాప కోపం నటించింది.

"సరే లేయే. నీమీదే దీపెట్టుకోని ఎప్పుడో ఆ గనిలో నే సచ్చిపోతాను" బరువుగా అన్నాడు గురువులు.

"సచ్చిపోతావట్రా?" పాప కళ్లు చెమగిల్లిపోయేయి.

అంతలో సైరను మోగింది. గురువులు చకచకా వెళ్లిపోయేడు.

## 3

వీధి మలుపుకేరేసి పాప యిలా లోగుమ్మంలోకి తిరిగిందో లేదో, ముసలిది దగ్గుతో రొప్పుకుంటూ వచ్చింది, ఆదుర్దాగాను.

"నువ్వెందుకు నేచిపోనావత్తా? డాకటేరు బాబు కూకలేత్తాడు, ముందు కెడితేని. అను మరీ మరీ చెప్పెయెల్లేడు... ఇక పలకర్ర."

"ఎల్లిపోనాడూ?" ఏఁవిటో విస్పృహతో, విచారమున్నా ముసలిదానికి.

"యేం? రోజూ యెల్లేయేదే. పొద్దు పోనే తియాల. అదు సెప్పినట్టు ఇయ్యాలా అదే పట్టుపరమాన్నం."

"అదే కాదే." ముసలిది నీళ్లు పుక్కిలించి ఉమ్మింది; కొంగుతో మొహం తుడుచుకుని పాపకి దగ్గిరగా వచ్చి గోడకి జేరబడింది.

"ఇద కాఫీనీల్లు. నీ కొడుకె నేసి పెట్టేన్డు."

"ఏం కాపీనీల్లో. నా కొద్దే." ముసలిదాని గొంతులో కంపం. ఎందుకో కళ్ళంట నీళ్లు!

"ఆదేటత్తా. ఏకుత్తా వెందుకూ? తాగు, తాగు. కాఫీ నీల్లయినా తాక్కపోతే బొత్తిగా యీావలొట్టి పోగలవ్."

"ఇయ్యో, ఇయ్యి. ఇంకేటుంటదేటి. ఆ బగవంతు డెలా రాసిస్తో అలా జరుగుద్ది."

ముసలిది ముక్కు ఎగబీల్చి కళ్లు కొంగుతో వొత్తుకుంది.

"ఏటత్తా, ఎందుకలా గేడుత్తావు పొద్దుణ్నేని?"

"ఏటి సెప్పమంటావమ్మా. సెప్ప కలొచ్చింది పెందలేని. తెలివేసే ఉన్నానమ్మా కేతిరల్లాను. బూడుసు బండొచ్చి కాదూ? ఇంజారం కూసింది? అప్పటికి తెలివేసే వున్నాను. అనాలొగే కునుకొచ్చేసిందోలమ్మా! మన శింగుపురం నేదూ? ఏరుదాటి పాలా సెమ్మటే యెల్తన్నాం అమ్మా, మీ మాఁవా, నానూను. ఆ రేవూ యీా రేవూ పచ్చంగ పొలాలు. రేవుగా ఎదిగి సెంక్క నీ యెత్తుందనుకోయమ్మా. ఆదేటిదో. నాను సెప్పలేను. నీ తిరమే నే. ఏడ సూసినా నూపొరివంత పేర పొలఁవే. ఇంకో నీ తిరవమ్మా, ఇలా గడుతున్నాఁవా? ఈ రేవల్లా పైరు, ఆ రేవల్లా పూవులూను. తెల్లంగ మీగడవాలున్నాయే ఆ పూవులు. మా లచ్చిమే. మీ మాఁవయితే వొల్లు మరిసిపోయి "గోంగూర పదం" పాడుతుస్న. ఆడితో ఆసికాలాడుకుంటూ యెంబడే యెల్తన్నాన్నేను. నాలు గడుగులు అలాగేసేఁవోలమ్మా—"

ముసలిదానిగొంతుక అకస్మాత్తుగా మారిపోయింది. శూన్యంలోకి చూస్తా, నిజంగా తన కళ్ళ యెదుట—అప్పుడు—ఏదో ఘోరం జరిగిపోతున్నట్టు కంపించి పోయింది. గద్గదికతో మళ్ళీ అందుకుంది—

"అలాగ ఆసికాలాడుకుంటూ యెల్తానే వున్నానే—అంతలోకి పెద్దగాలీ పరగడా సెగిసింది. ఆకాసిమల్లా ఎర్రగై పోవాలె, సిటంలోని! అయిపోయీా, వొరసం వొచ్చింది. వొరసం అంటే ఏటనుకున్నావో. రత్తం కురిసిందమ్మా! రక్తవేఁనే. ఓ ఓ! పొలాలూగట్టూ మరి నేవు. అంతా ఒకటే నెత్తురు. బూవంతా నెత్తురుమయిం అయిపోనాది. తనువుకో త్తేనే వొళ్లు గజగజలాడిపోతాదో లమ్మా! ఏటో ఉక్కిరిబిక్కిరయిపోయిన్నాను. తెలివేసి సూతును గందా, ఏటీ నేదు. ఎర్రగా పొద్దెక్కిపోనాది. ఆనాడే నా గేనమ్మ, నాన్నొగిసేసరికి మీ మావదూటీ కెల్పపోనాడు, పలిదికూడు ఆడే ఎట్టుకోని. అదే ఆకరి సూపయిపోనాది తల్లో గనిలో కెల్లినోడు మరి రానేదు. ఆయాల అలాగయిపోనాది. ఇయాలమల్లీ ఆదేకల. దెపుకల. ఏం రాతో—బగమంతుడే రచ్చింపాల" ముసలిదానికి ఆపినా ఆగకుండా వెల్లుబికివచ్చేయి,కన్నీళ్లు. పాపకి, సగం తెలిసీ సగం తెలియకా, మొత్తానికి మతిపోయింది. అయినా అకాత్తుగా చచ్చిపోవడం అంటే ఏదిటో ఊహించుకోలేని మనిషిగనక సాఫుగా అనుకంపతో అంది—

"ఏటి సేత్తాం అత్తా. తెమ్మకేవుఁడిరాత అలాగుందిగా బలస."

కావయితే దానిమాట పూర్తికాలేదు. ఆ వేళగాని వేళప్పుడు గనిలోంచి సైరను మోగింది. పాపకి చెవులు గింగురుమన్నాయి. బుద్ధికి జడత్వం ఆపాదించుకుపోయింది. రెండునిమిషాలపాటు అలాగ చిత్తరువులో బొమ్మలాగ, ఉండిపోయింది. మరికాస్సేపటికి—"ఏటత్తా" అని ఆక్రోశించింది.

ముసలిది మరిమాటాడలేదు. అసలు అది దుఃఖం దిగమింగుకుంటూన్నట్టే తెలియనివ్వలేదు. అంతలో ధైర్యం తెచ్చుకుంది. "నువ్వుకూడొండమ్మా, నానిప్పుడే వొత్తానుగానీ" అంటూ అక్కణ్ణుంచి లేచి వీధివేపు వెళ్లిపోయింది. తలుపుతీసేసరికి వాడవాడంతా ఒకటే గగ్గోలు, "గని పడిపోయిందంటే, గని పడిపోయిం"దని. ముసలిదానికి యిదంతా చాలా అనవసరపు గొడవలాగ తోచింది. అడిగిన ఒకరిద్దరూ, "గనిలో ప్రమాదం" అనో, "పునాదులు పల్లిపోయేయి" అనో అన్నారే గాని పని కొచ్చే ముక్క ఒక్కరూ చెప్పలేదు.

"ఏటో, అంపులా యేమాటా తిన్నగా సెప్పరూ" అని విసుక్కుంది ముసలిది.

"ఏటి పిన్నమ్మా. యిన్నావా పెమాదం?" అంటూ అప్పలమ్మ పలకరించింది అంతట్లోకేను. దాన్ని చూసేసరికి ముసలిదానికి జవసత్తులు వొచ్చేయి. అప్పలమ్మ తనలాగ, గనులలో ఢక్కా ముక్కీలు తిన్నదే.

"ఏటయింది అప్పలమ్మా? ఏటా గోల?"

"గని తవ్వకూంటేని పునాదులడిపోయాయంట" అప్పలమ్మ ఖరారు అయిన భోగట్టా చెప్పింది.

"యే లంబరేకి?"

"తొలి లంబరేస్ట పిన్నమ్మా" అప్పలమ్మ మాటల్లో వివరాలు తెలుస్తున్నాయి.

"నీ కొడుకు కెల్లినాడేటి?" ముసలిది మళ్ళీ అడిగింది.

"ఆడా? ఆడు మరీ పోకిరీ అయిపోతుండు. నిన్న రేతిరి తప్పతాగేసొచ్చిను యింటికి. బారెడు పొద్దెక్కినా సెగేనేదు ఇయాల. మరాడికి డూటీ యేటి, నా మొకం......నీ కొడుకో?"

"ఆదెల్లినాడప్పలమ్మా. పెందిలే యెల్లినాడు, యిప్పటి దాగే."

"అడిక్కేటే మా రాజా. ఆ దెప్పుడూ సిరీ సుక్కురాను... నాకు తెలీక అడుగుతానా—"

"స్సు. మెల్లిగా మాట్లాడే నీ జిమ్మడ."

"ఔవట్టు. మరిసేపోనాను. ఏటిపేత్తోంది పాప?"

"ఏటిసేత్తాది? పేణాలన్నీ ఆడిమీదే యెట్టకుంటాదంట."

"నిజఁవే పిన్నమ్మా. అది యిలాంటిగోరాలు నూసెరగదు. దాన్నిమాత్రం యీాది నోకొగ్గేవుగనక! గుండె పేలి సచ్చిపోతాది సుమీ, అక్కడేటి అనుకున్నావో!"

"తెల్దేటి, అప్పలమ్మా, ఎరఁగనాసేటి? అమ్మోర్రాత. గుండెలూ మొండేలూ, దుమ్ములూ నెత్తురూను. ఎవులెరగఁవేటి? రత్తప్పెభావం అయిపోద్ది."

"రాగా చెప్పినావ్...రొల్లమ్మా, రొలిపో కోపలికి. ఆ గుంటని మాసుకో." ఆత్రుతగా వస్తూన్న పాప కంటపడేసరికి అప్పలమ్మ ధోరణి కట్టి పెట్టి తివదారిని పోయింది. చివరి ఒకటి రెండుముక్కలూ వినిపడ్డాయేమో, పాపగుండెల్లో ఒకటే తుపాను. ఇంకా మరి పట్టలేక ముసలిదాన్ని అడిగింది—

"ఓపాలి గనికాడి కెల్లొత్తనత్తా."

"నీకేటి మతిగానీ పోనాదేటి ?" ముసలిది మందలించింది, "ఆడంతా యేటిదో తెలుసా ? అమ్మోరి పంబరేవ్రా, పోలిపిల్లి నాతిరా అనుకున్నా వేటి నీ మనస్సులోకి ? ఎలాగున్నాడో, ఎలాగొత్తాడో ! నా మాటినీ, ఆడికా సులకమంచం వొలేసి పక్కెయ్యి. కూడూ. నా బొంత ఆడి బొంత కోడించి ఎయ్యి ; మెత్తగుంటాది." మొండిధైర్యం తెచ్చుకుని ముసలిది అలా పనులు పురమాయిస్తూనే ఉంది.

పాప ఆరాటానికి అంతులేదు. పక్క వేస్తూ ఓ లక్షసార్లు అనుకుంది "ఏం పెమాదఁవో యేటో. దెబ్బతుండని ఆసి మరీ మరీ అడిగితేని ఏ కబురూ చెప్పకుండా విడిపించుకు తిన్నాను. ఆడు అన్నట్టు నామీదె దిబెట్టుకు సచ్చిపోవాడో యేటో ?"

పాపకి అనేకంఅయిన ఆలోచనలు రేకెత్తి యేదీ స్థిరంగా నిలవకుండా మనస్సుని కలికి పారేసేయి. ముసలిది పురమాయించిన పనులు అలాగ యంత్రవతుగా చేసుకుపోతోంది. అంతలో గిధి తలుపు దబదబా బాదిన చప్పుడు! అక్కడే ఉన్న ముసలిది గడియ తీసింది. పాప ఉన్న చోటునుంచి కదలకుండానే ఇవక్క తిరిగి చూసింది. ఓ నలుగురు మనుషులు గురివుల్ని స్ట్రెచ్చరుమీద తెచ్చేరు. పాప చప్పున దుప్పటీ పరిచి గోడవేపుకి తప్పుకుంది. వాళ్లు తిన్నగా వచ్చి గురువుల్ని మంచంమీద పడుకోబెట్టేరు. గురువుల వొంటినిండా దూది అంటింపులూ, ఊబిడో ఘాటం వాసనూ. పాపకి గుండె ఆగిపోయింది! కాని, ముసలిదానికి ఏవిటో ఆధైర్యం ! వాడి మొహంమీద మొహం పెట్టి నిద్రలోతూన్న వాడితో అన్నట్టు అంది—"అబ్బీ, గురువులూ. నాయనా ముసిలి దాన్ని."

గురువులు స్పృహగానే ఉన్నాడు—"రావులుకి కూడంపి నారే?"

"అంత మరీమరీ చెప్పిరొల్లి నావుగదా, పంపఁవా?" అంది ముసలిది.

గురువులు బాధ అపనయించుకుంటూన్నట్టు బరువుగా మూలిగేడు. ముసలిదాని గుండెల్లో భోషాణం యాడ్చినట్టయింది.

"ఏట్రా? సెయ్యికాలా...పెమాదఁ వేటి?"

"ఏటి నేదమ్మా. కాసింత పెక్కుకుపోనాదం తే. మా జట్టు జట్టంతటినోకి నా వొక్కణ్ణే మిగిలిపోనాను." అంటూ కళ్ళంట నీళ్లు పెట్టుకున్నాడు.

"ఏటో మొండితనం. ఏకుత్తా ఇంకుకురా, అయ్యా...... పల్లకో, పల్లకో. ఏటి సేత్తాం. ఆ బగమంతుడే వున్నా డన్నంటికీని" గురువులు వొళ్లు నిమురుతూ సముదాయించింది, ముసలిది.

"అది కాదే. నాను సచ్చినా తీరిపోను. బగవంతుడే రచ్చించేత్తే. పాపకోసఁవే, దానికోసఁవే మిగిల్చినిస్తు నన్ను. అదేటిదో కాని దానిమీదే దిబి ఉండిపోనాదే."

మంచం తలాపు దిక్కున నిలుచుని యిదంతా వింటూన్న పాపకి యీ చివరిమాటలు వినిని పద్ధంతో చే మరీ దుఃఖం ముంచుకు వొచ్చింది. నూతులో జలపడినట్టు, ఎక్కడో నెమ్మదిగా పుట్టి, కళ్లునిండి పేసి చెక్కిలిమీనుంచి జారిన అశ్రుకణం ఒక్కటి టక్కుమని గురువులు నుదుటిమీద పడింది. వాడు ఉలిక్కిపడి, కన్ను పైకెత్తిమాసేడు—"ఎక్కడా అలికిడి నేక పోతే యెటెల్లేవో అనుకున్నాను. ఈడనే వున్నా ?" అని అడుగుతూనే దెబ్బలు తగిలిన కుడిచెయ్యి బరువుగా పైకి లెత్తేడు గురువులు. ఇంబడే జాలిగా దీనంగా అడిగేడు "నామాట ఏటి సెప్పినావే ?"

పదిలంగా వాడి చెయ్యి తనచేతుల్లోకి తీసుకుని, చెక్కిలిని నొక్కి వొత్తుకుంటూ అంది పాప : "నీమాట నీమాట అంటా వేటిరా అత్తమానమూ, నీమాట యేరూ, నామాట యేరునా యేటి ?"



## మీరు క్షవరము చేసికొన్నప్పుడు ఏమౌను?



కేరళసబ్బు నురుగుతో వెంట్రుకలు మెత్తపడి త్వరగా తెగుటకు అనువగును.

సాధారణముగా గడ్డపువెంట్రుకలు కత్తి వాటునుంచి తప్పిపోవును. కనుక వాటిని నిబ్బరముగానిలిపి తెగునట్లు చేయుటకు చిక్కనైన నురుగు అవసరము. కేరళ క్షురసబ్బు సమృద్ధిగా, మంచి నురుగునిచ్చుటయేగాక దీని రసాయనిక మిశ్రము ప్రతి వెంట్రుకను మెత్తపరచి సులభముగా తెగనిచ్చును. ఇది కత్తిని గడ్డముపై జారుచేసి, ముఖమునకు బాధలేకుండా చేయును.

**మీ ముఖవర్చస్సును కాపాడుకోండి!**

## కేరళ

క్షురసబ్బు ఉపయోగించండి



- ప్లాస్టిక్ గొట్టములో
- తయారు. వెల.. అణాలు 11½
- సబ్బుమాత్రమే

**కేరళా సోప్ ఇన్‌స్టిట్యూట్, కాలికట్.**

పారిశ్రామిక వాణిజ్యశాఖ

**మద్రాసు ప్రభుత్వము**

SISTA'S-KS-4-Telugu.



## జగద్విఖ్యాతి గాంచిన జాండ్రపేట చూర్ణము

(రిజిష్టర్డు ట్రేడ్ మార్కు)

గ్యారంటీ!

వాడిచూడండీ!!

సంజ, పాండువ, గుల్మ, వ్యాప్రోగములు, ఉన్మాదములు, రక్తప్రదరము, శ్వేతప్రదరములు, మొదలగు సర్వవ్యాధులను నివారించుటలో పాశుపతాస్త్రము వంటిది.

వైద్యశేఖర, గుత్తి నాగయ్య

రిజిష్టర్డు ఫిజిషియన్

1 పొట్లము వాడిన 15 రోజులకే గుణ మిచ్చును.

15 రోజులకు సరిపడే పొట్లము 1-కి రు 5-0-0.

**శ్రీ వెంకటేశ్వరాయుర్వేదాలయము,**

జాండ్రపేట. (వయా) చీరాల, గుంటూరు జిల్లా.

---

వివాహ సంబంధముల కొరకు

## హిందూ వివాహ 'ఇన్‌ఫర్మేషన్' బ్యూరో



ఆఫీసు; కాకినాడ, రామారావుపేట.

(రిజిష్టర్డు నెం. 171)

ప్రథమ, వితంతు, ప్రేమ, వివాహములకు, రిజిష్టర్డు వివాహములకు కంట్రాక్టు రిజిష్టర్డ వివాహములకు, విడాకుల చట్ట నిబంధనలు, తెలుసుకొను స్త్రీ, పురుషులందరు, పై బ్యూరోవారిని సంప్రతింపుడు.

వివరములకు మీ అడ్రసుగల పోస్టు కవర్లు పంపుడు. అట్లు పంపనియెడల జవాబులు యివ్వబడవు.

ప్రొప్రయిటరు:

**టి. జ్వాలా నరసింహ్వం.**

టౌన్ రైల్వే స్టేషను వద్ద.

గమనిక:— బీదకుటుంబీకులు ఆడపిల్లలకు మాత్రమే ఉచితముగా వివాహము చేయబడును. స్త్రీలకు ప్రత్యేకవసతులుకలవు

## ఆరమ్ స్ట్రాంగ్ సిడ్లీ
డీజెల్ ఇంజన్లు
**6/8 & 12/20** హెచ్. పి

★

## "షివ్‌జీ" పంపు
సెంట్రీఫ్యూగల్
అన్ని సైజులలో లభించును



సోల్ ఏజంట్లు:
వ్యవసాయమునకు, పరిశ్రమలకు
ఉత్తమమైనవి.
అసలైన విడిభాగములు
పూచీ ఇవ్వబడినవి.
సర్వీసింగ్ సౌకర్యములు
ఎల్లప్పుడూ లభించును.



ఫుల్‌సోమీటర్ అసలు ఇంగ్లీషు పంపులు, ఫుట్‌వాల్వులు,
ఎలెక్ట్రిక్ మోటార్లు, మోటారు పంపు సెట్లు వగైరా వగైరా
కూడ లభించును.

### కె. యస్. షివ్‌జీ అండ్ కో.,
178/179, బ్రాడ్వే, మద్రాసు-1.

ఫోన్: నం. 8517
టెలిగ్రాంలు "LAMP"

---

## హిందుస్తాన్ కో-ఆపరేటివ్ ఇన్స్యూరెన్సు సొసైటీ లిమిటెడ్,
హెడ్డాఫీసు: కలకత్తా

ఫలితములే తెలుపగలవు

★

1950 డిశెంబరు 31 తో అంతమైన నాలుగు సంవత్సరములకు
### హిందూస్తాన్ 1950 వాల్యుయేషను
రు. 1 కోటి 25 లక్షల పైబడి మిగులు (సర్‌ప్లసు) నిచ్చినది.
తిత్సలితముగ లాభసహితము పట్టా లన్నిటిమీదను భీమా మొత్తము రు. 1000/- కి సాలుకు

| | |
|---|---|
| ఎండోమెంటు భీమా | రు 8 లు. |
| యావజ్జీవిత భీమా | |

బోనసు ప్రకటింపబడినది.

ఈ ఫలితములు వడ్డీ ప్రమాణమున ½% తగ్గించుటచే రిజర్వులను బలపరచిన పిమ్మటను, తరుగుదలకును అన్ని చిల్లర చెల్లుబడులకును ఏర్పాటుచేసిన పిమ్మటను పొందబడినవి.

తక్కువ వడ్డీ సంపాదన, హెచ్చుకర్చులు, తరుగుదల మొదలగు అనేక ప్రతికూల పరిస్థితులలో పనిచేయవలసివచ్చినను ఫలితములు హిందుస్తాన్ వారి పొడుపైన మానేజిమెంటును, నిరాక్షేపణీయమైన భద్రతను, సర్వవిధముల గొప్పదైన ఆర్థిక స్థితిని మరొకమారు ఋజువు చేయుచున్నవి.

| | | |
|---|---|---|
| అమలులోనున్న పట్టాలు | ... | రు. 73 కోట్ల 16 లక్షలపైన |
| జీవిత నిధి | ... ... | రు. 15 కోట్ల 97 లక్షలపైన |

ఆంధ్రదేశమునకు బ్రాంచి ఆఫీసు:
**"హిందుస్తాన్ బిల్డింగ్సు," గవర్నరుపేట, విజయవాడ.**

ఏమీ మాట్లాడుకోకుండానే ఎవరి గదుల్లోవారు ప్రవేశించి నిద్రపోయే ప్రయత్నం సాగించారు.

మర్నాడు బాంకుకి సెలవు కావడం మూలాన అతని చెక్కు మారలేదు. ఆ మర్నాడు చెక్కు మారిపోయిందిగాని ప్రయాణం మాత్రం కాలేదు. తరవాత మూడు నాలుగు రోజులు ప్రయాణం ప్రసక్తేరాలేదు. అసలు, వెళ్ళిన మరునాటి రాత్రికేవస్తానన్న భావనారాయణ అప్పటికీ రాలేదు. అతను మరి వచ్చేదేమిటి లెండి అంటుంది శశికళ. కాని, శంకరశాస్త్రి మాత్రం, "ఆః ఏమో ఏదో పెద్ద అవాంతరంవల్ల రాలేకపోయిఉంటాడు గాని, అసలే రాకపోతాడా, ఇటువంటి చోటు వదిలేసి" అంటాడు. ఆమె తనలో తాను నవ్వుకొంటుంది శాస్త్రి అమాయకత్వానికి. నిజమే శాస్త్రి వంటి మనిషి ఎన్నడూ అలా చెయ్యలేడు. ముందు తీసుకొనిరావడానికే అనుమానించి ఉండేవాడు. కాని, ఒకమారు వచ్చిన తరవాత మాత్రం, ప్రాణంపోయినా విడిచిపెట్టి ఉండేవాడు కాడు. అటువంటివాడికి భావనారాయణ లాటి మనిషి తత్వం ఏం తెలుస్తుంది? తానే భ్రమపడ్డాదికదా, తక్కిన విషయాల్లో ఎటువంటివాడైనా తన విషయంలో స్థిరంగా ఉంటాడని.

ప్రత్యేకించి ఇద్దరికీ ఒక కార్యక్రమమంటూ లేదు. కలిసే భోజనం, ఫలహారం చేస్తున్నారు. ఉదయం ఒకమారు శంకరశాస్త్రి తిరిగి వస్తాడు. మధ్యాహ్నం భోజనానంతరం కొంతసేపు విశ్రమించడం, తరవాత మూడుగంటలప్రాంతంలో లేచి కాఫీలు ఫలహారాలు పూర్తిచేసుకొని, కొంతసేపు ఏవో కబుర్లు చెప్పుకోడం, సాయంకాలం వీధిలోకి బయలుదేరడం, ఏదో ఒక సినీమా చూసి రాత్రి తొమ్మిదిన్నరప్రాంతంలో చేరుకొని, హోటలు తొమ్మిదికే కట్టేసేవాడు, తమ గదులవద్ద కేరియరులలో పెట్టబడి ఉండేది భోంచేసి పడుక్కునేవారు.

నాలుగవనాడు శంకరశాస్త్రి ఒంటరిగా ఉన్నప్పుడు హోటలు మేనేజరు అడిగాడు. "సార్, మీరు మరి రెండురోజులు ఉంటారా? మొదట్లో రెండురోజులే ఉంటామన్నారు. మరేం లేదు. మీ గది మరెవరికయినా కావాలంటే బుక్ చెయ్యడానికి"

శంకరశాస్త్రికి అతడి ప్రశ్న అంతరార్థం తెలియకపోలేదు. "నేను రెండురోజులే ఉండాలనుకున్నాను. కాని, ఇక్కడికి వచ్చేక మరి కొన్ని పనులు కూడా తగిలేయి. ముఖ్యంగా మా ప్రక్క గదిలో ఉన్నారు వాళ్లు మా వాళ్ళే; అతను భావరాయణ భూముల శిస్తుల వసూళ్ళకని వెళ్ళేడు. ఒకటి రెండురోజుల్లో రావలసినవాడే. అక్కడ ఏమి తప్పనిసరి పనులు ఉన్నాయోగాని, ఆవిడకు అక్కడి వాళ్ళవాళ్ళతో పడదు. అందుచేత ఇక్కడే ఉంటున్నాది. అతను వచ్చేవరకూ ఇక్కడ తోడుగా ఉండమన్నది నన్ను. అందుచేత నేనింకా మరి కొన్నాళ్లపాటు ఉంటాను. అంటే చెప్పలేను. అతను వస్తే వాళ్లు మద్రాసు వెళ్లిపోతారు. నేను మావూరు వెళ్లిపోతాను. అంతవరకూ ఉంటాము. మీకు కావాలంటే మరికొంత అడ్వాన్సు ఇస్తాను, మా రెండు గదులకీనూ."

"అడ్వాన్సుకి బాధలేదండి; వెళ్ళిపోయేటప్పుడు సెటిల్ చేస్తాను నే నడగడం ఎందుకంటే, మీరు మొదట రెండురోజులే ఉంటామన్నారు. మీరు ఇప్పుడుంటే బాధలేదుగాని, రేపు ఖాళీ చేసేసి, ఈలోపుని నేను, మరెవరయినా కావాలంటే లేదని పంపించేస్తే అనవసరంగా గది ఖాళీగా ఉండిపోతుంది చూడండి."

"నిజమేనండి"... మేడమీదికి వెళ్లి శశికళతో అంతా చెప్పేడు. ఆమె ఎందుకో నవ్వింది; అతనికీ నవ్వు వచ్చింది. అతని నవ్వు చూస్తే ఆమెకు మళ్లా నవ్వు వచ్చింది. ఆ నవ్వుల కొక అంతు కనబడలేదు.

హోటలు మేనేజరు అడిగిన మాటల్లోగాని, తన సమాధానంలోగాని, ఎక్కడా నవ్వు రావలసినమాటలు లేవు. ఆ సంగతి తనకు తెలియదా అంటే తెలుసును. అయినా ఎందుకో ఆమెతోపాటు తానూ నవ్వుతున్నాడు, ఆ నవ్వులో ఉండే ప్రభావం కాబోలు. లేకపోతే తా నెందు కింత అకారణంగా నవ్వుతాడు.

హోటలు మేనేజరుతోనయితే అంత స్పష్టంగా చెప్పగలిగేడు గాని, వాస్తవానికి పరిస్థితి అంత సంతృప్తికరంగా లేదు. ఆ భావనారాయణవచ్చే ఆశ మరిలేదట. ఆ వేళ మొట్టమొదటిమారు సినీమాకి కలిసివెళ్ళిననాటిరాత్రి, అతను తాను తమ ఊరికి వెళ్లిపోయేలోపుని రాకుండా ఉంటే బాగుండు ననుకొన్నాడు. కాని, ఇప్పుడు అందుకు విరుద్ధంగా అతను వస్తేనే నయమనిపిస్తున్నది. అక్కడితో తన బాధ్యత వదిలిపోతుంది. తాను ఏమీ పూచీలేనట్లుగా వెళ్లిపోతే ఎవరూ ఏమీ అనలేరు. ఆమెతో తన కిదివరకు ఏమీ సంబంధం లేదు; ఇకముందు ఉండబోదు. అటువంటి సందర్భంలో తనకేమీ బాధ్యత లేనట్టే. అయినా ఒక స్త్రీని నిరాధారంగా ఏమయితే కానీ అన్నట్టు, విడిచిపెట్టి వెళ్ళిపోగలడా? ఆమె ఏమిటి చెయ్యదలచుకొన్నదీ నిశ్చయంగా తెలియదు. ఒకప్పుడు తన కేమీ భయమూ బాధా లేనట్టూ, తిరిగి యింటికి వెళ్ళిపోతా నంటుంది; మరొకప్పుడు మాట్లాడితే అసలు ఎక్కడికి వెళ్లిపోతుందో తనకే తెలియనట్టుంటాయి మాటలు; చూడగా చూడగా అన్నిటికీ తెగించి ఆత్మహత్యా ప్రయత్నంలో ఉన్నట్టు కూడా కనిపిస్తుంది. ఇంతటి సౌందర్యవతి, వివేకవతి జీవితం మొగ్గలోనే వాడిపోవడమా? ఎంత చక్కటి గొంతు, నేర్చుకోకపోయినా సినీమా పాటలు చక్కగా పాడుతుంది; కొంచెం సాధకంతో, ఎంతగానయినా అభివృద్ధి కావచ్చును. అందుకే, ఆ భావనారాయణ వచ్చి తీసుకొనిపోతే, తనకు మరి ఏ విచారమూ ఉండదు. అయితే అతగాడి తత్వమేమిటో. ఇంటిలోనుండి లేవదీసుకొని వచ్చి, కొన్నాళ్ళపాటు సరదాగా గడిపి, ఇప్పుడిలా మాయమైపోవడం. మనిషిబుద్ధిని స్వార్థం అన్నది ఇంత దట్టంగా అలుముకో గలదన్నమాట!

అటువంటి మనిషిని ఎలా నమ్ముకొని బయలుదేరగలిగిందో? "మరేమిటి చెయ్యడం, గత్యంతరం లేకపోబట్టే; నాకూ కొంత తెలుసును; అయితే ఇంత త్వరలో ఇలా తయారవుతా ననుకో లేదు;" అంటుంది.

"సరే వాళ్లు ఎటువంటి వాళ్ళయినా, ఏ ఉద్దేశాలతో బయలు దేరినా తన కదంతా అప్రస్తుతం. ప్రస్తుతం వారు వస్తే వాళ్ళిష్టం. భావికార్యక్రమం ఏ విధంగా నిర్ణయించుకొన్నా తనకు బాధ లేదు; లేనప్పుడు ఆమెను తీసుకొనివెళ్ళి, ఆ సవతితల్లి దగ్గరే నయినా విడిచిపెట్టెయ్యాలి; అంతేకాని, ఇక్కడ ఇలా హోటలులో విడిచిపెట్టి వెళ్ళిపోవడం నట్టేటను విడిచిపోవడంతో సమానం కాదూ!"

ఇక్కడి తన బాధ్యతను గురించి ఆలోచించినప్పుడు తాను చేస్తున్న పనిలో ఏమీ పొరపాటు లేదనిపిస్తుంది. కాని, ఖర్చు చూసినప్పుడుమాత్రం చెప్పలేని గాభరా కలుగుతుంది. తన ప్రయాణపు ఖర్చులకని తెచ్చినదేకాదు, చెక్కు మార్చిన అరవై రూపాయిలలోనూ చాలాభాగం కరిగిపోతూంది. ఇంకా హోటలువాడి బిల్లు ఎంతకి వస్తుందో? అతడిస్తే తనకు పూచీలేదుగాని, లేకపోతే వాళ్ళబిల్లుకూడా చెల్లించాలి అంటే తన దగ్గరున్న డబ్బు చాలదు; అక్కడ అన్నయ్యా వదినా ఏమనుకొంటూ ఉంటారో? తాను డబ్బుపట్టుకొని రాగానే అన్నయ్య బయలుదేరాలనుకొంటున్నాడు పెళ్లి సంబంధం నిశ్చయం చేసుకోడానికి. తీరా తను వట్టిచేతు లూపుకొని వెళ్ళితే ఏమనుకొంటారు? అసలు ఇంత డబ్బు ఎలా ఖర్చుపెట్టేవని చెప్పడం. పోయిందని అబద్ధం చెప్పడమా? అంతకంటె యథార్థమే చెప్పేస్తే నమ్ముతారా? వాళ్ళకి నమ్మాలనే ఉంటుందిగాని, లోపల చిన్న అనుమానం ఉండిపోతుంది, వీడు కేవలం సహాయం చెయ్యడానికే ఖర్చుపెట్టి ఉంటాడా? ఇంకా ఏమో? తానయినా ఇంకొకళ్ళగురించి ఆవిధంగా అనుమానించి ఉండేవాడే...

ఆమె రావడంతో అతని ఆలోచనకి అంతరాయం కలిగింది. "ఇవాళ మధ్యాహ్నం నిద్రపోకుండా ఏదో ఆలోచిస్తున్నట్టున్నారు."

"ఆలోచనేం లేదు. నిద్రపట్టకపోయినా, అందుకోసమని ఎందుకు తాపత్రయపడడమని ఇలా కూర్చున్నాను ఏదో చదువుదామని. అప్పుడే ఎండాకాలం వచ్చేసినట్టే ఉంది. చదువూ కాలేదు, నిద్రా కాలేదు. మీరు బాగా నిద్రపోయేరా?"

"నాకు మరి ఉన్న పనేమిటి, పగలూ రాత్రి కూడా నిద్రపోవడమే."

"ప్రస్తుతం నా పనీ అంతేలెండి."

"మీకు ఇంటికి వెళ్ళేక కావలసినంత పనుంది. నాపని ఎప్పుడు ఇంతే. అయితే ఏమిటి ఎప్పుడు బయలుదేరుతున్నారు? అసలు మీ ముఖం చూస్తే ఇంటిమీద ధ్యాసం పుట్టినట్టుంది."

"అద్దంలో చూసుకొంటే నా ముఖంలో నాకేం కనబడడం లేదు. సరే మీ కేదో దివ్యదృష్టి ఉంది కాబోలు."

"ఉందో లేదో మీరే నిర్ణయించాలి. మీరు ఇంటినిగూర్చి మీ శ్రీమతిని గూర్చీ, మీ అబ్బాయినిగూర్చీ ఆలోచిస్తున్నారా లేదా? ఆవిడ ఈపరికి ఏంచేస్తూ ఉండిఉంటారు? ఏమో, పాపం మీకయినా ఏం తెలుస్తుంది; మీ రున్నప్పటి కార్యక్రమానికి ఇప్పటికీ ఏమి మార్పు ఉందో? ఏమయినా మేఘసందేశంలో యక్షుడు మేఘుడికి చెప్పిన గుర్తుల్లాగ మీరు ఫలానా ఫలానా రకంగా ఉంటారని ఊహించడం లేదూ! అయితే యక్షిణి ఒక్కతే; కొడుకు లేడు. మీకు మాత్రం ఆలోచనలో ఇద్దరూ ఒక్కమారే మెదుల్తూ ఉంటారు కాబోలు. మీ అబ్బాయి పేరు చెప్పారు (శంకరశాస్త్రి! భయం వేసింది ఏ పేరు చెప్తాను చెప్మా అని) కాని, మీ శ్రీమతి పేరు మాత్రం చెప్పారు కారు. మరి ఇవాళ చెప్పితీరవలిసిందే. లేకపోతే సాయంత్రం షికారుకి రాను. రాత్రి సినీమాకి రాను. అసలు పెళ్ళిలోనయినా చెప్పారా లేదా?"

"వాళ్లు చెయ్యవలసిన బలవంతం ఏదో చెయ్యకపోలేదు గాని, కొసకి చెప్పించలేకపోయేరు."

"బలే మొండిపట్టుదలన్న మాటే, నేనూ చూస్తాను కదా! ఇవాళ చెప్పకపోతే వీల్లేదు. అంతగా నోటితో చెప్పడానికి మొగమాటం అయితే, కాగితంమీద రాయండి, అంతే లేకపోతే అంతవరకూ నేను సత్యాగ్రహం చేస్తాను. భోజనం, కాఫీ ఫలహారమూ అన్నీ ముట్టుకోను"

"మంచి సత్యాగ్రహమే. ఇది పూర్వం పెత్తికోతలవాళ్ళ పద్ధతే. అడిగింది ఇచ్చేవరకూ ఏదో ఒకరకంగా శరీరానికి బాధ కలిగించుకొని, అవతలవాళ్ణి భయపెట్టడమన్న మాట?"

"మీకిప్పుడెందులో వచ్చిన మహాకష్టమేమిటికదా! అయినా మీ కెందుకింత మొగమాటమో నాకర్థంకాకుండా ఉంది. అయితే మరి చెప్పరన్నమాట!"

"ఎందుకు చెప్పను? అయినా నాచేత చెప్పించాలని మీ కెందు కింత పట్టుదలగా ఉందో నాకర్థంకాకుండా ఉంది. ఒక నాలుగక్షరాలమాట విన్నందువల్ల మీకు కలిగే ఆనందం ఏమిటి?"

"మీకు చెప్పకపోవాలని ఎలా పట్టుదలగా ఉందో, మీచేత చెప్పించాలని నాకూ అలాగే పట్టుదలగా ఉంది. అయితే నాలుగక్షరాల పేరన్నమాట! ఏమిటి చెప్మా; నాదీ నాలుగక్షరాల పేరే. ఏమిటయి ఉంటుంది, జయలక్ష్మి, శశిరేఖ, మనోరమ, రాజ్యలక్ష్మి, ఇందుమతి, భానుమతి, జానకమ్మ, సుందరమ్మ, సరస్వతి..."

"అలాగే అవతల మరికొన్ని పేర్లు చెప్పండి."

"మీ గమ్మత్తు నాకు తెలిసింది. చివరికి నాచేతే చెప్పించి అదే అదే అని తప్పుకొందామనా? అలా వీల్లేదు. మీరు స్వయంగా చెప్పితీరాలి."

అంతసేపూ శంకరశాస్త్రి ఏ పేరు చెప్పడమా అనే ఆలోచిస్తున్నాడు. ఏదో పేరు చెప్పేసి, తరవాత మరిచిపోకూడదు. నాలుగక్షరాల పేరని నిర్ధారణ అయిపోయిందికదా? నాలుగక్షరాల పేర్లలో తన శిష్యురాళ్ళ పేరేమయినా ఉన్నాయా? ఆ హేమలత! హేమలత? సన్నగా పొడుగ్గా బంగారపు తీగలాగే. పాపం, అంత పొడవుగా ఉండడమే ఒక అవలక్షణ మయింది పెళ్లికూతుర్ల మార్కెట్లో. ఆమె ఎలా ఉంటేనేం, ఇప్పుడు తనకు

దాచుకుంటున్నది. ఎక్కడ రాయమంటారు? ఈ పేపరుమీద రాద్దువా?"

"ఊహు ఈ పుస్తకంమీద రాసి నాకు బహుమతి చెయ్యండి జ్ఞాపక చిహ్నంగా ఉంటుంది"

"మంచిదే, నన్ను మరిచిపోయినా, నాఆవిడ పేరయినా కనిపిస్తూ ఉంటుంది."

రాసిన తరవాత ఇంకా ఈ విషయంలో చాలా ప్రసంగం వస్తుందనుకున్నాడు శంకరశాస్త్రి. కాని, వెంటనే "అమ్మయ్య, ఇప్పటికి మీచేత చెప్పించ గలిగాను" అని పుస్తకం పట్టుకొని తన గదిలోనికి వెళ్ళిపోయింది శశికళ.

ఆ సాయంత్రం మామూలుగానే పికారుకెళ్ళేరు. రాత్రి పీసీరూ వాలాయతుకూడా తీర్చుకున్నారు—మర్నాడు ఉదయం అతను వీధిలోనికి వెళ్ళి రావడం మామూలుకంటె ఒక గంట ఆలస్యం అయింది. క్రిందను అడిగితే తాను వచ్చేవరకూ భోజనం పంపవద్దని ఆమె చెప్పిందని తెలిసింది. సరే, వెంటనే రెండు భోజనాలూ మీదికి పంపమని చెప్పి, వస్తూనే అడిగాడు. "నాగురించి మీరెందుకు కూర్చోవడం, నాకు దార్లో మళ్ళీ టిఫిను తగిలింది; అందుకు తోడు ఒక తెగని బాతాఖానీ పట్టుకొంది. రోడ్డుమధ్యను నిలబడి గంటల తరబడి అలా ఏదో ఉపన్యాసం చెప్పకుపోవడమే. ఈ మధ్యనల్లా హైదరాబాదులో ఉంటున్న మా స్నేహితుడొకడు కనిపించేడు. వాణ్ణి వదుల్చుకుని వచ్చేసరికి ఇంత సేపయింది.

"పోనీకూడా తీసుకు రాలేకపోయేరా? ఇక్కడే భోంచేద్దురుకదా! లేక నేనున్నానని తీసుకురావడం మానేసేరా?"

"లేదు—వాణ్ణి పిలవక్కర్లేదు; తనని తను ఆహ్వానించుకుని వచ్చే రకమే. అయితే, ఇప్పుడు వాళ్ళత్తవారి ఊరు గుంటూరు వెళ్తున్నాడట—ఒక అయిదు రూపాయలు బదులడిగి వెళ్ళిపోయేడు; అందుకు ఉపోద్ఘాతం ఆ ఉపన్యాసం అంతా!"

"ఒక్క అయిదు రూపాయలతో విడిచిపెట్టేసేరు. ఎంతయినా యీ ఆడస్నేహితులకంటె మగస్నేహితులే వెయ్యిరెట్లు నయంకదూ! సమయం తప్పిన స్తే, నిర్మొగమాటంగా చెప్పవచ్చును కూడా డబ్బు లేదని. అంతే కాని, అదే ఒక స్త్రీ స్నేహితురాలయితే అంత కటువుదనం వస్తుందా? అందులోనూ ముఖ్యంగా మీవంటి సహృదయులకు?"

"నిజమే అది నాలోని లోపమే కావచ్చును"

"లోపం మాటకేమిగాని ముందు మీకు వల్లమాలిన కోపం వచ్చింది నామీద ఇలా అన్నందుకు. సరే, నామీద కోపం తరవాత తీర్చుకోవచ్చును గాని ఇందాకా మీకేదో ఉత్తరం వచ్చినట్టుంది"

"ఉత్తరమా? అన్నయ్య రాసిఉంటాడు, కార్డాకవరా?"

"ఏమో నాకేం తెలుసును పోస్టుమేన్ వచ్చి అడిగితే మీ ప్రక్కగదే అని చెప్పాను. అతను తలుపుసందులోనుండి పడేసి వెళ్ళిపోయాడు."

"సరే—"

అతను ఉత్తరం చదివి అలాగే కుర్చీలో కూర్చుండిపోయాడు. ఆమె ఒక అరగంటపైగా చూసి, వచ్చి, "ఏమిటంత తీక్షణంగా ఆలోచిస్తున్నారు? మా అక్కయ్య పెట్టిన మెత్తటి చీవాట్లు చాలా గట్టిగా తగిలేయి కాబోలు; తరవాత ఆలోచిద్దురు గాని లెండి ఎలా శాంతింపజెయ్యడమా అని. నేనూ నాచేతనయిన సహాయం చేస్తాను లెండి. అక్కడ టేబిలుమీద భోజనం పెట్టేసి వచ్చేను."

ఆమె చెయ్యి పట్టుకొని తీసుకొని వెళ్ళేదు గాని, అంత పనీ చేసింది. అతను ఏమీ మాట్లాడకుండా ఎలాగో భోజనం ముగించేశాడు. వెంటనే చొక్కా తొడుక్కొని బయలుదేరుతూ ఉంటే "ఇంకా చేతితడి అయినా ఆరలేదు; ఇంత ఎండలో ఎక్కడికి వెళ్తారు?" అంది శశికళ...

"అలా బజారుపని కొంచెం ఉంది. పిల్లలకు ఏవో ఆటవస్తువులూ అవీ కొనాలి; మా వదినకి ఒక మంచి చీర తెస్తానన్నాను. అసలు మరిచిపోయేను, ఇంతసేపూ నాలోనే అనుకుని, మీతో చెప్పేసి వనుకున్నాను. ఈ సాయంకాలమే మన ప్రయాణం. మీరు మరేమీ అడ్డు చెప్పడానికి వీల్లేదు. అంతగా అతను వస్తే, ఇక్కడకు వచ్చినవాడు అక్కడకు మీయింటికి రాలేడా? అందుచేత మనం ఈ సాయంత్రం బయలుదేరిపోతే, ఎల్లుండి రాజమండ్రిలో మీయింటిదగ్గర దిగబెట్టి, నేను, రేపుదయం మాఊరు వెళ్ళిపోతాను. ఏమంటారు?"

"ఏమంటాము, మీరంత నిశ్చయంగా మాట్లాడుతున్నప్పుడు, సరే, మీయిష్టమే. కాని, మీరు తొందరగా బయలుదేరుతున్నట్లున్నారు. నావల్ల ఒకపూట మాత్రం ఎందుకు ఆలస్యం కావడం? అంతే కాక, మాయింటికి మీరు రావడం ఎందుకు; నేను ఎవరితో బయలుదేరేనో అందరికీ తెలుసును; నాతోపాటు మీకుకూడా అపకీర్తి ఎందుకు? ఊహు మరేమీ అనకండి, పోనీ, నాకోసమే, నన్ను రాజమండ్రీ స్టేషనులో దింపెయ్యండి. అక్కడ బండి చాలాసేపు ఆగుతుంది. మాయిల్లు స్టేషనుకి అట్టే దూరంలేదు. మా వీధిదాకా కూడా బండి కావాలంటే. అంతేకాని, మాయింటికి రావడం ఎందుకు. ఇందుకు ఒప్పుకొంటేనే నా ప్రయాణం."

"అలాగే. మరి నేను బజారుకి వెళ్ళాలి;"

"ఇంకా చాలా టైముందికదా: మరోగంటపోయి వెళ్ళకూడదూ?"

"ఇంకా అటునించి వచ్చి హోల్డాలు సర్దుకోవాలి. మరి మీరు అన్నీ సర్దుకుని ఉండండి."

క్రిందకు వెళ్ళి హోటలు మేనేజరుతో తామిద్దరూ నాటి సాయంత్రమే వెళ్ళిపోతున్నారనీ, బిల్లు అంతా ఎంతయిందో చూడమనీ, సాయంకాలం పాసెంజరుకి వెళ్ళడానికి వీలుగా కాస్త భోజనం తయారు చేయించే ఏర్పాటు చేయించమనీ, మెట్లు దిగి రిక్షాలో కూర్చుని, పెద్ద బజారుకి తీసుకొని వెళ్ళమని చెప్పి, మళ్ళీ జేబులోని ఉత్తరం తీసుకుని చదువుకొన్నాడు. 'చిరంజీవి

తమ్ముడు శంకరశాస్త్రికి అనేక ఆశీర్వచనములు చేసి కామేశ్వర శర్మ వ్రాయునది. నీవు వెళ్లి యిన్ని దినములైనను రాకపోవటాన ఇచ్చట నాకును మీ వదినకును మిక్కిలి ఆందోళనగా నున్నది. నీ శరీరములో ఏమయినా అస్వస్థతగా నున్నచో వెంటనే టెలిగ్రాం యియ్యవలెను; మేము ఉభయులమూ వచ్చెదము. అక్కడ నీ వింకను ఉండుట అవసరమయినచో, తక్షణమే టెలిగ్రాం యిచ్చుటగాని, లేనిచో నీవు బయలుదేరి వచ్చుటగాని చేయవలెను. నీదగ్గరనుండి ఏవార్తయూ లేకపోవుటవలన మనస్సు పరిపరి విధముల పోవుచున్నది. సాధ్యమయినంత త్వరలో బయలుదేరి రాగోర్తాను. ఇచ్చటకు, నీవు విజయవాడ బయలుదేరిన మరునాడే ఒక పెండ్లి సంబంధమువారు వచ్చినారు. అన్ని విధములా నాకును మీ వదినకును నచ్చినది. నీకును నచ్చగలదనే అనుకొనుచున్నాము. నీవువచ్చి ఇష్టపడినచో ఈ మాఘాంతములోననే వివాహము జరిగించుటకు వారు సిద్ధముగా నున్నారు. ఇంతే సంగతులు గ్రహించవలెను.—

క. కామేశ్వరశర్మ

ఈ ఉత్తరం శశికళ చూసిఉంటే—తనను అబద్ధీకుడను కుంటుంది. అంతకంటె పెద్ద నష్టం ఏమీ లేదుగాని, తాను ఎందుకో తనకే తెలియకుండా ఒక అబద్ధంచెప్పేడు. దానిని మధ్యలో ఎందుకు తెంపివేయాలి. అలాగే కొనసాగిస్తేనే మేలు— ఇంకెంత, మరి కొద్ది గంటలు. అంతే ఆమె ఎవరో తానెవరో? అయినా ఇప్పటిమట్టుకు తన జీవితంలోని ముఖ్యమయిన సమస్య ఆమెకు సంబంధించినదే. ఆమె క్షేమంగా ఇంటికి చేరుకొంటే, తరవాత సంగతికి తాను కర్తకాడు. అధమం తన పరిస్థితుల్లో చేయగలిగిన పని, చేసినట్టే అనుకోవచ్చును—

చేతి ఉంగరం అమ్మగా వచ్చినడబ్బు తనదగ్గర మిగిలిన డబ్బూ కలిపితే హోటలు బిల్లు చెల్లిపోగా ఇంకా సుమారు పాతిక రూపాయిలు మిగిలేయి. ఓ, ప్రయాణానికి మరేం లోటు లేదు; తరవాత సంగతిక అటునించి నరుక్కు రమ్మన్నాడు.

తాను బజారునుండి వచ్చేక సర్దుకోవలసి ఉంటుందను కున్నాడు. కాని, వచ్చేసరికల్లా అన్నీ ప్రయాణానికి సిద్ధంగా అమర్చిఉన్నాయి.

ప్రయాణం చాలా సదుపాయంగానే నడిచింది. శాస్త్రికి మొదట్లో ఉన్నంత తృప్తిగా లేదు. రాజమండ్రి దగ్గరపడుతున్న కొద్దీ రైలు మరికొంత నెమ్మదిగా నడుస్తే బాగుండు ననిపించ సాగింది. ఒకవేళ ఏకారణంవల్లనయినా రయిలు ఆగిపోడం సంభవిస్తే? అతడు విన్న రైలుప్రమాదాల వృత్తాంతాలన్నీ ఒక్కమారు మనసులో మెరిసేయి. అప్పుడేమిటి కావలసి ఉంటుంది. తాను ఆమెను విడిచిపెట్టి వెళ్లిపోగలడా? విడిచిపెట్టక ఏమి ఫలితం? ఎన్నాళ్ళు కలిసిఉన్నా ఇంతే. తానేమో వివాహితుడు; ఆమె ప్రస్తుతానికి ఎవరికీ చెందినది కాకపోయినా తనయెడలమాత్రం ప్రేమ ఉండనుకొందుకి ఏమీ సావకాశం లేదుకదా! అసలు ఉండడానికి వీలేది తాను వివాహితుడుకదా! వివాహితులయినంత మాత్రంలో వాళ్ళ మనస్సు చలించదనీ, వాళ్ళమీద ఇతరులకు మనస్సు కలగరాదనీ ప్రకృతి సహజమయిన నియమం ఏమీ లేదు కదా! అలాగే ఉండేమాటైతే, ప్రపంచంలో ఇన్నిరకాల రహస్య బహిరంగ ప్రణయవ్యవహారాలు సందర్భించడానికి వీ లెలాగుంటుంది?

“ఏమిటి చాలా తీక్షణంగా ఆలోచిస్తున్నారు?”

“ఏమీలేదు, ఇంకెన్ని స్టేషన్లుంది మన సంయుక్తప్రయాణం అని?”

“మీ కంత త్వరగా నా నుండి తప్పించుకోవాలని తహతహగా ఉందన్నమాట?”

“నా కెలా గుంటుందనుకొంటే మీకు తృప్తిగా ఉంటే అలాగే అనుకోండి.”

గోదావరి బ్రిడ్జిమీద రయిలు నడుస్తున్నప్పుడామె అంది “ఎన్నోమార్లనుకొన్నేదాన్ని, ఈ రైలు మీంచి కిందకు దూకేస్తే, అని కాని, అవిశంగా పదిమంది దృష్టినీ ఆకర్షించడం నాకు అసహ్యం. లేకపోతే, ఎప్పుడో మూడునాలుగేళ్ళ క్రితమే ఆ పని చేసిఉండేదాన్ని. అసలు మనిషికి దేనికయినా స్వతంత్రం ఉంది గాని చావడానికి మాత్రం లేదు.”

తన మామూలు ధోరణిని “ఎందుకులేదు; ప్రతిదినమూ ఎన్నో ఆత్మహత్యలు జరుగుతూనే ఉన్నాయి” అన్నమాట స్ఫురించినా, అందులోని అసందర్భమయిన సూచనను గుర్తించి, “ఆత్మహత్యకు ఉపయోగించేదీ, ఒకమూలకు కూర్చొని విచారించ డానికి ఉపయోగించేదీ అదీ స్వాతంత్ర్యమేనా? అనవసరపు ఉద్రేకం లేకుండా, ఇంత వివేకంగా మీరు మాట్లాడడం నాకు ఆనందంగా ఉంది.”

ఆమె చేతిరుమాలుతో కట్టబడిన చిన్న పెట్టె ఒకటి అతని చేతిలో ఉంచి, “ఇది మీ ఆవిడకు. మీకు ఆవిడదగ్గర ఎలాగూ భయంలేదు కదా. నే నిచ్చానని చెప్పండి. అసలిది తిన్నగా ఆవిడకు పోస్టులో పంపాలనుకున్నాను. అయినా మీ చేతితో మీరు స్వయంగా ఇవ్వడం మరీ బాగుంటుంది. ఏముంటుందో ఆవిడే స్వయంగా చూసుకోవాలి; అంతవరకు మీరు చూడకూడదు సుమండీ” అంది.

“నాకు మా ఆవిడదగ్గర ఎంత భయం ఉందో పరీక్షిస్తున్నట్టున్నారు?” అంటూ కోటు లోపలిజేబులో పెట్టుకొన్నాడు. చేతి రుమాలుమీద చాలా చక్కని కసీదపని ఉంది; కమ్మటివాసన కూడా వస్తూంది. ఏ సెంటో, సరిగా పోల్చబడకుండా ఉంది.

ఆమెను జట్కాలో ఎక్కించి తిరిగివచ్చాడు శంకరశాస్త్రి. కొంతసేపటివరకూ చివరి రెండునిమిషాల్లో జరిగిన సంగతులే మన స్సులో మెదలసాగాయి.

“మా వీధివరకూ రారూ?”

“ఎందుకూ, మీమీద నాకు అపనమ్మకం లేదు. నేను అక్కడ రేడియోస్టేషనువాళ్ళతో మరోకమారు కూడా చెప్పేను. తప్పకుండా మీకు ప్రోగ్రామిస్తా మన్నారు; అసలు అవకేం చేస్తారులెండి. వస్తేమాత్రం తప్పకుండా వెళ్ళండి.”

"ఎందుకు వెళ్లినా, అందులోనూ మిమ్మల్ని ఇంత శ్రమ పెట్టినందుకయినా వెళ్తాను. మీరు తొందరగా బయలుదేరేరు. అక్కడ క్షేమంగా ప్రవేశించాక వీలుచూసుకొని ఒక ఉత్తరం రాస్తారుకదూ, ఎందుచేతంటే మిమ్మల్ని ఇంతవేగంలో మరచిపోగల ననుకోను" అంటూ ఆమె జట్కా ఎక్కి కూర్చుంది.

అతడు మామూలు అలవాటు చొప్పున, 'నమస్కారం సెలవు' అన్నాడు.

ఆమె మొగం తిప్పి, "నమస్కారం" అని మళ్ళీ మొగం అటు తిప్పేసుకొంది. జట్కా వడిచిపోయింది. ఆ మాట మాట లాగలేకపోడమే కాదు, కళ్ళలో నీళ్లు నిండిఉన్నాయి. అంతే కాదు, తనకు తెలియకుండానే శాస్త్రికళ్ళలోనూ నీళ్లు కమ్మాయి. జట్కా మలుపుతిరిగే సమయంలో తప్ప ఆమె వెనక్కి తిరిగి చూడలేదు. అప్పుడు చూసినా, మరి బాధలేదు, కళ్ళలోని నీళ్లు కనబడనంత ఎడం ఉంది తమ మధ్యను—

రైలు ద్వారపూడి దాటేవరకూ అతని మనస్సు ఒక తిన్నగా ఆలోచించే స్థితికి రాలేకపోయింది. ఆమె ఎదురుగా జట్కాలో కూర్చున్నట్టుగానే, రైలుతోపాటు జట్కా సమాంతరంగా పరుగెడుతున్నట్లుగానే గోచరించసాగింది.

ప్రక్కనుండి ఎవరో "అగ్గిపెట్టుంటే ఒకసారి ఇప్పిస్తారా?" అనడంతో అతను మామూలు ధోరణిలో పడ్డాడు. లేదంటూనే జేబు తడిమి చూసుకున్నాడు రైలుటిక్కట్టు భద్రంగా ఉందాలేదా అని.

ఆమె యిచ్చిన పెట్టె తగిలింది. తీసి వాసన చూసేడు. ఆమె తన భార్య కిమ్మంది. ఆమె స్వయంగా విప్పి చూడవలసిందేకాని, తాను ముట్టుకోనైనా కూడదట—అనుకొంటూ చేతిరుమాలు మెల్లిగా విప్పేడు. ఇదేదో కొత్తరకం సెంటుపెట్టే; తానిది వరకు చూసినది కాదు; అయితే లోపల సీసా లేదు. ఏమిటి చెప్మా ఇది ఉత్తరమా! అరె, తన భార్యకని చెప్పి, తనకే రాసిఉందే.

మిత్రులు శ్రీ శంకరశాస్త్రిగారికి: ఈ ఉత్తరం మీరే చదువుతారని నాకు తెలుసును. మీరు కాక, మీకాబోయే భార్య చదివినా ఇందుమూలంగా మీ గురించి చెడుగా ఊహించవలసిన పరిస్థితి కలగదనే నా నమ్మకం.

మీ మాటలనుబట్టి మీరు అవివాహితులని నేను తెలుసుకొన్నాను. అయినా మీరు ఆవిధంగా చెప్పడంలోని మీ సదుద్దేశాన్ని నేను అర్థం చేసుకోగలిగే ననుకొంటున్నాను.

మీవంటి నిగ్రహమూ, పరోపకారబుద్ధీ కలిగినవారు, అందులో ముఖ్యంగా నావంటి మనిషిని, ముందువెనకలతో నిమిత్తంలేకుండా మీ శక్తి ఉన్నంతవరకూ సాయం చేసినందుకు, మీరు అన్నివిధాలా అభివృద్ధిచెందాలని భగవంతుణ్ణి ప్రార్థించడం కంటె నేనేమీ చెయ్యలేను.

మొట్టమొదట తెలుసుకోలేకపోయినా భావనారాయణ స్వభావం నాకు తరవాత బాగానే తెలిసివచ్చింది. అతడు వెళ్లిపోతున్నాడంటే, మరి తిరిగి రాడని, ఏదో నా తంటాలు నేనుపడి ఇల్లుచేరుకొంటానని పూరుకొంటాడనీ తెలుసును. అయితే మా యిల్లూ పరిసరాలు వీటి గురించి మీకు కొంత చెప్పేనుకదూ, ఎక్కువ రాయడం అనవసరం. నేను ఆరోజే ఇంటికి వెళ్ళినా ఈ రోజున వెళ్ళినా పడవలసిన అపనింద ఒకటే. భవిష్యత్తులో ఏ ఆశాపత్రమూ కనబడని దైనికయాత్రాక్రమమూ ఒక్కటే. అందువల్లమరొక నాలుగయిదు రోజులు ఉండితే నేమిటనుకున్నాను—అసలు ముఖ్యకారణం మీవంటి మిత్రులు దొరకడం. అయిదారు రోజులే ఆయెను; అటువంటివి మళ్లీ ఎన్నడయినా వస్తాయా నా జీవితంలో.

నేను ఎక్కువ రాయడం అనవసరం. మీ అన్నయ్యగారి ఉత్తరంతెచ్చి పోస్టుమేన్ నాదగ్గర పడేసేడు. కిందవాళ్లు చెప్పిన గదినంబరు తప్పుగా వినిఉంటాడు. నేను నా ఉత్తరమే ననుకొని చూసేను. కార్డు వెనకపక్క ఈ మాఘాంతములోనే వారు వివాహము జరిపించుటకు సిద్ధముగానున్నారు అన్న మాట కనబడింది. అసలది కనబడకపోయినా నాకు తెలిసింది మీమాటల ధోరణిబట్టే. మీరు ఎంతసేపూ మీ అన్నయ్య, వదినగారు, పిల్లలు వీళ్ళగురించిన మాటలేతప్ప, మీ కుటుంబానికి సంబంధించి వచ్చేవికావు. కాక, నేను వేసే ప్రశ్నలకు మీరు ఆలోచించి ఆలోచించి చెప్పే సమాధానాలు వీటిమూలంగా నాకు అనుమానం లేదు. అయితే మీరాడిననాటకమే చివరివరకు నేనాడేను.

నేనేమో యిది బహుమతి అని యిస్తున్నానుగాని, నిజంగా నాఖర్చులు నేను భరించుకోడమే; ఈ వారంరోజులు అయినవీ, ఇదివరకు దీ హోటలు బిల్లు మీరునన్ను తీర్చనివ్వరు; నాకు తెలుసును. ఈ పెట్టెలో అడుగున (సిల్కుగుడ్డకింద) ఒకనూరు రూపాయిల నోటూ ఒక చిన్న ఉంగరమూ ఉంటాయి. ఆ ఉంగరము మీరు చేసుకోబోయే అమ్మాయి వేలుకి తప్పక సరిపోతుంది; మీ డబ్బు నామూలంగా చాలా ఖర్చయి పోయిందిగనక, ఇది మీకు అవసరం అయితే ఉపయోగిస్తారు. కాని, ఏమాత్రం వీలున్నా ఒక సిల్కు చీర కొనిఇవ్వండి మీ నవవధువుకు—ఈ రెంటి మూలంగానయినా మీవంటి మంచివారు నన్ను జ్ఞాపకం చేసుకుంటూ ఉంటారంటే నాకదొక తృప్తి. మిమ్మల్ని చెడపకుండా ఇలా విడిచిపెట్టగలుగుతున్నందుకు నన్ను నేను అభినందించుకొంటున్నాను.

నా గురించి మీరు మరేమీ గాభరా పడనక్కరలేదు. ఒకమారు మసూచికం పడిన వ్యక్తికి అందం ఎలాగయితే తిరిగి రాదో అలాగే నేను మరి తెలివితక్కువ సాహస కృత్యాలేవీ చెయ్యనని మీకు హామీ యిస్తున్నాను. ఎటూ దారి చూపలేని సాహస కృత్యాలకంటె, ఎందుకూ పనికిరానిదయినా సామాన్య దిన చర్య మేలని గ్రహించుకొంటున్నాను. ఏమంటే, అందువల్ల వ్యక్తికి ఏ ప్రయోజనం లేకపోయినా, సాంఘికమయిన అపనింద మాత్రం పడనక్కరలేదు—

ఒక్కొక్కప్పుడు ఎందుకో మనస్సు ఎంతో భారంగా ఉంటుంది. పరిస్థితుల్లో ఎటువంటి మార్పులేకపోయినాను. అటువంటప్పుడు కూడా ఎదురుగా ఉన్నవాళ్ళతో చెప్పుకోవాలని

ఉండదు. అందుచేత ఎప్పుడయినా ఆకుపచ్చ సిరాతో, సంతకం లేకుండా ఉత్తరాలు వస్తే నేను రాసినవే ననుకోండి. నా ఉత్తరాలన్నిటికీ మీరు జవాబు వ్రాయనక్కరలేదు. నా మనసులో మాటలు సహృదయులూ సమర్థులూ అయినవారికి చెప్పుకోగలిగేనన్న సంతృప్తి నాకూ చాలును.

ఈ ఉత్తరం రాయడం పూర్తి అయిపోయేక ఇంకా మనం కొన్ని గంటలు కలిసివుంటాం. అప్పుడే మీదగ్గర శెలవు పుచ్చుకొంటాను.

తాంబూలం:—ఈ రెండూ ఎప్పుడో మా మేనత్త నాకు ఇచ్చినవి. ఇన్నాళ్ళకు వాటిని ఈ విధంగా సార్థకంగా వాడే అవకాశం వచ్చింది.

****

ఉత్తరం చదవడం పూర్తికాగానే అతను అప్రయత్నంగా పెట్టె అడుగునున్న వస్తువులు రెండూ తీసి చూసేడు. అవి మళ్ళీ పెట్లో పెట్టి చేతిగుడ్డలు భద్రంగా చుట్టి లోపల జేబులో పెట్టుకొని, వెనక్కి చేరగిలబడి కళ్లు మూసుకొని, ఆలోచించసాగాడు తాను ఏ స్టేషనులో దిగి వెనక్కి వెళ్ళడమా అని. చివరికి ఒకలాగ సమాధానపడ్డాడు ఇక్కడెక్కడ దిగినా వెంటనే బండి ఉండదు. అంతకంటె సామర్లకోటవరకూ ప్రయాణం చేస్తే, తిరుగు కాలక్షేపంగా ఉంటుంది. అటునుండి బండి రావడానికి కూడా అట్టే వ్యవధి ఉండదు అనుకొన్నాడు. కాని, తీరా అక్కడికి వెళ్ళేక ఇంకొక బుద్ధి పుట్టింది.

ఇంట్లో, మొదట్లో తన ఈ క్రొత్త ప్రస్తావన అన్నయ్యకూ వదినకూ ఏమీ నచ్చలేదు; ఎవరో కడియాలడిపినకని వచ్చిన మనిషిని తిక్కన సంగతి సందర్భాలేమీ చూసుకోకుండా చేసుకోవడమేమిటి? కాని, మరి తాను నిశ్చయించుకొని, ఉన్నాడన్న సంగతి గుర్తించి "సరే, నీ యిష్టమే, ఏదో ఒకటి వేగం కావడమే మా కోరిక" అన్నారు—

"నువ్వు వెళ్లి చూసిరాకూడదా అన్నయ్యా!" అన్నాడు శంకరం.

"ఎందుకురా, నీకు నచ్చిన తరవాత మాకు మరి నచ్చకపోడమేమిటి? అయితే ఈ మాఘంలో నీ ముహూర్తం పెట్టించేస్తే—"

"అదంతా నీ యిష్టం అన్నయ్యా! వాళ్ళెవో పెళ్ళి చేసే స్థితిలో లేరనుకొంటాను. మనింట్లో నే, వీలయినంత సూక్ష్మంగా ఒక పండగలాగే జరిపించేస్తే మేలనుకొంటాను. అయితే మరి ముందు నువ్వు వెళ్లి చూడనక్కర్లేదంటావా?"

"నాకేం నీమీద కోపంవచ్చి వెళ్ళనంటున్నా ననుకొంటున్నావేమిటి? నువ్వు వ్యక్తపడడమే మా యిష్టం. మీ వదినను పెళ్లి ఏర్పాట్లన్నీ చెయ్యమను."

పెళ్ళి యింకా పదిరోజులుండనగా శంకరశాస్త్రికి ఉత్తరం వచ్చింది. అనవాలుగా ఆకుపచ్చ సిరాతో రాయబడి ఉంది.

మిత్రులు శ్రీ శంకరశాస్త్రిగారికి!

నేను నాకేవో యిబ్బందులు వస్తే మీకు చెప్పుకొందామనుకొంటోంటే మీరే నన్ను చిక్కులలో పెట్టేసేటట్లున్నారు. గోతిలోపడ్డ ఆవును జాలిదలిచి బైటికి తీయదలచినట్లుగానే మీరు నన్ను చేసుకోబోతున్నారేమో ననిపిస్తోంది. నామీది జాలికొద్దీ మీరు మీ జీవితాన్ని పాడుచేసుకోవడం నా కెంతమాత్రం యిష్టం లేదు. మీరు నాకు విజయవాడలో సహాయం చెయ్యడం సంగతి వేరు. ఆ ఘట్టం అక్కడితో సరి. కాని, ఇప్పుడు మీరు వేయబోతున్న అడుగు తరవాత వెనక్కి తీసుకోవాలంటే, మన ఉభయులకూ యిష్టమున్నా చాలా కష్టమౌతుంది. అందుచేత బాగా ఆలోచించండి. అసలు మీ కిటువంటి బుద్ధి ఎలా పుట్టింది? మీరు మనసా నన్ను భార్యగా స్వీకరించగలరా? నావలన సుఖపడగలరని నమ్మకం ఉందా? నానుంచి మీరు కోరుతున్నదేమిటి? ఎదురుగా ఉన్నప్పుడు మీరు వివాహితులైపోయేరు; తరవాత యీనాడు ఉత్తరం రాయకుండా, నా యిష్టం కనుక్కోకుండా, పెద్దవాళ్ళ మధ్యన పెళ్ళిమాటలు నడిపించేరు. గడుసువారే. లిఖితపూర్వకంగా మీదగ్గరనుంచి ఈ ఉత్తరానికి తృప్తికరమయిన జవాబు రానిపక్షంలో, నేను నా స్వేచ్ఛను కాపాడుకొందికిగాను తిరిగీ ఇల్లు విడిచిపెట్టవలసి ఉంటుంది. నే నింత నిర్మొగమాటంగా రాశానని కోపం తెచ్చుకోక, మీరూ నిదానంగా ఆలోచించి జవాబు రాయండి; ఇప్పటికయినా ఏమీ మించిపోలేదు. మీకు సుఖపడగలనన్న విశ్వాసం ఉంటే తప్ప నన్నే కాదు, ఎవర్నీ చేసుకోవద్దు.

****

ఇద్దరూ పారిగదిలో కొంతసేపు ఏమీ మాట్లాడలేదు. చివరికి ఆమె అంది. "పోనీ నేను అంతగా రాయమన్నాననయినా నాలుగు మాటలు రాస్తే, ఊహు అదీ కష్టమయిపోయింది. కాగితానికి అడ్డంగా చిన్నపిల్లలకి కాపీ పెట్టినట్టు రాసేరు. మీరే తీసుకోండి, మీ వెయ్యిముద్దులకీ ముందు నేను పది చేర్చి పదివేల ముద్దులు చేసేను" అంటూ అతని ఉత్తరం కాగితాన్ని మీద పడేసింది.

"పదివేలే! అయితే ఈ రాత్రి చాలుతుందో చాలదో మరెందు కాలస్యం, ఒకటి రెండు మొదలూ" అంటూ కాగితాన్ని ముద్దు పెట్టుకోసాగాడు.

"అయ్యో పాపం, కాగితం చేయని బుగ్గలు కన్నాలు పడిపోతున్నాయి. అంత మోటుతనమా" అంటూ చేతిలోని కాగితం లాగి క్రిందపడేసి, కుర్చీలో కూర్చున్న అతని తల వెనక్కి వంచి ముద్దు పెట్టుకుంది.

# వసంతశ్రీ

*

శ్రీ యామిజాల పద్మనాభస్వామి

మధుర మధుమాస యామినీ మందహాస
వీచికలలోన నూగాడు విభవ మెల్ల
నీమనోహర గానమై నెగడుటకును
ఎంత తప మొనరించితివే పికంబ!

తేనెల సోనలూరు విరితీయని పూవుల తళ్కు బెళ్కులో
మానితశాఖశారమణి మాధురులన్ కురియించు సత్ఫలా
స్థాన యశోవిభాసుర సుధామయమూర్తి చెలంగ భవ్య సం
తాన విశిష్టమై యెసఁగ ధన్యతఁ గాంచె రసాల మొక్కటే

కాకలికా రసస్ఫురిత గాన విమోహిత సత్ప్రపంచ సౌ
ఖ్యాకలనమ్ములో నెసఁగునట్టి పికంబని నిన్ను లోకముల్
ప్రాకట గౌరవస్ఫురణ వర్ధిలఁ జేయుచునుండెఁ గాన శో
భాకరమైన నీకృతిని పాడవె అచ్చటఁ జేరి; కోకిలా!

చల్లని నీడలన్ సుధలు చల్లెడి పూవుల తావులన్ యశో
మల్లిక కోరకించు కులమంజుల సంపదలన్ ఫలప్రసూ
నల్లలితాత్మ తేజమున చారుసువర్ణ కిసాలయప్రభా
వల్లరిలోన ఆడుచును పాడుము రాజరసాల సత్కృతుల్.

అందము చందమున్ గల ఒయారపు క్రొందళుకుల్ వయస్సులో
పొందయి జాళువా ఒరపు పొత్తుల లేఁత చిగుళ్ల జంటలన్
సుందర మూర్తివై సుకవి శోభలు రాజరసాల మొక్కటే
ఎందును పెంచి పేరుగొను నద్ది మెఱుంగవె నీవు కోకిలా!

అలరుల పాన్పులో చిగురుటాకుల ఓగిర మారగించుచున్
చెలిమియు, బల్మి, పల్కుబడి చెల్లగ నల్లన లేఁత కొమ్మపై
కలలిత పంచమస్వర రసస్ఫుర దార్ద్రమనోజ్ఞ కాకలీ
విలసితగాన మాధురుల విశ్వమునన్ విరజిమ్ము కోకిలా!

గున్నల వన్నెలన్ కొనరు కోర్కులుకూడ ఫలింప మాధవీ
సన్నుత మూర్తియౌచు సరసత్వ మెఱుంగఁ రసాల రాజు నిన్

మన్నన మీరఁజేరి యనమాన గతిన్ పరివారిలోఁపలెన్
మిన్నగఁజూచి కోరికల మీరి ఫలంబు లొసంగు కోకిలా!

తోరపు రూపుతోఁ గాదమ తుమ్మెద ఝూంకృతి తోడుగాగ బం
గారు మెఱుంగు లేఁజిగురు కన్నెరికంబు రసాకరంబుగా
సారరసాలరాజ సుయశఃస్థిర మోహన కాకలీకుహూ
కార నినాద మాధురుల గాయనరత్నము కమ్మ కోకిలా!

అలరు జొంపాల యుయ్యెలలో లతా భామ
పాల పాపకు జోల పాడువేళ,
పూదోఁట పడఁతి సొంపుగ బాటసారిపై
కుసుమాక్షతావళుల్ కురియువేళ,
కోరకించిన మల్లికారామ ప్రకృతి శ్రీ
వనలక్ష్మి గీతాలు పలుకువేళ,
కుసుమించి మందార కుసుమాంగి ప్రణయ గీ
తికలతో తుమ్మెదన్ త్రిప్పువేళ
తరిఁ వెన్నెల నెఱజాణ సరసమధుర
హావభావ విలాస నృత్యంబులోన
విశ్వ విబుధుని సంతోష పెట్టువేళ.
ఈవసంతపు సిరి నిన్ను నేలుఁగాక

గలగల ధ్వనులతో సెలయేరు కెరటాల
చిఱుతగాలికి పాట చెప్పువేళ,
పసిఁడి కాంతుల బాల భాను మూర్తిని జూచి
మురిసి జక్కవ కేలుమోడ్చు వేళ
తొలుసంజ మల్లెతావులతో సమీర గా
ర్భకుఁడు మేల్కొల్పులన్ పాడువేళ,
లేఁత వెన్నెల వెండిపూతతో శశిరేఖ
వినువీధి వాహ్యాళి వెడలు వేళ
ప్రకృతిభామిని సహజ శోభా విలాస
ముగ్ధ భావామృతానంద మూర్తియగుచు
వరలుచున్న వసంత సౌభాగ్య సీమ
విజయగీతాలు పాడుమా పేర్మి పికమ!

# అస్తితావాదము

## (Existentialism)

★

శ్రీ పి. గణపతిశాస్త్రి

కొత్త కొత్తరకాల దుస్తుల తయారీలలోను, అలంకరణాలలోను ప్రపంచంలో ఫ్రాన్సుదే అగ్రస్థానమని అంటారు. కొత్త వాఙ్మయోద్యమాలు, తాత్త్వికసిద్ధాంతాలు బయలుదేరదీయడంలో కూడా అగ్రతాంబూలం ఫ్రాన్సుదే. నిజానికి అస్తితావాదం (*Existentialism*) ఫ్రాన్సులో బయలుదేరిన నూతన సిద్ధాంతం కానేకాదు. కాని ఫ్రాన్సులో ఈ వాదం ఒక పెద్ద గాలిదుమారం లేవదీసింది. ఫ్రెంచి మేధావు లనేకులీ వాదానికి బాగా చేయూత ఇచ్చి, తమ దేశంలో దీన్ని గురించి విరివిగా ప్రచారం చేశారు. నేటికాలపు ఫ్రెంచి వాఙ్మయంలో అస్తిత్వవాదం ఆధారంగా తీసుకున్న రచనలెన్నో బయలుదేరాయి. క్రమక్రమంగా ఈ వాదం మిగిలిన పాశ్చాత్యదేశాల్లోకి కూడా వ్యాపించింది. ఇటీవల ఈ వాదచ్ఛాయలు మన తెలుగువాఙ్మయంమీద కూడా కొంచెం కొంచెంగా ప్రసరిస్తున్నాయి.

అసలు మొట్టమొదట ఫ్రాన్సులో ఈ సిద్ధాంతం బయలుదేరినప్పుడు పత్రికాప్రపంచంలో బాగా వాదధూళి రేగినా, ఆ దేశంలోని పెద్ద పెద్ద తాత్త్వికులు, వారికి సంబంధించిన పత్రికలు దీని గోజే తలపెట్టలేదట! కొందరు ఇది పుబ్బలో పుట్టి మఖలో మాడిపోయే వాదమనీ, ఇందులో అంత లోతుగా తరిచి చూడవలసినంత విశేషం ఏమీ లేదనీ అధిక్షేపించారట.

కాని అస్తితావాదం అంత తేలికగా కొట్టివేయవలసిన వాదం కాదు. ఇది, ఇంతకుపూర్వం అమలులో ఉన్న పాశ్చాత్య తాత్త్విక సిద్ధాంతాలన్నింటినీ పూర్వపక్షంచేసి ఒక వినూతన జీవనదృక్పథం సృష్టించిన సిద్ధాంతము. ప్రాచీన పాశ్చాత్యతాత్త్వికుల దృక్పథాలు కొన్ని కొన్ని ఈ వాదోత్పత్తికి ప్రోద్బలం కలిగిస్తే కలిగించి ఉండవచ్చును. కాని ఇది ఒక నూతనస్వరూపంతో అవతరించి, పూర్వసిద్ధాంతాలన్నిటికన్నా భిన్నమైన కొత్త తాత్త్వికసిద్ధాంతమనే గౌరవం పొందింది.

### అస్తితావాదము

అస్తితావాదం అన్న పేరులోనే ఈవాదస్వభావం ధ్వనిస్తున్నది. అస్తిత అంటే ఉనికి అన్న మాట. (*Existence*) ఎగ్జిస్టెన్సు అన్న మాటకు కూడా ఇదే అర్థం. *Existentialism* అంటే ఉనికికి సంబంధించినవాదం అని అర్థము. ఈ అస్తిత మానవునికి సంబంధించినది. అంటే మానవుని అస్తితకు ప్రాధాన్యమిచ్చే వాదమని తాత్పర్యము.

అయితే ఇంతకుపూర్వం ఉన్న పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞులు మానవాస్తితకు ప్రాధాన్యం ఇవ్వలేదా ? ఇస్తే ఈవాదంలో మానవునికి కొత్తగావచ్చిన ప్రాధాన్యం ఏమి ఉన్నదని ఎవరికైనా సందేహం కలగవచ్చును. కాని అస్తితావాదంలో ఉన్నంత మానవవ్యక్తి ప్రాముఖ్యము ఇతఃపూర్వం అమలులో ఉన్న పాశ్చాత్యతత్త్వశాస్త్రాలలో లేనేలేదని అస్తితావాదు లంటారు. ఈ విషయం పరిశీలించడానికి అస్తితావాదానికి పూర్వం అమలులో ఉన్న పాశ్చాత్యతాత్త్విక సిద్ధాంతాల ప్రధాన దృక్పథా లిక్కడ సంగ్రహంగా పరిశీలిద్దాము.

అస్తితావాదానికి పూర్వం ఉదయించిన తాత్త్వికసిద్ధాంతాలు రెండు విధాలుగా విభజించవచ్చును. వీనిలో మొదటిది ఆదర్శవాదము, (*Idealim*) రెండవది, భౌతికవాదము (*Materialism*)

పాశ్చాత్యాదర్శవాదం ప్లేటోతో ప్రారంభించి హెగల్‌తో ఒక అవధికి వచ్చిందని అనవచ్చును. ప్లేటో మన విజ్ఞానం రెండు విధాలుగా విభజించాడు. మొదటిది దైనందినానుభవ జన్యమైన విజ్ఞానము, రెండవది ఆదర్శ విజ్ఞానము. సౌందర్యము, ధర్మము, మొదలైన ఆదర్శభావాలన్నీ ఈ ఆదర్శవిజ్ఞానానికి సంబంధించినవి.

అయితే మొట్టమొదటి దైనందినానుభూతికి సంబంధించిన విజ్ఞానమంతా భ్రమప్రమాదభూయిష్ఠమనీ, ఆదర్శవిజ్ఞానం మాత్రమే సత్యమైనదనీ ఇతడు నిర్వచించాడు. ఈతని నిర్వచనం ప్రకారం ఆదర్శవిజ్ఞానాన్ని అనుసరించి మానవప్రవృత్తిలో ధర్మాధర్మనిర్ణయం చెయ్యవలసి ఉంటుంది.

ఇల్లాగే వేర్వేరు పాశ్చాత్యాదర్శవాదులు వేర్వేరు ప్రధానాదర్శాలు ప్రతిపాదించారు. వీరికి ఈ ఆదర్శభావాలే సత్యమైనవి. ఈ ఆదర్శాలను అనుసరించి, మానవప్రవృత్తిలో యుక్తాయుక్తనిర్ణయము, సత్యాసత్య నిర్ణయము జరుగుతూంటాయి.

ఇక భౌతికవాదం (*Materialism*) దగ్గిరికి వద్దాము. ఆదర్శవాదంలో మనస్సుకు, మనోతీతములైన భావాలకు వచ్చిన ప్రాధాన్యం ఇక్కడ (*Matter*) పదార్థానికి వస్తుంది. మార్క్సు నిర్వచించిన గతి తార్కిక భౌతికవాదంలో కూడా వస్తూత్పత్తి విధానము, వర్గకలహము మొదలైనవి ప్రధానవిషయాలు. ఈ విషయాల ననుసరించి చరిత్ర ధనస్వామ్య (*Capilalist*)

సంఘంలో ఉండిన పరస్పర వర్గవైరుధ్యాల ద్వారా శ్రామికవర్గ నియంతృత్వంవైపు పురోగమిస్తున్నదని మార్క్సు ప్రతిపాదించాడు. ఆయా కాలాలలో ఏర్పడిన సాంఘికాదర్శాలు, మత విశ్వాలు మొదలైనవి ఆయా కాలాలలో అమలులో ఉన్న భౌతిక పరిస్థితుల మూలంగా ఏర్పడినవేననీ, అంతకంటె వాటిలో పరమార్థం ఏమీ లేదనీ, ఆ పరిస్థితులు మారిపోయిన పిమ్మట అవే పట్టుకుని వేళ్లాడడం విప్లవ వ్యతిరేకపంథా అవుతుందనీ మార్క్సు గతి తార్కిక భౌతికవాదం ప్రతిపాదిస్తుంది. నిజానికి మార్క్సు దృక్పథం ప్రకారం పరమ సత్యస్వరూపం (*Absolute Truth*) అనే దేదీ లేనే లేదు. అందుచేతనే మార్క్సిస్టుల దృక్పథంలో దైనందినాచరణం ఒక పారమార్థిక నైతిక దృక్పథాన్ని అనుసరించకుండా కేవలం, తాత్కాలికగతితార్కికభౌతిక పరిస్థితులనుబట్టి మారిపోతూంటుంది.

ఇలాగ నేటి ప్రపంచంలో మానవుని కర్తవ్యనిర్ణయంలో అనేక భిన్న భిన్నములైన నైతికదృక్పథాలు ఏర్పడుతున్నాయి. ప్రపంచంలోని ఆయామతాలు పరిశీలించినా అవి మానవుని కర్తవ్యనిర్ణయంలో వేర్వేరు మార్గాలు చూపిస్తున్నాయి. మతదృక్పథంలో ఈశ్వరుని కొక పారమార్థికసత్త ఉన్నది. ఈ ఈశ్వరుని ఉనికి తాత్త్వికంగా నిర్ణయించినా, లేక కేవలం విశ్వాసాన్ని బట్టి నిర్ణయించినా మానవుని నైతికాచరణం ఆయావిధములైన దృక్పథములనుబట్టి పరిమితమైన పంథాలో సాగిపోతూంటుంది.

ఈవిధంగా ఆదర్శవాదాన్ని బట్టి చూసినా, భౌతికవాదాన్ని బట్టి చూసినా, లేక మతదృష్ట్యా చూసినా సామాన్యవ్యక్తిజీవితం అస్వతంత్రమై ఆయాదృక్పథాల ఆదర్శప్రాప్తికి అనుకూలమయిన ఆచరణద్వారానే పూర్ణత్వం పొందగలుగుతున్నది.

అస్తితావాదం ఈ క్రమాన్ని తల్లకిందులు చేసి మానవాస్తితకే ఎక్కువ ప్రాధాన్యము, స్వాతంత్ర్యము ఇస్తున్నది. జాఁ పోల్ సార్త్రే '*Existensialism and Humanism*' అనే గ్రంథంలో '*Man is nothing but that which he makes of himself*' అనే వాక్యం అస్తితావాద ప్రధానసూత్రమని నిర్వచించాడు. మానవేచ్ఛానుసారంగా మానవజీవితం పరిణమిస్తుందని పై అంగ్లవాక్యాభిప్రాయము. ఈ సూత్రం అస్తితావాదులు ఈక్రింది విధంగా వ్యాఖ్యానిస్తారు. మానవునికి స్వీయానుభూతిమాత్రమే స్పష్టంగా తెలిసిన విషయం. ఇదిగాక మానవ మేధస్సునుండి ఉద్భవించిన సిద్ధాంతాలన్నీ పారమార్థిక సత్యాలు కాజాలవు. ఆదర్శవాదమైనా, భౌతికవాదమైనా ఒకవిధమైన సంభావ్యతం (*Possibility*) మాత్రమేగాని అంతకంటె అధికమైన పారమార్థికత ఈ సిద్ధాంతాలలో లేనే లేదు. మతవిశ్వాసాలు, శాస్త్రీయవిజ్ఞానము (*Scientific knowledge*) ఇల్లాంటి సంభావ్య సిద్ధాంతాలేగాని అంతకంటె అధికమైనవని చెప్పడానికి వీలులేదు. అందుచేత మానవుడు తన జీవితం ఏవిధంగా మలుచుకోవాలంటే ఆవిధంగా మలుచుకోగలడు. అవిచ్ఛిన్నమైన పరిపూర్ణ స్వాతంత్ర్యం మానవుని కున్నది. ఈ నిరంతర స్వాతంత్ర్యానుసరణమే మానవ జీవితలక్ష్యము. సంగ్రహంగా చెప్పవలసివస్తే ఇదే అస్తితావాదంలో సారాంశము.

అయితే దీనినిబట్టి ఏ వ్యక్తి అయినా తన ఇష్టం వచ్చినట్లు సంచరించవచ్చునని భావించకూడదు. ఇక్కడ మానవుడంటే ఒక ప్రత్యేక మానవవ్యక్తి కాదు. అందుచేత ఏ వ్యక్తి అయినా ఒక నిశ్చయానికి వచ్చి కార్యాచరణలోకి దిగేటప్పుడు తాను మానవజాతిలో నివసిస్తున్న వ్యక్తిలా ప్రవర్తిస్తున్నానని భావించి ఆ విధంగా ప్రవర్తించాలి. అంటే సర్వమానవసంఘానికి శ్రేయస్కరమైన మార్గంలో ప్రవర్తించాలన్నమాట.

అయితే ఆ శ్రేయోమార్గం మాత్రం అస్తితావాదం నిర్వచించదు. అది ఆ మార్గనిర్వచన స్వాతంత్ర్యము, ఆచరణ స్వాతంత్ర్యము మానవునికే వదిలివేస్తుంది. ఏదేనా ఒక కార్యాచరణలో యోగ్యాయోగ్యతలను గురించిన సందేహం వచ్చినప్పుడు మానవాంతరాళంలో కలిగే సంకోచమే కర్తవ్యాకర్తవ్య నిర్ణయానికి తోడ్పడగలదనీ, సంకోచభావం కలిగినప్పుడది అయోగ్యతనని మానవునికి స్ఫురించగలదనీ అస్తితావాదుల అభిప్రాయము. పైదానిని బట్టి అస్తిత్వవాదం ప్రకారం మనుష్యుల దైనందినాచరణలలో తోడ్పడే నిత్యధర్మసూత్రాలేవీ లేవనీ, మానవుడే ఏ క్షణాని కా క్షణం తన ధర్మం నిర్ణయించుకుని ప్రవర్తించాలనీ తేలుతుంది.

ఈ విషయానికి ఇక్కడ సార్త్రే వ్రాసిన ఒక ఉదాహరణ ఇస్తున్నాను. 1940 లో జర్మనీ ఫ్రాన్సుదేశం ఆక్రమించిన రోజుల్లో ఒక ఫ్రెంచి పౌరుడు జర్మనీ అధికారులతో చేతులుకలిపి వారికి సహాయం చేశాడు. కాని ఈ విషయంలో అతనికీ అతని భార్యకు మధ్య పెద్ద తగాదా వచ్చింది. వీరి కిద్దరు కుమారులున్నారు. వీరిలో పెద్దఅతన్ని జర్మనీ అధికారులు చంపివేశారు. రెండవ కుమారుడు తన సోదరుని ఈ విధంగా వధించిన జర్మనీఅధికారులపై పగ తీర్చుకోవాలనీ, ఫ్రెంచి స్వాతంత్ర్యంకోసం ఇంగ్లండులో ఉండి ఉద్యమం సాగిస్తున్న సైన్యాలతో చేరాలనీ అనుకున్నాడు. కాని తల్లి కింక మిగిలినవాడితడొకడే. పెద్ద కుమారుడా విధంగా మరణించడంవల్ల ఆమె తన ప్రాణాలన్నీ ఇతనిమీదనే పెట్టుకున్నది. ఆ సమయంలో ఆమెను విడిచిపెట్టి వెళ్లడంవల్ల చివరి కామె ప్రాణాలకే అపాయం కలిగేటట్లుంది.

ఈసందర్భంలో రెండవకుమారుడేమిచెయ్యాలి? నానా ఇబ్బందులు పడి ఎల్లాగో అల్లాగ అతికష్టంమీద ఇంగ్లండు చేరుకోవాలా? లేక ఫ్రాన్సులోనే ఉండి తల్లికి ఆసరాగా ఉండాలా? ఫ్రెంచి స్వాతంత్ర్యసైన్యంలో చేరడంకూడా అంత తేలికైన పనికాదు. తీరా తల్లిని విడిచిపోతే అతని ప్రయత్నాలెంతవరకు సఫలం అవుతాయో నిశ్చయించడం చాలా కష్టం. ఈ విషయంలో ఈయువకుడేవిధంగా నిశ్చయించుకోవాలి? ఒక వేళ ఈ యువకుడీ విషయంలో ఒక నిశ్చయానికి రాలేక ఎవరినైనా ఒకర్ని సలహా అడిగి ఆవిధంగా నడుచుకోవాలని నిశ్చయించాడనుకుందాము. అప్పుడుకూడా ఆ సలహా చెప్పేవారిని ఎన్నుకోవడంలోనే అతనొక విధమైన నిశ్చయానికి వచ్చినట్లవుతుంది. ఇల్లాంటి పరిస్థితుల్లో స్వేచ్ఛానిర్ణయం తప్ప తాత్త్వికసిద్ధాంతాలుగాని, మతవిశ్వాసాలుగాని, తోడ్ప

విలువలనీ స్వతంత్రంగా చేసే వ్యక్తి నిశ్చయం ఒక్కటే శరణ్యమనీ అస్తితావాదులంటారు.

అస్తిత్వ వాదంలో వ్యక్తి స్వాతంత్ర్యం అతిముఖ్యమైన సిద్ధాంతం. అలాగే ఇది వ్యక్తికి కూడా ఎక్కువ ప్రాధాన్యం ఇస్తుంది. అయితే ఇది ప్రత్యేక వ్యక్తిప్రాధాన్యంగల వాదమని మాత్రం భావించకూడదు. అస్తిత్వవాదం మానవవ్యక్తిలో మానవజాతిఅంతా అంతర్యామితమైనదని వ్రాశాను. కమ్యూనిజము మొదలైన సిద్ధాంతాలు కేవలం సమాజ ప్రధానమైనవి. వీటిలో వ్యక్తిప్రాధాన్యంఉన్నా అది సమాజాంతర్యామితంగానే ఉంటుంది. అంతే, ఇంతకంటె అధికమైన వ్యక్తిస్వాతంత్ర్యం ఇంతకుపూర్వం వచ్చిన తాత్త్వికసిద్ధాంతాలలో కూడా రాలేదనే చెప్పాలి.

మానవవాదము (*Humanism*) కూడా మానవవ్యక్తికి ప్రాధాన్యం ఇచ్చే సిద్ధాంతమే. అయితే అస్తితావాదానికి పూర్వం బయలుదేరిన మానవవాదము, మానవవ్యక్తి హేతుప్రధానమైన వ్యక్తి (*Rational Being*) అని నిర్వచిస్తుంది. అస్తితావాదం మానవ వ్యక్తిని ఒక ప్రత్యేక నిర్వచనంతో నిరూపించదు. పైగా హేతుదృక్పథం అసలే అంగీకరించదు. సామాన్య దృష్టితో చూస్తే ఈ రెండువాదాలకు గల భేదం ఇది.

## అస్తిత్వవాద చరిత్ర

అస్తితావాదులు తమవాద బీజాలుసోక్రటీస్ (*469-B.C*) పాస్కల్ (*1623 A. D.*) నీచే (*1844 A. D*) మొదలైన పాశ్చాత్యతత్త్వశాస్త్రజ్ఞులలోనే ప్రారంభమైనాయని భావిస్తారు.

అయితే సోరెన్ కీర్కెగార్డ్ అనే డెన్మార్క్ తత్త్వశాస్త్రజ్ఞునితో అస్తితావాదం ఒక ప్రత్యేక సిద్ధాంతంగా నిలబడినదని చెప్పవచ్చును.

ఇతడు 1813 లో కోపెన్ హేగన్‌లో జన్మించాడు. కోపెన్ హేగన్ విశ్వవిద్యాలయంలోనే తత్త్వశాస్త్రం అభ్యసించాడు. ఆపిమ్మట జర్మనీ దేశం అంతా తిరిగి, చివరికి కోపెన్ హేగన్‌లో కుదురుకున్నాడు. ఇతడు తన జీవితకాలంలో ప్రభుత్వానికి, మతానికి ఏవిధమైన సంబంధము ఉండకూడదనీ, మతము నేది కేవలం వ్యక్తికి సంబంధించినదనీ వాదిస్తూ ఒక పెద్ద ఉద్యమం నడిపించాడు. విశ్వాసము, (*Faith*) విజ్ఞానము (*Knowledege*) కేవలం పరస్పర విభిన్నమైన ప్రత్యేకవిషయాలని ఇతని సిద్ధాంతము. ఇతడురచించిన గ్రంథాలలో అస్తితావాదానికి ప్రప్రథమంగా గట్టి పునాదులు పడ్డాయి.

ఈ తరవాత పేర్కొనదగినవాడు మార్టిన్ హేడెగ్గర్. ఇతడు జర్మనీ దేశస్థుడు. 1889 లో జన్మించాడు.

కారల్ జాస్పర్స్ అనే అస్తిత్వతత్త్వజ్ఞుడు కూడా జర్మనీదేశీయుడే. ఇతడు 1888 లో జన్మించాడు. వీరిద్దరి సిద్ధాంతాలు ప్రథమప్రపంచయుద్ధానంతరం జర్మనీలో బాగా ప్రచారం పొందాయి.

ఇటుపిమ్మట ఈ క్రమంలో పేర్కొనదగినవాడు సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత జా పోల్ సార్త్రె (*Jean Paul Sartre*) ఇతడు 1905 లో జన్మించాడు. ప్రస్తుతం సజీవులయిన ఫ్రెంచి అస్తితావాదులలో అగ్రగణ్యుడు. ఇతడు నవలలు, నాటకాలు మొదలైన ఎన్నో రచించాడు; పారిసు విశ్వవిద్యాలయంలో తత్త్వశాస్త్రాచార్యుడుగా ఉండేవాడు. కాని ఆ రోజుల్లో కాలరు, కోటు వేసుకోడానికి ఇష్టపడక పోవడంవల్ల కళాశాలాధికార వర్గం వారి కోపానికి గురిఅయినాడట! అస్తితావాదాన్ని గురించి ఇతడు వ్రాసిన 'లేత్ర్ ఏ నియాం' (భావము—అభావము) అనే తాత్త్విక గ్రంథంవల్ల ఇతడు బాగా విఖ్యాతుడైనాడు.

20 శతాబ్ది ప్రారంభంనుంచీ అస్తితావాదం ఫ్రాన్సులో బాగా స్థిరపడినట్లు కనబడుతుంది. ఈ సందర్భంలో గేబ్రియల్ మార్సెల్, లూయీ లావెల్ అనే ఇద్దరు ప్రఖ్యాత ఫ్రెంచి తత్త్వజ్ఞులనుగూడా ఇక్కడ ముఖ్యంగా పేర్కొనాలి. వీరిద్దరు 20 వ శతాబ్ది ప్రారంభంలో ఉన్నవారే.

వీరందరు కాక అస్తితావాదానికి ఆధారభూతుడైన ఇంకొక తత్త్వవేత్త ఉన్నాడు. ఇతని పేరు ఎడ్మండ్ హుస్సార్ల్. ఇతని పరిశోధన ఫలితంగా అస్తితావాదానికి ప్రోద్బలం ఇచ్చాయి. ఇతడు 1938 లో మరణించాడు. ఇతఃపూర్వం జర్మనీదేశంలో ఫ్రైబర్గ్ విశ్వవిద్యాలయంలో తత్త్వశాస్త్రాధ్యాపకుడుగా ఉండే ఇతడు (*Phenomenology*) ఫినోమినాలజీ అనే నూతన తాత్త్విక సిద్ధాంతం ప్రతిపాదించాడు. ఫినోమినాలజీ అంటే ఇంద్రియగోచర వస్తుతత్వశాస్త్రమని అర్థము. ఈ శాస్త్రాన్ని గురించి వివరించే ముందు దీని పూర్వరంగాన్ని గురించి కొంత చర్చించవలసి ఉన్నది.

తత్త్వశాస్త్రంలో ఒక ప్రధానసమస్య ప్రపంచ తాత్త్వికులకు అందరికీ గడ్డుసమస్యగా పరిణమించింది. ఈ సమస్యనుగురించి నేటివరకు ఇంకా వాదోపవాదాలు సాగుతూనే ఉన్నవి. ఆ సమస్య ఇది.

తాత్త్వికులలో ఆదర్శవాదులు మనస్సొకటే ప్రధాన వస్తువనీ, పరిదృశ్యమానమయిన వాస్తవిక ప్రపంచం అంతా దీనికి ప్రతిబింబవంటిదే ననీ అంటారు. వీరిలో కొంతమంది మన విజ్ఞానం అంతా మానసికమే కాబట్టి మనోతీతమైన స్థితి ఉన్నా అది దుర్జ్ఞేయమే అని అంటారు. వీరిలో కొందరు (*Matter*) పదార్థమనేది వేరే ఏమీ లేదనీ ఇంద్రియసంయుక్తమయిన మనస్సే పదార్థరూపంలో భావిస్తున్నదని నిర్వచిస్తారు.

దీనికి వ్యతిరేకంగా భౌతికవాదులు పదార్థం (*Matter*) ఒక్కటే ప్రధాన వస్తువనీ,మనస్సు దానిలోనుంచి పరిణమించినదనీ అంటారు. గత తార్కిక భౌతికవాది అయిన మార్క్స్ అభిప్రాయం కూడా ఇదే అవుతుంది.

అయితే హుస్సార్ల్ మనస్సు (*Mind*) ప్రధానమా? లేక పదార్థం (*Matter*) ప్రధానమా? అనే ప్రాథమిక విషయాల

సమాధానాలకోసం ప్రయత్నించడం మానివేసి అసలు చైతన్యాన్ని గురించి (Consciousness) గూర్చి పరిశోధనలు సాగించాడు. ఈ అంతర చైతన్య పరిశోధనల ఫలితంగా ఇతడు చైతన్యం ఎల్లప్పుడూ ప్రయోజనాత్మకంగా (Purposive) గానే ఉంటుందని కనుగొన్నాడు. ఈ ప్రయోజనం రకరకాలుగా మారిపోవచ్చును. అంటే చైతన్యం ఎల్లప్పుడు వస్త్వాత్మకం (Directed towards objects) గానే ఉంటుందన్నమాట. అయితే ఈ వస్తు (Object) రహితమయినప్పుడు చైతన్యం శూన్యం (Nothingness) గానే ఉంటున్నదని హుస్సూరల్ స్థిరీకరించాడు.

ఈ సిద్ధాంతాలనుబట్టి చైతన్యస్వరూపము శూన్యమే అనీ, అయితే ఇది స్వయంగా ఏదో ఒక ప్రయోజన (Purpose) లక్ష్యంతో ప్రవర్తిస్తూ ఉంటుందనీ తేలింది. ఇంతేకాక ఈ సిద్ధాంతంప్రకారం చైతన్యం బాహ్యవస్తు ప్రతిబింబం కాదనీ, ఇది బాహ్యవస్తుసంసర్గం లేకుండానే సహజంగానే ప్రయోజనాత్మకంగా (Purposive) ఉండగలదనీ కూడా తేలిపోయింది.

ఈ క్రింద ఇచ్చిన చిత్రాన్ని బట్టి కూడా మన యీ విషయం అనుభూతిపూర్వకంగా నిశ్చయించవచ్చును.



ఇది మాల్టాదేశీయుల శిలువ.

ఈ చిత్రంకేసి చూసినప్పుడు మనకు శిలువ కాని, లేక నాలుగురేకులు గల పువ్వుగాని కనబడుతుంది. శిలువ ఆకారం నల్లగాను, పుష్పాకారం తెల్లగాను కనిపిస్తుంది. దీనికేసి చూసినప్పుడు మనకు ఈ రెండిటిలోను ఏదో ఒకటే మాత్రమే కనిపిస్తుందిగాని, రెండూ మాత్రం ఒక్కసారిగా ఎప్పుడూ కనబడవు. ఒకతోటమాలికి దీనిలోని పుష్పాకారమే కనబడవచ్చును. ఒక సైనికునికిగాని ఈశ్వరవిశ్వాసికిగాని ఈ చిత్రంలో శిలువ ఒక్కటే కనబడవచ్చును. ఇలా కనబడడంచేత ద్రష్టలో వస్తుదర్శనానికి పూర్వం ఉండిన స్వభావాన్ని బట్టి వస్తుజ్ఞానం కలుగుతున్నదనీ, అంతేగాని వస్తువును (object) బట్టి ద్రష్టలో జ్ఞానోత్పత్తి కలగడంలేదనీ ఇంద్రియగోచరవస్తుతత్త్వజ్ఞులు (Phenomenlegists) సిద్ధాంతీకరించారు.

పై ఉదాహరణ దిఙ్మాత్రంగా జ్ఞానోత్పత్తి ప్రకారం నిరూపిస్తుంది.

ఈ శాస్త్రజ్ఞులు ఈ విధమైన పరిశోధనల ద్వారా వాస్తవిక సత్యస్వరూపం (Objective Reality) అనేది ఏదీ లేదనీ, ఏదైనా ఉన్నా అది ద్రష్టదృక్పథాన్ని బట్టి ఏర్పడినదే అనీన్నీ ఈవిధంగా ఈ దృక్పథాన్ని బట్టి వేర్వేరు తాత్త్వికసిద్ధాంతాలు ఏర్పడుతున్నవనీ నిరూపిస్తారు.

హుస్సూరల్ తరవాత ఈ శాస్త్రంలో మరి ఇద్దరు పరిశోధనలు సాగించారు. వీరిలో మొదటివాడు, మాక్స్ షెల్లర్. ఇతడు మానవునికి (Intuitive) సహజంగానే నైతికమూల్యాలు (Ethical Values) అవగాహన చేసుకునే శక్తి ఉన్నదనీ, ఇది సహజంగా ఈశ్వరునివల్లనే మానవునికి లభిస్తున్నదనీ అభిప్రాయపడ్డాడు.

రెండవవాడు నికోలాయ్ హార్ట్‌మాన్. ఇతడు మానవునిలో సహజంగానే నైతికాదిమూల్యాలు తెలుసుకునే శక్తి ఉన్నదనీ, దీనికోసం ఈశ్వరుణ్ణి ఒక ప్రత్యేక కారణంగా నిరూపించవలసిన అవసరం లేదనీ ప్రతిపాదించాడు.

ఈ పైన వివరించిన సిద్ధాంతాలనుబట్టి హుస్సూరల్ అనుయాయులు వస్తువును (Object) గాని, లేక ద్రష్టను (Subject) గురించి గాని సమగ్రంగా అవగాహనచేసుకునే అవకాశం లేదనీ మానవుడీ ప్రపంచంలో అనిశ్చితమైన పరిస్థితిలో ఒంటరిగా నిలబడి తన కర్తవ్యము, తన విలువలు, తనంతట తానే నిర్ణయించుకోవలసి వస్తున్నదనీ అన్నారు.

కీర్క్‌గార్డ్ మొదలుకొని హుస్సూరల్, సార్త్ర్, లావెల్ మొదలైన అస్తితావాదు లందరి సిద్ధాంతాలలోను ఒక ప్రధాన దృక్పథం కనబడుతుంది. కొత్తగా మన తత్త్వశాస్త్రంలో కలిగిన పరిశోధనలవల్లనైతేనేమి తాత్త్వికచర్చలవల్లనైతేనేమి, వీరందరు వాస్తవికత (Objectively) అనేది లేదనీ, ఉన్నా అది మానవ వ్యక్తిగతమైన ప్రయోజనపరత్వం (Purposiveness) మీదనే ఆధారపడిందనీ విశ్వసిస్తారు. ఈ ప్రధానసిద్ధాంతం మీదనే అస్తితావాద సిద్ధాంతం అంతా ఆధారపడి ఉన్నది.

అయితే ఇప్పటివరకు అస్తితావాదోత్పత్తికి పూర్వరంగము, అస్తితావాదస్వరూపము, ఈ వాదాని కంతటికీ అన్వయించే సామాన్యసిద్ధాంతాలు, పరిశోధనలు, ప్రారంభకులు మొదలయిన విషయాలను గురించి సంగ్రహంగా వ్రాశాను.

అయితే అస్తితావాదం అంతా ఒకే వర్గీకరణం కింద వివరించడం అంతగా సముచితం కాదు.

ఫ్రాన్సులో 20 శతాబ్ది పూర్వార్ధంలో ఈవాదానికి అనేకమైన శాఖోపశాఖలు బయలుదేరాయి. వీటి కన్నింటికీ కొన్ని సామాన్య ధర్మాలుండడంవల్లనే అన్నింటినీ అస్తిత్వవాద శీర్షిక కింద జమకట్టవచ్చును.

ఈ అస్తిత్వవాదంలో బయలుదేరిన శాఖోపశాఖలన్నీ విడిచిపెట్టి ప్రధానశాఖలు రెండిటిని గురించి మాత్రమే ఇక్కడ వ్రాస్తున్నాను.

ఈరెండిటిలోను మొదటిది నిరీశ్వరాస్తిత్వవాదము. (Atheistic Existentiutism) రెండవది క్రైస్తవాస్తిత్వ వాదము (Christian Existenliatism)

## నిరీశ్వరాస్తిత్వ వాదము

హైడెగ్గర్, కారల్ జాస్పర్స్, జాపోల్ సార్త్రె అనే ఈ ముగ్గురు నిరీశ్వరాస్తిత్వవాద శాఖకు సంబంధించినవారు: వీరిలో సార్త్రె 'లేత్ ఏ నియాం' (భావము—అభావము) అనే గ్రంథంలో నిరీశ్వరాస్తిత్వవాదం దృక్పథం సమగ్రంగా వివరించాడు. ఇది అస్తిత్వవాద సిద్ధాంతం పూర్తిగా ప్రతిపాదించిన గ్రంథము.

ఇంత సమగ్రంగా క్రైస్తవాస్తిత్వవాదదృక్పథం అంతా క్రోడీకరించిన గ్రంథం ఏదీ బయలుదేరలేదని తెలుస్తున్నది.

సార్త్రే అస్తితావాదముకూడా వ్యక్తికి సంపూర్ణస్వాతంత్ర్యం ప్రతిపాదిస్తుంది. ప్రతీవ్యక్తికీ తన ప్రవృత్తిని నిర్ణయించుకోడానికి సంపూర్ణస్వేచ్ఛ ఉన్నది. అయితే ఈమానవప్రవృత్తికి నియతములైన ధర్మసూత్రాలేవీ లేవు. ఎప్పటికప్పుడు వ్యక్తే తన ఆచరణద్వారా తాత్కాలికంగా ఒక ధర్మసూత్రం నిర్ణయించుకుంటున్నాడు. అసలు అస్తితావాదానికి ప్రధానసూత్రం (*Irrationality*) కార్యకారణభావశూన్యత–లేక అసంబద్ధత. సత్తావాదులందరు హేతునిర్మితములైన సిద్ధాంతాలేవైనా భావ్య (*Possible*) ములే గాని పరమార్థాలు కావని నిర్ణయించారని ఇదివరకే వ్రాశాను. అందులోను సార్త్రే ఈ విషయం ఒక కొసకు తీసుకుపోయాడు. కనకనే ఇతని దృష్ట్యాజీవితం అంతా అసంబద్ధమే (*Absurd*). కనకనే ప్రతివ్యక్తికీ కార్యాచరణలో (*Anguish*) ఒక విధమైన ఆవేదన అనుస్యూతంగా, ఉంటాయని సార్త్రే అంటాడు. ఇల్లాగే (*Abandonment*) 'నిస్సహాయతా భావం' తో కూడా వ్యక్తి ప్రవర్తించవలసి ఉన్నదనీ, అయితే ఈరెండు భావాలతో బాటు వ్యక్తి అనుక్షణము జవాబుదారీ (*Responsibility*) కూడా వహించవలసి ఉంటుందనీ సార్త్రే చెబుతాడు. నిరీశ్వరాస్తిత్వవాదం అంటే విధిగా ఈశ్వరుడు లేడని భావించాలని అనుకోకూడదు. ఈ వాదంలో ఈశ్వరుని అస్తిత్వం ప్రతిపాదించవలసిన అవసరం లేదనీ, మానవ వ్యక్తే సంపూర్ణస్వాతంత్ర్యం వహించవలిసిఉంటుందనీ అర్థంచేసుకోవాలి.

మానవవ్యక్తిచైతన్యం వస్త్వాత్మకమై (*Directed towards object*) ఉండనప్పుడు, దీని స్వస్వరూపం అభావమే (*Nothingness*) అని సార్త్రే కూడా నిర్వచిస్తాడు. సార్త్రే అభిప్రాయంలో అభావం అంటే అనిర్వచనీయత అని అర్థం చెప్పవచ్చునని తోస్తుంది.

ఇంచుమించుగా అస్తితావాదు లందరు మానవ వ్యక్తిని గూర్చి ఈవిధంగానే నిర్వచిస్తారు. అయితే ఈ అభావ స్వభావమేమిటని ఎవరైనా ప్రశ్నించవచ్చును. జీవితం అంతా అసంబద్ధమే అయినప్పుడు— తార్కిక దృక్పథంతో ఈ ప్రశ్న అసంబద్ధమని సార్త్రే సమాధానం చెబుతాడు.

ఈ సమాధానం మనకు పట్టి అసంబద్ధంగా ఉన్నట్లే కనబడుతుంది! కాని ఏతాత్త్విక సిద్ధాంతంలోనైనా ప్రధాన సత్యాలను గూర్చి ప్రశ్నించినపుడు ఇంచుమించుగా ఇల్లాంటి సమాధానమే వస్తుంది. ఉదాహరణకు ఆదర్శవాద భౌతికవాదాలు తీసుకుందాము. ఈ రెండువాదాలలోను, మనస్సులోనుండి పదార్థంగాని పదార్థంలోనుండి మనస్సుగాని ఎందుకు పరిణామం చెందింది? అలాగ పరిణామం చెందడానికి ప్రయోజన మేమిటి? అసలు మనస్సుగాని పదార్థంగాని ఎలాగ వచ్చింది? అని ఎవరైనా ప్రశ్నిస్తే సమాధానాలు రావు. ఒకవేళ వచ్చినా ఇంచుమించుగా సార్త్రే చెప్పిన ధోరణిలోనే వస్తాయి. అందుచేత సార్త్రే చెప్పిన సమాధానానికి మనం అంతగా ఆశ్చర్యపడవలసిన అవసరం లేదనుకుంటాను.

## క్రైస్తవాస్తిత్వవాదము

క్రైస్తవాస్తిత్వవాదంలో కూడా అస్తితావాదసామాన్యలక్షణాలన్నీ కనిపిస్తాయి. అయితే ఈశ్వరాస్తిత్వవాదులు ఈ వ్యక్తి అస్తితతో బాటు ఈశ్వరాస్తిత్వం కూడా ప్రతిపాదిస్తారు. ఇక్కడ ప్రాచీనతాత్త్విక దృక్పథాలు నిర్వచించే ఈశ్వరుని సత్తకు అస్తితావాదులు ప్రతిపాదించే ఈశ్వరసత్తకు చాలా తేడా ఉంది.

ప్రాచీన తాత్త్వికసిద్ధాంతాలు హేతువాదంద్వారా ఈశ్వరసత్త నిర్ణయిస్తాయి. అస్తితావాదుల ఈశ్వరసత్త హేతువాదంమీద ఆధారపడినది కాదు. ఇది సహజజ్ఞానం (*Intuintion*) మీద ఆధారపడింది. అందుచేత క్రైస్తవాస్తిత్వవాది సహజస్వాతంత్ర్యంతో తన దైనందినాచరణ ద్వారా పరిపూర్ణమైన ఈశ్వరసత్త అధిగమించడానికి ప్రయత్నిస్తాడు. నిరీశ్వరాస్తిత్వవాది దృక్పథంలో నిత్యస్వాతంత్ర్యమే పరమలక్ష్యం అవుతుంది. ఈ స్వాతంత్ర్యం ఈశ్వరాస్తిత్వవాదిని ఉన్నతోన్నతమైన ఈశ్వరాస్తిత దగ్గరకు తీసుకుపోతుంది. ఒక సూత్రబద్ధమైన ఆచరణ ఈశ్వర నిరీశ్వరాస్తితావాదుల్లో ఇద్దరిలోను లేదు. అందుచేత అన్ని విషయాలలోను అందరు సమానంగానే ప్రవర్తిస్తారు. అందుచేత నిరీశ్వరవాదుల్లో వచ్చే ఆవేదనాదులన్నీ ఈశ్వరవాదులకు వస్తాయి. ఒక్కలక్ష్య నిర్వచనంలోనే వీరిద్దరికీ కొంచెం తేడా ఉన్నట్లు కనబడుతుంది.

వెనక పేర్కొన్న సోరన్‌కీర్క్‌గార్డ్, గేబ్రియల్ మార్సెల్, అనే ఈ ఇద్దరు క్రైస్తవాస్తిత్వవాదవర్గీకరణంలోకి వస్తారు.

వీరిలో సోరన్‌కీర్క్‌గార్డ్ ప్రొటెస్టాంట్ క్రైస్తవుడు. గేబ్రియల్ మార్సెల్ కొంతకాలానికి రోమన్ కేథలిక్ మతం స్వీకరించాడు.

ఇక మిగిలినవాడు లూయీ లావెల్. ఇతడు పారిస్ తత్త్వకళాశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేసేవాడు. లావెల్ ప్రాచీనతత్త్వ సిద్ధాంతాలకు అస్తితావాదానికీ చక్కని సమన్వయం కుదిర్చినట్లు కనబడుతుంది. అస్తితావాదులందరు ప్రాచీన తాత్త్వికులు ప్రతిపాదించిన, ఆత్మ, భావము (*Idea*) మొదలయిన విషయాలన్నీ తత్త్వాలు (*Essences*) అంటారు. అస్తితావాదు లీ తత్త్వాలలోనించి అస్తిత పరిణమించిన దన్నమాట యథార్థం కాదనీ, అస్తితలోనించే ఈ తత్త్వనిర్వచనం జరిగిందనీ, అందుచేత అస్తితకే ప్రాధాన్యం ఉందనీ అంటారు. లూయీ లావెల్ కూడా ఈ వర్గానికి చెందినవాడే. అయితే ఇతడు వర్తమాన వ్యక్తి (*Existent*) సర్వస్వతంత్రతతో తన తత్త్వం (*Essence*) నిర్వచించుకొని ఆ లక్ష్యసాధనకై ప్రయత్నించాలని అంటాడు. ఇతనివాదంలో ఇక మిగిలినవిషయాలన్నీ ఇతరాస్తిత్వవాదులలో ఉన్నవే. ఇతన్ని నిరీశ్వరాస్తితావాదుల్లో గాని, క్రైస్తవవాదుల్లో గాని చేర్చడానికి వీలులేదనుకుంటాను.

## అస్తిత్వవాదరచనలు

అస్తితావాదులందరికీ హేతువాదనిర్ణీతమైన సిద్ధాంతాలంటే ఏమాత్రము నమ్మకము లేదని ఇదివరకే వ్రాశాను. అస్తితావాదం సహజజ్ఞాన (*Intuition*) ప్రధానమైనది. అందుచేత వీరెవ్వరు తమ సిద్ధాంతాలు కార్యకారణ భావపూర్వకమైన ఒక క్రమపద్ధతిలో ప్రతిపాదించాలని తలపెట్టలేదు. ఈ సత్తావాద ప్రవర్తకులలో చాలామంది ఫ్రాన్సులోను, తదితర దేశాలలోను బాగా పేరుపొందిన రచయితలు. సోరెన్ కీర్కెగార్డ్ మొదలుకొని లూయీలావెల్ వరకు—అందరు, సత్తావాదానికి సంబంధించిన తాత్త్వికగ్రంథాలే గాక, నవలలు నాటకాలు మొదలైనవెన్నో రచించారు. సత్తావాదులకు మానవ హేతుశక్తిమీద నమ్మకం లేకపోవడంచేత, కళాత్మకంగానే అస్తితావాదాభిప్రాయాలు తేలికగా ధ్వనించవచ్చునని భావిస్తారు. అందుచేత ఒక సిద్ధాంత (*Theory*) రూపంలో వీరి వాదం వివరించడం చాలా కష్టం. ఎవరైనా ఈ వాదాన్నిగురించి దిఙ్మాత్రంగానే సూచించవచ్చును గాని అంతకంటె చెయ్యగలిగిం దేమీ లేదు.

ఇందుచేత సత్తావాదం అవలంబించిన కొందరు రచయితల రచనలనుగురించి కొంచెం సంగ్రహంగా వ్రాస్తాను.

జా పోల్ సార్త్ర రచించిన ఏజ్ ఆఫ్ రీజన్ (*Age of Reason*) ఈ సందర్భంలో కొంతవరకు ఉపయోగిస్తుంది.

కేవల సాహిత్యదృక్పథంతో చదువుతూంటే ఈ రచయిత చాలా సమర్థుడని ఎవరికైనా స్ఫురిస్తుంది. నవల రచనాపద్ధతి, పాత్రశిల్పము మొదలయినవన్నీ ప్రశస్తంగానే కనిపిస్తాయి. కాని దీనిలో కథ మాత్రం చాలా విచిత్రంగా ఉంటుంది.

మాత్యూ అనే తత్త్వశాస్త్రోపాధ్యాయునికి మార్సెల్ అనే యువతితో సంబంధం ఏర్పడుతుంది. కొంతకాలానికి ఆమె గర్భవతి అవుతుంది. చివరికి అతని కామెను వివాహం చేసుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. కాని ఈ విధంగా తన స్వాతంత్ర్యం హరించిపోగలదేమోనని అతనికి భయం కలుగుతుంది. అందుచేత అతడామె గర్భవిచ్ఛిత్తికి ప్రయత్నిస్తాడు. దీనికి సమర్థులైన వైద్యుల సహాయం కావాలి. అది బాగా డబ్బుతో కూడిన వ్యవహారం. అతనికి ఎంత ప్రయత్నించినా డబ్బు దొరకదు. ఈ విషయంలో తన సోదరుడు డేనియల్‌ను అడుగుతాడు. అతడు బాగా డబ్బున్నవాడు, లాయరు. కాని ధన సహాయం చెయ్యడు.

చివరికి ఒక స్త్రీ అధీనంలో ఉన్న ధనం రహస్యంగా అపహరించి మళ్ళీ ఆమెకు తెలియకుండానే ఆ డబ్బు అక్కడ పెట్టవచ్చుననీ ఈ లోగా తన అవసరం తీర్చుకోవచ్చుననీ నిశ్చయించి మాత్యూ ఆ ప్రయత్నంలో ఉంటాడు.

కాని ఇంతకుపూర్వమే డేనియల్‌కు, మార్సెల్‌కు కొంత పరిచయం ఏర్పడిఉంటుంది. ధనసంపాదనప్రయత్నం బాగా ఆలస్యం కావడంతో ఆమె బాగా విసిగిఉంటుంది. ఈ లోగా డేనియల్‌తో ఆమెపరిచయం ఎక్కువౌతుంది. ఒకనాడు డేనియల్ మాత్యూను హఠాత్తుగా ఫోనులో పిలిచి, మార్సెలు, తాను వివాహంచేసుకోవాలని నిశ్చయించామనీ, శిశువు పుట్టాక దాని సంరక్షణభారం తామే వహిస్తున్నామనీ చెబుతాడు. మాత్యూ చెక్కుచెదరకుండా యథాప్రకారంగా తన జీవితపంథాలో నడిచిపోతూంటాడు.

సంగ్రహంగా ఇదీ ఈ నవలలో కథ. దీనిలో మాత్యూ స్వాతంత్ర్య లక్ష్యం అడుగడుగునా వ్యంగ్యంగా ధ్వనిస్తూంటుంది. సామాన్యంగా నవలలు చదివేవారికి కథ. అంతా చాలా విచిత్రంగా ఉంటుంది. అస్తితావాదం అవగాహన చేసుకున్నవారికిమాత్రం దీనిలో అంతగా వైచిత్రి కనబడకపోవచ్చును.

మానవ చైతన్యం ద్వారానే పరిసర పదార్థాలకు అస్తిత్వం ఆపాదింపబడుతున్నదని పైన వ్రాసిన సత్తావాదవివరణనుబట్టి గ్రహింపవచ్చును. సీమోన్ ద బూవ్వార్ అనే అస్తిత్వవాద రచయిత 'లావితేయ్' అనే నవలలో ఈ అభిప్రాయం ఈ క్రింది భాగంలో ధ్వనింపజేశాడు. అది ఇక్కడ అనువదిస్తున్నాను. ఫ్రాన్ స్వాజ్ అనే యువతి ఒకనాటిరాత్రి ఆలస్యంగా సినిమా స్టుడియోలో ప్రవేశిస్తుంది. ఈ క్రిందిది ఆ ఘట్టంలో ఉన్న పరిసర వర్ణన.

“ఆమె అక్కడికి రాక పూర్వం ఆవస్తువులన్నీ అక్కడ లేనేలేవు కాని ఆమె అక్కడికి వెళ్ళేసరికి నేలపై పరిచిన రత్నకంబళీ కాలిరంగులన్నీ ఒదుగుతూ ఒదుగుతూ పైకి వచ్చే కిరెలుగుల్లా మందమందంగా మెరిశాయి. ఈ అద్భుతశక్తి ఆమెకు సంబంధించినదే. చైతన్యరహితంగా పడి ఉన్న వస్తువులన్నీ ఆమె సన్నిధిలో చైతన్యంతోను, చిత్రవిచిత్రమైన వర్ణాలతోను సువాసనలతోను వెల్లివిరిశాయి. ఆమె కిందికి దిగి వెళ్లి మెల్లిగా రంగస్థలంతలుపులు తెరిచింది. అంతకుపూర్వం అది అంతా గాఢాంధకార బంధురంగా ఉంది. ఇప్పుడామె అక్కడికి వెళ్లి ఆ ప్రదేశానికి అస్తిత్వం ప్రసాదించింది. బహుశః అది ఆమె కర్తవ్యమేమో అన్నట్లు కనబడింది.. ఆమె ఆ లోపలికి వెళ్ళేసరికి అంతవరకు స్తబ్ధంగా పడిఉన్న కుర్చీలన్నీ ఆమెకోసం నిరీక్షిస్తున్నాయి. ఇంతకుపూర్వం అవి అలాగ నిరీక్షించడం లేదు. కాని ఆమె అక్కడ ప్రవేశించగానే అవన్నీ ఆమెను చేతులెత్తి పిలుస్తూన్నట్లు కనిపించాయి.” అని ఈ వర్ణన ఇలాగ సాగిపోతూంటుంది.

## భారతీయ తాత్త్వికసిద్ధాంతాలు—సత్తావాదము

సత్తావాదానికీ భారతీయతాత్త్విక సిద్ధాంతాలలో కొన్నింటికీ చాలా దగ్గరపోలిక లున్నట్లు కనబడుతుంది. ముఖ్యంగా బౌద్ధ వేదాంతులలో కొంతమంది అస్తితావాదానికి చాలా దగ్గరగా వస్తారు. వీరు బౌద్ధమాధ్యమిక వాదులు. వీరి ప్రధానాచార్యుడు నాగార్జునుడు. ఇతడు అంతకుపూర్వం అమలులోవున్న ఒక బౌద్ధ సిద్ధాంతం పూర్వపక్షంచేసి శూన్యతావాదం ప్రతిపాదించాడు. ఇతడు పరిదృశ్యమాన జగత్తుకు అంతర్లీనంగా ఉన్నది అభావమే నని అంటాడు. అయితే అస్తితావాదులకు, నాగార్జునునికీ ప్రధాన సిద్ధాంతాలలో విభేదం ఉంటే ఉండవచ్చును.

ఇతని అనుయాయులయిన ఆర్యదేవుడు మొదలయినవారంతా ఈ వాదానికి చెందినవారే.

ఒక ప్రత్యేక దృక్పథాన్ని బట్టి చూస్తే అద్వైత వేదాంతులు కూడా జగత్తు—జీవుడు పారమార్థిక సత్యాలు కావనీ, ఈ రెంటికీ అతీతమయిన పారమార్థిక సత్యం ఉన్నదనీ ప్రతిపాదిస్తారు. వీరి దృష్టిలో జగజ్జీవు లిద్దరు మాయ — లేక మిథ్యాస్వరూపాలు. అయితే అస్తితావాదుల అభావము, అద్వైతవాదుల మాయ ఒకటే అని చెప్పడానికి వీలులేదు. అద్వైతుల మాయ అనిర్వచనీయము. అస్తితావాదుల అభావానికీ, వీరి మాయకు కొంత సాజాత్యం ఉన్నదని చెప్పవచ్చును.

అస్తితావాదం చాలాకాలంనించి యూరపులో తలకెత్తిన కేవలంభౌతికవాదాలపై తిరుగుబాటుగా బయలుదేరిన సిద్ధాంతము. ఇది వ్యక్తికి, జవాబు దారీ, స్వాతంత్ర్యము ప్రతిపాదించే వాదము. కేవలం(*Object*) పదార్థము మాత్రమే ప్రధానంగా తీసుకున్న గతితార్కిక భౌతికాదివాదాలన్నీ మానవుణ్ణి కేవలం పరిసరదాసుణ్ణిగా తయారుచేస్తాయి. ఈ విధమయిన కేవల భౌతికవాదాలు చాలాకాలంనించి పాశ్చాత్య తత్వశాస్త్రంలో బాగా పాతుకుపోయాయి. అందుచేత అస్తితావాదప్రారంభంతో పాశ్చాత్యతాత్త్విక దృష్టిలో ఒక విప్లవం బయలుదేరినదని అనవచ్చును. పాశ్చాత్య మనస్తత్వశాస్త్రం కూడా వ్యక్తిని ఒక వస్తువు (*Object*)గానే పరిశీలించింది గాని అంతకంటె ఎక్కువదూరం పోలేదు.

హుస్సారల్ చేసిన పరిశోధనలు ఆదర్శభౌతికవాదాలు రెండిటినీ అతిక్రమించి, ఈ రెంటికీ ప్రధానమైన వ్యక్తి అనుభూతుల లోలోపలికి వెళ్లి కొన్ని నూతన విషయాలు బయలుపెట్టింది. ఇది మనస్తత్వశాస్త్రంలో బయలుదేరిన ఒక కొత్త పంథా. బహుశః ఈ పంథాలో ఇంకా కొన్ని కొత్త పరిశోధనలు జరిగిన కొన్ని నూతన విషయాలు బయటపడితే పడవచ్చును.

సార్త్ర ప్రతిపాదించిన నిరీశ్వరాస్తిత్వవాదంలో మానవునికి స్వాతంత్ర్యం ఒకటే నిరంతరలక్ష్యంగా కనిపిస్తుంది. ఏ విధమైన విలువలు లేనప్పుడు ఈ స్వాతంత్ర్యం అనే విలువకుమాత్రం ప్రయోజనం ఏమి ఉన్నది? సార్త్ర ఇచ్చే 'అసంబద్ధత' (*Absurdity*) అనే సమాధానం సామాన్యదృష్టికి చాలా హాస్యాస్పదంగా కనిపించవచ్చును.

అందుచేత నిరీశ్వరాస్తిత్వవాదం కంటె క్రైస్తవవాదం—లేక సేశ్వరాస్తిత్వవాదం మానవాళిని ప్రేరేపించగల ఒక వినూతనమైన సమున్నతాదర్శం ప్రతిపాదిస్తున్నట్లు కనబడుతుంది.

అయితే ఏ వాదమైనా చివరికి ప్రపంచంలో ఎలాంటి పరిణామాలు తేగలదో ఎవరూ చెప్పలేరు.

సామాన్యదృష్టికి కనబడినట్లు అస్తితావాదం గాలికి ధూళికి తేలిపోయే తాత్కాలికమైన తికుకు టెంకుమాటల గారడీ కాదనీ, దీనిలో ప్రపంచ తాత్త్వికపంథాలో తీవ్రసంచలనం తీసుకువచ్చే సూచనలున్నాయనీ నిశ్చయంగా చెప్పవచ్చును.



# పి. శి. ఏ. అండు కంపెనీ, ఆయుర్వేద సమాజం

## పెరిదేపి-నెల్లూరు జిల్లా

శ్రేష్ఠమయిన మా ఔషధములు వేలకొలది మంది చే వాడబడుచున్నవి-
అనేక యోగ్యతాపత్రములు గలవు. వెలస్వల్పము, ఫలమధికము,

## నారసింహ లేహ్యము




బంగారు చేర్చబడినది, మేహములు, నిక్కాక - నిస్సత్తువ శుక్లనష్టము, అతిమూత్రము, మొదలగు వాటిని హరించి మిక్కిలి బలమును వీర్యవృద్ధిని, సంభోగశక్తిని, రక్తవృద్ధిని, కలిగించుటలో అమోఘమయినది.

20 తులముల డబ్బి
రు. **3-4-0.**

## మదన కామేశ్వరి లేహ్యము

మేహములు, నిక్కాక, నిస్సత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము మొదలగు వాటిని హరించి వీర్యవృద్ధిని బలమును కలిగించును, దీనియందు బంగారు చేరదుగాని, నారసింహ లేహ్యము వలెనే పనిచేయును.

20 తులముల డబ్బి రు. **2-0-0**

## పాలసుగంధి లేహ్యం

సవాయి మేహములు, మేహపొడలు, మచ్చలు, చర్మరోగములు, కీళ్లనొప్పులు, మలబద్ధము - మొదలగు వాటిని హరించుటలో శ్రేష్ఠమయినది.

20 తులముల డబ్బి రు. **2-0-0**

## రోజాపుష్ప లేహ్యం

మలబద్ధమును ఖండించుటలో శ్రేష్ఠమయినది. అజీర్ణము, వాతము, మూలవ్యాధి మొదలగు వాటిని హరించి కాలవిరోచనమును చక్కగా కలిగించును.

15 తులముల డబ్బి రు. **1-0-0**

## చ్యవనప్రాస లేహ్యం

క్షయ - దగ్గు - ఉబ్బసము - మొదలగు వాటికి మంచిది.

20 తులముల డబ్బి రు. **1-12-0**

## మహా ఖండార్ద్రక లేహ్యం

పైత్యములు, అజీర్ణము, వాంతులు వెక్కిళ్లు-మొదలగు వాటిని హరించి ఆకలిని జీర్ణశక్తిని కలిగించును.

15 తులముల డబ్బి రు. **1-4-0**

## ఘనసార చందిని

ఇది - ఎరుపు, తెలుపు, పసిమి, మొదలగు అంటు (గనేరియా) సంబంధమగు వ్యాధులను, స్త్రీల కుసుమవ్యాధులను ఖండించును. సీసా రు. **2-4-0.**

అనుపానము చందిని అత్తరు సీసా రు. 1-0-0.

## గంధక రసాయనము

రక్తశుద్ధికి శ్రేష్ఠమయినది— సవాయి మేహములు, మేహపొడలు, మచ్చలు, కుష్ఠువు, చర్మరోగములు. క్రిమిరోగము - అంటువాయువు మొదలగు వ్యాధులను ఖండించి, బలమును కలిగించును. 10 తులముల డబ్బి రు. **2-8-0**

## ప్రమద

స్త్రీల పాలిటి వరప్రసాదము. ప్రదరము - బహిష్టు చక్కగా కాకుండుట, రుతుశూల - మొదలగు గర్భకోశ సంబంధమగు వ్యాధులను హరించి సంతానమును కలిగించు దేవామృతము. 8 ఔన్సుల సీసా రు. **2-4-0**

## సంజీవన కల్పము

ప్రతి యింట నుండదగినది. జ్వరములు, ఉష్ణవాత సంబంధమగు వ్యాధులు, కళ్లు నొప్పులు, మూత్ర వ్యాధులు, మొదలగు వాటికి అమృత తుల్యము—

5 తులముల డబ్బి రు. **1-8-0**

## చందనాది తైలము

సువాసన, మెదడుకు చల్లదనము, శిరోవేదన మొదలగు వాటిని హరించి వెంట్రుకలను వృద్ధిచేయును—

4 ఔన్సుల సీసా రు. **1-2-0**

**ఇంకా అనేక ఔషధములు గలవు.**

అన్నిటికి పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

మా వద్ద శ్రేష్ఠమయిన 800 రకములగు ఔషధములు గలవు. కోరిన వారికి క్యాటలాగు ఉచితము.

**పి. సి. ఏ. అండ్ కంపెనీ, ఆయుర్వేదసమాజం - పెరిదేపి, నెల్లూరు జిల్లా.**

**P. C. A. & Company, Ayurvedic Samaj, PERIDEPI, Nellore District.**

కాగితము, స్టేషనరీ తయారు చేయువారు

# The Craftsmanship

## THAT IS TRULY INDIAN



పూర్వకాలపు శిల్ప సాంప్రదాయాల నుంచీ పారిశ్రామిక బహుళోత్పత్తికి అనువైన ఆధునిక డిజైన్ల వరకూ భారతదేశపు పనితనం విశిష్టమైన తన ఉత్తమ ప్రమాణాలను నిలువబెట్టుకొనుచున్నది. కృష్ణా షర్టింగుల సూటింగుల ప్రతిగజంలోను ప్రస్ఫుటించే ఉత్తమమైన నాణ్యత, కళానైపుణి లోకూడ ఇదే ద్యోతకమగుచున్నది.







# Krishna

## SHIRTINGS-SUITINGS

SRI KRISHNA SPG. & WVG. MILLS LTD. BANGALORE

FAS. 767

**SRI KRISHNA SPINNING & WEAVING MILLS. LTD.**

**SUBRAMANYAPURA. BANGALORE CITY**

# తోడు నీడ

★

శ్రీ వెంపటి సచ్చిదానందశర్మ

ఇది నిజమైన సత్యం ; నమ్ము—ఉట్టి తెల్లకాగితాన్ని చదవటానికి ప్రయత్నిస్తున్నావు నువ్వు.

కళ్ళముందుకి పత్రికని ఇంకా జరిపినందువల్ల ప్రయోజనం లేదు ; గుడ్లు పత్తికాయలల్లే చేసి మరింత తేరిపార జూచినందువల్ల కూడా ప్రయోజనం లేదు.

పోనీలే, ఇప్పుడు గాకపోతే తరవాతనైనా ఒప్పుకుంటావు— నేను చదవబోయింది తెల్లకాగితాన్ని —అని.

—ఈ మాటలకి నేనూ పదింతలు విభ్రాంతిపడ్డాను. కథ ఉండక ఏమైపోతుంది? ఫలానా పేజీలో బావగారు అఘోరించిన కథ ఉంటుందని విషయసూచికలో చూచానాయె—లైట్ల వెలుగులో...

'కాదు. చీకట్లో'

'అబద్ధం! కళ్లు మిరుమిట్లుగొలిపే విద్యుద్దీప కాంతిలో...' రెట్టించాను ఆవేశంతో, ఈ మాటలు ఎవరితో అంటున్నానో విచారించే సావకాశం కూడా లేకుండా.

'నిజం...కటిక చీకట్లో...'

నేను నమ్మలేదు.

'ఔను. ఆ కథ నేను వ్రాసి ఉండవలసింది; కాని, వ్రాయటం పడకనేపోయింది...'

'ఎందుకని?' అన్నాను బావవైపు చూస్తూ.

'ఈ లోపలే చనిపోయాను'

అంత మనిషి ఎదురుగా కనిపిస్తూ నమ్మమని ఈమాట లనే సరికి బావని చూచి పక్కున నవ్వ బుద్ధిపుట్టింది. కాని, మళ్లా ఒక అనుమానం వచ్చింది—ఈ మాట లన్నది బావేనా—అని.

బావ పెదవులు కదిలినట్లు లేవు.

'నిజం. ఆత్మహత్య... నే నే చంపాను.' ఈ మాట లంటున్న దెవరని ఒక్కసారి వెనక్కి తిరిగాను. ఎవరూ లేరు.

'మరి నువ్వెవరు?' అన్నాను శూన్యంలో.

'నేనా?...వాడి ఆత్మని...'

ఇంకా అనుమానం తీరక బావ దేహాన్ని గట్టిగా కుదిపాను. నేను పట్టు వదిలేసరికి బావ దేహం లుంగగా కింద కూలిపోయింది.

'అనుమానం తీరిందా? నిజం...వచ్చి సాధించదల్చుకున్నాను...'

అప్రయత్నంగా ఇటు తిరిగాను. గదిలో మరెవరి అలికిడి లేదు. నే నేమి చూస్తున్నానో నాకే తెలీదు. గదితలుపులు గాలికి రెపరెప లాడినై. ఒక స్త్రీ మూర్తి గాలిలో కొట్టుకొచ్చింది.

అక్కయ్య!—

'నిజంరా తమ్ముడూ! బావ సాధించటానికే చనిపోయాడు—జీవితంలో నా సహచర్యం లభ్యం కాకపోతే చచ్చి దయ్యమై పొందుతాననేవాడు ఎప్పుడూ నాతో...' అక్క ఆత్మ మాట్లాడుతోంది అల్లంత దూరాన్నుంచి.

'పోనీ, దయ్యమైపడితే పట్టేవాడేమో...అన్నంత మాత్రానికే నువ్వు కూడా చచ్చిపోవట మెందుకే?' అన్నాను బిక్కగా.

'ఎన్నాళ్ళని ఈ ఆత్మవంచన? అందుకే చేశాను—ఆత్మహత్య...' అంది తీవ్రంగా.

'అసలు, ఆత్మవంచ నెందుకు చేసుకోవలసి వచ్చింది?'

'చేసుకోరాదు; కాని, చేసుకునేదాన్ని. ఎందుకు చేసుకునేదాన్నో నాకే తెలీదు' అంది పొరపడి విచారించటం తప్ప తను చేయగలిగిందేమీ లేనట్లు.

ఏదో తెలీని సంతృప్తి పొందాను ఈ మాటలవల్ల. పదిమంది ముద్దాయీలలో కూర్చున్నప్పుడు నేరస్థుడు పొందే సంతృప్తి ఇటువంటిదే కావచ్చు. నిజానికి, ప్రాపంచిక దృష్ట్యా నా ప్రవర్తన నిరాక్షేపణీయం.

కాని, నన్ను కూడా చంపెయ్య మంటున్నా రెవరో...

'అన్నయ్యా! బావని కూడా చంపెయ్యరా...ఇన్నాళ్లూ కబుర్లతో కడుపునింపి, అన్నీ మరిచిపోయినట్లు ప్రవర్తిస్తున్నాడీ మనిష్య...'

మాటలు వినిపించిన మరుక్షణానికి మరొక స్త్రీ దేహం కూడా కొట్టుకొచ్చింది గదిలోకి.

'చెల్లాయ్! నువ్వు కూడా చనిపోయావుటే!' అంది బావ ఆత్మ.

'ఔనురా అన్నయ్యా! బావ చేస్తున్న మోసాన్ని తెలుసుకోటానికి చనిపోయాను...బావనికూడా చంపెయ్యరా...'

అన్నా చెల్లెళ్లిద్దరూ నన్ను చంపి తీరుతారని భయపడ్డాను. 'నే నేమీ మోసం చెయ్యలేదు' అన్నాను, ఎన్నడూ తొందరపడి నోరుజారి ఉండనందుకు సంతోషిస్తూ.

* 'నీ', 'నా' ఉనికి *Existentialism* దృష్ట్యా ఇది. 'మన' బింబాలు, ప్రతిబింబాలు 'వీళ్లు', 'వాళ్లు'...

‘అబద్ధం......నిన్న నువ్వు మోసం చేసుకుంటున్నావు. మొన్న మనం పార్కునుంచి తిరిగొచ్చాక పుస్తకం పుచ్చుకుని చదువు నటిస్తూ ఏమాలోచించావో చెప్పు!’

‘నేనేమాలోచించానో నీకెలా తెలుసు?’ అన్నాను.

‘తెలుసుకోటానికి వీలవుతుంది గనకనే చనిపోయాను. ఇక్కడ అనుకోవటానికీ అనటానికీ తేడా లేదు.’

‘లాభం లేదురా తమ్ముడూ! ఇక్కడ రహస్యాలంటూ లేవురా. నా మాట విని నువ్వుకూడా చనిపో’ అంది అక్క.

‘వదినా! పోనీ, నువ్వే చెప్పు, మొన్న నేమాలోచించాడో బావ!’

‘నిజమే. అసలు వాడికెప్పుడూ నీధ్యాసే! మొన్న కాఫీ హోటల్లో, నిన్న సినిమాహాల్లో, ఇందాక ఇంటికి వస్తూ......’ అక్కయ్య ఏదో పుస్తకంలోనుంచి చదువుతున్నట్లు ఏకరువు పెడుతోంది.

‘అన్నయ్యా! మరి, బావని కూడా మనలోకి రప్పించెయ్యరా...చంపెయ్యరా’

బావ అమాంతం నా పీక నులిమేస్తాడేమో ననుకున్నాను. మాటలైతే వినగలను గాని, ఆకారం లేని ఆ వ్యక్తి తీరా పీక పిసికే దాకా తెలియదాయె...

‘ఒకళ్లు చంప నవసరం లేదు వాణ్ణి...ఆత్మవంచన చేసుకున్నాడుగా. ఆత్మహత్య కూడా చేసుకు తీరుతాడన్నమాటే...’ బ్రహ్మ వాక్యంలాగా పలికింది బావ అత్త.

బావ ఈ మాట లంటుండగానే ‘చూశావుట్రా తమ్ముడూ! ఇక్కడి మనస్సులో అనుకునే విషయాలకి తప్పితే, నోటి మాటలకి విలువ లేదు. నిజానికి, ఇక్కడే చాలా బాగుందికదూ?’ అంది అక్క పశ్చాత్తాపపడుతున్నట్లు.

‘నిజమే...ఏమో అనుకున్నాను గాని, ఇక్కడే చాలా హాయిగా ఉంది...’ నేను గూడా కాదనలేకండా ఉన్నాను. ఒక్కసారిగా నా మాటలు ఆగిపోయినై.

నా శరీరం కూడా అల్లంత దూరాన పడిఉంది.

నే నెప్పుడు ఆత్మహత్య చేసుకున్నానో నాకే తెలీదు.

దూరంగా—రెండుచోట్ల నాలుగు శరీరాలు!

‘తమ్ముడూ! ఇప్పుడు నువ్వేమాలోచిస్తున్నావో చెప్పనా? ఆ శరీరాల్లో బంధింపబడి ఉన్నంతకాలం, నమ్మి నమ్మించి బతికింది క్షణం సేపు కూడా లేదు; ఇప్పటికైనా బైటపడ్డాం. చాలు- అని సంతోషిస్తున్నావు. నిజంగా కూడా అంతేరా. పాడు బతుకులు......’ అంది అక్క.

మనసుకి దాపరికశక్తి లేకపోవటం విడ్డూరంగానే ఉంది.

‘నువ్వు మాత్రం? నువ్వేమాలోచిస్తున్నావో చెప్పనా?— బావని గురించి!’ అన్నాను.

‘ఓస్! ఇంతే కదా! అది బావకే తెలుసు! మరి—నువ్వెవరిని గురించి ఆలోచిస్తున్నావో...’ అక్క వాక్యం పూర్తిచెయ్యలేదు.

‘వదినా! బావ ఎవరిని గురించి ఆలోచిస్తున్నాడో నాకు తెలుసు!’

నలుగురమూ పగలబడి నవ్వాం; ఒకళ్ళ నవ్వు నందుకుని మరొకళ్ళం దిక్కులు పిక్కటిల్లేటట్లు నవ్వుతున్నామింకా...

అప్రయత్నంగా మా అందరి నవ్వులూ ఒక్కసారిగా కట్టుబడ్డై—దూరాన్నుంచి ఇంతకింతలుగా నవ్వులు వినవస్తున్నై.

ఒక్క క్షణంపాటు అంతా నిశ్శబ్దంగా గడిపాము.

‘ప్రతిధ్వను లేమో!’ అన్నాను.

‘కాదు బావా! ఎవరో ఇటే వస్తున్నట్లు ఆ నవ్వు లింక దగ్గరౌతున్నై.’

‘ఎవరో నాకు పరిచయస్థుల గొంతులే......ఎవరబ్బా?’ అన్నాడు బావ.

‘పరిచయస్థులే కదా......బతుకుజీవుడా!...సగం భయం తీరింది’ అంది అక్క.

ఎవరో వస్తున్న సవ్వడి మరింత దగ్గర వవుతోంది. కులాసాగా కబుర్లాడుతూ, కేరింతలు కొడుతూ వస్తున్నారు.

‘అబ్బ! బతికి బతికి ప్రాణం విసికింది. ఇటుగో వదినా! వీళ్లంతా ఇక్కడున్నారు!’ అంది ఒక స్త్రీ గొంతు.

మేము నలుగురం నిశ్శబ్దంగా ఉన్నాం.

‘ఉస్! వాళ్లింకా మన్ని గుర్తుపట్టినట్లు లేరు. దగ్గరగా మాట్లాడకు.’ మరొక స్త్రీ కంఠం మందలిస్తోంది.

మేమెవరం మాట్లాడలేదు.

‘అలా విస్తుపోతావేంరా? మరిచిపోయావా మమ్మల్ని?’ బావని ఎవరో నిగ్గదీస్తున్నారు.

‘ఏదో లీలగా ఉంది తప్పితే పూర్తిగా గుర్తు రావటం లేదు’ అన్నాడు బావ మందంగా.

‘చూడరా బావా! అప్పుడే మరిచిపోయాట్ట! రోజుల తరబడి వీడి ధ్యాసంతా మన పైనే ఉండేనుకదా...’ అంటున్నాడు మరొకడు రెండవవాడితో.

‘నాధ్యాస మీ పైనా! అసలు మీరెవరు?’ అన్నాడు బావ అయోమయంగా.

‘ఎవరని చెప్పమంటావు? అంతా ఆలోచించి, తీరా, నామరూపాలివ్వకండానే మమ్మల్ని వదిలేస్తివాయ్...’ అంటున్నాడు మొదటివాడు.

ఇంతలో, అక్కయ్య దేహం నిద్ర లేస్తున్నట్లు లేస్తోంది.

‘అక్కా!’ కేక వేశాను.

అక్కయ్య కెవ్వుమంది నా పక్కనుంచి.

‘నువ్విక్కడే ఉన్నావే’ అన్నాను.

‘ఔనురా! నా శరీరంలో మరొకళ్లెవరో ప్రవేశించి ఉంటారు.’ అంది కళవిళపడుతూ.

క్రమంగా మా శరీరాలన్నీ లేస్తున్నై.

నా ఒళ్లుకూడా విరుపులు ప్రారంభించింది.

'ఏయ్! ఎవరునువ్వు? అది నా శరీరం... ముట్టుకున్నావంటే నా!' గదమాయించాను నా దేహాన్ని, అందులో ప్రవేశించిన వాడి నుద్దేశించి.

'నీదేమిటోయ్! నీదేమీ లేదిక్కడ...' నా శరీరం నన్ను ధిక్కరిస్తోంది.

'ఎవరు నువ్వు?' అన్నాను.

'నేనా? శివుణ్ణి!'

'అది నా పేరు...' అన్నాను ఆశ్చర్యపోతూ.

'నీ పేరు పెరిగిపోయింది. ఆ పేరు నాది; సుఖంగా బ్రతకాలని తాపత్రయ పడుతున్న వాణ్ణి నేను. సవ్యంగా బ్రతకలేక దని పోయిన వాడివి నువ్వు. నీకిప్పుడు నామరూపాలు రెండూ లేవు. మీ అందరికీ కూడా అంతే! ఇప్పుడైనా గుర్తించు మేమెవరో, మీ రెవరో—ఇడుగో వీడు మా బావ శేఖరం, ఇది మా అక్క—దుర్గ; ఇది నా భార్య—సీత, సరే, నేనెవరో చెప్పనే చెప్పాను కదా!' అన్నాడు శివుడు.

మా శరీరాల్లో ప్రవేశించి, మా పేర్లు పెట్టుకుని మమ్మల్ని వాళ్లెదిరిస్తుంటే మేము నలుగురం చూస్తూ ఉండిపోయాం.

నిజమే మాకిప్పుడు నామరూపాలు రెండూ కరువైనై—

'ఇప్పుడు మేము పశువులం! నీ మనస్సులో నీడలులాగా మెదిలి, నువ్వు మామీద దయదల్చి మా కథ వ్రాస్తే..., ఏ కొద్దిమందో మామీద దయతల్చి రవ్వంత మా కథ చదివే శ్రమ తీసుకుంటే వాళ్ల మనస్సుల్లో తిరిగి నీడలులాగా మెదలవలసిన పని మాకిప్పుడు లేదు. నువ్వు మాకథ వ్రాయనందుకు మా అందరి కృతజ్ఞతాభివందనాలు. ఇప్పుడు మేము నీ పాత్రలం కాదు; మనుష్యులం...' అన్నాడు బావ శరీరంలో ప్రవేశించిన వ్యక్తి బావతో.

వాళ్లు నలుగురూ ఒక్కసారి అతి వినయంగా తలలు వంచారు.

నామరూపాలు లేకపోవటంవల్ల వాళ్లు ఎంత బాధ అనుభవించారో, ఇప్పుడు మేము ఎంత అనుభవించాలో విప్పిచెప్పవల్లయింది.

అంతా కళ్ళున్నాం.

కూడ నామరూపాలు లేవు; కావాలి—

'పోనీ మమ్మల్ని నీకథలో పాత్రల్ని చేసి రవ్వంత శీలం పొయ్యి' బావ శేఖరాన్ని దీనంగా వేడుకుంటున్నాడు.

'తీరిక లేదు. కథ వ్రాయటానికయ్యే కాలాన్ని కూడా మేమంతా కలిసి గడుపుతాం, కులాసాగా' అన్నాడు శేఖరం.

వాళ్లు నలుగురూ నవ్వారొకసారి.

'పోనీ, శివుడూ! నువ్వన్నా చెప్పరా మీ బావతో, మా కథ వ్రాయమని' అన్నాను.

'నేను చెప్పను. ఏం? నువ్వు చెప్పావేం, మీ బావతో... మా కథ వ్రాయమని!' వాడు నా మాట అసలు వినేట్టు లేదు.

మేమంతా బ్రతిమాలాము—దుర్గ, సీత కూడా శేఖరానికి చెప్పేట్టు లేరు, వాళ్ళ సంతోషమే వాళ్ళకి తిప్పిలే.

ఉలబరించుకుని మా దగ్గరనుంచి వెళ్ళిపోవటానికి లేచారు వాళ్లు నలుగురూ. మేమూ వెంటపడ్డాం. వేడుకుంటూ.

పండగ రద్దీతో బజారంతా కళకళ్లాడుతోంది. వాళ్లు నలుగురూ శేరింతాలు కొడుతూ బజారులో కొట్లన్నీ గాలిస్తున్నారు.

'వదినా! ఈ చీర చాలా బాగుందికదూ?' అంది సీత ఉత్సాహంగా, నల్లజరీచీర తీసి చూస్తూ.

'చాలా బాగుంది. నల్లజరీచీరంటే నా కెంతో ఇష్టం!' తన గొంతెత్తి ఇష్టమెలా దుర్గ కళ్లు పెద్దవి చెయ్యటంలో తెలియచేసింది.

—ఒకళ్ళ ధ్యాసమాపైనే లేదసలు.

'చూడు వదినా! ఆ చీరలు వాళ్ళు కొనేసుకుంటారల్లే వుంది.'

'ఏమో! మనం కొనుక్కోవాలని ఎంతో అనుకున్నాం' అక్కయ్య సమాధానం చెప్పింది దిగులుగా.

ఇంతలో శివుడి దృష్టి నాకు నచ్చిన సూటుమీద పడ్డది. ఒక్కసారి నా గుండె జారినట్లనిపించింది. గుడ్డ చాలా బాగున్నదంటూ మెచ్చుకుంటున్నాడు శేఖరం శివుడికి.

'అవి కీళ్లు కొనేసుకుంటున్నారు' అన్నాడు బావ దిక్కుగా.

నాకూ అనుమానంగానే ఉంది.

కొట్లోనుంచి అంతా బైటికొచ్చాం.

వాళ్ళకి నచ్చిన గుడ్డల్ని గురించి అదే పనిగా మాట్లాడుకోవటం మొదలు పెట్టారు వాళ్లు.

మా ఆలోచనలన్నీ కూడా ఆ బట్టలపైనే ఉన్నై. కాని రూపురేఖలేలేని మాకు బట్టల కొరేమిటి? మాట, పలుకు లేకుండా వాళ్ళ ననుసరించాం.

శేఖరం మమ్మల్ని పూర్తిగా మరిచిపోయాడు—

—వాడి మనస్సంతా కొట్లో చూచి నచ్చిన బట్టలమీద ఉంది. పండగపూట కొత్తబట్టలు కొనుక్కోటంలో ఎంత ఆనందం ఉందో కొనకుండా కూర్చుని తెలుసుకో గలుగుతున్నాడు. పావులో బట్టలు మరోకసారి శేఖరం కళ్ళలో మెదిలినై. కొట్లో ఎవరైనా అడుగుపెట్టగానే వాళ్ల దృష్టిని అవ్వే ఆకర్షించి తీరుతా యనుకున్నాడు. తనకోసం వాటిని వేరే దాచిఉంచమని చెప్ప వన్నా చెప్పాను గా దనిపించింది.

కాని, తన దగ్గరున్నది అంతా లెక్కస్తే యాభైరూపాయలు!—కట్టిగా ఒకరికి బట్టలుకోవటానికి సరిపోవచ్చునేమో...

కుర్చీలో పడుకుని ఇంటికప్పువైపు చూస్తున్నవా డల్లా తల తిప్పాడు.

దుర్గ కిటికీముందు నిలబడి బైటికిచూస్తూ ఉంది. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్లుంది. ఆ ఆలోచనలని భంగం చేయరాదనుకున్నాడు శేఖరం.

తను దుర్గవైపే చూస్తూ కూర్చున్నాడు. తను కొనాలను కున్న చీరకట్టుకుని దుర్గ తనయెదుట నిలబడ్డట్టు భ్రమించాడు శేఖరం. ఎంత బాగుంటుందో—అనుకున్నాడు. మళ్లా, శేఖరందృష్టి చెదిరిపోయింది. పల్లజరీచీర పూవులో బీరువామడతల్లో కనిపించింది.

శేఖరం దుర్గదగ్గరకు నడిచాడు. దుర్గ గమనించలేదు.

'ఏమిటి ఆలోచిస్తున్నావు ?' అన్నాడు శేఖరం.

దుర్గ తడబడి, అర్థరహితంగా 'ఏమీ లేదు' అని, తనింతవరకు ఏమి ఆలోచిస్తున్నదో అప్పుడు ఆలోచించి చెప్పబోయింది. 'మీకో మాటు వచ్చిందికదూ' అంది చివరికి.

'ఔను' అన్నాడు శేఖరం చిరునవ్వు నవ్వి దుర్గ కళ్ళలోకి చూస్తూ.

'నిజం. చాలా బాగుంది. ఇవ్వాళే తప్పకుండా కొంటానని మాటిచ్చెయ్యండి...' కొంటే ఉండే సంతృప్తి, కొనకపోతే ఉండే అసంతృప్తి ఇంతింతలై ప్రచండగా వినిపిస్తున్నై ఆ గొంతులో.

'అలాగే' అని మాత్రం అని అక్కడినుంచి నడిచాడు శేఖరం.

'అలాగే. అంటే కాదు. మీ దగ్గిరున్న డబ్బు పెట్టి కొనెయ్యాలి. లేకపోతే ఒట్టు!' అంది దుర్గ, వెళ్ళిపోతున్న శేఖరంతో.

దుర్గ తన చీర మాట ఎత్తదేం?—శేఖరం నడుస్తూ ఇదే ఆలోచించాడు. తన బట్టలవిషయం దుర్గ మాట్లాడి, దుర్గ చీరవిషయమై పడిదగ్గ విచారమంతా తనకు వదిలి వేసిం దనిపించింది శేఖరానికి.

ప్రాణాలపైనా కురువ పెట్టే దుర్గకి ఆ చీర కొనాలనుకున్నాడు శేఖరం.

పర్సులో చూస్తే, ఉన్నాయని తనింతవరకూ సంతృప్తిపడుతున్న యాభై రూపాయలు లేవు. నిలువునా నీరైపోయాడు శేఖరం. తన పెట్టె పుస్తకాలు అన్నీ గాలించాడు పిచ్చిగా. లాభం లేకపోయింది. తను తిరిగిన తిరుగుడికి డబ్బు ఎక్కడ పోగొట్టుకున్నాడో తెలుసుకోవటం దుస్సాధ్యం.

శేఖరానికి మతిపోయినట్లయింది. ఎక్కడని వెతకటం ? కాలు గాలిన పిల్లిలాగా ఇల్లంతా తిరిగాడు. పైగా, తను పడుతున్న కలవరం దుర్గకి తెలియరాదు. కొత్త చీర తెచ్చేవరకు కట్టబెట్టాడో తెలీనంతగా దుర్గని ఆశ్చర్యపర్చాలని శేఖరం ఉబలాటం.

శేఖరం కుర్చీలో కూలబడ్డాడు. గదిలో తను కుళ్ళగించని చోటు అంగుళం మేరకూడా లేదు. ఎదురుగా ఉన్న దుర్గ బట్టల పెట్టె పైకి పోయింది శేఖరం దృష్టి. ఆ పెట్టె ఒక్కటే మాత్రం తను వెతకలేదు.

పూర్వం ఎన్నడూ తవా పెట్టె తెరిచి ఎరగడు; అవసరం లేదు కూడాను. పెట్టె తాళం లేకుండానే ఉండేది—తాళం వెయ్యవలసినంత భయం దుర్గకి కాని, తాళంతీసి చూడవలసినంత అనుమానం శేఖరానికి గాదే నివు.

ఇప్పుడా పెట్టె తెరిచి చూడాలనే ఆలోచన రాగానే భయంతో వెన్నులో చిన్న చలి ప్రారంభించింది.

ఇంతలో, గదిలోకి దుర్గ ప్రవేశించింది. శేఖరం దృష్టి మరల్చాడు కళవళపడుతూ. దగ్గరకు వచ్చి నిలబడి చెయ్యి చాచి 'మిమ్మల్ని నమ్మిం దెవరు...ఆ డబ్బిలా ఇచ్చేయండి. నేనూ మీతో బజారు వెడతాము ఆనక' అంది.

'అబ్బే...ఎందుకు......నేనే తెచ్చుకుంటాను' పదే పదే అన్నాడు శేఖరం, ఇవ్వటానికి గాని, తెచ్చుకోవటానికి గాని తన దగ్గిర డబ్బు మాయమైందని లోలోపల విచారిస్తూ.

'సరే, మీ యిష్టం. మీరే తెచ్చుకోండి. పోనీ, తెచ్చుకున్నాకనైనా చూపిస్తారా? లేకపోతే, తొడుక్కున్నాకనైనా చూడక పోను!' అని వెళ్లిపోయింది దుర్గ, అట్టే బలవంతం చెయ్యటం తన కిష్టం లేనట్లు.

దుర్గ చాలా ఉత్సాహంగా ఉంది. తను బట్ట కొనుక్కోదల్చుకోలేదని దుర్గ పసికట్టెయ్యటమే ఈ ఉత్సాహానికి కారణమేమో ననుకున్నాడు. తనమీద ఈ అనుమానంకొద్దీ డబ్బు దుర్గ దాచిఉంటుందనికూడా అనుకున్నాడు శేఖరం.

శేఖరం దృష్టి మళ్ళీ ఒకసారి దుర్గ బట్టలపెట్టెపైకి మళ్లింది. ఎన్నడూ లేనిది ఇవ్వాళ భద్రంగా పెట్టెకు తాళం వేసింది! ఎంత అమాయకంగా పట్టుబడిపోయిందో—అని నవ్వుకున్నాడు శేఖరం. తాళంచెవి ఎక్కడ దాస్తుందో తనకు తెలుసు—టాయ్‌లెట్ బాక్సులో!

పెట్టె తెరిచి మూటిగానే పసికట్టాడు కావలసిన వస్తువెక్కడుంటుందో— పెట్టె ఎడమవైపు అట్టడుగు చీర మడతలో. అనుకోని విధంగా ప్రవర్తించి ఎదటివాళ్ళని మభ్యపెట్టాననే లౌక్యం తెలియని అమాయకురాలు దుర్గ అనుకున్నాడు శేఖరం.

ఏడు పది రూపాయిలనోట్ల జోత్తి!

దుర్గ పెట్టెలో డబ్బు మాయమైన సంగతి గ్రహించేలోపలే తను పోయి చీర కొనుక్కురావా లనుకున్నాడు శేఖరం.

దుర్గ మరింత ఆశ్చర్యపడకమానదు!

శేఖరం హుటాహుటిగా బజారు చేరుకున్నాడు. దారి పొడుగునా తను కొనబోయే చీర సింగారించుకుని వన్నె చిన్నెలతో దుర్గ శేఖరం కళ్ళలో మెదులుతోంది. కుణంసేపట్లో తను చీర ఎలాగూ కొంటాడు. ఆ చీర కట్టుకుని, ఇంతకు పదింతలు మురిసిపోతూ దుర్గ తనముందు ఎలాగూ నిలబడుతుంది.

'ఒరే! బావా!!'- శివుడి రెండోపిలుపు కాని శేఖరం చెవికెక్క లేదు.

శేఖరం తృళ్లిపడ్డాడు.

'ఏమిట్రా అంత పరాకు! ఎక్కడికి ఇంత విసురుగా వెడుతున్నావు'

శివుడి రెండో ప్రశ్నతో శేఖరం పగటి కలలన్నీ పటాపంచలైనై.

'ఇక్కడికే గాని, నువ్వెక్కడికి?' ఎదురు ప్రశ్నించాడు శేఖరం, తనింతవరకూ ఊహాప్రపంచంలో విహరించి పొందిన ఆనందాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ.

శివుడు కూడా ఉత్సాహంగా ఉన్నాడు.

'ఇక్కడికేకద... సరే, ఐతే హోటల్లోకి నడు. నీతో చాలా కథ చెప్పాలి' అన్నాడు శివుడు.

శివుడు గుక్క తిప్పుకోకుండా మట్లాడేస్తున్నాడు. మధ్య మధ్య తను చెప్పబోయే విషయాన్ని తల్చుకుని తనే పగలబడి నవ్వుతూ ఒక వింతైన తన్మయతలో ఉన్నాడు.

శేఖరం విస్తుపోయి వింటున్నాడు. శివుడు చెపుతున్న విషయాలన్నీ తు. చ. తప్పకుండా ఇంతవరకూ తనకు, దుర్గకు మధ్య నడిచినవే!

శేఖరానికి నమ్మశక్యం గాకుండా వుంది—

మళ్ళీ ఒక అనుమాన మొచ్చింది—దుర్గ, సీత, కూడబలుక్కుని ఇద్దరూ ఒకేవిధంగా ఇలా ప్రవర్తిస్తున్నారేమో నని. కాని, ఒక వేళ వాళ్లిలా నాటకం ఆడుతున్నా, శివుడు, తను మాత్రం అనుకోకుండా ఇలా ఒకేవిధంగా ప్రవర్తించటం విచిత్రాతి విచిత్రమైన విషయం అనుకున్నాడు.

'దీన్ని కథ అంటే ఎవరూ నమ్మరు... వాస్తవికమంత ఆశ్చర్యకరంగా ఉంది!' శివుణ్ణి సరిదిద్దాడు శేఖరం, అంతా విని.

నిన్న గాక మొన్నటిదాకా తనతో గిల్లికజ్జా లాడిన సీత అప్పుడే ఎంత జిత్తులమారిగా మారిందో!—అనుకున్నాడు శేఖరం తన చెల్లెల్ని గురించి.

శేఖరాన్ని మరొక సమస్య బాధించిం దిప్పుడు—తనొక చీరకొంటే ఏమి సరిపోతుంది? మరి సీతకో! ఒక చీర పట్టుకెడితే దుర్గ కట్టుకోక పోవచ్చు—సీతకి పెడతానని తప్పకుండా అంటుంది.

తనిప్పుడు రెండుచీరలు ఎలా కొనగలడు? అంతా అయోమయంగా ఉంది శేఖరానికి.

శివుడు వేడివేడి కాఫీ సాసర్లో పోసుకుని ఊదుకుంటూ ఆదరాబాదరా తాగుతున్నాడు. వాడి ఉత్సాహాన్ని బట్టి చూస్తే వాడి దగ్గిర డబ్బు ఉండి ఉంటుందను కున్నాడు శేఖరం.

ఇంతలో శివుడే, 'నీదగ్గరేమైనా డబ్బుంటే సర్దుతావుట్రా బావా! పండగ వెళ్లగానే ఇచ్చేస్తాను.' అన్నాడు. తన మనసులో మాటలు గ్రహించినట్లు. శివుడు ఈ ఎదురు అప్పడిగేసరికి శేఖరం తృళ్లిపడ్డాడు.

తను అప్పు అడిగి పోకుండా వాడు వేసిన ముందరికాళ్ళ బంధం ఇది అనుకున్నాడు శేఖరం. శేఖరం దృష్టి శివుడిలాల్చీ జేబు పైకి మళ్లింది. ఎంత ఎత్తుగా ఉందో—అనుకున్నాడు.

శివుడు ఇంకా సాసర్లో కాఫీ ఊదుకుంటూనే ఉన్నాడు.

అతి నైపుణ్యంతో శివుడి జేబులోకి చెయ్యి పోనిచ్చాడు, శేఖరం. పర్సు బైటికి లాగటం కూడా పూర్తయిందలిప్తపాటులో. చల్లగా బల్లకిందనించి తన లాల్చీ జేబులోకి చేర్చాడు పర్సుని తన హస్తలాఘవాన్ని తనే మెచ్చుకుంటూ.

ఇద్దరూ కుర్చీల్లోనుంచి లేచారు. బిల్లు చెల్లించటానికి శివుడు పర్సు తీయవలసిన అవసరం రాకుండా శేఖరమే చెల్లించాడు.

శివుణ్ణి వదుల్చుకుని తొందరగా అవతల పడాలనుకున్నాడు. శివుడుకూడా శేఖరాన్ని వదిలి హడావిడిగా వెళ్లిపోయాడు.

శివుడు కనుమరుగవగానే శేఖరం పర్సుతీసి చూచాడు. యాభై రూపాయలతో పాటు కొంత చిల్లరకూడా ఉంది!—

పండగ పబ్బం గడుస్తుందిగదా, అని సంతోషించాడు శేఖరం. కాని, తను చాలా దారుణమైన పనిచేశాననుకున్నాడు, మళ్ళీ.

పండగ వెళ్లగానే అప్పు తీర్చినట్లు వాళ్ల యాభైరూపాయలూ శివుడి కిచ్చేదాము లెమ్మనుకుని సంతృప్తి పొందాడు. అయినా ఇప్పుడూ చీర కొనబోతున్నది తన చెల్లెలు సీతకోసమే నాయె! శివుడైనా భార్యకి చీర కొందామనే తెచ్చిఉంటాడు కూడాను.

వాళ్లు డబ్బు పోయిందని నొచ్చుకుంటుండగా తను చీర పెడితే వాళ్ళంతా మరింత ఆశ్చర్యపడుతారను కున్నాడు శేఖరం.

కొట్లోకి వెళ్ళటమే తడవుగా రెండు చీరలు కాగితంలో కట్టించి జేబుల్లోకి చేతులు పోనిచ్చాడు శేఖరం.

తన మనీపర్సు లేదు!

బుఱ్ఱ ఖాళీ అయిపోయినట్లని పించింది.

చివరికి ఒక్క చీరమాత్రమే కొని, బజారంతా పర్సుకోసం మరోకసారి గాలించి ఇల్లుచేరాడు శేఖరం. మరోక చీర కొనదగ్గ డబ్బు తను వృధాగా పోగొట్టానని మనసు కలకించ పడుతోంది. గదిలో ప్రవేశించి చీరను బీరువాలో పెడదామని బీరువా తెరిచాడు—

తను పోయిం దనుకున్న పర్సు అందులో ఉంది!

అనుకున్నంతా చేసితీరిందన్న మాట దుర్గ. కాని ఎలా కొనగలిగిందో—పెట్టెలో డబ్బు తను తీసేశాడాయె. శేఖరాని కేమీ పాలుపోలేదు.

ఏమీ ఎరగనట్టు బీరువాతలుపులు మూసి, తను తెచ్చిన చీర మంచంపైన పడేసి కుర్చీలో పడుకున్నాడు.

దుర్గ చరచరా గదిలో ప్రవేశించింది. 'నేను బట్టలు కొనుక్కోవాలి, డబ్బుంటే ఇమ్మని దొరలాగా అడిగి పుచ్చుకోక వాళ్ళకి పెట్టెలు పగలగొట్టే దొంగ బుద్ధేమిటి?' తన కోపమంతా అభినయంలో చూపించింది.

తనకి బట్టలుకొని, తను చీరే కొనిఉంటాడన్న నమ్మకం కూడా ఉండి దుర్గ ఇలా అలుగుతుంటే శేఖరానికి పెద్దగా నవ్వ బుద్ధయింది.

తను పారేసుకున్నా ననుకుంటున్న యాభైరూపాయల విచారం ఇట్టే మరచిపోయాడు. 'నేను చీర కొనుక్కోవాలి డబ్బుంటే ఇవ్వండని దొరసానిలాగా అడిగి పుచ్చుకోతగ్గ దానికి జేబు దొంగతనాలు చేసేబుద్ధేమిటో!' శేఖరం మళ్లీ వాయనం తప్పచెప్పాడు.

అనవసరంగా తనకి స్వార్థం అంటగడుతున్నట్టు కోపం ముక్కుపైకి తెచ్చుకుంటూ 'అనండి—మీ ఇష్ట మొచ్చినట్లు. నేను చీర కొనుక్కోటానికి డబ్బు దాచుకుంటే ఆ పాపమంతా నాది... మహా నరకాన పడతాను' అంది దుర్గ.

'నేను కూడా అంటేనా?' అన్నాడు శేఖరం.

ఈ ప్రశ్నకి అంటేనని సమాధాన మివ్వటానికి ఎందుకో భయపడింది దుర్గ.

'అంతే నన్నమాట!' రెట్టించాడు శేఖరం.

'ఆ మాట నే నన్నానా?' అంది దుర్గ కళవిళపడుతూ.

దుర్గ అమాయకత్వానికి శేఖరం ఒక్క పెట్టున నవ్వాడు. 'పోనీ, నాకు బట్టలుకొందామనే నువ్వు డబ్బు దాచిఉన్నట్లయితే నీకు పుణ్యముండి, స్వర్గానికి వెడతావన్నమాటేగా?' అన్నాడు శేఖరం.

'ఏమో, నాకు తెలీదు' అంది దుర్గ ముభావంగా.

'ఇది, ఇందాక నువ్వన్నమాటేగా!' అన్నాడు శేఖరం.

తర్కంతో సంభాషణని విపరీతమైనదారులు తొక్కించ గలడు తన భర్త అనుకుంది దుర్గ. 'స్వర్గానికి అక్కర్లేదు. మరెక్కడికీ అక్కర్లేదు ఉన్నట్లుండ నివ్వండి' అంది భర్త తెచ్చిన పొట్లం విప్పుతూ.

తన చీర!—

'ఇదా రహస్యం!—మీరు స్వర్గానికి టిక్కెట్టు తెచ్చుకున్నారేం!—అప్పుడు కూడా మాబోటి పాపుల్ని కనికరించండి' అంది సానునయంగా.

'అంత విచారం అనవసరం...సహగమనం చేదాం—నీ టిక్కెట్టు కూడా బైటికి తియ్యి—బీరువాలో ఉంచి మరిచి పోయినట్టున్నావ్.'

బీరువా తెరిచి తన సూటుతీసి మంచంపైన పడేశాడు.

ఇద్దరూ మాటా పలుకూ లేకండా క్షణంపాటు గడిపారు. దుర్గ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తోంది.

'ఏమిటి ఆలోచిస్తున్నావ్?' అన్నాడు శేఖరం.

'పండుగపూట చాలా సంతోషంగా ఉందికదూ?' మెల్లగా అంది దుర్గ శేఖరం కళ్ళలోకి చూస్తూ.

దుర్గ పెదవులుకావు, హృదయం అంటోంది ఈ మాటలు అనుకున్నాడు శేఖరం.

'నీకు మాత్రం అనిపించటంలేదూ?' అన్నాడు సానునయంగా.

'ఔను, అనిపిస్తోంది' అంది దుర్గ తలవంచి.

దుర్గ మళ్లీ మౌనముద్ర పట్టింది. దుర్గ ఇంకా అలా మాట్లాడితే బాగుండు ననుకున్నాడు శేఖరం.

'ఏమిటాలోచిస్తున్నావు? మాట్లాడు దుర్గా!' అన్నాడు దుర్గ తలపైకెత్తి కళ్ళలోకి చూస్తూ.

దుర్గని ఎక్కడలేని సిగ్గూ ఆవహించింది. ఇంతకుపూర్వం తను ఆవేశంలో ఏమేమో మాట్లాడేశానని, అది ఆవేశమన్న విషయం భర్తకు తెలిసిపోయిందనీ లజ్జపడ్డది.

'సీతావాళ్ళు ఏం చేస్తున్నారో! తను కూడా చీర కొనుక్కుందేమో?' అంది విషయం మార్చి.

'కొనుక్కునే ఉంటుంది. ఇందాక మీ తమ్ముడు బజార్లో కనిపించాడు చీర కొనటానికివచ్చి' అన్నాడు శేఖరం.

శివుడి జేబులో డబ్బు తను కాజేస్తే, వాడు సీతకి చీ రెలా కొనిఉంటాడని శేఖరాన్ని అంతరాత్మ చెంపదెబ్బ కొట్టింది. ఇంతేకింత, వాళ్ళని సంతోష పెట్టబోయి, వాళ్ళ సంతోషాన్ని తను పూర్తిగా పాడుచేశానని బాధపడ్డాడు శేఖరం.

'వాళ్లు కూడా బట్టలు కొనుక్కొని ఉంటే కొనుక్కొని ఉంటారు. ఇద్దరూ మన తోబుట్టినవాళ్లు. వాళ్లకి పండక్కి మనం బట్టలు పెట్టి సంతోష పెట్టాలికదూ?'

ప్రశ్నలోనే తను చెప్పవలసిన సమాధానమేదో ఇమిడ్చి దుర్గ ఇలా అనేసరికి, 'ఔను. పెట్టవలసిందే.' అనటం తప్పితే మరేమీ చేయలేకపోయాడు శేఖరం.

వాళ్లు బట్టలు కొనుక్కున్నారన్నా తను బట్టలు పెట్టి వాళ్ళని సంతోష పెట్టా లనుకుంటున్న దుర్గకీ, వాళ్లు బట్టలు కొనుక్కోగల అవకాశం చెడగొట్టి కేవలం సమాధానంగా మాత్రం—బట్టలు పెడదాము—అంటున్న తనకీ మధ్యనున్న అంతరువు గ్రహించి కలవరపడ్డాడు శేఖరం.

శివుడి జేబులో పర్సు కొట్టేసి, తను మంచి ఉద్దేశించి అనుకోకుండా వాళ్ళకి చెరుపు ఎలాచేశాడో దుర్గముందు వెళ్లబోశాడు శేఖరం.

'సాధారణంగానే, మనం వాళ్లని సంతోష పెట్టాలి. అలాటిది, ఇంత జరిగినప్పుడు తప్పకుండా ఈ బట్టలు వాళ్ళకే పెట్టాలి.'

ఈ విషయంలో తుదినిర్ణయమిచ్చే అధికారం తనకు వదల లేదు దుర్గ అనుకున్నాడు శేఖరం.

ఈ తర్జనభర్జనలో...సీత, శివుడు గదిలో ప్రవేశించి ఎదట నిలబడ్డ క్షణానికి కాని ఇద్దరూ గమనించలేదు.

'వెయ్యేళ్లాయుస్సట్టా! ఇప్పుడే మీమాట అనుకుంటున్నాం' అన్నాడు శేఖరం.

దుర్గ బట్టలు తెచ్చి టీపాయ్‌మీద పెట్టి, 'ఇవ్వి పట్టుకొద్దామని ఇప్పుడే అనుకుంటున్నాం' అంది నవ్వుతూ.

'సరిపోయింది! మీరు పట్టుకొద్దా మనుకుంటున్నారు; మేము

కట్టుకురానే వచ్చాం!' అన్నాడు శివుడు చేతులో పొట్లం వాటి ప్రక్కన పెడుతూ.

శివుడి మాటల నందుకుని సీత కళ్లు పెద్దవిచేసి ఎర్రేవాగా 'ఎలాగైతేనేం, తెచ్చావురా అన్నయ్యా! ఇంతలావు బహుమతి... నీ డబ్బెట్టి!' అని దుర్గతో, 'చూడు వదినా! మీ తమ్ముడి బుద్ధి మంతనం...జేబు దొంగతనాలు మొదలెట్టారు!' అంటూ చేతిలో పర్సు ముందుంచింది.

శేఖరం మనీపర్సు!

'వాణ్ణే అనవలసిన పనిలేదు. మీ అన్నయ్య బుద్ధిమంతనం కూడా అంతంత మాత్రంగానే వుంది. చూపిస్తా నుండు...' అంది దుర్గ సీతని మించి అభినయిస్తూ.

'ఐతే, నా పర్సు నువ్వు కాజేశావుట్రా!' అన్నాడు శేఖరం తబ్బిబ్బౌతూ.

'ఏం? నా పర్సు నువ్వు కాజెయ్యలా!' తప్పకెప్పాడు శివుడు.

'ఇంతకీ నా పర్సు నువ్వు కాజేశావని నీ పర్సు నేను కాజేశానా, లేక, నీ పర్సు నేను కాజేశానని నా పర్సు నువ్వు కాజేశావా?' అన్నాడు శేఖరం తెప్పరిల్లుతూ.

'ఎలా అయితేనేం. ఇద్దరి పర్సులూ ఇద్దరమూ కాజేశాం' మొన్న చెప్పింది సశేషం. ఇప్పుడు ముగిస్తా విను......'

శివుడు ఖులాసాగా ఉపక్రమించాడు—నలుగురూ కబుర్లలో పడ్డారు.

ఇక్కడ జరిగిన విషయాలన్నీ శివుడు దివ్యదృష్టిలో చూచి అవే తిరిగి తనకు చెపుతున్నాడేమో ననుకున్నాడు శేఖరం.

అక్కడిక్కడి సంఘటనలకి గల సామ్యం గ్రహించి నలుగురూ విస్తుపోయారు.

'ఇంతకీ, అబ్బాయిలు పండగంతా దొంగతనాలతో గడిపారు!' అంది సీత నవ్వుతూ.

'మీరో!' ఒకళ్ళని మించిన ఆత్రంతో ఒకళ్లు అన్నారు శివుడు, శేఖరం.

'మేము బహుమతు లిచ్చుకోవాలని దాచుకున్న డబ్బు మీరెలాగో కాజెయ్యకపోరనే మేము దొంగతనాలు చేశాం. మే మనుకున్నట్లుగానే మీరు పెట్టెలు పగలగొట్టారు. చివరికి, మీలో మీరే దొంగతనాలు చేసుకున్నారు!' అంది సీత.

నిన్నమొన్నటి సీత ఎంత సునిశితంగా మాట్లాడేస్తోందో— అనుకున్నాడు శేఖరం.

'మేము దొంగలమే! ఒప్పుకుంటున్నాం......దండించవచ్చు!', అన్నాడు శేఖరం ముద్దాయిలాగా.

'ఐతే, మేమూ ఒప్పుకుంటున్నాం—మేము తోడుదొంగలమనీ, దండించబోమనీ!...'

నలుగురూ గలగలా నవ్వుతున్నారు.

—మమ్మల్ని పూర్తిగా మరిచిపోయారు.

ఔను. వ్యక్తిత్వాల కోసమై మేము వెలిబుచ్చే ఆవేదన వాళ్ల నవ్వుల గలగలలో కరిగిపోకుండా ఎలా ఉండగలదు?

ఈ సంతోష సమయంలోనే రవ్వంత మమ్మల్ని కథకెక్కించమని శేఖరాన్ని చేసుకుంటే ఒప్పుకోక పోడేమోనని పించింది నాకు. విపరీత మేమిటంటే—బావకూడా తన విషయం, మా విషయం పూర్తిగా మరిచిపోయి నట్లున్నాడు. వాళ్ల సంతోషంలో లీనమై అదేపనిగా నవ్వుతున్నాడు.

'వదినా! మన కథ శేఖరాన్ని వ్రాయమని అడగమను అన్నయ్యని...'

అక్కకూడా చాలా కోపంగా ఉంది. 'బావకూడా మన్ని మరిచిపోతున్నాడు. తనకెందుకింత సంతోషం' [illegible] పొడిచింది.

ఇక నేను ఉండపట్టలేక పోయాను. 'బావా! మనకి పాత్రలగౌరవం ఇప్పించమని శేఖరాన్ని అడగరా!' అన్నాను.

బావ నామాటలు ఖాతరు చేసినట్లు లేదు.

వాళ్లు నలుగురూ ఏదో పరిహాస మాడుకుని పగలబడి నవ్వారు.

బావకూడా వాళ్ళనుమించి నవ్వుతున్నాడు.

'బావా!' అరిచాను కోపమంతా కంఠంలోకి తెచ్చుకుని.

'ఉండరా!' అన్నాడు బావ చికాకుగా.

'మనమున్న పరిస్థితులు తెలిసుండికూడా అంత నవ్వెలా వస్తోందిరా నీకు?' అన్నాను.

'నవ్వెలా రావటమేమిటిరా! ప్రాణం ఉక్కిరి బిక్కిరౌతోంది—చూడరా! ఇదంతా నేను కథ వ్రాద్దామనుకున్నాను. కాని, ఇదంతా వీళ్ళ జీవితంలో నిజంగానే జరిగిపోతోంది! నమ్మశక్యం గాకుండా ఉంది!' వెల్లువలాటి మరొక నవ్వు నవ్వాడు బావ, వాళ్ళతోపాటు.

శేఖరం—దుర్గ, శివుడు—సీత... వీళ్ళ నలుగురి జీవితాలు కట్టుకథలంత ఆశ్చర్య జనకంగా, స్వప్నాలంత మనోహరంగా గడిచిపోతున్నాయన్న మాట!

మాస్థితి తల్చుకుని విచారించకుండా ఉండలేకపోయాను.

నిజంరా బావా! ఇదంతా నేను కథ వ్రాద్దామనుకున్నాను. కాని, ఆ కథే వాస్తవమై కూర్చుంది. పోనీలే, నేను కథ వ్రాయలేక పోయానన్న విచారం లేదు నాకిప్పుడు' అన్నాడు బావ.

'ఏం?' అన్నాను బావ పడుతున్న సంతృప్తికి ఆశ్చర్య పడుతూ.

'నేను కథ వ్రాయాలనుకున్నదంతా యదార్థమై కూర్చుంది! కట్టుకథ లక్షణాలు దానికి నశించినై!' అన్నాడు, ఈ మాటలన్నా కాస్సేపూకూడ వాళ్ళతో కలిసి ఆనందించనీయకుండా నేను అడ్డు ప్రశ్నలు వేసినందుకు చికాకుపడుతూ.

'ఇలా సమాధానం చెప్పుకుని, నీ కథలు వ్రాయలేని తనాన్ని కప్పి పుచ్చుకోవాలని చూస్తున్నావు' అన్నాను.

'అలా అనుకోవటంలో నీకు సంతృప్తి ఉంటే, సరే, అలాగే అనుకో. నాకేమీ అభ్యంతరం లేదు' అన్నాడు బావ, నీతో వాదించటానికి నాకు తీరిక లేదన్నట్లు.

'చాలించండి. వాదనలతో నిజమెప్పుడూ బైటపడదు! నిజం చెప్పు బావా!—ఒకవేళ నువ్విప్పుడు కథ వ్రాయాలనుకుంటే వ్రాయగలవా?' సూటిగా ప్రశ్నించింది అక్క.

బావ మౌనం వహించాడు.

'తెలిసింది. వదినా! అన్నయ్య కథ వ్రాయాలనుకున్నా వ్రాయలేడు. పైగా, అన్నయ్య కథ వ్రాయకపోయినా ఇప్పుడు వాళ్ళకు చింతలేదు!'

'కాని, మనకుందిగా—చింత! మన మెవరమిప్పుడు? వ్యక్తిత్వం లేకపోయినా, కథలో పాత్రలమన్నా గాదో!'

అక్క ఈ మాటలు అనేసరికి మేమంతా ఏదో అగాథంలో పడ్డట్లు, ప్రపంచానికి ఇంకా దూరమై పోతున్నట్లు—అనిపించింది.

వాళ్ళతో పాటు బావ మరోకసారి పెద్దగా నవ్వాడు—ఇది మరీ దుస్సహంగా ఉంది.

'బావా! నువ్వు కథలు వ్రాయవలసిన అవసరం, నీ కథలు వ్రాయలేనితనంతో పాటు తీరితే తీరిఉండవచ్చునుగాని, మనం కథలో పాత్రలుగానైనా ఉండవలసిన అవసరం ఉంది మన కిప్పుడు. ఈ సంతోషసమయంలో నువ్వు శేఖరానికి మన కథ వ్రాయమని చెప్పు వింటాడు. నువ్వు చెప్పక తప్పదు' అన్నాను ఒక్క పెట్టున.

బావ మాట్లాడలేదు—నా మాటలు కొంతవరకు పట్టించుకున్నా డనుకున్నాను.

మేమంతా కూడా పదేపదే అడిగాం.

'సరే, అడుగుతాను' అన్నాడు చివరికి.

ఈ మాటలకే, శేఖరం మా కథ వ్రాస్తా నన్నంత సంతృప్తి పొందాం.

పండగపూట కొత్తబట్టలతో...ఆత్మసంతృప్తితో వాళ్ళ సంతోషం చెప్పశక్యం గాకుండా ఉంది.

'శేఖరం!' బావ పిలిచాడు ఎట్టకేలకు!

'ఊఁ...'

'ఈ సంతోషంలో ఎలాగో వీలుచూసుకుని మాకు కూడా పాత్రల గౌరవమిస్తావన్న ఆత్మసంతృప్తి రవ్వంత మా కివ్వరా!' బావ వేడుకుంటున్నాడు.

'శ్రీపుడూ! మీ బావకి చెప్పవా?'

దుర్గా! నువ్వు చెప్పుదూ...'

'సీతా! నువ్వు కూడా చెప్పవా?'

—మేమంతా కూడా అడిగాం ఒక్క పెట్టున.

వాళ్ళ తరహా చాలా సానుభూతి సూచకంగా ఉంది.

'తప్పకుండా అలాగే ప్రయత్నిస్తాను—ఆత్మసంతృప్తి నివ్వటానికి' అన్నాడు శేఖరం అభయమిస్తున్నట్లు.

—మేము నలుగురం ఆత్మసంతృప్తి పొందినంత ఆత్మసంతృప్తి పొందాం ఈ మాటలకి.

'ఇప్పుడు మీరు సంతోషంగా లేరా?' అన్నాడు శేఖరం.

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటం కష్టమనిపించింది.

ఆత్మవంచనలతో బ్రతుకు భారమై, ఆత్మహత్య అనంతానికి మార్గమనుకుని, చనిపోయి సుఖమనుభవిస్తున్నామని మనఃపూర్వకంగా ఇంతవరకు నమ్మిన మేము సంతోషంగా లేమని ఎలా చెప్పటం?

'సంతోషంగానే ఉన్నాం' అన్నాడు బావ.

'ఐతే, మాతో పాటు నవ్వండి' అన్నాడు శేఖరం.

వాళ్ళ నలుగురితో పాటు మేమూ నవ్వాం—వాళ్లనిమించి మేము, మమ్మల్నిమించి వాళ్లు, దిక్కులు పిక్కటిల్లేటట్లు—ధ్వనులు, ప్రతిధ్వనులవలె.

నిజంగా, మేము చాలా సంతోషంగా ఉన్నాం. ఆనందించటంలో ఉన్న ఆనందం అప్పుడే అర్థమౌతోం దనిపించింది.

కాని ఎందుకీ నవ్వు? అనిపించింది మళ్లీ—

వాళ్లు నలుగురూ విశాలప్రపంచంలో భాగస్వాములై, అనుభవించి ఆనందిస్తున్నారు. కాని, మేమో! ఏదో అఖాతానికి బైట ఉండి వాళ్లు నవ్వుతుంటే, మేము అఖాతంలో ఉండి వాళ్ళతో పాటు నవ్వుతున్నట్లనిపించింది.

'నామరూపాలు రెండూ లేని మేము నవ్వితే సార్థకమేమిటి?' అన్నాను: నా గొంతు అఖాతంలోనుంచి వినబడుతున్నట్లుగానే ఉంది.

శేఖరం చాలా క్లిష్టమైన విషయాన్ని వివరించదల్చుకున్నట్లు ముఖం పెట్టాడు—'ఒక్క విషయం—నువ్వు జీవించిఉన్నానని ఒప్పుకుంటావా, లేదా?'

మా విషయమల్లా, వేదాంతగోష్ఠిగా మారుతోం దనుకున్నాను. సమాధానం చెప్పటం ఇష్టంలేక మెదలకుండా ఊరుకున్నాను.

శేఖరం మళ్లీ ప్రారంభించాడు: 'ఉన్నానని ఒప్పుకోవాలి. లేకపోతే ఆత్మవంచన అవుతుంది—నీకు సంబంధించిన నిజాన్ని నీనుంచి కప్పిపుచ్చుకోవాలనుకోవటమే ఆత్మవంచన. వంచింపబడ్డ ఆత్మ పగ సాధించి తీరుతుంది. అదే ఆత్మహత్య'

ఈ మాటలు చాలా భయంకరంగా వినిపించినై.

ఇంతకూ నేనున్నానా, లేనా? అన్నాను నసిగా.

'తప్పకుండా ఉన్నావు. హత్యచేసి వంచననుంచి తప్పించుకున్నావు. నువ్వుండగా నీపైన కథేమిటి? నువ్వు యదార్థం. యదార్థ విషయాలెప్పుడూ కథలు గావు. సంతోషంగా కాలం వెళ్లబుచ్చక, కథలేమిటి? హాయిగా నవ్వు మాతో పాటు. మీరంతా కూడా...'

ఒక్క గుక్కలో వినిదంతా అర్థం చేసుకోలేక పోతున్నాను.

వాళ్లు నలుగురూ పకపక లాడుతున్నారు.

ఎప్పుడు మొదలైట్టామో మేమూ నవ్వుతున్నాం మరింతగా. ఇంతకు మరింతగా వాళ్లు నవ్వుతున్నారు.

నాలుగురెళ్లు ఎనిమిది గొంతులు నవ్వుతున్నై, దిక్కులు బ్రద్దలయ్యేటట్లు. ఇందులో ధ్వని లేదో; ప్రతిధ్వని లేదో!

—ఇక్కడ మేమంతా కులాసా.

ఈ సమాచారం తెలియజెయ్యటానికే వీలు గాకుండా ఉంది.

శేఖరం వ్రాయడు—

బావ వ్రాయలేడు—

---

# రెండు ఆధునిక సామ్రాజ్యాలు

## విధాన, తారతమ్య పరిశీలన

★

శ్రీ సీతంరాజు సుబ్రహ్మణ్యశర్మ

[యుద్ధకాలపు స్వప్నపు 'ఏకప్రపంచం', ఈ విధంగా రెండుకూటములుగా చీలిపోయి, అంత కంతకూ దూరమైపోయి, ఒక కూటమిలోని ప్రజలు, రెండవకూటమిలోని రాజ్యాలు ప్రజలు, ఇంకొక గోళంలో వున్నట్లుగా భావించవలసివస్తున్నది. ఇతర గోళములవలెగాక, ఈ రెండుగోళములు పరస్పర వైరుధ్యంతో వ్యవహరించు చుండుటచే, ఈ రెంటికీ మధ్య సంఘర్షణ ఎప్పటికప్పుడు అనివార్యముగానే కనిపించుచున్నది. ఈసంఘర్షణ జరుగునా, జరిగినచో ఎవరు విజయమందెదరు, సంఘర్షణ జరగనిచో, భవిష్యత్తులో ఈ రెండుగోళముల ప్రజలు తిరిగి, మానవ మాత్రులవలె సన్నిహితులయ్యెదరా, అది ఏవిధముగా పొసగును, లేనిచో ఈ రెండుమానవ కోటులమధ్య సంబంధములు ఏవిధముగా రూపొందును, ప్రపంచ ముయొక్కయు, పారిశ్రామికనాగరికత యొక్కయు భవిష్యత్తు ఏమిటి, అసలు ప్రపంచమునకు పాశ్చాత్య పారిశ్రామిక నాగరికత సరిపడినదేనా—ఇటువంటి ముఖ్యప్రశ్నలు ఎన్నియో ఉత్పన్నమగుచున్నవి.]

ద్వితీయ ప్రపంచసంగ్రామ కాలమున, ఏక, ఐక్య ప్రపంచ స్థాపనే మిత్రరాజ్యముల లక్ష్యముగ నుండెను. ఫాసిస్టు శక్తుల నిర్మూలన మొనర్చినపిదప, ప్రపంచ మానవ కోటికి మహాదభ్యుదయము లభింపజేయుటకు అనువుగ 'చతుఃస్వాతంత్ర్య'ములను, మిత్రరాజ్య అగ్రనాయకులు నిర్వచించి, ప్రచార మొనర్చిరి. ఈ లక్ష్యముల సాధనకుగాను ఐకరాజ్యసమితి, దాని ఉపాంగములు ఏర్పరుచబడినవి. యుద్ధము సమాప్తమై ఆరు సంవత్సరములు గతించినవి; ప్రపంచమున శాంతి నామ మాత్రావశిష్టమగుచున్నది; ప్రపంచము 'యుద్ధభయ'మున విహ్వలముగ నున్నది. యుద్ధకాలమున ఆశించిన ఏక, ఐక్య ప్రపంచమునకు బదులు, నిరాశావాదులుకూడ ఊహింపలేనంత విస్పష్టముగ, ద్వేష పూరితములగు రెండుకూటములుగ నిర్భేద్యమగు 'ఉక్కుతెర' మూలమున ప్రపంచము నిర్విభజితమై పోయినది. చరిత్రలో ఇదివర కెన్నడును ప్రపంచము ఇంత విస్పష్టముగ, రెండుకూటములుగ, యుద్ధకాలమునగాని, శాంతికాలమునగాని, చీలియుండలేదు.

ద్వితీయప్రపంచ సంగ్రామము యూరప్ రాజ్యముల మనుష్యసంపదను, వస్తుసంపదను ఊడిచి పెట్టినది. యుద్ధజ్వాలలచే ఆవరింపబడక, సమస్తవస్తు సంపదలయందు సమృద్ధిమై, పారిశ్రామికముగ ముందంజవేసిన యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా యున్నూ, ప్రపంచమందన్ని రాజ్యములకన్న ఎక్కుడుభూభాగమును, వస్తుసంపదను గల్గియుండి, లక్ష్యసాధనకు ఎటువంటి త్యాగమునకైన చేయుటకు వెనుదీయని సోవియట్ రష్యారాజ్య మున్నూ కాలూని నిలువగలిగినవి. పారిశ్రామికసంపద, వస్తు సంపద, మనుష్యసంపద—ఇవే నేటి ప్రపంచమున రాజకీయ నాయకత్వమును నిర్ణయించు కొలబద్దలు. యుద్ధకాలమున అగ్రరాజ్యములు సామరస్యముతో వ్యవహరించినవిగాని ఆ సామరస్యము తాత్కాలికముగనే ఇరుపక్షములు భావించెను. అనేక సమస్యలపై ఎప్పటికప్పుడు అభిప్రాయభేదము లుండినను, యుద్ధపుటొత్తిడి మూలమున దాని నేదో ఒక విధముగ, పరిష్కరించుకొనుచు, శత్రువును జయించువరకు తమ అభిప్రాయ భేదములను సర్దుకొను చుండిరి. జర్మనీ పతనానంతరము జర్మన్ భూభాగమును ఆక్రమించుటయందునూ, జపాను ఓటమి యనంతరము కొరియా, సాఖలిన్, కిర్యూ మొదలగు భూభాగముల ఆక్రమణయందునూ, ఐక్య రాజ్యసమితి సంస్థ నేర్పాటుచేయుటయందునూ అగ్రరాజ్యముల సామరస్యము తాత్కాలికమని గోచరమైనది.

యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యాలుమాత్రమే బలవత్తర రాజ్యములనియూ, వాని మధ్య సామరస్యము ఎన్నటికి ఏర్పడ దనియు యుద్ధానంతరమునకే విశదమైనది. 'ఒకే దేశమున కమ్యూనిజం' నిలద్రొక్కుకొనగలదని నిరూపించుట స్టాలినిజం ముఖ్యోద్దేశ్యమైనప్పటికి, కమ్యూనిజం అంతర్జాతీయవ్యాప్తిని రష్యాపాలకులు విస్మరింపలేదు. ఇతర మిత్రరాజ్యములను అనునయించుటకు 'కొమింటర్న్'ను రద్దుజేసినను, రష్యాకు విస్తరణాభిలాష లేదని ఎవ్వరూ భావించలేదు; సామ్రాజ్యవాద కేపిటలిస్టు రాజ్యముల సరసన సోవియట్ ప్రజాస్వామ్యరాజ్యము చిరకాలము వర్ధిల్ల గల్గుట అసంభవము. వీనిరెంటిలో ఏదో ఒకటి చివరకు జయించి తీరవలెను. ఆ జయము లభించుటకు పూర్వము సామ్రాజ్యవాద రాజ్యములకు, సోవియట్ రాజ్యమునకు తీవ్రసంఘర్షణలు జరు

నుట తథ్యము" అని లెనిన్ 1919 లో బోధించిన సూత్రమే సోవియట్ రష్యాపాలకులు ఈనాటికిని అనుసరించుచున్నారు.

జర్మన్ సైన్యములు వెనుకంజవేసిన తోలది లాట్వియా, లిథూనియా మొదలగు బాల్టిక్ రాజ్యములనూ, రుమేనియా, హంగరీ, పోలెండ్, యుగోస్లేవియా, చెకోస్లవేకియా మొదలగు తూర్పు యూరప్ రాజ్యాలనూ రష్యన్ సైనికులు ఆక్రమించిరి; రష్యన్ సైన్యమాక్రమించిన ప్రతిరాజ్యమునందును అప్పటికప్పుడే బలిష్ఠములగు కమ్యూనిస్టుపార్టీలు ఏర్పడి, పరిపాలనా యంత్రమును వశీమొనర్చుకొన్నవి

ద్వితీయప్రపంచ సంగ్రామముతో ప్రపంచములోని పాలిత రాజ్యముల ప్రజల మనః ప్రవృత్తి సంపూర్ణముగ మారిపోయినది. శతాబ్దముల తరబడిగా తమ్ము పాలించుచూ, దుర్భేద్యములని తాము భావించుచుండిన పాలకవర్గము కూలిపోవుటను వారు తిలకించిరి. దానితో ఆరాజ్యములందు వారికి గల గౌరవప్రపత్తులు, వాని సుస్థిరతయందుగల విశ్వాసము సడలిపోయి, వారిలో ఒక వినూత్న స్వాతంత్ర్యాభిలాష జనించెను. ఆసియా, ఆఫ్రికాల యందన్ని దేశములందును ప్రస్ఫుటమైన ఈ నూతన పరిణామము వలన యుద్ధానంతరము ప్రపంచపరిస్థితులు యుద్ధాపూర్వపు యథాతథపు స్థితికి వచ్చుటకు అవకాశము లేకపోయినది; అంతే గాక, అట్లు యుద్ధాపూర్వపు స్థితికి వచ్చుటకు ప్రయత్నించెడి వారిని పాలిత ప్రజాశత్రువులుగా నిరూపించుటకు అవకాశమేర్పడినది. యుద్ధానంతరపు అంతర్జాతీయ రాజకీయములను అవగాహన చేసికొనుటకు ఈ సత్యము గమనార్హము.

యునైటెడ్ స్టేట్స్, సోవియట్‌రష్యాల విభేదములకు పరస్పర ద్వేషముకన్న పరస్పరభయము, అనుమానము ముఖ్యకారణమని చెప్పవలెను. ఈరెండురాజ్యములును, రాజ్యాంగవ్యవహారనిర్వహణకు సంబంధించిన అన్ని విషయములందును పరస్పరవిరుద్ధ విధానములనే అవలంబించెననుట సునిదితము. అందువలననే రెండుకూటములకు అవి నాయకత్వము వహించుట సంభవించినది. కాని యుద్ధకాలమున మాత్రము, వాని పరస్పరవిరుద్ధవిధానములు తాత్కాలికసామరస్యమునకు మాత్రము అడ్డురాలేదు; అప్పుడు శత్రువును జయించుట ఒక్కటే లక్ష్యముగా నుండెను. జయము కనుచూపుమేరలో కనిపించినంతనే, పరస్పరవైరుధ్యము జాగృతికి వచ్చి, ఒకరిని మించి మరొకరు బలవత్తరము కావలెనను అభిలాషతో, ఎవరికి వారు తమ తమ విధానములనే అనుసరింపజొచ్చి, తాము కేవలము స్వీయరక్షణార్థము మాత్రమే పాటుపడుచుంటిమని, ఎదిటి పక్షము వారు దురాక్రమణ కొరకు ప్రయత్నించుచుండిరని, భావించి, ప్రచారము చేయజొచ్చిరి. ఎదుటివారు తమ నేదో చేయ ప్రయత్నించుచున్నారను అనుమానము, భయము ఇరుపక్షములను ఆవహించి, వారి మధ్యగల తాత్కాలిక సామరస్యమును తుడిచివైచెను. యుద్ధానంతరపు అంతర్జాతీయ రాజకీయములందలి ముఖ్య సంఘటలన్నియు, కమ్యూనిస్టురాజ్యకూటమి, పశ్చిమరాజ్యకూటమి, ఒకరిపై నొకరు వైచుకొనిన ఎత్తులు, పై ఎత్తులుమాత్రమేననియు, కేవలము భయము, అనుమానమువల్లనే ఈకూటములమధ్య అగాధము ఏర్పడి, దినదినము విస్తారమగుచున్నదనియు కొంచెము నిదానముగ పరిశీలించిన విశదమగును.

కమ్యూనిస్టు రాజ్యకూటమికి సోవియట్ రష్యా నాయకత్వము స్వాభావికము, వాస్తవమునకు, ఇప్పుడు కమ్యూనిస్టు రాజ్యములుగానున్న తూర్పు యూరపియన్ రాజ్యములు—ఒక్క యుగోస్లోవియాతప్ప—సోవియట్ సైనిక ఆక్రమణ క్రిందకు రాబట్టియే కమ్యూనిస్టు రాజ్యములైనవని చెప్పవలెను. కమ్యూనిస్టు కూటమినుండి చీలిపోయిన యుగోస్లేవియా తప్ప తక్కిన కమ్యూనిస్టు రాజ్యముల పాలకులందరు తమ పదవులకు రష్యాపై ఆధారపడినవారే; ఈ రాజ్యములు మిక్కిలి చిన్నవగుటవలననూ, యుద్ధమువలన వాని పారిశ్రామిక, వ్యవసాయిక శక్తులు నశించి పోవుటవలననూ ఈ రాజ్యములు సర్వవిధముల సోవియట్ రష్యాపైననే ఆధారపడవలసియున్నది; ఈ రాజ్యములపాలనా యంత్రమును సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ఏ విధముగా అజమాయిషీ చేసి, అదుపులో నుంచుకొనునో ముందు ముందు పరిశీలింతము.

సోవియట్ రష్యాసైన్యముల ఆక్రమణ క్రిందకు రాని యూరపియన్ రాజ్యములన్నియు పశ్చిమరాజ్యకూటమి అని చెప్పవచ్చును; ఈ కూటమి కమ్యూనిస్టురాజ్యకూటమివలె సుసంఘటితమైనది కాదు. దీని నాయకత్వము యునైటెడ్ స్టేట్స్‌కు లభించినది. ఈ నాయకత్వము కమ్యూనిస్టు కూటమికిరష్యానాయకత్వపుటంత స్వాభావికమైనది గాని, కట్టుదిట్టమైనది గాని, ఆమోదము బడసినది గాని గాక, విధాననిర్వహణ అడుగడుగునా కష్టతరమై యున్నది. యుద్ధకాలమున దాదాపు పశ్చిమరాజ్యములన్నియు జర్మనీ ఆక్రమణలో నుండుటవలన, అవి యుద్ధరంగములై వ్యవసాయ క్షేత్రములు, పారిశ్రామిక కేంద్రములు నాశనములైపోయి, ఆర్థిక వ్యవస్థ వికలమైపోయెను. జర్మన్ సేనలు ఉపసంహరింపబడగానే అమెరికన్, బ్రిటిష్ సైన్యములు ఈ దేశములను ఆక్రమించి, ప్రజలకు ఆహారము, వస్త్రములు సరఫరాచేసి పోషింపవలసివచ్చెను. ఆయా దేశములలో వెంటనే జాతీయ ప్రభుత్వములు ఏర్పడినను, అవి ఆర్థికముగను, నైతికముగను, రాజకీయముగాను, సైనికముగాను అమెరికన్, బ్రిటిష్‌పాలకులపైననే ఆధారపడవలసివచ్చెను. ఈ దేశముల ప్రజలకు వెనువెంటనే అవసరమైన ఆర్థిక సహాయమునందజేయుటకు మిత్రరాజ్యములు UNRRA ప్రపంచ పునరుద్ధరణసంస్థను ఏర్పాటుచేసినవి; ఈసంస్థకు ఆర్థికముగా, ముఖ్యముగా, యునైటెడ్‌స్టేట్స్, తదితర అమెరికన్ రాజ్యములే సహాయముచేయవలసివచ్చెను. బ్రిటన్ కేవలము యుద్ధరంగము గాకపోయినను, జర్మన్ విమానదాడులవలన బాగుగా నష్టపడుటవలననూ, యుద్ధావసరములకే బ్రిటిష్‌నిధులు చాల ఎక్కువ ఉపయోగింపబడుటవలననూ ఈసంస్థకు బ్రిటన్ ఎక్కువగా సహాయము చేయునవకాశము లేక, నాయకత్వము, బాధ్యత యునైటెడ్ స్టేట్స్‌పై బడెను. ఈ పునరుద్ధరణ కార్యక్రమము పూర్తియై, పశ్చిమరాజ్యములు తమ కాళ్ళపై తాము నిలబడగలవను సమయము రాకమునుపే రెండు విషయములు ద్యోతకములయ్యెను. ఒకటి: సోవియట్ రష్యాతో తదితర మిత్రరాజ్యములకు కుదిరిన తాత్కా

లిక సామరస్యము దిన దినము క్షీణించి, అభిప్రాయభేదములు తీవ్రమై, యుద్ధకాలమున మిత్రరాజ్యములుగానుండిన రాజ్యములు రెండుకూటములుగా విడిపోయి, దినదినము దూరస్థమైపోవుచుండుట; రెండు: పశ్చిమ యూరప్ రాజ్యముల పారిశ్రామిక, వ్యావసాయికసంపద యుద్ధపూర్వపు ఉత్పత్తిస్థాయికి వచ్చుటకు, వానిని పునర్నిర్మించుటకు ఆయా దేశములకు ఎక్కువగ ఆర్థిక సహాయము కావలెను. ఈ సహాయములభింపనిచో ఆ రాజ్యముల ప్రజలకు పునరావాసములభింపక, దేశమున అలజడి, అల్లకల్లోలము వ్యాపించి, విప్లవము సంభవించి, తద్వారా కమ్యూనిజం వ్యాప్తి చెందవచ్చును. కాబట్టి కమ్యూనిజం వ్యాప్తి నరికట్టుటకు ఈ సహాయము అందజేసి తీరవలయును; పశ్చిమరాజ్యములలో ఈసహాయముచేయగల స్థితిలోనున్నది ఒక్క యునైటెడ్ స్టేట్స్ మాత్రమే. అందువలననే పశ్చిమరాజ్యముల నాయకత్వము యునైటెడ్ స్టేట్స్‌కు లభించినది. కాని పశ్చిమ రాజ్యములకు సహాయముచేయుటకు యునైటెడ్ స్టేట్స్ పారమార్థిక చింతతో అంగీకరించినదని భావించరాదు. పశ్చిమరాజ్యము లెట్టునూ బలహీనములై, కేపిటలిస్ట్ ప్రజాస్వామ్యవిధానమును రక్షించుకొన నశక్తములై వున్నవి; అవి కమ్యూనిస్టురాజ్యము లైపోయినచో, కమ్యూనిస్టురాజ్య కూటమి బలబడుటయే గాక, కేపిటలిస్ట్ ప్రజాస్వామ్యరాజ్య కూటమి మిక్కిలి బలహీనమగును; వానిలో మిగిలి ఉండునది ఒక్క యునైటెడ్ స్టేట్స్‌మాత్రమే నని చెప్పవలసి వచ్చును; అప్పుడు ప్రపంచములోని ఇతర రాజ్యములుకూడ తేలికగా, త్వరత్వరగా కమ్యూనిస్టురాజ్యములైపోయి, యునైటెడ్ స్టేట్స్ ఏకాకిగా నిలబడవలసివచ్చును; అట్లు ఏరాజ్యమును ఏకాకిగా ఎంతో కాలము నిలబడజాలదు. సుసంఘటితమై, నియంతృత్వ పరిపాలనలో నుండిన సోవియట్ రష్యాయే ద్వితీయ ప్రపంచ సంగ్రామమునకు పూర్వము ఏకాకిగా నిలబడి, ఇతరరాజ్యముల ఒత్తిడికి తట్టుకొనుటకు చాలా కష్టపడినది. అయిన, ప్రజాస్వామ్యమైన రాజ్యము నిలబడగలదా? మరియును, కేపిటలిస్టు రాజ్యములలో మిక్కిలి బలిష్ఠమైన యునైటెడ్ స్టేట్స్‌తో సంఘర్షణ వచ్చితీరునని సోవియట్ రష్యానాయకులు ఆదినుంచి భావించుచునేయున్నారు; అందుకు వారు సన్నాహములు చేసి కొనక మానరు కదా! అట్టిసమయమున, యునైటెడ్ స్టేట్స్ ఎంతటి బలవత్తరమైన రాజ్యమైనను ఏకాకిగా నిలబడి, జయించగలదా? కాబట్టి అమెరికా స్వీయరక్షణార్థమైనను ఇతర రాజ్యములకు సహాయముచేసి వాటిని తనపక్షమునకు త్రిప్పుకొనుట అవసరము. ఇట్టిరాజ్యములు యూరప్‌లో, అందునా రష్యా, దాని ఉపగ్రహ రాజ్యముల చుట్టునూ ఉన్నచో మరింత మంచిది; ఒకవేళ సోవియట్ రష్యా దండయాత్ర ప్రారంభించినచో ముందు దెబ్బ ఈ దేశములకు తగులును; ఈదేశములలోని స్థావరములనుండి సోవియట్ రష్యాపై దెబ్బతీయుటకు అమెరికన్‌లకు వీలగును; లేనిచో వారు వేలకొలది మైళ్లదూరము విమానములపై వచ్చి దాడిచేయవలసియుండును. పైగా, యుద్ధకాలమున యునైటెడ్ స్టేట్స్‌పారిశ్రామిక ఉత్పత్తిశక్తి చాల ఎక్కువగా వృద్ధిపొందెను; తన్మూలమున నిరుద్యోగసమస్య దాదాపు పూర్తిగా పరిష్కరింపబడుటయే గాక, ప్రజల జీవన ప్రమాణము కూడ వృద్ధియైనది; ఆ ప్రమాణము అవిచ్ఛిన్నముగా నుండవలెనన్న పారిశ్రామిక, వ్యావసాయిక వస్తూత్పత్తి స్థాయి తగ్గకూడదు, కాని ఉత్పత్తి చేసినవస్తువులన్నియు స్వదేశములో అమ్ముడుపోవు; విదేశస్థులు కొనగలరుగాని, డబ్బుయిచ్చుకొనలేరు. ఇట్టి పరిస్థితులలో దేశ ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నము కాకుండ కాపాడవలెనన్న విదేశస్థులకు ఋణములిచ్చి, వారు యునైటెడ్ స్టేట్స్‌నుండి సరుకులు కొనుటను ప్రోత్సహించవలెను. కాబట్టి ఇతరదేశములకు ఆర్థిక సహాయము చేయుట యునైటెడ్ స్టేట్స్ ఆర్థిక భద్రతరీత్యాకూడ అవసరమైనది. అన్నిటినిమించి, సోవియట్ రష్యా సైనికశక్తి కెనవచ్చుటకు ఇతరదేశముల మనుష్యసంపదకూడ యునైటెడ్ స్టేట్స్‌కు అవసరము. ఇన్ని కారణములవలన పశ్చిమరాజ్యకూటమికి యునైటెడ్ స్టేట్స్ నాయకత్వము అనివార్యమైనది.

ప్రపంచరాజ్యములు రెండుకూటములుగా ఏర్పడు అవకాశము లీలగా కనిపించినప్పటినుండియు అగ్రరాజ్యములమధ్య అనుమానములు మరింత తీవ్రమై రాజ్యకూటములు స్పష్టముగ రూపొందుటకు దోహదము చేసెను; రాజ్యకూటములు స్పష్టముగ రూపొందినకొలదీ అనుమానములు తీవ్రతరమైనవి. ఈ విధముగా, ప్రపంచ సంగ్రామము ముగిసిన ఏడుసంవత్సరములలోనే, శత్రురాజ్యములతో శాంతి సంధులు కుదుర్చుకొనక పూర్వమే, ఇదివరకటిమిత్ర రాజ్యముల మధ్య సంగ్రామము ఎప్పటికప్పుడు అనివార్యముగా కనిపించునట్టి ఉద్రిక్త పరిస్థితి ఏర్పడినది.

ఈనాడు ప్రపంచమంతయు రెండు రాజ్యకూటములుగా, రెండుసామ్రాజ్యములుగా విడిపోయినది; చరిత్రలో ఇదివరకెన్నడు ఎరుగనంతటి పెద్దసామ్రాజ్యములు, విచిత్రకారణముల వలన, వినూత్నమార్గములలో వ్యాపించి, సుసంఘటితమగుచున్నవి. ఈ రెండు సామ్రాజ్యకూటములను కాదని, స్వతంత్రముగా మనగలుగుట దాదాపు అసంభవమై పోయినదని చెప్పవలెను. ఈరెండు సామ్రాజ్యకూటములకు వాస్తవముగా సంఘర్షణ సంభవించునా, సంభవించినచో ఎవరు జయింతురను ప్రశ్నలటుంచి, ఇవి విస్తరించిన విధము, వాని విధానముల తారతమ్యములు ఇచ్చట స్థూలముగ పరిశీలింతము.

కమ్యూనిజం అంతర్జాతీయ ఉద్యమం. కడపటికి, ప్రపంచమంతయు కమ్యూనిస్టువిధానమునే అనుసరించునని కమ్యూనిస్టుల దృఢనమ్మకము. ప్రపంచమందలి ప్రతిరాజ్యమందును నీ కమ్యూనిస్టుపక్షములున్నవి; అవి అన్నియు ఒకే లక్ష్యముతో, ఒకే విధానముతో, ఒకే నాయకత్వముక్రింద పనిచేయుచున్నవి. ఆ నాయకత్వము మొన్నటివరకు ఏకైక కమ్యూనిస్టు రాజ్యమగు సోవియట్ రష్యాకు లభించుట స్వాభావికము. ప్రతిరాజ్యములోను పేరువడసిన కమ్యూనిస్టు నాయకులు పార్టీ పంథానుసరించి, వ్యవహార నిర్వహణనుగురించి, ప్రచారమునుగురించి, విస్తరణనుగురించి మాస్కోలో తరిఫీదు పొందినవారే; మాస్కోలోని నాయకుల ఆదేశానుసారము, చిత్తవృత్తిప్రకారము నడచువారే. అందువలననే ప్రపంచమందలి కమ్యూనిస్టుపార్టీలన్నియు ఏకైక

విధానము ననుసరింప గల్గుచున్నవి. ప్రతిదేశమందును కమ్యూనిస్టు పార్టీ అతి సుసంఘటితమై, క్రమశిక్షాబద్ధమై, నియంతృత్వవిధానములో నడిపింపబడుచూ, కార్యదీక్షతో, ఉత్సాహ, ఉద్రేకపూరితులగు యువకుల నాకర్షించి, ముఖ్యముగా చాకచక్యముగ ప్రచారముచే అమాయిక ప్రజలలో మిక్కిలి పలుకుబడి సంపాదింపగల్గుచున్నది. జాతీయ రాజకీయములలోగాని, ప్రాంతీయ రాజకీయములలోగాని ఎట్టి సమస్యయందైనను, తాము ప్రజాపక్షమే అవలంబించుచున్నట్లు కమ్యూనిస్టులు పైకి నటించగలరు; వారి విధానములు ఎప్పటికెట్లు అవసరమైన అప్పటికట్లు తేలికగా మారిపోవును. ప్రస్తుత పాలకవర్గముపట్ల ప్రజలకు ఏవిధమైన అసంతృప్తి కలిగినను, దానిని దోహదముచేసి, ప్రస్తుతపాలకవర్గము ప్రజాభ్యుదయ విరోధకమని, తామే ప్రజాపక్షమని వారు తెలివితేటలతో ప్రచారముచేయుదురు; తమవిధానములు, రెండు ప్రాంతములందుగాని, రెండు సమయములందుగాని అసంబద్ధముగా నుండినను, వానిని చాకచక్యముతో ముడిపెట్టగలరు. ఈకుశాగ్రబుద్ధి ఎదుటిపక్షమునకు దాదాపుశూన్యము. పశ్చిమరాజ్యకూటమిలోని రాజ్యములలో పరస్పర భేదాభిప్రాయములేగాక, ప్రతి రాజ్యమందును విభిన్నదృక్పథముగల వివిధవర్గములు పార్టీలు ఉండి, రాజ్యకూటమి యందేగాక ప్రత్యేకరాజ్యములయందుకూడ ఏకోన్ముఖ రాజకీయవిధానము, ఐక్యము, వాతావరణము కనపడుటలేదు. పశ్చిమరాజ్యకూటమికి ఇది పెద్దలోపమేగాని ఇట్టి స్వేచ్ఛాపూరిత జీవిత విధానమును రక్షించుటకు, కమ్యూనిస్టునియంతృత్వ శాసిత జీవితవిధానమునుండి ప్రపంచ ప్రజాకోటిని తప్పించుటకు తాము పాటుపడుచుంటిమని, కాబట్టి ఆ విధానమును వదలుకొనలేమని వారు భావింతురు.

ప్రపంచమందలి ప్రతిరాజకీయ సంఘటనను తమకు అనుకూలముగ వర్తింపజేసుకొనగల నేర్పు కమ్యూనిస్టులసొత్తు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామముతో పాలిత రాజ్యప్రజల మనః ప్రవృత్తియందుగల్గిన ముఖ్యపరిణామమును ముందు గమనించితిమి.

తత్ఫలితముగ ఆసియా, ఆఫ్రికాలలోని పాలితరాజ్యముల ప్రజలయందు స్వాతంత్ర్యవాంఛ ప్రబలినది. కమ్యూనిస్టులు వెంటనే ఈ వాంఛను బలపరచి, ప్రజల సానుభూతిని పొందగలిగిరి. కాని పశ్చిమరాజ్యకూటమి ఈ విషయమున తప్పటడుగు వేసి, యునైటెడ్ స్టేట్స్ పాలితప్రజల అనుమానములకు గురియైనది. వ్యక్తిగతముగా యునైటెడ్ స్టేట్స్‌పాలకులకు ఈ ప్రజల స్వాతంత్ర్యాభిలాష సమంజసమని, సమర్థనీయమని తోచినప్పటికి, బ్రిటన్, ఫ్రాన్స్, నెదర్లెండ్స్ మొదలైన సామ్రాజ్య దేశములను, తమ తమ సామ్రాజ్యములను వదలుకొమ్మని వారెట్లు కోరగలరు? తాము యుద్ధమునకు పూర్వము అనుభవించిన సామ్రాజ్యములను యుద్ధానంతరముకూడ అనుభవింపవలెనను ఆశ ఈ సామ్రాజ్య దేశములకు కూడనిదేయైనను, వర్తమానావసరములను బట్టి, సమయస్ఫూర్తితో వ్యవహరింపలేక ఈ సామ్రాజ్య దేశములు పాలితప్రజలతో విరోధము తెచ్చుకొని, తద్వారా ఆసియా, ఆఫ్రికాలలో కమ్యూనిజం వ్యాప్తికి తామే పాటుబడినవి. మిత్ర రాజ్యముల ఆంతరంగిక విధానములలో తాను జోక్యము చేసికొనినట్లు ఏమాత్రము అనుమానము గల్గినను ఆయా దేశములు తనతో కలిసిరావని తెలియుటచే యునైటెడ్ స్టేట్స్ తటస్థభావమువహించి, సామ్రాజ్య దేశములనే బలపరచినట్లు నిందకుపాత్రమైనది.

యుద్ధానంతరము అన్ని రాజ్యములలోను యునైటెడ్ స్టేట్స్ సైనికముగ మిక్కిలి బలవత్తరమైన దగుటకు ముఖ్యకారణము 'ఏటంబాంబు!' అణుశక్తిరహస్యములు ఒక్క యునైటెడ్ స్టేట్స్‌కు మాత్రమే తెలియునుకాబట్టి సోవియట్ రష్యా, ఆ భయమువల్లనే దురాక్రమణకు పూనుకొనదని పశ్చిమరాజ్యముల రాజకీయవేత్తలు భావించిరి. కాని సోవియట్ రష్యా దాని నింకొకవిధముగ ఉపయోగించుకొన్నది. ఏటంబాంబు ఎంతటి వినాశకారియో, దానివలన ప్రపంచమున కెంత ప్రమాదమురాగలదో గమనించిన వారందరూ, దానిని గర్హించిరి; దాని ఉపయోగమును నిరసించిరి. ఏటంబాంబును నిషేధించవలెనని భావించిన వారు ప్రతి దేశమందును ఉండిరి. అట్టివారినందరిని సంఘటితపరచి, ఒక ఉద్యమమును కమ్యూనిస్టులు లేవదీసి, దానికి 'శాంతిఉద్యమ'మని పేరుపెట్టి, కమ్యూనిస్టులు కానిపెద్దలచే ఏటంబాంబును, తద్వారా అణుశక్తి రహస్యములు తెలిసిన యునైటెడ్ స్టేట్స్‌ను విమర్శింపజేసి, ప్రపంచములో సోవియట్ రష్యాయే శాంతి వాంఛించుచున్న దేశమని, యునైటెడ్ స్టేట్స్ తన ఏటంబాంబుతో ప్రపంచమును నాశనముచేయ ప్రయత్నించుచున్న దురాక్రమణ రాజ్యమని చక్కగా, నచ్చునట్లు ప్రచారము చేసిరి. అసలే యుద్ధమువలన విసిగి, వేసారియున్న పశ్చిమరాజ్యముల ప్రజలకు ఈశాంతి నినాదము సమంజసముగా కనిపించినది; అమెరికా దానధర్మమిచ్చిన దుస్తులు ధరించి, అమెరికన్ మిత్రులు పంపిన రొట్టె చేతిలోనుంచుకుని, అమెరికన్లనే వారు విమర్శింప మొదలిడిరి. అణుశక్తి రహస్యము ముందుగా తెలియుటవల్ల యునైటెడ్ స్టేట్స్‌కు సోవియట్ రష్యాపై ఎట్టి అధిక్యత లభింపలేదుగాని, రష్యామాత్రము ప్రపంచప్రజల దృష్టిలో యునైటెడ్ స్టేట్స్‌ను న్యూనత పరచగలిగెను.

చైనాలో ఆదినుండియు యునైటెడ్ స్టేట్స్ మార్షల్ చియాంగ్—కై—షేక్ ప్రభుత్వమునకు సహాయము చేయుచునే యుండెను. కాని ఆయన తాబేదారుల అవినీతి, దుష్పరిపాలనల వలన యునైటెడ్ స్టేట్స్ చేసిన సహాయమంతయు బూడిదలో పోసిన పన్నీరయ్యెను. కొమింగ్‌టాంగ్ పక్షమును, కమ్యూనిస్టు పక్షమును జతపరచి, చైనాలో సర్వప్రజా సమ్మత ప్రభుత్వమేర్పరచవలెనని యునైటెడ్ స్టేట్స్ ప్రయత్నించెనుగాని ఇరుపక్షముల మార్గపుపట్టుదలలవలన అది ఫలించలేదు. కాగా కొమింటాంగ్ పక్షపు దుష్పరిపాలనవలన ప్రజలకు ప్రభుత్వముపై విసుగుపుట్టి, కమ్యూనిస్టులు తేలికగా జయించుటకు వీలయ్యెను. మార్షల్ చియాంగ్‌తో తాము చేసికొన్న సంధిని, విస్మరించి, సోవియట్ రష్యాపాలకులు రహస్యముగా మంచూరియాలోని కమ్యూనిస్టులకు పెద్దపెట్టున సహాయముజేసి, వారు విజృంభించుటకు

అవకాశమేర్పరచిరి. చివరకు, చియాంగ్ దుష్పరిపాలనకు ద్రోహము చేసినదనియు, అతనిని సాకుగా చూపించి, ఫార్మోజాను ఆక్రమించుకుని చైనా భూభాగముపై దురాక్రమణ జరుపుచున్నదనియు యునైటెడ్ స్టేట్స్ పట్ల చైనా ప్రజలకు అసహ్యము పుట్టించుట సోవియట్ రష్యా ప్రచార చాకచక్యము. ఐక్యరాజ్య సమితిలో నవ చైనాకు స్థానమిప్పించుటకు రష్యా చేసిన ప్రయత్నము కూడ దాదాపు ఇట్టి ధోరణిలోనే యున్నది. చైనాలో కమ్యూనిస్టులు జయించిన ప్రాంతములలో, మొదటినుండియు విదేశస్థులపై, ముఖ్యముగా అమెరికనులపై ఎక్కువ నిర్బంధములు విధించిరి. హాస్యాస్పదమైన కారణములను సాకుగా చూపి, అమెరికన్ పౌరులను, ఉద్యోగులను తీవ్రముగ శిక్షించుట, దీర్ఘకాలము కారాగారమునందుంచుట జరిగెను. తద్వారా, అసలే కమ్యూనిస్టులకు వ్యతిరేకమైన అమెరికన్ ప్రజాప్రభుత్వ అభిప్రాయములు మరింత విమర్శనాత్మకమై, కూలిపోతున్న మార్షల్ చియాంగ్‌కు మరింత సానుభూతి లభించి, నవచైనాను యునైటెడ్ స్టేట్స్ గుర్తించుటకు అవకాశములేక పోయినది. చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వము సుస్థిరముగ నుండగలదని విశ్వసించిన ఆసియా రాజ్యములు, బ్రిటన్ మొదలైన ఇతరరాజ్యములు నవచైనా కమ్యూనిస్టు రాజ్యమును గుర్తించినవి. వెంటనే, కమ్యూనిస్టు చైనాను ఐక్యరాజ్యసమితిలో చేర్చవలెనని, కొమింటాంగ్‌ను బహిష్కరించవలెనని సోవియట్ రష్యా ప్రతిపాదించుటతో ఈరాజ్యములు ఆ ప్రతిపాదనను అంగీకరింపక తప్పినదికాదు. అందువలన నవచైనాను ఐక్యరాజ్యసమితిలోనికి రాకుండ ఒక్క యునైటెడ్ స్టేట్స్ మాత్రమే నిరోధకముగానున్నదని, ఇతరరాజ్యములు దాని చెప్పుచేతలలోనున్నవని, ఐక్యరాజ్యసమితికూడ అమెరికనుల చేతిలోని కీలుబొమ్మయేనని ప్రచారము చేయుటకు సోవియట్ రష్యాకు మంచి అదను లభించెను. నవ చైనాను ఐక్యరాజ్య సమితిలో చేర్పించుటకు సోవియట్ రష్యా చేసిన ఆర్భాటము పరిశీలించినచో, బహుశః ఎదుటివర్గమును రెచ్చగొట్టి, కమ్యూనిస్టు చైనా ఐక్యరాజ్యసమితిలోనికి వచ్చు నవకాశమును రూపుమాపి, మావ్—సే—టుంగ్ టిటోవలె తను చేయిజారిపోకుండ చూచుటకు, కమ్యూనిస్టు వర్గమునకు ఏకైక ప్రతినిధిగా ఐక్యరాజ్య సమితిలో వ్యవహరించుటకు, సోవియట్ రష్యా ఇట్టి తీవ్రవైఖరిని ప్రదర్శించుచున్నదేమో నని అనుమానము కలుగకపోదు.

జపాన్ పతనానంతరము కొరియా ఆక్రమణకు ఒక వైపు నుండి సోవియట్ రష్యాసైన్యము మరొకవైపునుండి యునైటెడ్ స్టేట్స్ సైన్యము పరుగులెత్తినవి. చివరకు, అప్పటి తాత్కాలిక సామరస్యమువలన, 38 వ అక్షాంశరేఖను ఇరుపక్షములకు సరిహద్దుగా నిర్ణయించుకొనిరి. దీనివలన కొరియాదేశము అస్వాభావికముగ రెండురాజ్యములుగా చీలిపోయెను. ఎవరు ఆక్రమించిన ప్రాంతములలో వారి విధానములు, దృక్పథము వ్యాప్తిచెంది, ఉత్తర కొరియా కమ్యూనిస్టు రాజ్యముగను, దక్షిణ కొరియా కేపిటలిస్టు ప్రజాస్వామ్యరాజ్యముగను రూపొందినవి. ఉత్తరకొరియాను కూడ తమలో లీనము చేసుకొని పశ్చిమ ప్రజాస్వామ్య రాజ్యముగా ఐక్య కొరియాను రూపొందించవలెనని దక్షిణకొరియనులు, దక్షిణకొరియాను తమలో లీనము చేసుకొని, కొరియా నంతను కమ్యూనిస్టు రాజ్యముగ రూపొందించవలెనని ఉత్తరకొరియనులు ప్రయత్నించుచుండిరి. ఉత్తరకొరియన్ రాజ్యము కమ్యూనిస్టు ఒరవడిలో సుసంఘటితమై, క్రమశిక్షణాయుతమైన నియంతృత్వరాజ్యముగా ఏర్పడి, సైనికశక్తిని వృద్ధిచేసికొన్నది; దక్షిణ కొరియాపాలకులు, అమెరికనుల అండజూచుకుని దేశమును సక్రమముగా పాలింపక, రాజ్యమును బలహీనముచేసిరి. ఉత్తర, దక్షిణ కొరియన్ రాజ్యముల విభేదములు సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్‌ల విభేదములకు ప్రతిబింబములు మాత్రమే కాని యునైటెడ్ స్టేట్స్‌ను ప్రపంచప్రజలదృష్టిలో యుద్ధోన్మాదదేశముగా నిరూపించుటకు సోవియట్ రష్యాకు ఇక్కడ మంచి అవకాశము దొరికినది. ఉత్తర దక్షిణ కొరియా సైన్యములలో ఏది ముందుగా ఎదుటిపక్షముపై తుపాకి కాల్చెనో సత్యము భగవంతునికే తెలియవలెనుగాని, సుశిక్షితమైన ఉత్తరకొరియన్ సైన్యపు ధాటికి దక్షిణకొరియన్ సైన్యములు తట్టుకొనలేవని, తాను ఇన్నాళ్ళుగా పోషించిన రాజ్యమును రక్షించవలెనన్న యునైటెడ్ స్టేట్స్ తన సైన్యమును రంగములోనికి దింపక తప్పదనీ వెంటనే స్పష్టపడెను. కొరియాలో ఐక్యరాజ్యసమితి సేనలనుచేరిన పోరాడుచున్న యునైటెడ్ స్టేట్స్ సైన్యములతో పోరాడుచున్న ఉత్తరకొరియా సైన్యములకు సోవియట్ రష్యా ఆయుధములు, మందుగుండు సామగ్రి, ఇతర పరికరములు, సైనిక తర్ఫీదు లభించుటలేదని ఎవ్వరూ భావించుటలేదు కాని సోవియట్ రష్యా సైన్యములు యుద్ధములో పాల్గొనుచున్నవని ఎవ్వరూ అనలేరు; కాబట్టి కొరియాలో విదేశసైన్యము లుండరాదనీ, అమెరికన్ సైన్యములు కొరియాపై దురాక్రమణ జరిపినవనీ, యునైటెడ్ స్టేట్స్ యుద్ధోన్మాదరాజ్యమనీ సోవియట్ రష్యా సోదాహరణముగా ప్రచారము చేయగల్గుచున్నది. ఇంతేగాక, యునైటెడ్ స్టేట్స్ సైనికశక్తిని పరోక్షముగా కమ్యూనిస్టులు, తమ ముఖ్య సైన్యముల నుపయోగించకుండా, పరీక్షింపగల్గుచున్నారు; పశ్చిమరాజ్యకూటమిలోని రాజ్యముల ఐకమత్యము ఏపాటిదో, తమ తమ దేశములుగాక ఇతరప్రాంతములకు ముప్పువాటిల్లి నప్పుడు వారెంతగా ఆ ప్రాంతములకు సహాయపడెదరో కమ్యూనిస్టులు పరీక్షింపగల్గుచున్నారు. కమ్యూనిస్టురాజ్యకూటమి పాలకవర్గము విధాన నిర్వచనయందును, నిర్వహణయందును, ప్రచారమునందును పశ్చిమరాజ్యములకన్న ఎంత తెలివితేటలతో, ఎంత చాకచక్యముతో వ్యవహరించుచున్నదో కొరియా సంఘటనవలన పూర్తిగా రుజువగుచున్నది. ఎదుటిపక్షపు లోపములను, అవకతవకలను, తమకు అత్యంత సహాయభూతములుగా నొనర్చుకొనుటలో సోవియట్ యూనియన్ శక్తి గణుతింపదగినది.

ఇండోనేషియా, ఇండో చైనా మొదలగు ఆగ్నేయ ఆసియారాజ్యాలు జపాన్ ఆక్రమణనుంచి విముక్తము చేయబడగనే, పూర్వపాలకులకు వప్పజెప్పవలెనని యునైటెడ్ స్టేట్స్ ప్రయత్నించెను ఇది వివేకవంతమైన పని కాదని గ్రహించుట కష్టముకాదు. కాని ఫ్రాన్స్, నెదర్లాండ్స్ మొదలగు సామ్రాజ్య

దేశముల ప్రభుత్వములను, ప్రజలను తృప్తిపరచుటకు, యునైటెడ్‌స్టేట్స్ తనవిధానాలను తమ తలపై రుద్దుటకు ప్రయత్నించదని వారికి రుజువుచేయుటకు, బహుశః యునైటెడ్ స్టేట్స్ ఇట్టి విధానమును అనుసరించి యుండవచ్చును. తమకు కలసిన తిండి బట్టలేక యునైటెడ్‌స్టేట్స్‌పై ఆధారపడియుండిన ఆరాజ్యములు తమకు సామ్రాజ్యములు కావలెనని, ఆ పాలితప్రజలను తాము కొల్లగొట్టవలెనని ఆశించుట; ఆ విధానమును ప్రజాస్వామ్యరాజ్యములకు నాయకత్వము వహించి, ప్రపంచమున కమ్యూనిస్టు నియంతృత్వపు మీక వ్యాపింపకేయ ప్రయత్నించుచు, ప్రపంచ ప్రజల సానుభూతి, సహాయము లపేక్షించుచున్న యునైటెడ్ స్టేట్స్ బలపరచుట, కేవలము అవివేకమైన విధానము. ఈ అవివేకవిధానము నుపయోగించుకుని సోవియట్ రష్యా ఆగ్నేయ ఆసియా ప్రజల సానుభూతి, మన్ననను పొందగల్గుటలో ఆశ్చర్యమేమున్నది! ఇండియా, సింహళము, బర్మా మొదలైన పాలిత రాజ్యములపట్ల బ్రిటన్ వైఖరి చాలవరకు కాలానుగుణముగా నుండినను ప్రచారముకొరకు ఉపయోగించుకొనుటకు స్థానికలోటుపాట్లు, మలయాలో బ్రిటిష్‌ప్రభుత్వ విధానము సోవియట్‌రష్యా ప్రచారమునకు అవకాశమివ్వక పోలేదు.

ఆసియా, ఆఫ్రికారాజ్యములలో బలవత్తరమైన కమ్యూనిస్టు పార్టీలు లేవు; సోవియట్ రష్యానుండి వేరుగా ఈ రాజ్యములకు సహాయము అందజేయగల్గుట కష్టము; అందువలన ఆ రాజ్యములలోని కమ్యూనిస్టుపార్టీలు సోవియట్ రష్యా ప్రచార కార్యస్థానములుగా మాత్రమే పనిచేయగలవుగాని ఆ రాజ్యములను కమ్యూనిస్టులు ఆక్రమించి, కమ్యూనిస్టురాజ్యకూటమిని బలపరచుటకు ఇంకను అదను రాలేదు. యూరప్ రాజ్యముల విషయమట్లు కాదు. యూరప్‌రాజ్యములలో సుసంఘటితమై, బలిష్ఠమైన కమ్యూనిస్టుపార్టీలు, యుద్ధకాలములో విప్లవచర్యలలో పాల్గొని, అనుభవము సంపాదించియున్నవి. హిట్లర్ పతనమునకు సోవియట్ సైన్యము చేసిన నిరుపమాన త్యాగమువలన సోవియట్ రష్యాపట్ల యూరప్‌రాజ్యముల ప్రజలకు సానుభూతి, గౌరవము లభించెను. దీని నుపయోగించుకొని యుద్ధానంతర కష్టకాలమున తత్కాల ప్రభుత్వమును విమర్శించుచు, కమ్యూనిస్టులు పరిపాలనాయంత్రమును, ప్రభుత్వమును వశపరచుకొనుటకు మంచి అవకాశమున్నది. సోవియట్ రష్యా సైన్యము ఆక్రమించిన ప్రాంతములలో, విధిగా కమ్యూనిస్టులు అధికారమును వశపరచుకొనిరి కాని ఇతర రాజ్యములలో ఎక్కడ కూడ కమ్యూనిస్టులు అత్యధిక సంఖ్యాబలమును పొందలేకపోయిరి. రష్యా ఆక్రమించిన ప్రాంతములలో జరిగిన ఎన్నికలలో కమ్యూనిస్టులకు అత్యధిక సంఖ్యాబలము లభింపకపోయిన, సంకీర్ణమంత్రివర్గములేర్పడి, తర్వాత క్రమేణా, ఇతరపక్షములు ఏదో ఒక సాకుపై రూపుమాపబడి, కమ్యూనిస్టులు సంపూర్ణాధికారమును వశపరచుకొనిరి. ఈ విధానమును తిరుపరి పరిశీలింతము. సోవియట్ సైన్యపు ఆక్రమణలోనికి రాని ప్రాంతములలో కమ్యూనిస్టులు ప్రభుత్వములలో చేరలేకపోయిరి. యుద్ధానంతర కష్టసమయములోనున్న ప్రభుత్వముల లోటుపాట్లను వినియోగించుకొని, పార్టీని వృద్ధిచేసికొని తర్వాతనైన, అవసరమైనచో బలప్రయోగము ద్వారా నైనా ప్రభుత్వమును వశపరచుకోవచ్చునని వా రాలోచించిరి. ఇంతలో నే, అగ్రరాజ్యముల సామరస్యం అంతమై విభేదములు హెచ్చు పెరుగుటవలన, యూరప్‌లోని రాజ్యములు ఏవియు కమ్యూనిస్టుల అదుపులోనికి రాకుండ కాపాడుకొనవలెనని యునైటెడ్ స్టేట్స్ గుర్తించినది; తూర్పు యూరప్ రాజ్యములలో, కమ్యూనిస్టులతో చేతులు కలిపిన ఇతర పార్టీల గతి ఏమైనదో పరిశీలించిన పశ్చిమరాజ్యముల నాయకులు కూడ, తమ విభేదములను విస్మరించి అయినా కమ్యూనిస్టు ఉపద్రవమునుండి తమ్ము తాము కాపాడుకొనవలసిన ఆవశ్యకతను కొంతవరకైనా గుర్తించి యునైటెడ్ స్టేట్స్‌కు సహాయము చేయ ప్రారంభించిరి. అయితే, ఈదేశములలోని వివిధపార్టీలకు గల భేదాభిప్రాయములుగాని, ఆయా రాజ్యప్రభుత్వములకు యునైటెడ్‌స్టేట్స్‌పట్లగల అనుమానములుగాని అంతటితో సమసిపోలేదు; అందువలన నే, పశ్చిమరాజ్యముల కార్యక్రమము అడుగడుగుకు ఆలోచనలతోను, మార్పులతోను, ఒకవిధముగా ప్రారంభమై ఇంకొక విధముగా రూపొందుచు అవకతవకగా, ఆలస్యముగా జరుగుచున్నది. తాము యునైటెడ్ స్టేట్స్ పక్షమవలంబించిన, అగ్రరాజ్యముల మధ్య యుద్ధము ప్రారంభమైన వెంటనే సోవియట్ రష్యా తమపై దండయాత్ర జరుపునని, యునైటెడ్ స్టేట్స్ సహాయముడున్ననూ ఎక్కువ నష్టము తామే భరించవలెననీ, యునైటెడ్ స్టేట్స్ తమకు సహాయముచేయుట ఆరాజ్యపు 'రాజకీయ చతురత'లో ఒక భాగము మాత్రమేననీ శాంతికి అర్రులు జాచుచున్న ఈరాజ్యములకు ఒక శంకభయము పీడించుచునే యున్నది; అయిన, ఆయా రాజ్యములలోని కమ్యూనిస్టేతర పక్షములన్నియు కలసి కట్టుగా వ్యవహరించి, ఇటు యునైటెడ్ స్టేట్స్‌తో గాని, అటురష్యాతో గాని సంబంధము లేకుండా, స్వతంత్రముగా తమ కాళ్లపై తాము నిలబడి, తమ దేశముల ఆర్థికవ్యవస్థను చక్కబరచుకొనవలెనను ప్రయత్నముగాని, ఆకాంక్షగాని ఈ రాజ్యములలో కానవచ్చుటలేదు; ఇప్పటికప్పుడు ఏదో అడ్డంకులు, అనుమానములు వెలిబుచ్చి యునైటెడ్ స్టేట్స్‌నుండి వీలైనంత ఎక్కువ ఆర్థిక సహాయము పొందుటే కర్తవ్యమని ఈరాజ్యములు భావించునట్లు ఊహించవచ్చును.

పునరుద్ధరణ సంస్థకార్యక్రమము ప్రకారం యూరప్ రాజ్యములకు ఆర్థిక సహాయం చేయుటం యునైటెడ్‌స్టేట్స్ మానివేసిన తర్వాత, ఆ రాజ్యముల ఆర్థికవ్యవస్థ తిరిగి కోలుకొనుటకు అమెరికా సహాయము అత్యవసరమని, లేనిచో, పరిశ్రమలు తిరిగి ప్రారంభముగాక కల్లోలము ప్రారంభము కాగలదని స్పష్టపడుటతో యునైటెడ్‌స్టేట్స్ 'మార్షల్ పథకము'ను సృష్టించియు, కొన్ని విధముల కెనడా కూడ కలుగజేసికొనియు వీనికి ఆర్థిక సహాయము అందజేయప్రారంభించినవి. మార్షల్ పథకము ప్రకారము లభించిన సహాయముతో దాదాపు అన్ని పశ్చిమరాజ్యములును తమ పారిశ్రామికసంపదను తిరిగి చేకూర్చుకొని, పారిశ్రామిక వస్తూత్పత్తిని యుద్ధపూర్వపు స్థాయికి తెచ్చుకోగలిగినవి గాని, పాలిత రాజ్యములలో అనవసర యుద్ధములవలనా, ఆంతరంగికముగా

అవాంఛనీయమగు ఆర్థికవిధానములవల్ల ఇన్‌ఫ్లేషన్ వృద్ధిచెందింది, అమెరికన్ ఆర్థికసహాయము ఇంకనూ కావలసి వచ్చుచునే యున్నది; దీనికి తోడు ఈరాజ్యములన్నియు తిరిగి ఆయుధధారణకు పూనుకొనవలసివచ్చి అందుకు మరింత సొమ్ము వ్యయము కాజొచ్చెను. పశ్చిమరాజ్యములు తాము కలసిమెలసి, కూటమిగా పనిచేయవలసిన అగత్యమునే పదే పదే విస్మరించుచుండును; వాని ఆర్థిక, రాజకీయవిధానములు ఏకోన్ముఖముగా, సమన్వయపరచబడి, నిర్వహింపబడుటకై అమెరికన్ సహాయము దూబరాచేయబడి నిరుపయోగమైపోవుచుండెను; ఇట్లు కాకుండా, పశ్చిమరాజ్యము లన్నిటికి ఏకోన్ముఖమైన విధానము లుండవలెనని గుర్తించబడి చాలకాలమైననూ, ఇంతవరకు కూడ అది ఆలోచనారంగములోనే యుండిపోయినది. పశ్చిమ యూరప్‌రాజ్యముల పారిశ్రామిక సంపదను కేంద్రీకృతమొనర్చి, వాని సమష్టి అవసరములకు అనుగుణముగా, ఏకోన్ముఖముగా నడిపించుటకు ఉద్దేశించిన షూమన్‌పథకము ఏండ్లతరబడిగా ఆలోచనలోనే యున్నది. వీనిలో మొన్నటివరకు సోషలిష్టురాజ్యముగా నుండిన బ్రిటన్ తన పారిశ్రామిక సంపదను ఇతరరాజ్యముల దానితో కేంద్రీకృత మొనర్చుటకు ఒప్పుకొనదు; పశ్చిమ జర్మనీకి తనతోపాటు స్థానమిచ్చుటకు ఫ్రాన్స్ ఒప్పుకొనదు; స్పెయిన్‌ను ఈకూటమిలో చేర్చుకొనుటకు ఫ్రాన్స్, బ్రిటన్‌లు ఒప్పుకొనవు; ఈ విధముగా పరిస్థితి చాల అగమ్యగోచరముగా నుండును.

యుద్ధానంతరము ప్రపంచములో సైనికశక్తి—సంఖ్యలో—సోవియట్ రష్యకే అధికముగా నుండెను; అటుతర్వాత రష్య సైన్యమును తగ్గించుకొన్నట్లు తెలియదు కాని పశ్చిమరాజ్యములు మాత్రము చాలవరకు తగ్గించుకొన్నవి; చివరకు పశ్చిమరాజ్యములు తమ సైనికశక్తిని తిరిగివృద్ధి చేసికొనక పోయినచో, ఒకవేళ యుద్ధమే సంభవించిన, ఏటంబాంబు తమ్మికాపాడలేదని గ్రహించుకొని, సైన్యమును వృద్ధిచేయుట, ఆయుధధారణము ప్రారంభించినవి. పశ్చిమరాజ్యముల సైనికశక్తి కమ్యూనిస్టురాజ్యముల సైనికశక్తికి మించివున్నచో, అందువల్లనైనను కమ్యూనిస్టులు బెదిరి యుద్ధముప్రారంభించరనీ, ఒకవేళ ప్రారంభించినా తాము సంసిద్ధముగా నున్నచో వెంటనే తట్టుకోవచ్చుననీ వీని ఉద్దేశ్యము. తత్ఫలితముగ, ముందు బెనిలక్స్‌కూటమి, తరుపరి పశ్చిమరాజ్యములకూటమి, చివరకు అట్లాంటిక్ రక్షణ ఒడంబడిక జరిగి, పశ్చిమ యూరప్‌రాజ్యములు, యునైటెడ్‌స్టేట్స్ కెనడాలు పరస్పరము సంయుక్తముగా రక్షించుకొనుటకు అంగీకరించుకొని, తమ సైనికవ్యవహారములను ఏకోన్ముఖముగా నడిపించుటకు ప్రయత్నించుచున్నవి. గ్రీస్, టర్కీలుకూడ ఈకూటమిలో చేర్చుకొనబడినవి. మధ్య ప్రాచ్యరాజ్యములతో కూడ ఇటువంటి రక్షణ సంధి చేసుకొనవలెనని బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్‌లు ప్రయత్నించుచున్నవి. పసిఫిక్ రాజ్యముల కూటమిని గురించి కూడ ప్రస్తావనలు వినబడుచున్నవి. అట్లాంటిక్ రక్షణ ఒడంబడిక కార్యక్రమం అమలుజరిగినచో, దాదాపు ఇంకొక సంవత్సరములో పశ్చిమరాజ్యముల సైనికశక్తి, కమ్యూనిస్టు రాజ్యముల సైనికశక్తికి మించియుండును. రెండువర్గములకు సమానమైన సైనిక బలమున్నది కాబట్టి యుద్ధము రాకపోవచ్చుననువారికి అప్పటితో తృప్తి ప్రశాంతత లభించును. పశ్చిమరాజ్యములు తాము చెప్పుచున్నట్లుగా 60 డివిజన్ల సైన్యమును ఒక సంవత్సరకాలములో చేర్చి, తర్ఫీదుచేసి, ఆయుధములు సమకూర్చగలరని, వారిప్రస్తుతవిధానములు, కార్యదీక్ష, కార్యదక్షత పరిశీలించిన భావించుట సాహసమే కాగలదు.

పశ్చిమ జర్మనీ విషయమున పశ్చిమరాజ్యము లనుసరించుచున్న విధానము, సోవియట్ రష్యవిధానములకు దీటుగా నున్నది. హిట్లర్ పతనానంతరము జర్మనీని అగ్రరాజ్యములగు ఫ్రాన్స్, బ్రిటన్, సోవియట్ రష్య, యునైటెడ్‌స్టేట్స్‌లు ముక్కలుగా విభజించి, ఆక్రమించుకొన్నవి; సోవియట్ రష్యకు, పశ్చిమ రాజ్యములకు ఈ ఆక్రమణలో పరిసమాన హోదావుండుటకుగాను బెర్లిన్ నగరమును కూడ నాల్గుభాగములుగా విభజించి ఆక్రమించుకొనిరి. క్రమేణా, పశ్చిమరాజ్యములకు సోవియట్ రష్యకు కలిగిన అభిప్రాయభేదములు జర్మనీలోని ఆ క్రమితప్రాంతములలో కూడ ప్రతిఫలించి, పశ్చిమజర్మనీ, తూర్పు జర్మనీలు ప్రత్యేక రాజ్యములుగా ఏర్పరచబడి, నామమాత్రపు స్వాతంత్ర్య మొసంగబడినవి. బెర్లిన్ నగరపు చుట్టుప్రక్కల ప్రాంతమును ఆక్రమించిన రష్య, బెర్లిన్ నగరమునుండి పశ్చిమ రాజ్యముల మూడింటిని ఖాళీచేయించుటకుగాను రవాణాదిగ్బంధమును అమలు జరిపి, చిక్కులు పెట్టినదిగాని, పశ్చిమరాజ్యములు మొండిగా, విమానములద్వారా సరఫరాలు తెచ్చుకుని ఆదిగ్బంధమును నిరుపయోగమొనర్చగల్గిరి; ఇది నిజముగ, పశ్చిమరాజ్యములశక్తి సామర్థ్యములకు సూచిక. చివరకు బెర్లిన్ దిగ్బంధమును, అంత పరువు నష్టములేకుండా, రష్యతొలగించినది. జర్మనీ ఏకీకరణకు రెండు పక్షములును తమ స్వప్రయోజనముల కనుగుణముగ, ఎదుటి పక్షమునకు నింద వచ్చునట్లు ప్రచారము చేయుచున్నవి. తూర్పు జర్మనీ కేవలము సోవియట్ రష్య అనుబంధరాజ్యమైనది. పశ్చిమ జర్మనీ, పశ్చిమరాజ్యముల అవసరములను సాకుజూసుకుని, వీలైనంత స్వతంత్రప్రతిపత్తి సంపాదింప జూచుచున్నది. యూరప్ ఆర్థిక సమన్వయసంఘములోను, అట్లాంటిక్ రక్షణ ఒడంబడికలోను సమాన భాగస్వామిగా పశ్చిమ జర్మనీని, దాని పారిశ్రామికసంపద, మనుష్యసంపదల నాశించిన పశ్చిమరాజ్యములు, ఇష్టములేకున్నను చేర్చుకొన్నవి. శత్రువును జయించిన మిత్రరాజ్యములు తమలోతాము కలహించుకుని, తమ పూర్వ శత్రువుతో నూతన మిత్రత్వమును యాచించుకొనుచుండుట ఎంత ఆశ్చర్యకరము!

కమ్యూనిస్టు రాజ్యకూటమిలోని రాజ్యములు ఒకదాని ప్రక్క నొకటియుండి యూరేషియాలో ఎక్కుడు భూభాగమును ఆక్రమించినవి; వీని చుట్టునూగల రాజ్యము లన్నిటిని ఒక కూటమిగా తన నాయకత్వము క్రింద సంఘటితపరచి, కమ్యూనిస్టు కూటమికి చుట్టూ వలయముగా తన సైనిక కేంద్రము నేర్పరచుకొనుటయే యునైటెడ్ స్టేట్స్ ఆశయము—అదే యునైటెడ్ సామ్రాజ్యస్వరూపము, విధానము. పశ్చిమయూరప్ రాజ్యములు, ఇటలీ, గ్రీస్, టర్కీ, మధ్యప్రాచ్య రాజ్యములు, ఇండియా,

పాకిస్థాన్, బర్మా, సయాం, ఇండోచైనా, మలయా, ఫిలిప్పీన్స్, జపాన్ దేశములు ఈ సామ్రాజ్యములో ముఖ్యభాగములుగా నుండి తీరవలెను; తక్కిన రాజ్యములు సానుభూతిపరులుగ నున్నను ఫరవాలేదు. ఈ రాజ్యముల ప్రభుత్వములను బలవంతముగాను, కుట్రతోను లోబరుచుకోవలెనని యునైటెడ్ స్టేట్స్ ఆలోచన కాదు; వాని అంతరంగిక వ్యవహారములలోను భిన్న భిన్న పక్షముల వివేషములలోను జోక్యము చేసికొని పరోక్షవిధానముల ద్వారా ప్రాబల్యము సంపాదించవలెననికూడ దాని ఆశయము కాదు; ఆయా దేశములకు ఆర్థికముగా సైనికముగా సహాయముచేసి, ప్రభుత్వమును, ప్రజలను మంచిచేసుకొని నెమ్మదిగా, ఓర్పుతో పరోక్షముగా వారికి నచ్చచెప్పి తన విధానములువారిచే ఆమోదింపజేయుటయే దాని ఆశయము; తన ప్రాబల్యములోనున్న రాజ్యము లన్నియు అన్నివిధముల తనకు విధేయములై ఉండవలెననిగాని, తాను నిర్వచించిన ప్రతి విధానమును అవి యన్నియు విధిగా అంగీకరించవలెననిగాని అన్ని విషయము లందున తన సలహా ప్రకారమే అవి వ్యవహరింపవలెననిగాని, యునైటెడ్ స్టేట్స్ ప్రయోజనములకు వ్యతిరిక్తముగా అవి వ్యవహరింపరాదనిగాని, ఉద్దేశ్యముకాదు; కనీసపు ముఖ్యవిషయములోనైనా, యుద్ధప్రమాదము వాటిల్లినప్పుడైనా ఈ రాజ్యము లన్నిటిని ఒక త్రాటిపై నడచునట్లు చేయుటకు, ఇప్పటినుండి పునాదులువేసి, మార్గములు నిర్వచించి ఆయా రాజ్యముల సానుభూతిపొంది, సుముఖులజేసికొనుటయే ఈ సామ్రాజ్య విస్తరణ విధానలక్ష్యముగా కనపడుచున్నది; బహుశః ఇరువదియవ శతాబ్దములో సామ్రాజ్య వ్యాప్తి విధాన మిదియని భవిష్యత్తులో చరిత్రకారులు నిర్ణయించ వచ్చును.

యునైటెడ్ స్టేట్స్ విస్తరణ విధానములో రెండు లోపములు వెంటనే గోచరమగుచున్నవి. ఒకటి యునైటెడ్ స్టేట్స్ ఆర్థిక సహాయము; తమకు నిష్కామముతో యునైటెడ్ స్టేట్స్‌నుండి ఆర్థిక సహాయము లభించుచున్నదని ఏ రాజ్యమూ భావించుట లేదు; ఈ ఆర్థిక సహాయమునకు చివరకు ఎట్టి ఫలితములు కలుగునో సహాయమునకు ఎంతటి మూల్యము చెల్లింపవలసివచ్చునో అని ప్రతిరాజ్యము లోపల భయపడుచునే యున్నది; యునైటెడ్ స్టేట్స్ ఆశయములను, విధానములను ప్రతిరాజ్యము సంశయాస్పదముగనే చూచుచున్నది; కాని ఆ సహాయము వద్దనగల తాహతు వానికి లేదు. రెండు: ఇప్పుడు ప్రపంచ సమస్యలన్నియు మానవీక ప్రవృత్తికి సంబంధించినవిగాని ఆర్థిక విధానములకు సంబంధించినవి గావు. స్టాలినిజం ఎంతటి నియంతృత్వమైనా అది ప్రపంచంలోని బీద, పీడిత ప్రజలను ఇంకనూ ఆకర్షించుచునే యున్నది. అందుకు కారణము కేపిటలిస్ట్ ప్రజాస్వామ్య విధానములోని లోపములేగాని దాని గుణగణములుగాదు. కాబట్టి ప్రపంచప్రజలలో కమ్యూనిజంపట్ల వ్యామోహము తగ్గించవలెనన్న కేపిటలిస్టు ప్రజాస్వామ్య విధానమును సరిదిద్ది, దానియందు ప్రజలకు నమ్మకము, విశ్వాసము పుట్టించవలెగాని, డాలర్లు వెదజల్లుట అనవసరము. పీడిత ప్రజల మనస్సులలో ఈమార్పు రాకపోయిన, ఏనాటికైనను కమ్యూనిజం వ్యాపించుట తథ్యము.

ఇక సోవియట్ రష్యా విస్తరణ విధానమును గమనింతము. యుద్ధకాలమున సోవియట్ సైన్యము ఆక్రమించిన రాజ్యములు, సోవియట్ రష్యానుండి అపార సహాయము పొందిన చైనా, ఇవి మాత్రమే ఈ రాజ్య కూటమిలోని ఇతర అంగములు. తూర్పు యూరప్‌లోని అన్ని రాజ్యములలోను యుద్ధానంతరము మిత్రరాజ్యముల పర్యవేక్షణక్రింద ఎన్నికలు జరిగినవి. కమ్యూనిస్టులు అత్యధిక సంఖ్యాకులుగా—యుగోస్లేవియాలో తప్ప—ఎక్కడనూ రాలేదు కాని ప్రతి ప్రభుత్వములోను కమ్యూనిస్టులతో కూడి సంకీర్ణ మంత్రివర్గము ఏర్పడినవి. ప్రతి ప్రభుత్వములోను పోలీసు శాఖ, న్యాయశాఖల మంత్రిగాని, ఉపమంత్రిగాని, ఇతర కీలక శాఖలలో మంత్రిగాగాని ఉపమంత్రిగాగాని కమ్యూనిస్టులు నియమింపబడిరి. ప్రభుత్వోద్యోగముల నిచ్చుట ఉపమంత్రి కార్యముగా నిర్ణయింపబడి, కీలక మంత్రిత్వ శాఖలలో ఉద్యోగులు ఎక్కువ మంది కమ్యూనిస్టు పార్టీ సభ్యులు నియమింపబడిరి. ప్రతి మంత్రిత్వశాఖ ఉద్యోగులలోను రష్యన్ కమ్యూనిస్టు పార్టీ తరఫున గూఢచారి ఒకరు ఉండి తీరును; అత డెవ్వరో ఆ మంత్రిగాని, ఉపమంత్రికిగాని—వారు కమ్యూనిస్టు లైనను—తెలియదు. తన మంత్రిత్వశాఖలోని వ్యవహారములనే గాక, ఉద్యోగుల, మంత్రుల ప్రవర్తనను ఎప్పటికప్పుడు మాస్కోలోని కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యాలయమునకు నివేదించుచుండుటయే అతని పని. రష్యన్ కమ్యూనిస్టు పార్టీ—సోవియట్ రష్యా ప్రభుత్వపు ఆదేశములు ప్రతి రాజ్యములోని కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యాలయమునకు వచ్చి, అక్కడనుండి ఆయా మంత్రులకు, సంబంధించిన ఉద్యోగులకు అందజేయబడుచుండెను. ఈ విధముగ సోవియట్ ప్రభుత్వమునకు, ఆయా రాజ్యముల ప్రభుత్వములకు ఎట్టి ఉత్తర ప్రత్యుత్తరములు, ఆదేశములు లేకుండగనే. ఒక్కొక్కప్పుడు మంత్రులకు తెలియకుండగనే రష్యా ఆదేశములు సులువుగా ఆచరణలోనికి వచ్చును. ఇది ఇట్లుండగా తమతో సహకరించిన ఇతర పార్టీలను ప్రజల దృష్టిలో న్యూనత పరచుటకు, వానిని నిర్మూలించుటకు కమ్యూనిస్టు పార్టీలు ప్రయత్నించును. ఇతర పార్టీల నాయకులపై దేశద్రోహ, ప్రజాద్రోహ నేరములు, కమ్యూనిస్టుగూఢచారుల తప్పుడు సాక్ష్యముల సహాయముతో, బనాయించబడి, వారు నాయకత్వమును, మంత్రిత్వమును పోగొట్టుకొందురు; ఆ పార్టీలలోని నాయకులు కొందరు కాలానుగుణముగ మారి చివరకు రాజకీయములనుండి విరమించుకొనుటయో, కమ్యూనిస్టులగుటయో జరుగును. ఈ విధముగా, కేవలము సంఘటనాశక్తి, దూరాలోచన, కుట్ర, ప్రచారముల ద్వారా, మొదట మంత్రివర్గములో అనామకస్థాన మాక్రమించిన కమ్యూనిస్టు పార్టీ, ఒకటి రెండు సంవత్సరములలో అతి ప్రముఖ స్థానముగాని, సంపూర్ణముగాగాని ఆక్రమించును. ఇక పార్టీ సభ్యుల ప్రవర్తనపైనకూడ—వారి హోదా ఎట్టిదైనను—చక్కని గూఢ చారిత్వముండును. పార్టీ నాయకుల, మంత్రుల ఆలోచనా ధోరణి, మాస్కోపట్ల వారి వినయ విధేయతలు, అతి జాగ్రత్తగా, అతని అంతరంగిక ఉద్యోగులలో ఒకడుగా మెలగుచున్న గూఢ చారిచే గమనింపబడి, ఏనాటి కానాడు మాస్కోకు నివేదింపబడు

చుండును. అందువలననే తూర్పు యూరప్ రాజ్యములలో కమ్యూనిస్టు పార్టీల అగ్రనాయకులు, ఉపప్రధాని, 'కీలక' శాఖల మంత్రులు కూడ, బర్తరఫ్ చేయబడి, దేశద్రోహ నేరమునకు విచారింపబడి శిక్షలు విధింపబడుట మామూలుగా జరుగుచున్నవి. తూర్పు యూరప్ రాజ్యములకు ఇతర దేశములలో గల రాయబారులుకూడ ఇట్లే కమ్యూనిస్టు పార్టీకి లోబడి మాస్కోలోని కమ్యూనిస్టు కేంద్ర కార్యాలయమునకు నేరుగా నివేదికలు పంపించు గూఢచారిచే పరిశీలింపబడుచుందురు. గూఢచారి రాయబార కార్యాలయములలో ఒక చిన్న గుమాస్తాగనో, ప్యూనుగనో రాయబారితో అంతరంగికముగ మెలగుచుండును. గాని అతడు గూఢచారియని రాయబారికి తెలియదు గాబట్టే అతని కార్యము నిర్విఘ్నముగ సాగుచూ, రాయబారులను గురించిన విశేషములు సోవియట్ కమ్యూనిస్టు పార్టీకి ఎప్పటి కప్పుడు అందుచుండును. అక్కడనుండి అవసరమైన ఆదేశములు, ఆయా రాజ్యముల కమ్యూనిస్టు పార్టీలకు, తద్వారా ప్రభుత్వములకు అందజేయబడునే గాని, నేరుగా సోవియట్ ప్రభుత్వము ఆయా రాజ్యముల ప్రభుత్వములకు ఎట్టి ఆదేశములు ఇవ్వదు, వారి వ్యవహారములలో జోక్యము కలిగించుకొననట్లే నటించును. యుద్ధకాలము నుండియు ఎక్కువగా స్వశక్తిపైననే ఆధారపడిన ఒక్క యుగోస్లేవియా తప్ప తక్కిన తూర్పు యూరప్ రాజ్యములన్నియు ఈ మంత్రాంగపు యంత్రాంగముద్వారా ప్రతి స్వల్ప విషయమునకూడ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ఆదేశముల అనుసారము నడచుకొనుటకు అలవడినవి. మాస్కో విధానమునకు ఎదురు తిరిగినవారు, ఎదురు తిరిగెదరని అనుమానము పుట్టినవారు, ఏదో ఒక సాకుపై వెంటనే బర్తరఫ్ చేయబడి, పార్టీ నాయకులలో ఒక విధమైన భయము పుట్టి, రష్యా ఆజ్ఞలను పాలించి తీరుదురు. ఈ రాజ్యముల సైనిక సంపద, పారిశ్రామిక సంపద కమ్యూనిస్టు రాజ్యముల అవసరములకు వీలగునట్లు సమన్వయ పరచి ఉపయోగించుట సోవియట్ ప్రభుత్వపు కర్తవ్యము, దీనికి అభ్యంతరము చెప్పుటకు గాని, ఆటంకములు కలిగించుటకు గాని, మార్పులు సూచించుటకు గాని, సంప్రదింపులు జరపవలెనని కోరుటకుగాని ఆ రాజ్యముల నాయకులకు ధైర్యము చాలదు. అదేవిధముగ సైనిక విషయములందును, వివిధ జాతీయ, అంతర్జాతీయ రాజకీయ విషయములందును సోవియట్ రష్యా ఆదేశించిన విధానమే తుచ తప్పకుండ ఆమోదింపబడి, అనుసరింపబడును. కమ్యూనిస్టు రాజ్యములలోని రహస్య పోలీసు శాఖలు, కమ్యూనిస్టు పార్టీల గూఢచారులు, స్థానిక ఉద్యోగస్థులను, నాయకులను ఈ విధముగనే పరిశీలించి, సోవియట్ రష్యా విధానములకు ఎదురు తిరగవచ్చునను సంశయము కలిగిన వారి నందరినీ, ఏదో ఒక నెపమున అరెస్టు చేయుట, హింసించుట ప్రారంభించి, ప్రజలలో భయము వ్యాపింపజేసి, కమ్యూనిస్టు విధానములకు దాసులను జేతురు; వార్తా పత్రికలు, రేడియోలు మొదలైన ప్రచార సాధనములు ముందుగనే, ప్రభుత్వ శాఖలవలెనే, కమ్యూనిస్టుల వశమగును కాబట్టి, వారు ప్రచార యంత్రమును చక్కగా, తెలివితేటలతో ఉపయోగించి ప్రజలను మభ్యపెట్టుచుందురు. ఈ విధముగా రూపొందిన కమ్యూనిస్టు రాజ్యకూటమి—రష్యా సామ్రాజ్యము—లో ఒక్కమారు చేరిన, 'ప్రజాస్వామ్యము' దేశ స్వాతంత్ర్యము పూర్తిగా కోల్పోయినట్లే భావించవచ్చును. కమ్యూనిస్టు సామ్రాజ్యము సుసంఘటితము. క్రమశిక్షణాయుతము, కేంద్రీకృత అధికారమువలన ఏకోన్ముఖముగా చురుకుగా, కార్యదీక్షతో, ప్రతిఅంగపు కార్యక్రమము సమన్వయపరచి, నిర్దుష్టముగ, చాకచక్యముగ వ్యవహరించుచు సత్ఫలితములను పొందగల్గుచున్నది. ఈ క్రమశిక్షణ, నియంతృత్వ విధానములే సోవియట్ రష్యా బలమునకు మూలకందములు. సామ దాన భేద దండోపాయములతో ఏ విధముగనైనా కమ్యూనిస్టు సిద్ధాంతమును వ్యాపింప జేయుటయే, సోవియట్ రష్యా అధికారమును విస్తరింప జేయుటయే, ఈ సామ్రాజ్య ముఖ్యాశయము. ప్రచార సాధనము లన్నియు సోవియట్ రష్యా కమ్యూనిస్టుపార్టీ చెప్పు చేతలలోనుండుటచే ఆయా రాజ్యముల భావములు, అచ్చట జరుగుతున్న వ్యవహారముల ధోరణి, ప్రజల అభిప్రాయములు ఇతరులకు తెలియుటకు అవకాశమే లేదు; ప్రజలు స్వేచ్ఛ లేక ఒక నిర్ణీత పద్ధతి ప్రకారము జీవితము గడపవలసి వచ్చును; ఆ రాజ్యములు ఇతర ప్రపంచమునుండి శాశ్వతముగా, సంపూర్ణముగా వేరుచేయబడి, 'ఉక్కు తెర' వెనుక 'నిర్బంధింప' బడును. సాధారణముగా నియంతృత్వము ఎంతో కాలము నిలువజాలదు గాని, ఇటువంటి సంపూర్ణ నియంతృత్వము ఒకటి రెండు తరములలో ప్రజల మానసిక వికాసమునే అదుపులో పెట్టి, ఇతర ప్రపంచపు సంగతులు వారికి తెలియనివ్వక, ప్రజలందరును తన విధానములను భయముతో గాక, శ్రద్ధాభక్తితో, మూఢవిశ్వాసముతో అనుసరించునట్లు చేసి, ప్రపంచమందలి మానవులను ఒకరినొకరు గుర్తించుకొనలేని, అర్థము చేసికొనలేని విధముగా రెండు జాతులుగా విభజించివేసి, ఈ ప్రపంచమును రెండు గోళములుగా విభజించి వేయగల ప్రమాదము లేకపోలేదు. ఈ సామ్రాజ్యపు భవిష్యత్తు ప్రపంచపు ముఖ్య సమస్యగా పరిశీలింపదగినది.

యుద్ధానంతరము అంతర్జాతీయ శాంతి భద్రతలను కాపాడుటకు యుద్ధకాలముననే ఐక్యరాజ్య సమితిని మిత్రరాజ్యములు స్థాపించినవి. ఈ సమితి కార్యకలాపములకు సంబంధించిన వివిధ అంగములపై నిబంధనలు, మిత్రరాజ్యముల అనుమానములు, భేదాభిప్రాయములు, తాత్కాలిక సామరస్యత ననుసరించి, అప్పటి పరిస్థితులకు అనుగుణముగా, అన్ని పక్షములకు అంగీకార యోగ్యముగా నుండునట్లు, ఏర్పాటుచేసిరి. ఈ నిబంధనావళి చాల లోపభూయిష్ఠమైనది, అగ్రరాజ్యముల మధ్య ఏకాభిప్రాయము లేకపోయినచో ఐక్యరాజ్య సమితి పనిచేయలేదనీ, అసలు ఆ పరిస్థితిలోనే ఐక్యరాజ్య సమితి ఫలవంతముగ పనిచేయవలసిన అగత్యమున్నదనీ, ఇతర రాజ్యముల ప్రతినిధులు ఎంతో వాదించినను, అగ్రరాజ్యములు తమ కనీస అంగీకారము పొందిన నిబంధనావళి ఆమోదించబడక పోయిన, అసలు ఐక్యరాజ్య సమితి ఏర్పడనే ఏర్పడక పోవచ్చునను సాకుజూపి, లోపభూయిష్ఠమైన నిబంధనావళి ఆమోదింప జేసిరి. కాని ఆ నిబంధనావళి ప్రకారము

విశ్వరాజ్య సమితి, అందు ముఖ్యాంగమైన భద్రతామండలి పని చేయ లేదనీ, అగ్రరాజ్యములలో ఏ ఒక్కరికి ఏ విషయమున, భద్రతామండలిలోని తదితర 11గురు సభ్యులతోను భేదాభిప్రాయము వచ్చినను భద్రతామండలి నిరుపయోగము కగునని అందరూ గుర్తించిరి; చివరకు అది జరగనే జరిగినది. ప్రపంచ శాంతి భద్రతలకు ముఖ్య బాధ్యత వహించవలసిన భద్రతామండలి 'వీటో' అధికారములవలన ఏ విషయములోను సంతృప్తికరముగా వ్యవహరించ లేక పోయినది. క్రమేణా అగ్రరాజ్యముల విభేదములు, వారివారి రాజ్యకూటముల ప్రయోజనములు (విశ్వరాజ్యసమితి కార్యకలాపములలో ప్రతి ఫలించి) ఎదుటి పక్షపు లోటుపాట్లను తిట్టులను ప్రపంచసభలలో ఎత్తిచూపించి, ప్రపంచ ప్రజాభిప్రాయమును తమ పక్షమునకు త్రిప్పుకొనవలెనని రెండుపక్షములు ప్రయత్నించుటతో విశ్వరాజ్య సమితి ఇరు పక్షములకు ప్రచార సాధనముగా మాత్రమే మిగిలిపోయినది. విశ్వరాజ్య సమితి ఉపాంగములగు అంతర్జాతీయ సంస్కృతి సంస్థ, ఆహారసంస్థ, ఆర్థిక, సాంఘిక, సమితి, ఆరోగ్య సంస్థ మొదలగునవి సోవియట్ రష్యా ప్రమేయము లేకుండా, పశ్చిమ రాజ్య కూటమిలోని రాజ్యములకు సహాయము చేయుచున్నవి; ఇవి కేవలము పశ్చిమ రాజ్యకూటమికి సంబంధించిన సంస్థలుగా మాత్రమే వ్యవహరించు చున్నవి. విశ్వరాజ్య సమితి సర్వసభ్య సమావేశములలో పశ్చిమ రాజ్యములకే ఎక్కువ సంఖ్యాబలము ఉన్నప్పటికీ, నిబంధనావళి లోపములవలన, విశ్వరాజ్యసమితి కార్యాచరణకు పూనుకొనలేక పోతున్నది. భద్రతామండలి, అణుశక్తి కంట్రోలు సంఘము, అంతర్జాతీయ సైనిక సమితి మొదలైన ముఖ్యాంగములు ఏమాత్రము సంతృప్తికరముగా పనిచేయుట లేదు. అందువలన ప్రపంచశాంతి భద్రతల రక్షణకు విశ్వరాజ్య సమితి వాస్తవిక ప్రయోజనము దాదాపు శూన్యము. శత్రురాజ్యములైన జర్మనీ, జపాను, ఆస్ట్రియాలతో శాంతి సంధిజరుపు విషయమున ఆవశ్యకము విశ్వరాజ్య సమితికి వుండరాదని ఆదిలోనే నిర్ణయించుకొనబడెను కాబట్టి ఆ విషయమున సమితి చేయగల్గినది ఏమీలేదు. అగ్రరాజ్యముల విభేదములు పరిష్కరించుటకు అశక్తమై, పైగా ఆ విభేదములకు తానే ఆలవాలమై, విశ్వరాజ్య సమితి నిరుపయోగమైనది.

---

# వీడ్కోలు

★

మూలం:

శ్రీ రవీంద్రనాథ టాకూర్

దేవతల ఆజ్ఞమేరకు బృహస్పతికొడుకు కచుడు శుక్రాచార్యుని సన్నిధిని సంజీవని విద్య అభ్యసించేందుకు వెళ్లాడు.

అక్కడ వెయ్యేళ్లుండి, అనేక విధాలుగా ఆట పాటలతో శుక్రుని కూతురు దేవయాని హృదయాన్ని రంజింపజేసి, తద్వారా తనకార్యాన్ని సాధించుకొన్నాడు.

దేవలోకానికి ప్రయాణంకట్టి కచుడు దేవయానితో సెలవుతీసుకునేందుకు వచ్చాడు.

ఆసమయంలో వారిద్దరిమధ్య నడిచిన సంభాషణ యీ క్రింద వివృతమైనది.

(కచుడు, దేవయాని)

కచుడు:

ఆనతిమ్మా దేవయాని దాసుండు
దేవలోకమునకు పోవనున్నాడు.
తీరెను గురుకులదీక్ష యీనాటి,
కెంతో కాలమునుండి యే నేర్చినట్టి
చదువంతిరమ్మున జాజ్వల్యమాన
మై, మేరుశిఖరాగ్రమందర్కకిరణ
నుజ్వలరత్నమై యుండగా నన్ను
దీవించు—

దేవయాని:

వెళ్లిరా - తీరె నీ కోర్కె
ఆచార్యసన్నిధి నందగారాని
విద్యలనందితి, వేయేండ్లొనర్చి
నట్టి దుస్సాధ్య సాధన సిద్ధిచెందె.

..............................

అనువాదం:

శ్రీ విద్వాన్ విశ్వం

ఇంక యేయభిలాష హృదయాన లేద?
కలయ గన్గొనుము సఖా! మనసెల్ల

కచుడు:

ఎట్టి కామన లేదు హృది గురుపుత్రి

దేవయాని:

ఎట్టి కోరిక లేద? దృష్టి సారించి
యెడద అంచుల పరికించుము సరిగ.
కనిపించ కుంత చిన్నని వలుసైన
కఱకఱ లాడు తీక్ష్ణకుశాగ్రమట్టి
కామన యేదేని కలదేమొ అచట?

కచుడు:

వాంఛావశేష మావంతయు లేదు
చరితార్థమైనది జన్మ యీ నాడు.

దేవయాని:

సుజవి ముజ్జగముల సురలోక మింక
పొమ్మని పనివిూద; పొందుము బహుమ
తుల నుచ్చిరమున; సంతోష నాదాలు
పొలయు స్వర్గమ్మున; లలితస్వరాల
మొఱయు మంగళ శంఖములు; సురాంగనలు
నందన మందార మందప్వడపుడె
కోసితెచ్చిన పూలగుత్తుల జల్లు
కురిపింపగలరు నిశిరమున; పథిని
కల కంఠముల కిన్నరులు నచ్చరలు నొ
నర్తురి 'హలూధ్వని'—అబ్బ
బ్రాహ్మణుడ!
నీవారు లేని విదేశాన కఠిన
వతనమ్మునకు కష్టపడుచు కాలమ్ము
గడపి నాడవు.

సుఖకరముగే హమ్మ

భావింపజేసి, ప్రవాస ఖేదమ్ము
వారింప నిచట నెవ్వారలు గలరు?
నిలుపేద గుడిసె నుండిన వానితోనె
అతిథి నోపినయంత అర్చించినాము.
అగుగాని, స్వర్గ సౌఖ్య మ్మెట్లు వచ్చు?
నిర్మల సురకామినీ ముఖాలేవి
యిక్కడ?
అతిథి సత్కృతి సేయునెడల
దొసగు లేవైనను దొరలినవేమొ!
మరచి పొమ్మనియెల్ల సురలోకమునకు
చనిన తర్వాత, కచా—

కచుడు:

దేవయాని!
సెలవిమ్ము మిసిమి నవ్వొలుక దాసునకు

దేవయాని:

నవ్వ నూ టేటికి నాచెలికాడ?
ఇది సురలోక మంచెంచితి వేమి?
హృదయాంతరమున గ్రుచ్చిన వాంఛయొకటి
పువ్వున పురుపునా పొడుచుచు నుండ
ముడిగిన తామర కడ తమిగొన్న
తేటిపా రెకు చుట్టు తిరుగుచున్నట్టు
వాంఛ వాంఛిత మంటి పందురు చుండె
సుఖమేగ నాస్మృతి శూన్య గేహమున
నొంటిగ నిట్టూర్చుచున్నది—ఇచట
నవ్వ సులువుగ వచ్చునది కాదు సఖుడ
వెళ్ళిరా నీకయి వేచియుందురు సు
దులు, కాలయాపనవలదు:—

అట్లైన
పోయెదవానఖా? మూడు మాటలనె
వెయ్యేళ్ళ నేస్త మీవిధముగ ముగిసి
పోయెనా త్రుటిలోనె?

కచుడు:

నాయందు దోష
మేమున్న దిందులో

దేవయాని:

ఏమున్నదవునూ!—
ఈవన సుందరి యీవేయి యేండ్లు
చల్లని నీడల నమకూర్చె నీకు;
చివురుల రవళి పక్షిగణ కూజితము
వినిపించినది. నేడు వీని నన్నిటిని
విడనాడి చల్లగా వెడలి పోయెదవ?
వనమున తరులెల్ల వాడిపోయినవి.
వెతమున్గె నోయన విపినంపు నీడ
చిమ్మ చీకటి గ్రమ్మె-శీర్ణ పత్రములు
రాలుచున్నవి, గాలి గోలున యేడ్చె -
నీవే మొ చిరునవ్వ మోవిపై దొలంక
వెడలు చున్నాడవు, వేకువగన్న
సుఖమయ స్వప్నమ్ము చొప్పన -

కచుడు:

దేవి
యౌవనభూమి భావింతు తల్లి నిగ
ఇట నూత్న జన్మ ప్రాప్తించెను నాకు.
శాశ్వత ప్రేమ సంస్మరి యించువాడ -
వని ననాదర మెప్పు డొనరింపబోను

దేవయాని:

అలమేపుచు మజ్జి యరుగున జేరి
మండు టెండల మట్ట మధ్యాహ్న వేళ
నిద్రించు చుంటివి, నెనరున మజ్జి
తన నీడలంగప్పి తలిరు వీవనల
విసురుచు సుఖ సుప్తి యొసగుచు నుండె.
పోదువ లెమ్ము - ఈపాద పస్థలిని
కాసేపు కూర్చుండి నీసహచరుని
తో నంప్రతింపుము - తొందరపడకు
ఈయింత తడవు మీ యింద్రలోకమ్ము
నకు నష్టమేమి సంధానించ గలదు?

కచుడు:

చిరకాల పరిణత స్నేహమీ తరువు,
వీడ్కొను వేళ నవీన మూర్తులను
కన్పడు చున్నది. కమ్మనివలపు
బలిసిన స్మృతి పాశముల పారిపోవు
నేస్తుని గట్టిగా నిలవేయుచుండె -
ఆశ్రితమిత్ర వృక్షాధిపా! కచుని
వందన శతముల నందుకోవయ్య -

నీ నీడ నలత చెందిన పాంథులెంద
రో విశ్రమింతు, రంతే వాసులెంద
రో నీప్రశాంత కారుణ్య సంఛాయ
చారల గూర్చుండి చదువుకో గలరు —
ప్రొద్దుట ముని కుమారులు నీటమున్గి
వచ్చి నీ కొమ్మల పయి తడి బట్ట
లార వేయుదురు, గోపాల బాలకులు
నీ నీడ నాటలెన్నో నాడు కొంద్రు —
ఈకొత్త నేస్తుల మూకనందడిని
మునిగి నీపాత మిత్రుని మఱవకుము

దేవయాని:

మన హోమధేనువు మరచి పోకయ్య
అమృతముం ద్రావి మదాంధత గొనకు —

కచుడు:

అమృతమ్ము కంటె యీ యావుపాలెంతొ
మహితమైనది దీని మంగళవదన
వీక్షింపగా శమియించు పాపములు
చల్లని చూపుల జల్లు గోమాత
నలత యాకలి దప్పియను మాటమరచి
కనిపెట్టి యుంటి కీకారణ్యమందు ;
తృణయుత స్రోతస్వినీ తీరభూమి
మేపుచుంటిని దినమెల్ల ; గట్టులను
చిక్కని మెత్తని చివురు పచ్చికల
కడుపార మేసి వెక్కసపు టలంత
తరుతల మెల్లన దరిసి దూర్వాస
నమున విశ్రమియించి, నెమరు వేయుచును
శాంత దృష్టుల కృతజ్ఞత కూర్మికలిమి
పెనగొన నన్ను సంప్రీతి వీక్షించు.
కొన నాలుకను చేయిగొని నాకుచుండు
నట్టిగోమాత స్నిగ్ధాక్షి వీక్షణలు
నిండు కాయమ్ము రాణించు ముచ్చటల
కుచ్చుతోకను మనఃకుహర మందెపుడు
దాచియుంతును, సర్వదాస్మరియింతు.

దేవయాని:

సరిగాని, — కలరవముల ప్రవహించు
మన వేణుమతిని నెమ్మదినుంచుకొమ్ము.

కచుడు:

పూబొదలందూరిపోవుచు మధుర
మంజుల కల గానరంజితమ్మగుచు
పల్లెపడుచునువోలె పరువెత్తునీమె
సేవజేసితి ; ప్రవాసావసరావ
చేదోడుగానున్న చెలివేణుమతిని
మఱతునా ?

దేవయాని:

నేస్తుడా పరగృహవాస
ఖేదమ్ము మరపింప నీదండ నిలిచి
రేయింబవళ్లు, కూర్చిన చెల్మికత్తె
యెవరైన నున్నదా యీ ప్రవాసమున ?—
అయ్యో! అడియాస !

కచుడు:

ఆయమ పేరునాడు
చిరజీవితమున మిశ్రితమయిపోయె.

దేవయాని:

అలనాడు నీవిట కరుదెంచినట్టి
వలనెల్ల తలపున పరువెత్తునిపుడు —
తరుణ వయస్సు, పాండుర తనుదీప్తి,
దివ్యతేజస్సు చిందెడు ముద్దుమోము,
నుదుట గంధపుపూత, యెదపూలమాల,
పట్టుపుట్టము, కను పంచలమోవి
ముంగల చిరునవ్వు మొలకలు — వెలుగ
విప్రకిశోర మీవీ పూలతోట
కేతెంచి నిల్చితివి—

కచుడు:

ఈవునుస్నాన
మపుడపుడే చేసి యార్ద్రకేశముల
వెలి వలిపముగట్టి, మిలమిల మెఱయు
నుషవోలె పూబుట్ట నొకచేతబట్టి
ఒంటిగా విరుల కోయుచు నుంటివిచట
దేవార్చనమునకై ; దేవి నమోస్త
టంచని చెప్పితి ; అలతనీకేల
పూలగోయగ నాజ్ఞపుత్తెంచుమంటి

దేవయాని:

విస్మితులాలనై వింటి నీ తెరగు
వినయమ్ముతో నీ విట్లంటివపుడు :
'మీ పితృపాద సమీపమ్మునందు
విద్యార్జనము సేయ వెదలివచ్చితిని
సురగురు పుత్రుడ కరుణించు దేవి'

కచుడు:

తటపటాయించితి దానవగురువు
వేల్పుల వారిని వెడలించునేమొ!

దేవయాని:

అపుడె వెళ్ళితి తండ్రియంతికమునకు
'ఒక్కయర్థన' అని యొయ్యననంటి
నా తలనిమురుచు నయగారమొప్ప -
'చిట్టితల్లీ చెప్పవేమి కోరైన'
నని తండ్రి. 'సురగురు నందను డిటకు
విద్యార్థియై వచ్చె వినవె' యంటి—
అదియెంత కాలమో యయ్యెను, కాని
ఉదయాన జరిగినట్లున్నది చూడ.

కచుడు:

చంపిన మూఁడుమారులు దానవాళి
నన్ను చంపెను - నీవు నా ప్రాణములను
మరలించితివి దయాపరవశవగుచు -
ఆ మాట మనసున నే మాటుకొంటి ;
నే కృతజ్ఞుడ నౌదు నెల్ల కాలమ్ము.

దేవయాని:

ఎవరికి కావలె నీ కృతజ్ఞతలు!
మరచిపో! వగవ రెవ్వరు ; నే నొనర్చి
నట్టి మేలెల్ల పాడయిపోవనిమ్ము.
ఇచ్చిపుచ్చుకొనంగ నే నిచ్చగింప,
ఆ కృతజ్ఞతమాట అట్లుంచి వినుము ;
మనసున నే సుఖస్మరణయు లేద ?
ఆనందగీతి యేదైన నీయంత
రమ్మేదినమ్మైన రంజించ లేద ?—
సాయంతనమ్మేటి చాయల నున్న
తోటలో కూర్చుండి పాఠాలు నువు
చుండ నేనో కైన నిందు బడంద
పులకాంకురమ్ముల పొంగిపోలేద ?
పూవులపొదలు సంధ్యాపియత్తలము
వలపుటూర్పుల వలపులు చింద లేద?
ఇట్టి సుఖస్మృతు లేవైన నున్న
జ్ఞాపకముంచుకో! నాపట్లకృతము
దవ్వులనుంచుము. తరుణుడా ! యిచట
నేపాటి యేని నీ యెడదకు హాయి
చేకూర్చెనా ? కల్ల చెమరుపనిందు
మనసున నీ లేమ కనిపించె నంద
చందాల రాశిగా చక్కని దంచు
నిట్టి వల్వనుగట్టి నట్టియే వనిత
నైన కనుంగొని యభినుతించితివ ?
-ఇట్టి సుఖస్మృతు లేవైన నున్న
తలపోసుకొను తిరుబడి యున్నయపుడు
దివిజ లోకమ్మున దేవకుమార -
అంతరాళమ్మెల్ల నాషాఢ నీల
జటలు నా జలదముల్ జడివట్టి వాన
గురియ న నధ్యాయముల పనిలేక
కూరుచున్నప్పుడు కొండతలంపు
బరువులు నీ తపోవనసీమ నెన్ని
దినములు నీగుండె తిని వేసినవియొ ?
ఈ విపినస్థలి నెన్నిదినాలు
వంతలేలేని వాసంత యౌవనము
మోదతరంగ సమ్ముగ్ధమై పొంగి
గానము సేయు నుత్కంఠ వాహినులు
తీవెల నాకుల పూవుల కనుల
పొంగిపోయి, ఒక్కొక్క పొరలిక నిన్ను
నానందమున తేలి యాడించి నవియొ?
ఉషసు, వెన్నెల, పూవు టూర్పుల క్రిక్కి-
రిసిన యమానిశాగీతు లీవనుల
నీ జీవితమ్మున నెనసి పెనంగి
సుఖ దుఃఖముల నెన్ని సొక్కిపోయినవో ?
తలపున నొకసారి కలయ గన్గొనుము.
ఉషయొ? సంజయొ? ముగ్ధనిశయొ, సంతసమొ!
సుఖమొ? యెదో ఒక ముఖమొ?-అవ్వాని
లోనెన్నో నీలోన లీనమై శాశ్వ-
తమ్ముగా రాత్రిం దివమ్ములు చెదని

చిత్తరు వేరైన సృష్టించ లేద?
ఉపకార మొక్కటేనా ఉన్నదింక ?
చెలువము లేద? ఏవలపును లేద ?
ఇం కేదియును లేద? ఏమోయి సఖుడ ?

కచుడు:

ఏదింక కలదో వచింపగా రాదు –
హృదయ రక్తమున సమ్మిశ్రితమైన
దెబువలె వెలికి చూపింతును చెలియ ;

దేవయాని:

తెలిసికొంటిని సఖా ! తేట తెల్లముగ –
కను రెప్ప పాటటు కంపించిపోయి
హృదయాంతరమ్మున సన్ని దోసార్ల
కనుగొంటి నీమది; కనుక నే నేటి
యీ చెలి యలుక; వసింపు మిచ్చటనె !
వెడలిపోకుము. కీర్తి విభవమ్ము నందు
హాయి లే, దీ యేటి చాయల జేరి
మన మిద్దఱము నూతన దివమ్మొకటి
సృష్టించుకొని ఒరు లెవ్వరు లేని
కానన చ్ఛాయల కరగి పోవుదము.
కలికితో చని కలంతలు లేని లేమ
డెందలు రెండు కట్టాయితమ్ములయి
సర్వ బాహ్య ప్రపంచము విస్మరింప
గావుత సఖుడ నే కనిపెట్టి నాను
నీగుట్టు –

కచుడు:

దేవయానీ కాదు, కాదు !

దేవయాని:

కాదు ? ఛో—పట్టిదగా ! నీ మనస్సు
చూడ లేదా నేను ? గూఢమైయున్న
నీ ప్రేమ నెఱుగనా ? నేస్తుడా – వికసి
తమ్మైన కుసుమమే తలిరుజొంపముల
దాచిన మాత్రనే దాగునా వలపు ?
మొగమెత్తినపుడు, కందొగవిరిసినపుడు,
నా నవ్వరిమ్మును విన్ననాడు – నీ మొకద
ప్రతియంగకమ్మున కంపనమొంద లేద
పరికించితిని దాని, దొరికిపోయితి వి
నాకు బందీవయినావు నిశ్చయము –
తప్పించుకోలేవు తన్వంగి నింక –
దొర యిక్కపై సురేంద్రుడు కాడు – నేను –

కచుడు:

తొయ్యలియుండుగా దైత్యేంద్రుదైత్య
పరిసరమ్ములపడ్డ పాళ్లెల్ల ?

దేవయాని:

ఏల
కారాదు ? చదువునకై మాత్రమేన
జగమున జీవులు జగతెందు కెల్ల ?
వనితకై యెవరు తపము సేయు లేద ?
పత్నివరమును సంపాదింపదలచి
తపతికోసము కురుధానుని సూర్య
గనుగొంచు నాహారమును మాని ఘోర
సాధన సేయరో సంవరణుండు ?
చదువొక్కటే కష్టసాధ్యమా ? ప్రేమ
ఊరకే దొరకునా ? ఓపిక పట్టి
వెయ్యేళ్లు దేనికై వెతజెందినావో
అది యెఱుంగవు నీవు – చదువొక ప్రక్క
నే నొక ప్రక్కగా నిలుచుంటి మోయి !
విశ్వవైభోక వరి వెలది నన్నొక్క
వరి, వరికింపుచు సురసురపతిని
ఎన్నాళ్లుగా నటు నిటు కొట్టుకొనుచు
మ మిద్దఱను సమానమ్ముగ మదిని
ఆరాధనము సేసినాడవు ; నేడు
మే మొక పట్టున మెచ్చి వరించి
చేపట్టుమని వచ్చి చేరితి మింక
ఒకరిని వరియించి యొకరిని విడువ
సమయమ్ము వచ్చెను – సఖుడ ! అధ్యయన
మున లేదు సుఖము, కీర్తిని లేదు హాయి
దేవయానీ నీవె దేహముంగొన్న
సిద్ధివి, 'నీ కా వరించితి' నంచు చిఱుత
సిగువతో వచియించితేని, రోషతియు
కలుగదు ; దీనసిగ్గిలపని లేదు.

ఎలనాగ యెడదవేయేదులపాటు
పనిచేసి సాధించవలసినధనము.

కచుడు:

దేవసన్నిధిని ప్రతిజ్ఞ గైకొన్న
వాడ 'సంజీవనీప్రథిత విద్యను గ
డించి స్వర్గమునకే తెంచెద' నంచు.
అందుకై వచ్చితి, నంతరాంతరము
నందున్న దే అది—అబ్బ! యీనాడు
నెఱవేఱినది! యింక చరితార్థమయ్యె
నాజన్మ; యిప్పట్ల నాకయిదేని
గాని యపేక్షించు కామన లేదు —

దేవయాని:

ఛీ అబద్ధీకుడా ఛీ! ఒక్క విద్య
నే కోరినాడవా? ఈ గురుకులము
నందొక విద్యార్థివై యేకతమున
శాస్త్రమ్ములందె వీక్షణములనిల్పి
పవలు రాతిరి చదువందె నిమగ్ను
డైతివా? మరియున్ని త్యజియించినావ?
పాఠశాలకు బోక పైపైని వనుల
వెంబడి దిరుగుచు విరులను గోసి
హారముల్ గూర్చి నిత్యము దరహాస
వికసితాస్యుడవయి విదుపిని కాని
నాకేల యొసగితి వో కామ జేత?
విద్యార్థియగు వానివృత్తి యిదేన?
దారుణమైన నీ తపమిదియేన?
ఉదయ మనధ్యాయముల పూలబుట్ట
గైకొని నేముందు గన్పడి నంత
పుస్తకమ్మావల పోద్రోసి వచ్చి
మంచు చిన్కుల తడియంచులనున్న
విరిసిన విరులను కురిపించి తేల?
సంజల పాదుల జలములు వోసి
బడలినయపుడు నాపయి దయసూపి
చెట్లకు నీకేల చిలకరించితివి?
తనపాఠములను చింతన సేసికొనక
మేత నీకొట్టి నా మృగశాబకమ్ము
ప్రేమతో లాలించి పెంచితి వేల?
మునిమాపు చీకటి ముంచుకవచ్చు
పట్టున నిశ్శబ్ద వాహినీ తీర
మున గూరుచుండి నాకను లరమోడ్చ
మిసిమి చాయలదేలు పసియాకులట్టు
లవశమైయుండ నీ యమర గానమ్ము
వినిపించి వినిపించి తనియించి తేల?
విద్యకోసము వచ్చి విబుధ చాతుర్య
మెలయించి మనసు దొంగిలి నాడవేల?
ఇన్నులో కేసుక నాతండ్రి మనసు
నం జొచ్చి పనితీరి నంతనె యిపుడు
చేసిన మేలు నే చింతింతు నంచు
నొక చిన్నమాట నా మొకమున విసిరి
పోవుచున్నాడవు — భూపతి జూచి
వాంఛ తీరినయర్థి, వాకిట నున్న
కావలివాని కో కాసిచ్చి నట్లు!

కచుడు:

అబ్బ మానినులెంత అభిమాన వతులు!
నిజము విన్నంతన నీకేటి హాయి?
సత్యమ్ము నేను వంచన సేయలేదు.
కల్ల కపటములేక యుల్లమ్ము విరియ
నీకు సమ్మోదమ్ము చేకూర్చినాడ
పనులొనర్పుట నెట్టి పాపమేయున్న
దానికి విధిశాస్తి దయసేసినాడు
ఆమాట లికనేల? అత్యంత ముక్క
నాకుమాత్రమె చెందినట్టి నాయెడద
తెలిసిన ముల్లోకముల నెవ్వరికిని
లాభము లేదు — ఏలా చెప్పమనెదు?
వలచితినో లేదో? వాదింపువల్ల
ఫలమేమి? ఇంతకు పనిపూర్తియయ్యె!
సురలోక మికమీద నరకమ్ము వోలె
కనిపింపనీ!— క్షతగాత్రమైనట్టి

మృగము పోలికమది వగగుంది చిక్క-
యేవనాంతర మందొ పడ్వనీ!-దగ్ధ
హృదయ మధ్యమున నాచిర కాంతియెల్ల
వేళల రగులనీ!-వేసటలైన
నేమైనగాని పోయెద తప్పకుండ
సుఖశూన్యమైన యాసుర ధామమునకు!
దివిజులకెల్ల నీ దివ్యసంజీవి
నీ విద్యచే నవదేవత్వ మొసగి
నపుడు నా జన్మము సార్థకమగును.
అంతటివరకు నా హాయినిగూర్చి
తలపోసుకొనజాల - తరుణీక్షమించు
క్షమియించు దాసగుల క్షమియించునన్ను -

దే వ యా ని :

నామది క్షమయేది నా క నివాసి ?
కఠిన వజ్రము చేసి కాల్చితివీసుద
తీ హృదయమ్మును దేవబ్రాహ్మణుడ!
వళ్ళిపామ్మిక దివో వేశ్మకు మహిత
గౌరవమ్మున ; నిజకార్య ప్రకర్ష
పులకించి వగ లెల్ల పోద్రోలుకొమ్ము.
నా కేమి కార్యమున్నది యింక నిచట!
విఫలమీ దగ్ధ జీవితమునందింక
నేమున్నది? - ఎవ్వరికిందు గౌరవము?
ఈ కాననమ్మున నేకాకినగుచు
నేమిటి నెంచక, యేయాశ లేక,
యెందుకో తెలియక, యే దలవంచు
కొని పడియుండెద ; నే ప్రక్క కనుల
మరలించినను వేయితలపులు సూడు
లట్టుగుచ్చుకొను ; గుండెలం జేరుకొన్న
సిగ్గుసారెకు విమసిక్తదంష్ట్రికల
కలచుచునుండు—

శ్రీకరుణావిహీన

పాంథుడా యిటకేలవచ్చితివీవు ?
నా జీవితోప వనచ్ఛాయగొంత
సేపు విశ్రమియించి, జీవనసౌఖ్య
సుమముల గిల్లి దామము నొక్క-సూత్ర
మున గూర్చితివి. నీవు చనియెడి వేళ
దాని నీగళమున ధరియించుకొనక
యేహ్యభావమున నాయింతమాత్రమ్ము
రెండుగా పుటుకున త్రెంచివేసితివి.
ధూళిలో దొరలించి గాలికి వదిలి
నీదారినీవు పోనేపోవుచుంటి
వీజీవితమహత్వ మెల్లనుమట్టి
పాలు సేసితివి.

శాపమ్మిత్తునీకు.

ఎందుకై నన్నవ హేళచేసితివో
ఆవిద్యనీకు సమగ్ర మెన్నటికి
కాకుండుగాత; నీకది భారమాత్ర
మైయుండు, నీకు భోగార్హము కాదు.
నేర్పుటకే కాని నీవు ప్రయోగ
మొనరింప నావిద్య యొనరదు పొమ్ము -

క చు డు :

నేవరమ్మిచ్చెద నీకు - "సుఖోస్తు
మహితగౌరవ భాజమానవై యెల్ల
యిడుముల విస్మరియింతువుగాక."

# ఖర సాహిత్య సమీక్ష

★

"శ్రీ వాత్సవ"

ఖరనామసంవత్సరం కరువులకు ప్రసిద్ధి. ఆ ప్రసిద్ధికి లోటు రానీయకుండా ఈ సంవత్సరంకూడా ఎక్కడచూచినా కరువుపరిస్థితులే ఏర్పడ్డాయి. ప్రపంచమంతటా యుద్ధభయం ఆవరించి ఎవరి మనస్సులోనూ శాంతి లేకుండా చేసింది. దానికి తోడు కృత్రిమవాతావరణం; జీవితావసర వస్తువులకు ధరలు పెరిగిపోయి జన సామాన్యం తమ కొలది రాబడితో సరిపెట్టుకోలేక ఉక్కిరిబిక్కిరవుతున్నారు. పెద్ద పెద్ద రాజ్యాలమధ్య పోటీలూ, ఆయుధ సమీకరణలూ, యుద్ధసన్నాహాలు ఒకరిమీద ఒకరి పోటీతో సాగుతూనే ఉన్నవి. ఈ సందర్భంలో చాల దేశాలలో ఎన్నికలు జరిగాయి. ప్రభుత్వాలు మారిపోయాయి. కొత్త ఆర్థికవిధానాలు పేరు చెప్పి ఏమీ అనులుపరచలేని అభ్యుదయ పక్షాలకంటె, ఏదో మంచిదారిలో పెట్టి జీవనసమస్యలు కొంతవరకయినా తీర్చగలరనే విశ్వాసంగల పక్షాలవారినే ప్రజలు ఎన్నుకొన్నారు. బ్రిటన్లో, ఆస్ట్రేలియాలో, న్యూజిలెండులో ప్రభుత్వాలు చేతులు మారాయి. తూర్పుదేశాలలో యుద్ధబాధలకు తోడు, తిండీ బట్టల కరువు సాగుతూనే ఉంది. ప్రజలంతా అట్టుడికినట్టు ఉడికి పోతున్నారు. మధ్యప్రాచ్యంలో పర్షియా నూనెగనులలోంచి బయలుదేరిన బడబానలం చల్లారలేదు. ఈజిప్టులో సూయెజుకాలువనుగురించిన కలహంకూడా శాంతించలేదు. ఎక్కడచూచినా అశాంతి, అరాచకం నగ్న తాండవం కావిస్తూ ఉన్నాయి. ఈ సమయంలో బ్రిటిష్ సింహాసనాధిపతి పరమపదించాడు. ఒక స్త్రీకి ఆ పదవి సంక్రమించింది.

మన ప్రజలలో ఇటు అమెరికనుల పూంజీవాదమూ, రష్యావారి సామ్యవాదమూ కలవరం కలిగిస్తున్నాయి. ఈ వాదాల యొక్క ప్రాముఖ్యం మన ప్రజలకు తెలిసినా తెలియకపోయినా ఏదో ఒకవైపుకు బలంగా ఆకర్షణ పొందుతూనే ఉన్నారు. ఈ సంగతి యీ సంవత్సరం జరిగిన ఎన్నికల్లో స్పష్టమయింది. ఎన్ని పక్షాలవారు పోటీచేసినా—మొత్తంమీద ప్రజలయొక్క అవసరాలు తీర్చగలవారినే వోటర్లు ఎన్నుకున్నారు. ముఖ్యంగా మన రాష్ట్రంలో ఓటర్లు తాము పడుతూఉన్న నానాకష్టాలూ తీర్చగలరని చెప్పినవారినే ఎన్నుకొని పంపారు. సంవత్సరం పూర్తి అయ్యేటప్పటికి రాజకీయ సమస్యలలాగే ఆర్థిక సమస్యలు కూడా పరిష్కారంకాకుండా ఉన్నవి. తిండి, బట్టతోపాటు నీటికి కూడా కరువు ఏర్పడి కటకటలాడిస్తోంది. రాయలసీమలోని భయంకర క్షామం పేదజనాన్ని చెంబేలు పెడుతూనే ఉంది. తెలంగాణాలో రాజకీయాలు ఎటు మారినా సామాన్యమానవుడి నిత్యకష్టాలు దూరమయ్యే శుభసమయం ఇంతట్లో వచ్చేటట్టుగా లేదు.

ఇంత దుస్థితిలో కూడా తెలుగువాడు నిరాశావాది కాడు. ముందు రానున్న భూలోకస్వర్గాన్ని ఊహించుకొని కలలు కంటూనే ఉంటాడు. ఆశాసౌధాలు నిర్మించుకొంటూనే ఉంటాడు. నిండుజీవితం జీవిస్తానే ఉంటాడు. వెలుపలి ప్రపంచంలో ఇంత భీభత్సమైన పరిస్థితులుంటే మన కవులు రామాయణం, మహాభారతం తిరుగ వ్రాస్తున్నారు. జరిగిపోయిన చారిత్రిక ఘటనలను ఉగ్గడించుకొని సంతోషిస్తూ ఉన్నారు. వసంతాలను గ్రీష్మాలను వర్ణించి ఆనందిస్తున్నారు.

ప్రకృతిలో పరధ్యానం చేసే కవులు కొందరుంటే ప్రణయంలో నిమగ్నులయ్యేవారు కొందరు. ప్రేమ కవిత్వాలూ భావ కవిత్వాలూ పాతబడిపోయాయని ఎంత ఘోషణ చేస్తున్నా ఈ కాలంలో కూడా ప్రణయగీతాలు వ్రాసేవారు లేకపోలేదు. "పూలలో జ్వాలలు" తాకిచూడండి.

> నాకు నీ యింటి వెనుక పున్నాగ పూచె
> నేను నీ యింటిముందు కన్నె జాజె నై
> పారిజాత శృంగార మందార కుసుమ
> అరుణ తరుణప్రభాతి భాస్కరసముద్ర
> అంత చల్లని నీ గుండె యందజేల
> కోప మగ్ని కీలామాలికోపముగ్ర
> ఇంత చల్లని ఈ పూలచెంత ఏల
> పెకలివచ్చు వహ్ని జ్వాల విద్యుదిదయు......దాశరథి.

ఇవిగాక పూర్వథోరణి కథాకావ్యాలు వ్రాసేవారున్నారు. ఈ కావ్యాలలో రీతి, శయ్య పాకములను తాత్కాలికంగా ఆకర్షిస్తాయి తప్ప చెప్పదగిన విశేషం ఏమీ ఉండదు. కరుణశ్రీ రచించిన పద్యభారతంకృతిలో కర్ణుని గూర్చి కుంతి అంటున్నది. వినండి—

> "చిన్ని పెదవుల ముత్యాలు చిందిపడగ
> కలకలమటంచు నవ్వవే గాని కన్న
> అమ్మ కష్టము తన యదృష్టమ్ము గూడ
> నెరుగ జింతియు నా యమాయకపు బిడ్డ."

ఇదే పద్ధతి కథాఖండికల సంపుటిగా వెలువడిన మరొక మంచి కావ్యం ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారి 'దక్షారామము'. ఇది కొడాలివారి హంపీక్షేత్రము విధాన చక్కని యతిప్రాసలతో చక్కని పద్యాలతో కూర్చబడింది.

దక్షారామంలో బ్రహ్మసూత్రాలు రచించిన వ్యాసుణ్ణి చూడండి—

> ముదిరిన గాంభీర్యముద్రలో ధర్మజా
> పౌరుష గర్వసత్త్వములు తొణకు
> చూచిన చూపులో లేచి వెళ్లెదు వాసు
> దేవుని రాజనీతిజ్ఞ గరిమ
> పంచిన కనుబొమ్మవంపు పుక్కిట బట్టు
> పూరిత గాండీవ భుగ్నకోటి
> కలిగిన కడగంటి మకిపులో నిలిచె పాం
> చాలి వేనలి పోగనీలిరేఖ
> ఎత్తిన శిరమ్ము సొగసులో హత్తుకొనెను
> రాగ సురరాజమణి యభిమాన కళిక

సైతం యీ విధానంలో చెప్పడంవల్ల మరుగుపడిపోవడంలేదా? అని విమర్శకుల ఫిర్యాదులు. కవి అంటాడూ, 'సంఘం ఈనాడు కల్లోలంలో ఉన్నట్టు ఉంది. ఆ సంఘానికి ప్రతినిధి కవి. ఆ సంఘంలోని అరాజకం, అశాంతి రూపం పొందించడానికే ఇలాంటి ఛందస్సులూ, భాష, రూపకాలూ వాడుతున్నాం. సంఘాన్ని తబ్బిబ్బుచేసే కార్చిచ్చులో ఏ కొంచెం వేడిమా రచనలవల్ల మీకు కలిగినా మాకృషి ఫలించినట్టే' అని.

ప్రాత కొత్తల మధ్య బయలుదేరిన యీ సంఘర్షణలో తిరిగి గొప్ప కవులందరూ ప్రాతవిధానాలను ఆశ్రయిస్తున్నారు. ఈనాడు పాశ్చాత్య సభ్యజగత్తులో పేరుమోసిన కవులంతా పూర్వపు గ్రీకు రోమన్ పద్ధతులలో కావ్యరచన సాగిస్తున్నారు. బరువుగల పెద్ద ఛందస్సులలో గ్రీకు మహాకావ్యాలవంటివి వ్రాస్తున్నారు. అలాగ వ్రాసిన ఇలియట్ కవి పద్యనాటకం *Cocktail Party'* గొప్ప పేరు సంపాదించింది. ఈ విధానంలోనే *Christoper Fry* అనే నాటకకర్త *Venus Observed* అనే పద్యనాటకం వ్రాసి గొప్ప ప్రఖ్యాతి సముపార్జించారు. నాటకరంగంలో కూడ కేవలం వచనంతోనే వ్రాసిన నాటకాలు పోయి పద్యాలతో కదను తొక్కించిన నాటకాలు మన్నన లందుకొంటున్నాయి. మిగతా అన్నిరంగాలలోలాగే సాహిత్యంలో కూడా ఒక చక్రం తిరిగి వచ్చింది. అరాజకం, అశాంతి ప్రబలి నీచాతినీచస్థితికి దిగిన భావవిధానంలోనుండియే, తిరిగి దివ్యాతిదివ్యమైన ఉన్నతశిఖరాలను అందుకోగల ఉత్తమ ఆశయాలు ఉద్భవిల్లుతున్నాయి. పాశ్చాత్యప్రపంచంలో జరిగిన పరిస్థితులే మననాట కూడా తిరిగి పరిఢవిల్లగలవు అనడానికి సంశయం ఏమీలేదు. తిరిగి కవిత్రయంవంటి కవిసత్తములు, పింగళి సూరనవంటి కల్పనానిపుణులు ప్రభవిస్తారు. కాని అది జరిగేవరకు కొంతకాలం నేడు మనం చూస్తూఉన్న స్తబ్దతలాంటిది అనుభవించక తప్పదు. పద్యకవితకే మూర్ధాభిషేకంచేసే కాలం పోయింది. నేడు ఎక్కడ చూచినా కవిత్వానికి ఆదరణే లేకుండా ఉంది. ఇది చూచి కవులు పద్యకవిత రచించడమే మానివేశారు. విదేశాలలో పద్యకావ్యాల ప్రకాశన బహు నష్టదాయకంగా పరిణమించింది. ఈ దుస్థితి భరింపలేక కొందరు సహృదయులు ఇంగ్లాండులో కవిపోషకనిధి స్థాపించాలని సూచనచేశారు. అయితే ఆత్మాభిమానం కల కవులు అటువంటి సహాయక నిధివల్ల బ్రతికే కంటె అలాంటి కవితారచన చేయకపోతేనేం అని సహాయంవద్దని నిరాకరించారు. ఇటువంటి అనుభవమే మనదేశంలో కవులకు కూడా పద్యకావ్య ప్రచురణవల్ల కలుగుతుంది. మునుపటివలె వారిని ఆదరించి సత్కరించే శ్రీమంతులూ లేరు; కవితాపోషకులూ లేరు. పద్యకవితే సన్మానవస్తువు అనే సంప్రదాయం పోయింది. నేటి ప్రజాయుగంలో చదువరులు ఎక్కువమందిని ఆకర్షించి వారి అభిమాన పాత్రులయిన వచనరచయితలకు కూడా సన్మానాదరాలు లభిస్తున్నవి.

ఈ ప్రజాయుగంలో, సంఖ్యాబలంచేత నిర్ణయాలు జరిపే సమయంలో వచనానికి గల పలుకుబడి పద్యరచనలకు లేదు. వచన రచనలో కూడా అందరికీ సులభంగా అర్థంకాగల శైలిలో ఉన్న రచనలు బహుళప్రచారం పొందుతున్నాయి. కేవలం వినోదంకోసం ఏవి వ్రాసినా చెల్లుబడి అయిపోయే రోజులుకూడా గడచిపోయాయి. వస్తున్న రచనల్లో మంచిచెడ్డల వివేచన చేస్తున్నారు. ప్రయోజకత్వాన్ని అభిలషిస్తున్నారు. వినోదానికి తోడు విజ్ఞానభిక్ష అర్థిస్తున్నారు.

ఏ విషయంగురించి వ్రాసినా కూలంకషమైన పరిజ్ఞానం కోరుతున్నారు. ఆషామాషీ వ్రాతలు తృప్తి కలిగించడం లేదు. ఇది చూచే తెలుగుభాషాసమితి అనే సంస్థ ప్రభుత్వప్రాపకంతో స్థాపించి ఒక విజ్ఞాన సర్వస్వం ప్రకటించాలని సంకల్పించారు. వెయ్యేసి పుటలు గల పన్నెండు సంపుటాలుగా ప్రచురించాలని వారి ఆశయం. ఇప్పటికి వారు ప్రచురించిన మచ్చుతునకలు చూస్తే జనసామాన్యానికి యీ భాష ధోరణి బహుదూరంలో ఉన్నట్టు తోస్తుంది. కొమర్రాజువారు ప్రారంభించి కీ. శే. దేశోద్ధారకులు కొనసాగించి ప్రకటించిన సంపుటాలు వేయిరెట్లు మెరుగులుగా ఉన్నవి. ఆ విధానంతో - ఆ శైలితో ఇదే సంస్థ ద్వారా మిగతా సంపుటాలు పూర్తిచేయడానికి ప్రజలు ప్రభుత్వం సహకరిస్తే ఒక మహత్కార్యం నెరవేరినట్లు చేయగలరు. కాని అటువంటి కలిసికట్టుతనం తెలుగువారిలో అరుదు. ప్రతి ఒక్కడూ ఒక ఉద్యమం - ప్రతిఒక్కడూ ఒక సంస్థ. ప్రతి ఒక్కడూ ఒక మహానాయకుడు.

ప్రయోజకమైన విజ్ఞానం అందజేయడానికి తెలంగాణాలో వర్ధిల్లుతూ ఉన్న ఆంధ్రసారస్వత పరిషత్తు అమూల్యమైన కృషిచేస్తూ ఉంది. వారు సైన్సుకథ అని చక్కని పుస్తకంలో సామాన్య విజ్ఞానం సరళశైలిలో అరటిపండు ఒలిచి పెట్టినట్టు వ్రాయించి ప్రకటించారు. ఆంధ్రుల సాంఘికచరిత్రనుగూర్చి ఇదివరలో హైదరాబాదు వాస్తవ్యులే సురవరం ప్రతాపరెడ్డిగారు ఒక అమూల్యగ్రంథం ప్రకటించారు. అదే పద్ధతిలో హైదరాబాదు వారే-శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు ఆంధ్రులసంస్కృతి చరిత్ర అని ఆంధ్రులగూర్చి అనేక వివరాలతో కూడిన మహద్గ్రంథాన్ని ప్రకటించారు. ఇలాంటి గ్రంథాలు, అన్ని దేశాలలోనూ, అన్ని జాతులగురించీ వెలువడ్డాయి. స్కాట్లండు అని పేరుతో స్కాట్లండుదేశం, నైసర్గికం భూగోళం— ఖనిజాలు, జనం, కళలు, సాహిత్యం, సంస్కృతి, పరిశ్రమలు మొదలయిన అంశాలమీద ఆయావిషయాలలో ఆరితేరిన నిపుణులచేత వ్యాసములు వ్రాయించి ఒక సమగ్రగ్రంథం ప్రకటించారు. దానికి చక్కని బొమ్మలు, ఉదాహరణ పటాలు పెట్టని అలంకారాలుగా ఉన్నవి. ఇటువంటివే కెనడా గురించీ, అమెరికాగురించీ ముచ్చటయిన పుస్తకాలు వెలువడ్డాయి. తెలుగు సంస్కృతిగురించి సర్వంకషపరిజ్ఞానంతో కూడిన ఒక సంపుటం అట్టిది తెలుగులో వెలువడితే చక్కగా ఉంటుంది.

ఈనాడు తెలుగులో పుస్తకప్రకాశనమే కష్టసాధ్యమైపోయింది. ఉత్తమగ్రంథాలు ప్రచురించే ప్రచురణసంస్థలు బహు స్వల్పం. అందుచేతనే ఉత్తమరచయితలు పదుంకట్టే మంచి గ్రంథాలు ప్రచురించలేకపోతున్నారు. తెలుగు భాషాసమితి వారు ఏటేట బహుమతుల ఎరచూపి ఆరుగ్రంథాలకు సహాయం చేసే ఏర్పాటు గావించామంటున్నారు. కాని ఈ బహుమతులను చూచి మంచి గ్రంథాలువ్రాసే ఉత్సాహం కవులకు లేకపోగా విషయనిర్ధారణ ముందే చేసినకారణంచేత వచ్చినవానిలో గుడ్డిలో మెల్ల ఎన్నుకోవలసి వస్తుంది. అసలు సాహిత్యంలో ఏ అర్హత పొందజాలని అల్పగ్రంథాలకి సైతం బహుమతులు ఇయ్యక తప్పనిసరి అవుతుంది. దీనివలన బహుమతి ప్రయోజనమే ధ్వంసమైపోతున్నది. అలాగకాక సంవత్సరానికి వెలువడిన గ్రంథాలన్నింటిలోనూ సాహిత్యంలోను విజ్ఞానంలోనూ ఉత్తమోత్తమమని తోచిన మంచి రచనకే పురస్కారం యిస్తే సాహిత్యానికి నిజమైన ప్రోత్సాహం లభిస్తుంది. కాగా, ఉత్తమరచనలని తోచినవాటిని బహుమతి యిచ్చినా లేకపోయినా యిటువంటిసంస్థలు చేబట్టి

ప్రచురిస్తే ఆదే పదివేలు. ఇతరత్ర కళ్ళువెలుగు చూడలేని గ్రంథాలకు ప్రకాశనావకాశం కలిగించినవారవుతారు.

ఇటీవల మద్రాసు విశ్వవిద్యాలయంతరఫున కొన్ని అముద్రిత గ్రంథాలు వెలుగులోకి వచ్చాయి. వీటిలో ముఖ్యమైనవి కట్టా వరదరాజు ద్విపద రామాయణం, రాజగోపాలవిలాసం అశ్వపరీక్ష (శాస్త్రం) మున్నగునవి. ఇవన్నీ శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు సంపాదించి ప్రకటించి ఆంధ్రపాఠకలోకం మన్ననలందుకున్నారు. ఇలాంటికృషి విశ్వవిద్యాలయంవంటి సంస్థల సహాయంచేత సాధ్యంకాని ఇతరత్ర కాదు.

ఇలాగే స్వకల్పిత రచనలను ప్రోత్సహించడానికి ప్రకాశన సంస్థలు అవసరం. అటువంటి సంస్థలు లేకపోగా—కనీసం రచయితలు తమంత తాము ప్రచురించిన కృతులకు కూడా విక్రయం చేసే సావకాశాలు లభించకుండా ఉన్నవి. వేరు పుస్తక విక్రయం చేసేవారు పత్రికల విక్రేతలు, లేక స్కూలు పుస్తకాలు అమ్మేవారున్నూ. అందుచేతనే ఏ పుస్తకాలకూ సరియైన అమ్మకాలు ఉండవు. మూడు రంగుల ముద్దులొలికే బొమ్మలతో ముచ్చటగా చిత్రించిన పత్రికలలో సమానంగా తక్కువ పేజీలు కలిగి ఎక్కువ ధరలు వేసిన పుస్తకాలు అమ్మకం చూపితే పత్రికల అంగడుల్లో కొనేవారెవరు? అదేవిధంగా గణితబోధినీలు. వాచకపుస్తకాలు అమ్మే దుకాణాల్లో సాహిత్యవిజ్ఞాన పుస్తకాలు అమ్మితే ఆదరించేవారెవ్వరు? అందుచేత ఇవేవీ కాక కేవలం సాహిత్యపుస్తకాలు మాత్రం విక్రయించే నిమిత్తం ప్రత్యేక బుక్ డిపోలు ముఖ్యనగరాలు అన్నింటిలోనూ బయలుదేరాలి. ఆ డిపోలు అన్ని పుస్తకాలూ తెప్పించి ఆధునిక పద్ధతుల్లో విరివిగా ప్రకటనచేసి ఆకర్షించాలి. మొదట్లో—ప్రజలలో పుస్తకాలు కొనే అలవాటు కలిగేవరకు రకరకాల పుస్తకాలు కొనడానికి బుక్ క్లబ్బు లేక గ్రంథమాలలు స్థాపించి చందాదారుల పద్ధతిని ప్రోత్సహించాలి. ఒక వెయ్యిపుస్తకాలయినా చెల్లగలవనే స్థైర్యం ఉంటే తప్పక పుస్తకం ప్రకటించవచ్చు. అందుచేత ఏ వ్యాపారసంస్థ అయినా ఈ పనికి పూనుకొని ముందుకు వచ్చేవరకు రచయితలే ఒక సహకారసంఘంగా ఏర్పడి ఈ పని నిర్వహించవచ్చును. ముందుగా ఒక విక్రయశాల పెట్టి అందులో రచయితల అందరిగ్రంథాలూ దొరికేటట్టు చేయవచ్చు. పుస్తకాలు వచ్చినట్టు తెలిసినా అవి దొరికేచోటు తెలియక చాలమంది కొనడం లేదు. నేటి వ్యాపారప్రపంచంలో గ్రంథవిక్రయం సక్రమమార్గంలో స్థాపిస్తే తప్ప సాహిత్యానికి త్వరగా అభివృద్ధిఅయ్యే మార్గాలు గోచరించడం లేదు. ఆర్థిక ప్రోత్సాహం లేక, జనాదరణ లేక దేనికోసం రచయిత సాహిత్యసేవ చేస్తూ కాలక్షేపం చేస్తాడు? ఎంతకాలమని నిష్కామకర్మ చేస్తాడు?

ఇదేమీ లేకపోయినా నేటి రచయితకు కల్పవృక్షాల లాగున పత్రికలు ఆదరణ చేస్తున్నవి. వాటి పుణ్యమాయని బహుళప్రచారంలో ఉన్న పత్రికలు యుద్ధవార్తలు, రాజకీయాలు, ఎన్నికల సంరంభం, మొదలయిన వానితోపాటు ఈ కాగితం కరువురోజులలో కూడా సారస్వత విషయాలకు ఎడతెగని ప్రోత్సాహం యిస్తున్నవి. దినపత్రికలతో బయలుదేరిన పఠనాదాహం, వార, మాసపత్రికలమీదికి ప్రసరించింది. కథలు, నవలలు చదవాలనే కుతూహలం పాఠకులలో పెరిగింది. పత్రిక చదివే పాఠకులసంఖ్య పెరుగుతూవున్నకొద్దీ, వారిలో మంచివి చదవాలనే కుతూహలంకూడా పెరుగుతూవున్నది. పాఠకులకు, పత్రికాసంపాదకులకూ రచయితలకు యీ కుతూహలం నిలవబెట్టుకోవడంలో ఒక పరుగు పందెం లాగ పరిణమించింది. ఇందులో ఎవరు నెగ్గుతారు?

ఈ పరుగుపందెములో మానవుడి మృగవాంఛల్నీ, ఉద్రేకాలనూ రెచ్చగొట్టి వాటిని తృప్తిపరచాలనే ప్రయత్నం కొన్ని పత్రికలు చేశాయి. సెక్సుకథలు, యథార్థ నగ్నదృశ్యాలు ప్రకటించాయి. కొద్ది మాసాలలోనే అటువంటి ప్రయత్నం నెగ్గేది కాదని గ్రహించాయి. తెనుగుసాహిత్యం అదృష్టవశాన ఈ ఫలితం అతి త్వరితంగానే కొట్టవచ్చినట్టు కనిపించి ఈ సంవత్సరంలోనే తప్పుత్రోవ పట్టినవాళ్లు మంచి త్రోవకు రావడం శ్లాఘించవలసిన అంశం. రానురాను చదువరులు అభిరుచి అలవరచుకొంటూ ఉన్నారు. యుక్తాయుక్త విచక్షణజ్ఞానం తెలుసుకొంటూ వున్నారు. ఆరోగ్యకరమైన వ్రాతలనే ఆదరిస్తున్నారు. అందుచేత రచయితలు, ప్రకాశకులు సైతం పాఠకలోకంఅభిరుచి గమనించి మరీ వ్యవహరించవలసివస్తూ ఉంది. ఫలితం - కడచిన సంవత్సరం అంతా గోచరించింది. మసిపూసి మారేడుకాయ చేసే విధానం అంతరించిపోయింది. ఏది చూచినా దానిలో నిజాయితీ కనిపిస్తోంది. ఋజుత్వం, సూటితనం స్ఫురిస్తున్నాయి. రానున్న మంచి సాహిత్యానికి ఇది బీజక్షేత్రమేమో! ప్రసిద్ధ రచయితలే అని లేదు; కేవలం కొత్తవాళ్లు, యువకులు, విద్యార్థులు-ఇంగ్లీషు చదువు రానివాళ్లు అన్ని తరగతుల వారూ వ్రాస్తున్నారు. వీరందరి రచనలలోనూ, తెనుగువారి సాంఘికజీవనం అద్దంకట్టి చూపించినట్టు ఉంది. పరిశీలించాలీ అంటే, ఒక సంవత్సరం—ఆంధ్ర సచిత్రవారపత్రిక తీసుకొని దానిలోని కథారచనలు పరిశీలిస్తే చాలు. ఈ కథలన్నీ — తెనుగువారి మధ్యమ తరగతి కుటుంబీకులు పడుతూ ఉన్న కష్టసుఖాలు చూపిస్తున్నవి. ఎక్కువ భాగం— నేటి ఆర్థికవిధానంవల్ల, కంట్రోల్సు, పెచ్చుధరలు వస్తులోపాలు వీనివల్ల ప్రజలు పడుతూఉండే ఇబ్బందులు ఇతివృత్తాలుగా తీసికొన్నవి. ఈ ఆర్థికవిధానంలో చిక్కుపడిపోయిన మనిషిచేత మన రచయిత దానిని ఎదుర్కొనే మార్గం అన్వేషింపచెయ్యడు. కథ ప్రారంభం చేయడం అద్భుతంగా మంచి సన్నివేశంతో ఎత్తుకుంటాడు, దానికి మరికొన్ని అనుభవాలు జతపరుస్తాడు. చివరకు వచ్చేటప్పటికి ఏం చెయ్యాలో తోచదు. ఆవ్యక్తిని చంపివేస్తాడు. లేకపోతే పరారీ అయ్యేటట్టు చేస్తాడు. ఒకోసారి అతనికి సన్యాసం యిప్పిస్తాడు. నిజానికి ఇవేమీ చెయ్యనక్కరలేదు. నిత్యజీవితంలో ఏ సమస్యా పరిష్కారం అవుతుందనుకోవడం పొరపాటు. కథలోలాగ జీవితం ఒక మంచిచోట మొదలుపెట్టి మరో మంచిచోట నిలిచిపోదు. జీవితఅనుభవానికి మొదలు లేదు. చివర లేదు. బ్రతుకు పోరాటానికి తుదిమొదళ్లు ఉండవు. కథలు కూడా జీవితానికి ప్రతిబింబాలుగా అలాగే రూపించవచ్చు. ఈ సంవత్సరం మద్రాసులో చూపిన చలనచిత్రోత్సవానికి వచ్చిన ఉత్తమచిత్రం ఇటాలియన్ చిత్రం సైకిలుదొంగ ఉదాహరణగా తీసుకుంటే ఈ కథావిధానం నిరూపించవచ్చు. తనకు జీవనాధారంగా ఉన్న ఒక సైకిలు పోగొట్టుకున్న మనిషి—సైకిలుకోసం పట్టణమంతా వెదకుతాడు. అనుమానం ఉన్నవాడిని గద్దిస్తాడు; ఎన్ని శ్రమలో పడతాడు—దొరకదు. చివరకు దుఃఖంచేత—తిండిగడిచే ఉపాయం మరొకటి కనిపించక ఎవరి సైకిలో తానే దొంగిలిస్తాడు. పాపం పట్టుబడిపోతాడు. అతన్ని పట్టుకున్నవాళ్లు పోలీసులకు వప్పగించడానికి బదులు జాలితో వదిలివేస్తారు. పాపం అతను ముఖం దిగాలుగా వేసుకొని ఆ జన సమూహంలో కలిసిపోతాడు. ఇలాంటివి మన నిత్యజీవితంలో

ఎన్నో జరుగుతాయి. తరవాత ఏమవుతుంది అని ప్రశ్నించవక్కరలేదు. అది రచయిత పనీ కాదు, పఠితపనీ కాదు.

యువక రచయితలు ఎక్కువగనుంది శృంగారం—అంటే ప్రేమకథలు వ్రాస్తున్నారు. వీటిలో ఎక్కువభాగం—ఆర్థిక విభేదాలనే చూపిస్తున్నాయి. పేదవాడు ధనికురాల్ని ప్రేమించడం లేక ధనికకుటుంబంలోవాళ్లు పేదవాళ్లమీదికి మొగ్గడం. కాని ఆర్థిక వ్యత్యాసంవల్ల వాళ్లు కలుసుకోలేకపోవడమున్నూ. మరోక రకం—యీ తరగతి ప్రేమ కథలలో పరస్పర సుఖం కోసం పరారీ అయిపోవడం. ఎక్కడో నిజానికి అలాగ జరిగినా కాని ఆ విధంగా యీ ప్రేమసమస్య పరిష్కారం కాదు. మరోక రకం కథలలో ధనవంతులయిన యువకులు వధువులకోసం వెదకుతారు. ఎవరిని చూస్తే వాళ్లను నిరాకరిస్తూ ఉంటారు. తమకు అనుకూలుడైనవాడు కనిపిస్తే, వ్యర్థగర్వంతో వాళ్లను కాలదన్నడం. ఇవన్నీ యధార్థదృశ్యాలయినా కథారచనలో ఒకే ధోరణిలో ఉండి విసుగు కలిగిస్తాయి.

మరోక రకం కథలు—బంపిగా ఎదుటఎదుట కనిపించే నిత్యజీవిత దృశ్యాలను విస్మరించి ఊహాలోకంలో విహరించేవి. నిత్యానుభవంలో ఎన్నో అందనివాటికి ఆశించి అవి యధార్థ జీవితంలో అనుభవించే వీలులేక స్వప్నలోకంలో కొందరు వాటిని పొందుతారు. ఒకవేళ స్వప్నంలో కూడా పొందలేక పోయినా పొందాలని అభిలషిస్తారు. అందుకే మన కథా నాయకులకు పందాలలో గెలిచినట్టు, లాటరీలో ధనం సంపాదించినట్టు, అకారణంగా ధనం వచ్చినట్టు చూపిస్తారు. అయితే అణగిఉన్న ఊహలకు రెక్కలుకట్టి, ఆకాశవీధుల్లో విహరింపజేసినా తిరిగి బయులుదేరిన చోటికి వచ్చి దైనందిన జీవితంలో చూపిస్తారు. అందుకే ఇలాంటి కథలు అయధార్థంగా కనిపించవు.

ఒకకథలో 'బుచ్చిబాబు' వ్రాసినట్లు సామాన్యంగా మనలో చాలమంది ముఖ్యసమస్యలని స్వతంత్రించి ఎదుర్కోము. వాటి పరిష్కారం ఇతరులకు వదిలివేస్తాము. ఆ యితరులు చేసే పనే కొందరు రచయితలు చేస్తారు. కొందరు అసాధారణవ్యక్తుల్ని అసాధారణపరిస్థితుల్ని తీసుకొని ప్రసిద్ధకథారచయిత సోమర్ సెట్ మాఘమ్ కథలు కట్టాడు. ఒకగంట పరిచయం ఉన్న వ్యక్తిని చూస్తే నేను కథ వ్రాస్తాను అని మాఘమ్ ఒకసారి యెక్కడో వ్రాశాడట—ఈ మాఘమ్ మాట తీసుకొని బుచ్చిబాబు, తనకు మూడేండ్లు పరిచయమున్న ఒక అసాధారణ వ్యక్తినిగురించి 'మీరూ నేనూ మాఘమ్' అనే కథ వ్రాశాడు. ఇందులో పద్మావతి గొప్ప కుటుంబంలో పుట్టింది. తనతోడి అక్కచెల్లెళ్లు పెద్ద హోదాలో ఉన్నవాళ్లను పెళ్ళిచేసుకొని సుఖిస్తే తాను ఒక డాక్టరు భార్యగా ఉండి ఎదిగిన పిల్లలతో సంసారతాపత్రయంలో సంతృప్తిలేక జీవితం ధ్వంసం చేసుకొంటుంది. రోగిష్టి అయిన భర్తజీవితం భగ్నంచేస్తుంది. మానసికంగా నే కాక భౌతికంగా నే అతన్ని హత్యచేస్తుంది. అయితే యీ కథకు సంవిధానం, ప్రయోజనందగ్గరనించీ తీసుకొని మాఘమ్ అభిప్రాయంతోపాటు కథా విధానంగురించి కూడా రచయిత చర్చించాడు. కథా,విమర్శ, కలిసిన క్రొత్తరకం కథ. ఇలాంటికథ మన పాఠకులదృష్టి చేత కథావాఙ్మయంమీదకు ప్రసరింపచేస్తూ ఉంది. మొత్తం మీద మన కథాసాహిత్యం దిన దిన ప్రవర్ధమానమై అసమానప్రగతితో ముందంజ వేస్తున్నదని మనం సగర్వంగా చెప్పుకోవచ్చు. పత్రికలలో ప్రకటించే కథలే గాక ప్రజాదరణ గమనించి అనేక కథా ప్రచురణలు పుస్తకరూపంలో కూడా వెలువడ్డాయి. దేవి కవితామండలివారు గోపీచంద్ కథలు, పేడ పెట్లు అనే బుచ్చిబాబుకథలు ప్రచురించారు. హైదరాబాదునించి జల్లంప్రభాకరరావుగారి కథలు వచ్చాయి. మొక్కపాటి నరసింహశాస్త్రిగారు, మునిమాణిక్యం నరసింహారావుగారలు తమ క్రొత్తకథల సంపుటాలు ప్రకటించారు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి షష్టిపూర్తిసందర్భంలో వారి రచనలన్నీ సంపుటాలుగా వెలువడ్డాయి.

ఈ సంవత్సరం మరోక విశేషం ఆంధ్రపత్రిక యాజమాన్యంక్రింద జరిపిన ప్రపంచ కథానికలపోటీ. ఆంధ్రపత్రిక—తెనుగు కథలలో నాలుగింటిని ఎన్ని—భారతదేశపు కథల పోటీకి పంపగా దానిలో కూడా తెనుగు కథకు ద్వితీయ బహుమానం లభించింది. భారతదేశంనించి పంపిన రెండుకథలు న్యూయార్కు హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక జరిపిన పోటీలో పాల్గొన్నాయి. తిరిగి యీ పోటీలో కూడా పాలగుమ్మి పద్మరాజుగారి గాలివాన అనే తెనుగు కథకు ద్వితీయబహుమానం లభించింది. ఈ సన్మానం—తెనుగు కథకు కలిగినందుకు తెనుగువారందరూ గర్వించ తగినదే. దీనినిబట్టి—తెనుగు కథలు - భారత సాహిత్యంలోనే గాక ప్రపంచసాహిత్యంలోనే ఒక ఉన్నతస్థాయి అందుకొన్నవి అని చూపడానికి తార్కాణం. పాలగుమ్మి పద్మరాజుగారు తెనుగుసాహిత్య నిష్ణాతుల్లో సమర్థులు. కవి; కథకుడు; నాటకకర్త, నవలా రచయిత. బహుముఖ ప్రజ్ఞాశాలి. వీరు రచించిన యీ గాలివాన కథలో—యీనాడు విహ్యూని యరిజమ్ అని పిలువబడు తత్వాన్ని ప్రస్ఫుటింప జేశారు. అంటే మానవుడు స్వతః కొన్ని గుణాలు, ఆదర్శాలు కలిగి వ్యవహరిస్తూ ఉన్నప్పటికీ పరిస్థితులు వాతావరణం మారినప్పుడు మరోక విభిన్నరీతిగా ప్రవర్తించవచ్చునని యీవాదం చూపుతుంది. 'గాలివాన'లో నాయకుడు 'రావు' కృత్రిమ వాతావరణంలో, ఏవో కల్పించుకున్న ఆదర్శాలతో చుట్టూ పెట్టని గోడలు పెట్టుకుని ప్రత్యేక భావసౌధంలో నివసించే వింతమనిషి. ఆయన—గాలివాన హోరులో, భయంకర ఝంఝామారుతంలో ఉరుములు మెరుపులు కూడిన ప్రళయంలో మృత్యుదేవతకు ముఖాముఖిగా నిలిచినప్పుడు ఆ గోడలూ, మేడలూ కూలిపోయి నగ్నప్రకృతిగా మిగిలి—తన సహజప్రవర్తనతో ఇదివరకు ఎన్నడూ చెయ్యనిది చేస్తాడు. కథారచయిత యీ చిత్రణంలో అద్భుతశైలి చూపించాడు. అందుకే దీనికి బహుమతి దొరికింది. దానికి పద్మరాజుగారు అభినందనీయులు.

కథల కున్న ఆదరణ నవలలకు వస్తుందని తోచినా, ఎక్కువ వ్యయప్రయాసలకోర్చి తమంత తాము క్రొత్త నవలలు ఎవరూ ప్రచురించలేక పోతున్నారు. అందుచేతనే మంచి నవలలు మన సారస్వతంలో రావడంలేదనే నాడు అలాగే ఉండిపోయింది. ఉన్నంతలో—పత్రికలే నవలలు ప్రచురణ పొందడానికి సీరియలు ద్వారా ధారావాహికంగా ఏర్పాటుచేస్తున్నాయి. అలాగే ఇటీవల పది పదిహేను సంవత్సరాలనించి కొన్ని అయినా నవలలు వస్తున్నాయి.

ఈ సంవత్సరం వెలువడిన వానిలో చెప్పుకోతగిన నవల కొడవటిగంటి కుటుంబరావుగారి "చదువు." ఇది ఒక పిల్లవాడు, తండ్రిగతించినప్పటినించీ తల్లిచాటుగా బడులలోనూ, కాలేజీలలోనూ, జీవితంలోనూ చదివిన చదువు. అన్నిటికంటె గొప్ప పాఠశాల జీవితరంగమే అని రచయిత నిరూపించి—మనదేశం రెండు యుద్ధాల మధ్య, రెండు గొప్ప సత్యాగ్రహోద్యమాల మధ్య

పొందిన పరిణ క్రమం ఒక కుటుంబంలోని వ్యక్తుల అనుభవాల ద్వారా మనకు పరిచయం చేశాడు. ఈ నవల తెలుగు సారస్వతంలో వచ్చిన ఉత్తమ నవలలలో ఒకటిగా కలకాలం నిలిచిపోతుందని చెప్పవచ్చు. మరొక నవల 'కీలుబొమ్మలు' పత్రికలోనే ధారావాహికంగా వెలువడింది. పల్లెటూరులో ప్రజలు సామాన్య జనుల ఉద్రేకాలకు ఆవేశాలకు లోబడి ఎలాగ ప్రవర్తిస్తారో రచయిత శ్రీ జి. వి. కృష్ణారావుగారు చూపించారు. చక్కని సహజ వాతావరణంతో తెలుగు జీవితంలోని యథార్థ దృశ్యాలు ఇందులో పొందుపరచారు. స్త్రీ హృదయాన్ని చక్కగా చిత్రించిన మరొక నవల శ్రీమతి వట్టికొండ విశాలాక్షి గారి "భారత నారి". ఇలాంటి రచనలు ఎన్ని అయినా మనభాషలో రావలసిందే. ప్రకాశకులు తగినవారు పూనుకొని ప్రోత్సహిస్తే నవలలు అనేకం రావచ్చు.

నవలకంటె ఒకడుగు ముందు వేసిన శాఖ నాటకం. ఈ సంవత్సరం ఎన్నో నాటకాలు—రంగస్థలంమీద జయప్రదమైన ప్రదర్శనలు పొంది సభాసదుల మన్ననలు అందుకొన్నవి. ఇవే గ్రంథరూపమున అందుబాటులోనికి వచ్చినవి. సినీమా ప్రభావం మన రంగస్థలాన్ని ఎంత వెనుకకు నెట్టినా గాని తిరిగి నటించే నటుల ఉత్సాహంవలన, కళాశాలలు, విద్యాసంస్థలు, యువజనసంఘాలు మొదలయిన వాటివల్ల ఏమెచ్యూర్ నాటకసమాజాలకు ప్రోత్సాహం కనిపిస్తోంది. సమాజాలు హెచ్చేకొద్దీ నాటకాల అవసరం హెచ్చుతోంది. వార్షికోత్సవాలు మొదలయినచోట్ల ప్రదర్శించే చిన్న నాటికలకు గిరాకీ పెరిగింది. పెద్ద నాటకాలకు పెరిగింది. ఈ సంవత్సరం ప్రదర్శించిన నాటికల్లో పేర్కొన తగినవి ఆత్రేయ 'ప్రగతి' సోమంచి యజ్ఞన్నశాస్త్రి 'రిహార్సల్సు', నరసరాజు 'ఆత్మహత్య' 'అంతర్వాణి' గోకుల్ చంద్ 'కరువురోజులు' అని శెట్టి 'శాంతి' ఆత్రేయ 'ఎవరు దొంగ?' వీటిలో చివరినాటకం ప్రదర్శింపకూడదనే నిషేధం కూడా వచ్చింది. అని శెట్టి 'శాంతి' రష్యన్ ఫిల్ము ప్రతినిధులు ఫిల్ము కూడా తీశారు. ఇంక పెద్దనాటకాలలో పినిశెట్టి 'పల్లెపడుచు' ఆంధ్రదేశమంతటా ఎన్నో ప్రదర్శనలు పొంది పేరు సంపాదించింది. డి. వి. నరసరాజు రచించిన 'నాటకం' క్రిందటి పరిషత్తు సభలో ఉత్తమనాటక బహూకృతి అందుకొన్నది.

బుచ్చిబాబు రచన 'ఆత్మవంచన' గ్రంథరూపంలో వెలువడింది. ప్రదర్శన యోగ్యమైన కొత్తనాటకాలు అన్నింటినీ విజయవాడ దేశకవితా మండలివారు పుస్తకరూపంలో తీసుకొని వచ్చి, నాటకరంగానికీ, రచయితలకు సాహిత్యానికి కూడా అమూల్యసేవ చేస్తూ ఉన్నందుకు ఎంతో అభినందనీయులు.

ఈనాడు తెలుగునాటకాలు ప్రసారంచేసే రేడియోస్టేషన్లు మద్రాసు, హైదరాబాదు, విజయవాడ కేంద్రాలనించి వారానికి కనీసం అయిదునాటకాలకు తక్కువకాకుండా ప్రసారంచేస్తూ ఉన్నవి. ఇవన్నీ సాహిత్యంలోకి లెక్కకు రాకపోయినా కొన్ని అయినా ఉత్తమసాహిత్యం కావచ్చు. బి. బి. సి. గూర్చి క్రిందటి సంవత్సరం వ్యవస్థాపకుడు సమీక్ష వ్రాస్తూ—రేడియోస్టేషన్ చేసిన పని విలువకట్టే గీటురాయి ఒక సంవత్సరం అయిన తర్వాత బ్రాడుకాస్టు అయిన అంశాలు ఎన్ని గ్రంథరూపం పొంది ఉత్తమ సాహిత్యంలోకి లెక్కకు వచ్చాయో అని విలువ కట్టినప్పుడే అని చెప్పారు. ఆ పరీక్ష మన రేడియో కేంద్రాలకు చేసి చూస్తే, రేడియోలో ప్రసారంపొందిన ఎన్నో రచనలు (కథలు, వ్యాసాలు నాటికలు) గ్రంథ రూపం దాల్చాయని చెప్పవచ్చు. ముఖ్యంగా నాలుగు సంపుటాలుగా రేడియో నాటికలు వెలువడటం ముదావహం. జి. వి. కృష్ణారావుగారు రచించిన తొమ్మిది నాటికలు తోలు బొమ్మలు అనే పేరుతో ప్రజాసాహిత్యమండలి వారు తెనాలినించి ప్రకటించారు. విభిన్న పాత్రల గురించిన చిత్రణం భావస్ఫోరకంగా ఉంది. ముఖ్యంగా అవ్యంతాలలో ఉన్న నాటికలు 'పాడు సంఘం' 'ప్రతిక్రియ' అనేవి ప్రదర్శన యోగ్యంగా ఉన్నవి. 'రత్న మాణిక్యాలు' వి. డి. ప్రసాదరావుగారి మరో నాటికా సంపుటి. వీటిలో పాత్రలూ సన్నివేశాలు పొందికతో అమరినట్టు ఉంటాయి. కాని రేడియోలో విన్నప్పుడు కలిగే రసస్ఫూర్తి—చల్లని ముద్రణలో వచ్చేటప్పటికి కొంచెం కొరవడినట్టు గోచరిస్తుంది. ఇదే మాట హరిశ్రీ ప్రచురించిన రేడియో నాటికల సంపుటి 'ప్రాగ్జ్యోతి' గురించి కూడా చెప్పవచ్చు. రేడియోలో శ్రవ్యరూపకాలుగా ప్రసారం అయ్యేటప్పుడు కనిపించని కొన్ని అసందర్భాలూ అవలోపాలూ పుస్తక రూపంలో చదువరుల సంయోగం అయినప్పుడు తప్పక కనిపిస్తాయి. రేడియోలో బ్రాడుకాస్టు అయిన ప్రతికృతి ముద్రణార్హం అనుకోవటం పొరపాటు. అసలు ఉత్తమ శ్రవ్య నాటకం ముద్రణ యోగ్యత పొందదు. ప్రసిద్ధ రచయిత లూయీ మెక్‌నీస్ అన్నట్టు *(Louis Mcnice)* రేడియోలో ప్రసారం చేసినవే కొన్ని పిల్లల నాటికలు కూడా పుస్తక రూపాన వెలువడ్డాయి. రంగస్థలం మీద పిల్లలచేత ప్రదర్శనా భాగ్యం పొందుతున్నాయి. పిల్లల పత్రికలవల్ల నేడు బాలబాలికల్లో ఎక్కడలేని సంచలనం బయలుదేరింది. మంచికథలు, రచనలు చదవాలనే దాహం వారిలో ఉద్భవించింది. ఈ దాహం తీర్చడానికి తగిన మంచి పుస్తకాలు పిల్లలకోసం రావటంలేదు. పిల్లల మెదడుకు పని కలిగించి ఆలోచన రేపే రచనలు రావటంలేదు. ఈలోపం తీర్చడానికి ఆంధ్రవారపత్రికలో చక్కని ఉపాయం పన్నారు. ప్రపంచ సాహిత్యంలో పేరుపొందిన పిల్లల పుస్తకాలు బొమ్మలతో సహా అనువాదాలుగా ప్రకటించారు. అవిసంగా పిల్లలదాహాన్ని తీర్చి కొత్తరుచులు అందింపచేస్తున్నారు. టామ్‌సాయర్, ట్రెజర్ ఐలెండు, రాజా—పేద, హకల్ బరీఫిన్ మొదలయిన మంచి పుస్తకాలు ప్రకటన అయ్యాయి. బాల సాహిత్యంలో చేసిన యీ ప్రయోగమే—పెద్దలయెడల కూడా పనిచేసింది. ఆంధ్రవార పత్రిక కౌంట్ ఆఫ్ మాంటిక్రిస్టో ధారావాహికంగా ప్రకటిస్తూ ఉంటే ఎందరో పాఠకులు తొలిసారి చదివినంత ఉత్సాహంగా చదివి ఆనందించారు. ఉత్తమ సాహిత్యం భాషా పరిధులను దాటి అందరికీ అందుబాటులోనికి రావలసిందే. తెలుగుసాహిత్యం నిజానికి అన్ని భాషలనించీ అనువదించి నిధి నిక్షేపాలను సేకరించుకుంది. ఇంకా సేకరించుకొంటూ ఉంది. ఇటీవల అనువాద సాహిత్యం పెంపొందింప చెయ్యాలని 'ఇంటింట విజ్ఞానవనాల' అని కొందరు ఉత్సాహవంతులు స్థాపించారు.

ఇలాగే భారతీయభాషలనించి ఉత్తమగ్రంథాలు అనువాదాలుచేసి మనపాఠకులకు చక్కనిసంపుటాలలో పరిచయం చేశారు. ఈపని యువగ్రంథమాలవారు బాగా చేసి వదిలిపెట్టేశారు. బెజవాడ, దేశకవితామండలివారి పక్షాన శ్రీకొండలపాటి శివరామకృష్ణగారు శరత్ చంద్రుని రచనలన్నీ తెలుగులోకి అనువదించి అందమైన అచ్చు కూర్పులతో 12 సంపుటాలలో అందచేశారు. కల్ప

రల్ బుక్ డిపోవారు కొన్ని రాజకీయ చరిత్రగ్రంథాలను ప్రకటించారు. దేశంలో కాగితం కరువువల్ల పుస్తకప్రకాశన బహువ్యయ ప్రయాసలతో కూడిన ప్రయత్నమైనా గాని అభిమానులూ ఉత్సాహవంతులూ చక్కని పుస్తకాలు ప్రచురించి ఇతోధిక సాహిత్యసేవ చేస్తున్నారు. ఈ సంవత్సరంలో మరొక విశేషం. తెనుగులో ఛలోక్తిగా చెప్పుకొనే మాటలు గ్రంథరూపం ధరించడం. "వార్ల" వ్రాసిన వ్యాసాలు—మాటామంతీ - పిచ్చాపాటీ అని రెండు సంపుటాలుగా వెలువడ్డాయి. కథానికలు చరిత్ర, నవలలు చదివినట్టు ఇవి కూడా పాఠకులు చదివి ఆనందించడం గమనించవలసిన అంశం.

ఎన్ని పుస్తకాలు వెలువడినా, ఎలాంటి సాహిత్యం రూపుదిద్దుకొంటూ ఉన్నా యీ సాహిత్యంపై దృష్టిసారల్పి చక్కని అభినివేశం కలిగించడానికి కరదీపికలవంటి సమీక్షలు విమర్శలూ అవసరం. తెనుగుసాహిత్యంలో నాటికీ నేటికీ యీ విమర్శనా సాహిత్యం తీరని కొఱఁతగానే ఉండిపోయింది.

ప్రసిద్ధవిమర్శకులు అని చెప్పుకోదగిన మరియిద్దరు మేధావులు ఈ సంవత్సరం చరిత్రలో దాగిపోయారు. వారు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, చిలుకూరి నారాయణరావుగారు. పంచాగ్నులవారు వేదం, తర్కం, మీమాంస మొదలయిన శాస్త్రాలలో కూలంకష పరిజ్ఞానం సంపాదించిన ఉద్దండ పండితులు. శాసనధిక్కారాన్ని కూడా లెక్కచేయక, అధికశ్రమప్రయాసల కోర్చి గౌతమధర్మసూత్రాలు, వాత్స్యాయన కామసూత్రాలూ ప్రకటించిన ధైర్యశాలి. అసమాన వ్యాఖ్యాత. రసజ్ఞులు. బహుభాషాకోవిదులు. ఎంకిపాటల గాలిదుమారంలో సంగ్రహించిన సహృదయులు. ఎన్నో ఉద్గ్రంథాలకు తగిన సామగ్రి సేకరించినవారు. వారి కృషి సమగ్రంగా తెనుగుపాఠకులకు లభించే లోపునే మృత్యువు వాతపడ్డారు. తెనుగువారికి మరుగుపడిపోయారు.

ఇక చిలుకూరి నారాయణరావుగారు అనేక సాహిత్యక్షేత్రాలలో కృషిచేసి బంగారు పండించినవారు. భాషా చరిత్ర కోసం వారు పడిన శ్రమ, సేకరించిన విషయ నిక్షేపాలు తెనుగువారికి తరగని సంపదలు. వారి గ్రంథాలు అసంఖ్యాకాలు. సామెతలు, పల్లెపాటలు వారు సేకరించినవి అమూల్యమైనవి. త్రిపిటకం, ధమ్మపదం, ఖురాన్‌షరీఫ్, అథర్వణవేదం మొదలైన మతగ్రంథాలు తెనుగుచేశారు. అచ్చి అశ్వత్థామ మొదలయిన నాటికలూ వేలకొలది పద్యకృతులు రచించారు. సాహిత్య భాషాచరిత్రలు సమీక్షచేయడంలో కొత్త తెన్నులెన్నో త్రొక్కి ఇతరులకు మార్గదర్శులయ్యారు. ఈ పండిత సత్తముల మృతి తెనుగుసాహిత్యానికి మరొక ప్రబలనష్టం.

తమిళ దేశంలో జన్మించి ఆదర్శవంతమైన ఉత్తమ రచనలు చేసిన మంచి రచయిత కె. యస్. వేంకటరమణి కూడా ఈ వత్సరమే కీర్తిశేషు లయ్యారు. ఈతని నవల జీవనప్రభాతం అనే పేరుతో తెనుగులో ఆంధ్ర గ్రంథమాలవారు ప్రకటించారు. గ్రామాలకుపోయి పునరుజ్జీవనం చేసి, పల్లెపట్టుల్లో కొత్తవెలుగు తీసుకురావాలని కలలుగని యథార్థజీవితంలో ఆచరణలోకి పెట్టలేక ఆశాభంగంతో మరణించిన ఆదర్శవాదుల్లో వేంకటరమణి ఒకడు.

జీవితం నిరంతర స్రోతస్విని. ఆ జీవనది వడితో వచ్చినపుడు ఎదురుగా కనిపించే పెనువృక్షాలు పెల్లగించుకొని పోతాయి; పర్వతాలు దిగజారిపోతాయి. కొత్త సుక్షేత్రాలు ఉత్పన్నమవుతాయి. చిత్రవిచిత్ర ప్రకృతిపరిసరాల్లోంచి ప్రవహించుకొనిపోతూ ఉంటుంది ఈ నదీప్రవాహం. ఈ ప్రవాహంవంటి జీవిత ప్రతిబింబమే సాహిత్యం—నిర్మల ప్రాణజలాలతో పాటు కాలుష్యమూ, దుర్గంధమూ కూడా ధరిస్తుంది. సంవత్సరాలు గడిచేకొద్దీ ఇది తేరుకొని తేటనీరు అందించి ప్రాణంపోస్తుందని ఆశిద్దాం. కరువుతో కూడిన ఖర సంవత్సరం మళ్ళీ నందనలో ప్రవేశించే సమయంలో పాలవెల్లివంటి నందన వనాలు కలిగి, కొత్త చిగుళ్లతో, రంగుపూలతో, కమ్మని తావులతో నిండిన ఆనంద నందనం కాగలదని ఆనందవనంలో మన సాహితీ ప్రవంతి నిర్మల సలిలాలతో కలకల ధ్వనులతో సాగిపోగలదని ఆశిద్దాం.





Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.